# చతుర

నవంబర్ 2000

రూ.7/-



# ఎడారిమంటలు

పెద్దింటి అశోక్‌కుమార్

# చతుర కతలు

## యూస్ అండ్ త్రో

కామిశ్రీ ఇప్పుడిప్పుడే ఎక్స్ట్రాగా పైకొస్తున్న సినీతార. "తలుపేసుకుందాం రా" లో సైడ్ హీరోయిన్‌కి చెలికత్తె. కేరెక్టరుకి బుక్ అయినప్పటినుండీ కామిశ్రీకి పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. కామిశ్రీకన్నా తల్లి ఆర్భాటం అధికంగా ఉందిప్పుడు.

హౌస్‌లో ఉండిపోయింది.

పెళ్లెప్పుడయిందో తెలియదుకానీ ఆ మర్నాడే హనీమూన్‌కి బయలుదేరదీశాడు ముత్యాలరావు.

"మంచి ఐడియా! మాకూ నాలుగుఊళ్లు చూసినట్టుంటుంది. కాశ్మీరు దాకానేనా వెళ్లేది? అబ్బ... ఎప్పటినుండి చూడాలనుకుంటున్నానో..." అని మురిసిపోతున్న కామిశ్రీ త




మొత్తానికి బొమ్మ పూర్తయి రెండు థియేటర్లలో ఇరవైరెండు రోజులు రికార్డు సృష్టించిన సందర్భంగా ప్రొడ్యూసరు బీ.డీ నాయుడు అనకాపల్లిలో ఆరుబయట ఇరవై రెండురోజులోత్సవ మహాసభను అత్యంత ఘనంగా నిర్వహించాలనుకున్నాడు.

ఆ సభకు ముఖ్య అతిథిగా వచ్చిన లోకల్ లీడర్ కమ్ కోటీశ్వరుడు ముత్యాలరావుకి కామిశ్రీ తల్లి ఎలా లైనేసిందో కానీ వేదికమీదే ముత్యాలరావు కామిశ్రీని గాఢంగా ప్రేమించేశాడు. త్వరలో పెళ్లాడుతున్నానని ప్రైవేటుగా ప్రకటించేశాడు. ఉత్సవం పూర్తయి అందరూ హైదరాబాదుకి చెక్కేసినా కామిశ్రీ మాత్రం మాతృసమేతంగా ముత్యాలరావు గెస్ట్

ల్లిని కసురుకున్నట్టు అన్నాడు "వెళ్లేది మేమయితే.. మీరెందుకు మురుస్తారు? "

"మరి నేనూ రావడంలేదా? "

"మేం వెళ్లేది హనీమూన్‌కి"

"అమ్మాయి చిన్నపిల్లండీ! ఏమీ తెలియదు."

"అందుకు దగ్గరుండి అన్నీ చూపిస్తారా? "

"హవ్వ! అది సినిమా షూటింగ్ కాదమ్మా" తల్లిని కసురుకుంది కామిశ్రీ. "నేను చిన్నపిల్లను కానుగా. నాకన్నీ తెలుసులే."

సామానులు సద్దుకునే హడావిడిలో ఉన్న

కూతురుని చూసి అంది "తెలుస్తూనే ఉందిలే నీకేం తెలుసో హనీమూన్‌కి పోతూ ఇన్నిన్ని బేగులూ, లగేజీలూ మోసుకెడతారటే ఎవరైనా"

"మరి అన్నీ కావాలికదే. టూత్‌పేస్ట్ దగ్గర్నుండి రాత్రి పడుకునేముందు వేసుకునే నైటీ వరకూ ఏది తక్కువైనా కుదర్దుకదే"

"అదే నీ తెలివి తక్కువ. టూత్‌పేస్ట్ కావాల్సిందే. దానికిక్కడినుండే ఇంత పెద్ద ట్యూబ్ పట్టుకెళ్లాలా? సాచెట్స్ లాంటివి తీసుకో. అయిపోగానే పారేయొచ్చు అలాగే ఈ పౌడర్ డబ్బాలు, స్నో సీసాలు, షాంపులూ, కాస్మొటిక్స్ అన్నీ పేకెట్స్‌లో వస్తున్నాయి. చక్కగా వాడుకుని అవతల పారేయొచ్చు పిచ్చిమొహమా అర్థమయిందా? యూస్ అండ్ త్రో సిస్టమన్నమాట. అంతా అమెరికన్ సిస్టం. అది నేర్చుకోవాలి" అంది గర్వంగా ముత్యాలరావు వంక చూస్తూ.

ముత్యాలరావు మెరిసే కళ్లతో కామిశ్రీ తల్లిని అభినందన పూర్వకంగా చూశాడు బండెక్కబోతూ.

పదిహేనురోజుల హనీమూన్ ముగిసింది.

కూతురు, అల్లుడు రాకకోసం కళ్లు కాయలు కాచేలా ఎదురుచూస్తోంది కామిశ్రీ.

కొత్త దంపతులు తిరిగొచ్చేరోజు రానే వచ్చింది.

కామిశ్రీ తల్లి స్టేషన్‌కి పరిగెత్తింది బండొచ్చేవేళకి.

బండి రానే వచ్చింది. అందులోంచి ముత్యాలరావు ఒక్కడే దిగడం చూసి బిత్తరపోయింది కామిశ్రీ తల్లి.

"అమ్మాయేదయ్యా?"

"మీరే కదా అన్నారు 'యూస్ అండ్ త్రో'... అంతా అమెరికన్ సిస్టం అని. అది నాకు నచ్చింది. మీ అమ్మాయిని అక్కడే కాశ్మీర్ లో వదిలేసి వచ్చా" అని చక్కగా తనకోసం వచ్చిన కార్లో కూర్చుని తుర్రుమన్నాడు ముత్యాలరావు.

–కర్లపాలెం హనుమంతరావు.

---

## వయసు

"మనం వెళ్లేది పెళ్లికికదా!" అన్నారు సుగుణమ్మగారు.

"అవును. అయితే?" అన్నారు సుబ్బారావు గారు.

"పెళ్లి జరిగేది హైదరాబాదులో. మన బంధువులంతా వస్తారు. అందరినీ ఇరవైఏళ్ల తర్వాత కలుసుకుంటున్నాము." చెప్పారు సుగుణమ్మగారు.

"అవును. అయితే?" అన్నారు సుబ్బారావు గారు.

"మీరు ఉద్యోగంలో ఉన్నప్పుడెప్పుడో మిమ్మల్ని చూశారు బంధువులు. ఆ తర్వాత మనం ఆ. పరిసరాలకి వెళ్లలేదు. వాళ్లెవరూ ఇటూ రాలేదు." అన్నారు సుగుణమ్మగారు.

"అవును. అయితే?" అన్నారు సుబ్బారావు గారు మళ్లీ.

"మీరు రిటైరయి పదిహేనేళ్లయింది. అయినా శరీరంలో పటుత్వం అంతగా తగ్గలేదు. ముఖంమీద ముడతలు కూడా అంతగా పడలేదు..." అంటున్న సుగుణమ్మ గారి మాటలకి అడ్డు వచ్చి.

"అవును. అయితే?" అన్నారు సుబ్బారావు గారు ఎప్పటిలాగే.

"మీరు రిటైర్ అయ్యారని తెలిసినా మీకు మరీ అంత వయసు వచ్చిందని తెలియకూడదు. అంచేత చెప్పేదేమంటే..." అంటున్న సుగుణమ్మగారి మాటలకి మళ్లీ అడ్డువచ్చి..

"చెప్పు. చప్పున చెప్పు" అన్నారు సుబ్బారావుగారు.

"ఎప్పటిలాగానే మీరు ఏ-ఒన్ హెయిర్‌కటింగ్ సెలూన్‌కి వెళ్లి హెయిర్‌కట్ చేయించుకుని డై చేయించుకుని రండి" అన్నారు సుగుణమ్మగారు.

"ఇప్పుడు ఎందుకు ఈ వయసులో డై?" అన్నారు సుబ్బారావుగారు.

"ఇప్పుడు కాకపోతే తొంభై ఏళ్లు వచ్చాక డై





చేయించుకుంటారా? వయసు దాచే అద్భుత చికిత్స అదే. టి.వి యాడ్స్‌లో చూడడం లేదూ? వెళ్లండి" అంటూ భర్తని 'డూ అండ్ డై' కి సుగుణమ్మగారే పంపించారు.

మూడు గంటల తర్వాత తిరిగి వచ్చిన భర్తని సుగుణమ్మగారే ఒక పట్టాన గుర్తు పట్టలేకపోయారు.

"పాతిక సంవత్సరాల క్రితం మిమ్మల్ని చూసినవారు ఇప్పుడు చూస్తే మీ వయసు అక్కడే ఆగిపోయిందేమోనని ఆశ్చర్యపో తారు.." అన్నారు ఎంతో ఆనందంతో సుగుణమ్మగారు.




ఆ మర్నాడు చార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో చెన్నైనుంచి హైదరాబాదు బయలుదేరారు సుగుణమ్మగారు, సుబ్బారావుగారు. రిజర్వ్ చేసుకున్న ప్రకారం యస్.9 బోగీలో సామాను సర్దుకుని రెండూ ఎదురెదురు లోయర్ బెర్త్‌లు కావడంతో కిటికీల దగ్గర సీట్లలో హాయిగా కూర్చున్నారు.

ట్రెయిన్ బయలుదేరిన అరగంట తర్వాత చెకింగ్ ఇన్‌స్పెక్టర్ వచ్చాడు. సుబ్బారావుగారి నుంచి టికెట్ తీసుకుని ఆయనకేసి చూశాడు.

"నేనూ, మా ఆవిడ" అంటూ భార్యని చూపించారు సుబ్బారావుగారు.

చెకింగ్ ఇన్‌స్పెక్టర్ టికెట్‌లో ఇద్దరూ సీనియర్స్‌గా ఉండటం చూసి "మీ వయసు 70 అని ఉందే" అన్నాడు.

"ఔను. రిటైర్ అయి పదేళ్లకుపైగా అయింది" అన్నారు సుబ్బారావుగారు.

"మీ ఆవిడ సీనియర్ సిటిజన్ అని తెలుస్తోంది. మరి మీ వయసు పేర్కొన్న విధంగా లేదనిపిస్తోంది. సీనియర్ సిటిజన్ కన్‌సెషన్ కోసం అలా వేసివుంటారు." అన్నాడు చెకింగ్ ఇన్‌స్పెక్టరు.

"రామ!రామ!" అన్నారు సుబ్బారావుగారు.

"అయితే మీ వయసుని ధృవపరిచే పత్రమూ, మీ ఐడెంటిటీ కార్డు చూపించండి" అన్నాడు చెకింగ్ ఇన్‌స్పెక్టరు.

"ప్రస్తుతం నాదగ్గర లేవు. తీసుకురాలేదు." అన్నారు సుబ్బారావుగారు.

"అయితే ఎక్సెస్ ఫేర్ కట్టండి లేకపోతే" అన్నాడు చెకింగ్ ఇన్‌స్పెక్టరు.

ఇక గత్యంతరం లేక సుబ్బారావుగారు ఎక్సెస్ ఫేర్ కట్టి రశీదు తీసుకున్నారు. చెకింగ్ ఇన్‌స్పెక్టరు వెళ్లిపోయాడు.

"ఊరినుండి తిరిగొచ్చిన వెంటనే తిరుపతి వెళ్లి ఏడుకొండలవాడికి తలనీలాలు సమర్పిస్తాను." అన్నారు భార్యతో సుబ్బారావుగారు.

"మీఇష్టం" అన్నారు సుగుణమ్మగారు.

**–తాజీప్రసాద్.**

★

# చతుర

సంపుటి: 23 సంచిక: 10 నవంబర్ 2000



## ఎడారి మంటలు

పెద్దింటి అశోక్ కుమార్



విశాలమైన ఎడారిలో గాలికి లేచిన దుమ్ము అతని కళ్లముందు పరదాలా నిల్చింది. అంతలో గాలికి దీపం ఆరిపోయింది. వణుకు పుట్టించే ఆ చలిలో... చీకట్లో పక్కనే ఏదో జరజరపాకిన చప్పుడు. చుట్టూ జనసంచారం లేని ఆ భయంకరమైన ఎడారిలో అతడొక్కడే... ఒంటరిగా...

పూటకి గతిలేక పుట్టెడు అప్పుల్లో కూరుకుపోయిన అతనిచేత మరింత అప్పు చేయించి భూతలస్వర్గంలాంటి ఆ దేశంలో ఉద్యోగంచేసి లక్షలు మూట గట్టుకు రావచ్చని పంపించాడు అతని పొరుగింటి ఏజంటు.

ఆ మాటలు నమ్మి... దేశంకాని దేశంలో అడుగుపెట్టిన ఆ అమాయకుడు ఎదుర్కొన్న అనూహ్య పరిస్థితులు ఎలాంటివి? అతడిని అలా పరాయిదేశానికి పంపిన బ్రోకర్‌లాంటి ఆ స్నేహితుని మనసులో రూపుదిద్దుకున్న పథకం ఏమిటి?

హృదయపు లోతులను స్పృశించే... పెద్దింటి అశోక్ కుమార్ రచన **'ఎడారిమంటలు'** ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

అంతవరకూ కమ్ముకున్న మేఘాలు అదృశ్యమైపోయి ఆకాశం నిర్మలంగా మారిపోయింది. సూర్యుడు నడినెత్తిన ప్రకాశిస్తున్నాడు.

ఆకాశంవైపు దిగులుగా చూస్తూ నిట్టూర్చాడు దేవరాజు.

"ఈయేడు కూడా వానలు లేనట్టే! ఉత్తెర కార్తి దాటిపోయింది. ఇప్పటివరకు తాగడానికి నీళ్ళుదొరికాయి. ఇకముందు అవికూడా దొరికేట్టులేవు. బావుల్లో ఊటలు తగ్గిపోయాయి. ఇంతవరకు భూమిమీద ఒక్క విత్తనం నాటలేదు. ఎట్ల బతుకుడో ఏమో!" అన్నాడు అప్పుడే అక్కడికి వచ్చిన ఎల్లయ్య.

"రెండేండ్లనుండి వర్షాలే లేకపాయె. బావులల్ల ఊటలు ఎక్కడినుండి వస్తయి! ఈ కరువుల మనటువంటి గరీబుగాళ్ళు బతుకుడు కష్టం ఎల్లన్నా! పంట పండుడులేదాయె. అప్పులు ఎలా తీర్చేది? ఎలా బ్రతికేది...?" అరుగుమీద నీరసంగా కూర్చుంటూ అన్నాడు దేవరాజు.

అతడి పక్కనే కూర్చున్నాడు ఎల్లయ్య. నెత్తికి చుట్టుకున్న రుమాలునుండి చుట్టను తీసి నోట్లో పెట్టుకుంటూ అన్నాడు, "ఇక్కడ ఎన్నిరోజులున్నా ఇంతే! వానలు పడ్డప్పుడు పంటలు పండవు. పైరు బాగా ఎదిగినప్పుడు వానలు పడవు. గొర్రెతోక బెత్తెడు అన్నట్టుంటుంది బతుకు. మీ బావ మస్కట్ పోయిండు గదా! విజా (వీసా) పంపుమని లెటర్ రాయి. నాలుగైదేండ్లు పోయివస్తే హాయిగా బతుకవచ్చు"

ఎల్లయ్యవైపు చూస్తూ నిస్పృహగా నిట్టూర్చి అన్నాడు దేవరాజు. "దేనికైనా అదృష్టం కావాలి ఎల్లన్నా! విజా పంపుమని ఆరేడు లెటర్లు రాసిన. ఒక్కదానిక్కూడా బదులు రాయలేదు. కనీసం విజాలు దొరకడం లేదని కూడా రాయలేదు. విసిగిపోయి నేనే ఉత్తరాలు రాయడం మానేసిన"

దేవరాజువైపు జాలిగా చూశాడు ఎల్లయ్య. వారి సంభాషణ మస్కట్ వెళ్ళిన వారిమీదికి మళ్ళింది. ఎవరెంత సంపాదించిందీ ఎవరెలా నష్టపోయిందీ మాట్లాడుకుంటున్నారు.

అప్పుడే పరుగెత్తుకుంటూ వచ్చింది దేవరాజు ఆరేళ్ళ కూతురు.

కూతురును చూడగానే దేవరాజుకు కంగారు మొదలయింది. తల్లి ఆరోగ్యం అసలే బాగులేదు. అప్పుడప్పుడూ బి.పి. ఎక్కువై విరుచుకుపడిపోతుంది. ఇప్పుడు కూడా అలా జరిగిందేమోనని ఆందోళనగా కూతురునడిగాడు. ఏ విషయం చెప్పకుండా 'అమ్మ రమ్మంటుంది' అని మళ్ళీ వెనక్కి చూడకుండా పరుగెత్తింది పిల్ల.

పరుగులాంటి నడకతో ఇంటికి చేరుకున్నాడు దేవరాజు. ఇంట్లో తల్లి కనిపించలేదు. భార్య చిన్న కూతురుకు అన్నం తినిపిస్తూ కనిపించింది. తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ నులకమంచంలో కూర్చున్నాడు. భర్త రాకను గమనించి మంచం వద్దకు వచ్చింది పద్మ. ఆమె బలవంతం చేయడంతో భోజనానికి కూర్చున్నాడు దేవరాజు. అతడికి అన్నం పెడుతూ నెమ్మదిగా చెప్పింది పద్మ.

"ఏంటీ! కరువు వచ్చిందని రంధి పెట్టుకున్నవా! ఎలా జరిగేదుంటే అలా జరుగుతుంది. కష్టాలు మనుషులకు రాక మానులకొస్తాయా! నువ్వు బాధపడుతూ పిల్లి పట్టిన కోడివలె కూర్చుంటే నాకు చేసే రెక్కలు ఆడవు. నువ్వు నవ్వుకుంట తిరిగితే నాకు వెయ్యి ఏనుగుల బలమొస్తది. నువ్వేం బెంగపడకు. బీడీలు చేసి సంసారం ఎల్లదీస్త. నీకు పై ఖర్చులకు డబ్బులిస్త. నా కండ్లముందు నవ్వుకుంటూ తిరుగు. నాకు అంతే చాలు!"

చాపమీద ముడుచుకుని కూర్చున్నాడు దేవరాజు. అన్నం తినాలనిలేదు. తాను తినకపోతే పద్మ కూడా తినదు. అందుకే భోజనానికి కూర్చున్నాడు. అన్నాన్ని కలుపు





తున్నా మనసు తిండిమీదలేదు. ఎంత ఆలోచించగూడదనుకున్నా ఒక్కొక్క సమస్య గుర్తుకువస్తూ అతడిని ఉక్కిరిబిక్కిరి చేస్తు న్నాయి.

నాలుగు ముద్దలు తిని లేవబోతుంటే బలవంతంచేసి కూర్చోబెట్టి మరింత అన్నాన్ని కంచంలో పెట్టింది పద్మ. భర్త చూపుల్లోని దిగులును చూస్తుంటే ఆమెకు భయం కలిగింది. కంచంలో కూరవేస్తూ ధైర్యాన్ని నూరిపోస్తున్నట్టుగా చెప్పింది.

"చీకటి కొన్నిరోజులు. వెన్నెల కొన్నిరోజులు. ఎప్పుడూ చీకట్లోనే ఉండం. ఎప్పుడో ఒకప్పుడు వెలుతురు వస్తది. మనం చేయవలసింది చీకట్లో ఉన్నప్పుడు ధైర్యంగా ఉండడమే! మహారాజులంతటి వాళ్ళకు కూడా కష్టాలు వచ్చినవి. మనమెంత! కరువు మనకు ఒక్కళ్ళకేకాదు, దేశమంతా వచ్చింది. అందరు ఇలాగే బాధపడుతున్నరా!"

భార్యవైపు విరక్తిగా నవ్వుతూ చూశాడు దేవరాజు. ఎప్పుడూ చిరునవ్వుతో కాంతివంతంగా ఉండే అతడి మొహం పాలిపోయి ఉంది. భోజనం ముగించి చేయి కడుక్కుంటూ అన్నాడు దిగులుగా.

"అందరి పరిస్థితి వేరు. మనది వేరు. ఉన్నది ఒక్కటే ఎకరం భూమి. అది అమ్మినా తీరని అప్పు. అవ్వ రోగాలకుప్ప. రోజూ మందులుంటేనే మనిషి. మనకు ఇద్దరు ఆడపిల్లలు.

"కట్నం డబ్బు సంపాదించకపోయినా మంచి సదువన్నా సదివియ్యాలె! ప్రైవేటు సదువులంటే వట్టిగైతదా! ఇవన్నీ ఒక ఎత్తయితే నీ ఆరోగ్యం మరో ఎత్తు. ఏడాదికింద దవాఖానల చూపిస్తేనే గర్భసంచికి పుండు అయింది, ఆపరేషన్ చెయ్యాలనిరి. రోజూ కడుపునొప్పితో బాధపడుతున్నావని నాకు తెలుసు. నాకు తెలిస్తే ఎక్కడ బాధపడతానో అని నవ్వుకుంటూ తిరుగుతున్నావని కూడా తెలుసు. ఇప్పుడే కరువు వచ్చె అప్పుల వాళ్ళు బాకీ తీర్చమని ఒత్తిడి చేయవట్టిరి. ఇన్ని బాధలుండగా ఎట్ల నవ్వుకుంట ఉండాలె చెప్పు!"

భర్తవైపు నిశ్చలంగా చూసింది పద్మ. ఆ చూపుల్లో గుండె దిటవుతప్ప, ఎలాంటి భయంలేదు. అతడు చేయి కడుక్కోగానే తుడుచుకోవడానికి తన కొంగును అందిస్తూ చెప్పింది. "ఇరువై ఏండ్ల తర్వాత వచ్చే బాధల్ని ఇప్పుడే గుర్తుజేసుకుని బాధపడుతున్నవు. పిల్లలు చిన్నవాళ్ళు. ఒకరు నిన్న ఇవ్వల్ల బడికిపోవట్టె. చిన్నది పాలే మరువకపాయె. వాళ్ళకు లగ్గాలు, చదువులని బాధపడవడితివి. రంధి పెట్టుకుంటే మాత్రం కష్టాలుపోతయా...? మనకంటే ఎక్కువ కష్టాల్లో ఉన్న వారిని చూసుకుని బతకాలి. అప్పుడే మనం సుఖంగా ఉన్నట్టనిపిస్తది. కుమ్మరి రాజయ్యను చూడు. ఎదిగిన కొడుకు ట్రాక్టర్ కింద పడి చచ్చిపోయె. పెండ్లీడుకు వచ్చిన బిడ్డ రోగమొచ్చి చనిపోయె. మళ్ళీ ఇప్పుడు భార్యకు పక్షవాతం వచ్చిందట. తిరుగరాని దవాఖానలు తిరుగవట్టె! ఆయన నీలెక్క రంధి పెట్టుకున్నాడా!"

చెయ్యి తుడుచుకుని మంచంలో కూర్చుంటూ భార్యవైపు బేలగా చూశాడు దేవరాజు. ఆమె మొహంలో గంభీరత తప్ప బెంగ అన్నది అణువంతయినా కనిపించలేదు. తాను ఎక్కువగా ఆలోచిస్తున్నానా అనిపించింది దేవరాజుకు. సమస్యలు గుర్తుకొచ్చి మళ్ళీ కలవరపెట్టాయి. ఏదో చెప్పబోతుండగా తలుపు వద్ద అడుగుల చప్పుడు వినిపించి వెనక్కి తిరిగాడు.

ఎదురుగా మల్లయ్యసేటు కొడుకు కనిపించాడు. అతడిని చూడగానే దేవరాజుకు చెమటలుపట్టాయి. పద్మవైపు భయం భయంగా చూశాడు. అతడిని భయపడవద్దని కళ్ళతోనే సైగచేసి "ఏంటి రామన్నా! ఎందుకో వచ్చినవు?" అంటూ అతడివైపు తిరిగింది పద్మ.

"ఏంలేదు... మా నాయిన దేవరాజును



రమ్మన్నడు. బాకీ డబ్బులు తెమ్మన్నడు. మీకు ఎన్నోరోజులనుండి చెబుతున్నాము. మీరు పట్టించుకోవడంలేదు. ఈరోజు బాకీ కట్టాల్సిందే. డబ్బులు పట్టుకుని వచ్చి లెక్క చూసుకో!" అంటూ వెళ్ళిపోయాడు రాములు.

అతడు అంత తొందరగా వెళ్ళిపోతాడను కోలేదు పద్మ. తేలిగ్గా ఊపిరిపీల్చుకుంటూ "ఇక్కడ చెట్లకు కాసినయి. కోసుకొని వస్తము! ఇప్పటికిప్పుడు పది వెయ్యిలు ఎక్కడనుండి తెచ్చేది? " అన్నది నవ్వుతూ. అంత బాధలోనూ ఆమె హాయిగా నవ్వడం విచిత్రమనిపించింది దేవరాజుకు. ఆమెవైపు విస్మయంగా చూశాడు. అతడిలోని భావా లను పసిగట్టినట్టుగా బదులు చెప్పింది పద్మ.

"నాకు ఇలాంటి కష్టాలు కొత్తకాదు. పుట్టి బుద్దెరిగిన నాటినుండే చూస్తున్నాను. ఐదేండ్ల వయసులో అమ్మను పోగొట్టుకున్న నాడే బాధల్ని చవిచూశాను. కన్న తండ్రి మరో స్త్రీని చూపించి పిన్నీ అని పిలవమన్న నాడే కష్టాలంటే ఏమిటో తెలిసింది. బాధప డుతూ కూర్చునేకంటే వాటిని ఎలా ఎదు ర్కోవాలో నేర్చుకున్నాను. కష్టాల్లో ఏడవడం కంటే... నవ్వడం నేర్చుకున్నాను"

"నువ్వు ఎన్నయినా చెప్పు. నాది రోషం పుట్టుక. మూడు రోజులు ఉపవాసమైనా ఉంటాను కానీ మాటంటే పడను. వర్షాలు పడితేనైనా ఏదైనా కూలీనాలీ దొరుకుతుండే! చేతులమీద పనుంటే ఏదీ గుర్తుకురాకపో తుండే! పనిలేక కూర్చుంటే బాధలన్నీ గుర్తు కురావట్టే! అందరు బొంబాయి, బీవండి బతుకపోతున్నరు. నేను కూడా ఆరు నెలలు పోయివస్త. అట్లనన్న కొంత బాకీ తీరిపోతది" భార్యతో చెప్పాడు దేవరాజు.

అతడివైపు సాలోచనగా చూసింది పద్మ. క్షణంలో ఆమె మొహం కళతప్పింది. అతడు అలా వెళ్ళడం ఆమెకు ఇష్టంలేదు. భర్తను చూడకుండా ఒక్కరోజుకూడా ఉండ లేదు ఆమె. ఎప్పుడైనా పుట్టింటికి వెళ్తే మరు నాడే తిరిగి వచ్చేది. దేవరాజు కూడా అంతే! ఆమెను విడిచి ఉండలేడు. ఎప్పుడైనా ఆమె పుట్టింటికి వెళ్ళి రెండురోజులకు మించి ఉండిపోతే ఏదో నెపంతో "అత్తవారింటికి వెళ్ళేవాడు. మొగుడిని కొంగుకు ముడివేసు కుని తిప్పుకుంటున్నావని వరుస ఉన్నవారు పద్మను ఆటపట్టించేవారు. పద్మ గర్వంగా నవ్వుకునేది. ఇప్పుడు బొంబాయి వెళ్తానన డంతో గుండెలో గుబులు మొదలయిందా మెకు.

"నువ్వు దగ్గర ఉంటే ఎంత ధైర్యంగా ఉంటానో, దూరమైతే అంతకు రెట్టింపు బెంగపడిపోతా! గడపలోపల ఉన్న సుఖం కైలాసంలో కూడా దొరకదట. కాలేనొచ్చే.. కడుపేనొచ్చే ఎవరుంటారక్కడ. అయ్యా...! అవ్వా...! ఇక్కడైతే ఒకరికి ఆపదవస్తే మరొకరం చూసుకుంటాం! ఉన్ననాడు తిందాం! లేనినాడు ఉపవాసముందాం. అంతేగానీ... నువ్వు అక్కడ, నేను ఇక్కడ... ఎందుకయ్యా తృప్తిలేని బతుకు" అతడివైపు బాధగా చూస్తూ అన్నది.

"అయితే అప్పులు ఎలా తీర్చాలి? " కొద్దిగా గొంతును హెచ్చించి అడిగాడు దేవ రాజు విసుగ్గా.

"ఇలా మాత్రం తీరవు. నువ్వు అక్కడకు వెళ్ళి చేసే కూలీ నీ ఖర్చులకే సరిపోదు. ఇంకేదైనా ఆలోచించాలి" నెమ్మదిగా చెప్పింది పద్మ.

"అప్పులు తీరే ఆలోచన ఏదైనా చెప్పు చేస్తాను. వాళ్ళు బాకీ తీర్చమని నానా మాటలంటుంటే నాకు తలకొట్టేసినట్టుగా ఉంది" బాధగా చెప్పాడు దేవరాజు.

ఏదో చెప్పబోయింది పద్మ. అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టింది పక్కింటి భూదేవి. మంచినీరు తోడుకుపోవడానికి వచ్చినట్టుగా ఆమె చేతిలో బిందె ఉన్నది. ఇద్దరివైపు చూసి నవ్వుకుంటూ అన్నది. "అప్పులు తీరే ఆలోచన ఏముంటుంది! ఒక్కటే మార్గం...





అడిగితే ఉన్న నాడిస్తానని చెప్పాలె. మొండి కేస్తే ఎవరేం చేస్తరు. అడిగీ అడిగీ విసుగు పుట్టి వాళ్ళే ఊరకుండిపోతారు"

ఆమె ఎందుకలా అంటోందో ఇద్దరికీ అర్థమైపోయింది. భూదేవి వద్ద వెయ్యి రూపాయల అప్పు తీసుకున్నారు. అవి తీర్చమని నెలరోజులనుండి ఒత్తిడి చేస్తోంది భూదేవి. రేపు మాపు అంటూ వాయిదా వేస్తున్నారు. దేవరాజు మొహం చిన్నబుచ్చుకుని బయటకు వెళ్ళి కూర్చున్నాడు. పద్మ నవ్వుతూ "మంచినీళ్ళ కొరకు వచ్చావా!" అంటూ భూదేవిని పలకరించింది.

ఆ వాడకు అదొక్కటే మంచినీళ్ళ బావి. పొద్దున, సాయంత్రం ఆడవాళ్ళు లైను కడతారక్కడ. పద్మకు పాచి పనిచేసుకోవడానిక్కూడా వీలుండదు. అయినా ఆమె విసుక్కోదు. ఎవరినీ వద్దని చెప్పదు. బావివద్దకు ఎవరూ రాకముందే పనంతా పూర్తిచేసుకుంటుంది. ఎండాకాలంలో కూడా ఎంతోమంది తోడుకుపోయినా నీటిమట్టం తగ్గిపోదు.

"పట్టపగలు నీళ్లు చేదుకపోతే ఏమనుకుంటావోనని అనుమానపడుతున్న. పొద్దునపూట పని తొందరగా అవుతుందని నిద్రలేవంగానే చెరుకువాడె తీయడానికి పోయిన కూలీవాళ్ళు వచ్చిన తర్వాత వారిని తియ్యిమని చెప్పివచ్చిన. ఎంత కూలీ ఇచ్చినా ఇంటి మనుషులుంటేనే పనిచేస్తరు. మనం కనిపించకపోతే ముచ్చెట్లు పెట్టుకుంట కూర్చుంటరు" బావివద్దకు నడుస్తూ అన్నది భూదేవి.

"ఏవేళ తోడుకపోయినా ఏముందక్కా! గుణం ఒక్కటి మంచి గుండాలె. కొందరు కడుపులోకత్తులు పెట్టుకుని పైకి తియ్యగా మాట్లాడుతరు. ఇంకొందరు మొహం ముందు ఒకటి మాట్లాడి మొహంచాటుకు మరొకటి మాట్లాడుతరు" పెదవులదాకా వచ్చి పద్మకు మాటలు ఆగిపోయాయి. కోపాన్ని కడుపులోనే దాచుకుని చిన్నగా నవ్వి మౌనంగా ఉండిపోయింది.

"మల్లయ్య సేటు క్కాడా బాకీ ఉన్నరట గదా?" బొక్కెనను బావిలోకి వదులుతూ ఆరాతీస్తున్నట్టుగా అడిగింది భూదేవి. ఆమె మాటల్లో మీరు బాకీలేని వ్యక్తి ఊరిలో ఎవరూ లేరు కాబోలు అన్న వెటకారం ధ్వనించింది. సూటిపోటి మాటలతో వేధించి తన బాకీ వసూలుచేసుకోవాలన్నది ఆమె ప్లాను.

"ఉన్నామక్కా! ఏడాదికింద మా అత్త ప్రాణం బాగాలేకుంటే పది వెయ్యిలు అప్పు తెచ్చినము. పంట పండగానే బాకీ కట్టిద్దామనుకున్నాం. అప్పటినుండి పంటలే లేవాయె! కడుపుకే కొనుక్కుని తినుడాయె! మూడు రూపాయల మిత్తికి రాసుకున్నడు" పెదవి విరుస్తూ బాధగా చెప్పింది పద్మ.

భూదేవి బిందెను నింపుకుని బొక్కెనను కిందవేస్తూ చెప్పింది. "అప్పు తీసుకున్నామంటే భయం ఉండాలె చెల్లే! నన్ను ఎవరేం చేస్తరని మొండిగా ఉంటే మళ్ళీ అవసరమున్నప్పుడు అప్పుపుట్టదు. ఒకసారి మొండివాళ్ళని పేరు వచ్చాక ఊరిలో ఉప్పురాల్లు కూడా అప్పుపుట్టవు. ఇప్పుడు మీ పని కూడా అలాగే జరిగేట్టుంది"

బయట అరుగుమీద కూర్చున్న దేవరాజుకు భూదేవి మాటలు శూలాల్లా తగిలాయి. ఆవేశం ముంచుకొచ్చింది. ఇంట్లోకి వచ్చి భూదేవిని చూస్తూ కోపంగా అన్నాడు.

"మేము ఎవరికి బాకీ డబ్బులు ఇవ్వలేదో చెప్పు! ఎంతమందికి ఎగవేసామని అలా అంటున్నావు. నీ బాకీ నెలరోజుల్లో తీరుస్తానని బతిమాలి చెప్పాను. అప్పుడు సరేనన్నావు. ఆ వాయిదా కూడా రాలేదు. మేం కడుపుకు మాడ్చుకున్నా...అలాంటి నీతిమాలిన పని చెయ్యం. ఈ రోజు కాదు, రేపు తీరుస్తామని బతిమాలుకుంటాంగానీ మొండికెయ్యం. బాకీ ఇచ్చినంత మాత్రాన ఇష్టమున్నట్టు మాట్లాడితే ఎవరూ ఊర్కోరు"

ఆ మాటలకు భూదేవి గతుక్కుమంది.

దేవరాజు బయట కూర్చుని వింటున్నాడని ఆమెకు తెలియదు. ఏదో గొణుక్కుంటూ బిందెను భుజంమీదికి ఎత్తుకుంది.

అతడి ఆవేశం చూసి పద్మకు భయం పట్టుకుంది. భూదేవి ఎలాంటి మనిషో ఆమెకు బాగా తెలుసు. ఉన్నవి లేనివి సృష్టించి చెప్పి ప్రాణమిత్రుల మధ్యకూడా చిచ్చుపెడుతుంది. భర్తను మౌనంగా ఉండుమన్నట్టు కళ్లతోనే హెచ్చరించింది. అది గమనించి కూడా మౌనం వహించలేదు దేవరాజు. రెండు మూడు సూటిపోటి మాటలన్నాడు. "మీ అంతు చూస్తానుండండి" అనుకుంటూ బయటకు నడిచింది భూదేవి. ఆమె వెళ్ళిపోయాక భర్తను సమీపించింది పద్మ. ఈమధ్య అతడు మాటిమాటికీ కోపం తెచ్చుకుంటున్నాడు.

"ఆమె మామూలు మనిషికాదు. తెలిసి ఉండికూడా ఎందుకలా అన్నావు. ఎవ్వరికో ఏదో చాటు మాటలు చెప్పి మనమీదికి ఉసిగొలుపుతుంది. ఇప్పటికే ఎంతో బాధపడుతున్నాం. మళ్ళీ అదొక బాధనా!" నొచ్చుకుంటూ అన్నది పద్మ.

భార్యవైపు కోపంగా చూశాడు దేవరాజు. "వెయ్యిరూపాయలు అప్పుతీసుకున్న పాపానికి ఎన్ని మాటలన్నా భరించాం. మనం ఎవరినో మోసం చేసినట్టు అలా మాట్లాడుతుందా? మౌనంగా ఉంటే ఇంకేవో మాటలంటుంది. ఎదురు తిరిగితే తోకముడుస్తుంది" అరిచినట్టుగా అన్నాడు.

భర్తవైపు వింతగా చూసింది పద్మ. ఇంతకుముందు ఎంతో నెమ్మదిగా ఉండి కోపమంటే తెలియనివాడిలా ఉండేవాడు. ఎవరేమన్నా పట్టించుకునేవాడు కాదు. ఈమధ్యనే ఇలా ఆవేశపడిపోతున్నాడు. చీటికీ మాటికీ కోపాన్ని తెచ్చుకుంటున్నాడు. తనేం మాట్లాడినా మరింతగా కోపం తెచ్చుకుంటాడని మౌనంగా ఉండిపోయింది పద్మ.

దేవరాజు బయటకు వెళ్ళి చీకటిపడ్డాక తిరిగివచ్చాడు. అప్పటికే చేయాల్సిన పని చేసి తృప్తిగా నవ్వుకుంది భూదేవి. ప్రమాదం అంత తొందరగా ముంచుకొస్తుందని తెలియని పద్మ బీడీలు చేస్తూ కూర్చుంది.

ఇంట్లోకి అడుగుపెట్టిన దేవరాజు ఆశ్చర్యంతో చుట్టూ చూశాడు. బయట ఇండ్లల్లో, వీధుల్లో లైట్లు వెలుగుతున్నాయి. తన ఇంట్లో మాత్రం గుడ్డి దీపం వెలుగుతోంది. "అందరి ఇండ్లల్లో కరంటు ఉన్నది. మన ఇంట్లోనే లేదు. ఫీజు ఎగిరిపోయిందా ఏమిటి?" భార్యవైపు చూస్తూ అడిగాడు.

భర్తవైపు ఇబ్బందిగా చూసింది పద్మ. తను చెప్పే విషయం వింటే అతడు బాధపడతాడని తెలుసు. అందుకే అది మామూలు విషయం అన్నట్టు తేలిగ్గా తీసేస్తూ చెప్పింది.

"కరెంటు పొడుగాను. అది ఉన్నా ఒకటే! లేకపోయినా ఒకటే! ఒక్క మన ఇంట్లోనేకాదు. ఈరోజు చాలా మంది ఇండ్లలో కరెంటు వెలుగదు. ఆరు నెలల నుండి బిల్లు కట్టలేదని వైరు తీసేశారు. బిల్లు కడితేనే కనెక్షన్ ఇస్తరట. బీడీలు చేసిన పైసలు వచ్చాక కట్టేద్దాం. ఇప్పుడు అది లేక మనకు [illegible]యిందేమున్నది. గంట రెండు గంటలిస్తడోలేదో... కట్ చేస్తడు. మళ్ళీ దీపాలు వెలిగించుడేనాయె!"

జరిగింది విన్నాక దేవరాజు మొహం చిన్న బుచ్చుకున్నాడు. అతడికి అవమానం అనిపించింది. అది గమనించి అతడిని కబుర్లలోకి దింపాలని చూసింది పద్మ. భర్త ఒక్కక్షణం బాధపడినా చూడలేదామె. అతడి సంతోషానికి ఏం చేయడానికైనా వెనుకాడదు. అతడు ఉల్లాసంగా ఉంటే ఆమెకు ఎంతో సంతృప్తిగా ఉంటుంది.

ఆమె ప్రయత్నాన్ని సాగనీయకుండా ముభావంగా వెళ్ళి వాకిట్లో నిలబడ్డాడు దేవరాజు. అతడి వెంట బయటకు వెళ్ళిన పద్మ కూతురు ఏడుపు విని ఇంట్లోకి వెళ్ళింది.





చుట్టుపక్కల ఇండ్లవైపు, రోడ్డువైపు పరిశీలనగా చూస్తూ నిలబడ్డాడు దేవరాజు. అందరూ తన ఇంటివైపు చూస్తూ తన పేదరికాన్ని ఎత్తి చూపుతున్నట్టుగా అనిపిస్తోంది. గుడ్డి దీపం వెలుతురులో తన ఇల్లు వెలవెలబోతున్నట్టుగా కనిపించిందతనికి. పక్కనే పిలుపు వినిపించడంతో తిరిగి చూశాడు. ఎదురుగా తన తల్లి నర్సవ్వ కనిపించింది. ఆమెవెంట తన పెద్ద కూతురు కనిపించింది.

తండ్రిని చూడగానే పాప నానమ్మ చేతిని విడిచి అతడి వద్దకు పరిగెత్తి కాళ్ళకు చుట్టుకుంది. కూతురును ఎత్తుకుని ముద్దాడాడు దేవరాజు.

"ఏంది బిడ్డా! చీకట్ల నిలవడ్డవు. పురుగు పుట్రా ఉంటాయి. ఇంట్లకు నడువు" అంటూ మూల్గుతూ ఇంట్లోకి వెళ్ళింది నర్సవ్వ.

తల్లిని చూడగానే పొద్దున ఆమె చెప్పిన పని గుర్తొచ్చింది దేవరాజుకు. ఇప్పుడు అడిగితే ఏమని చెప్పాలో తోచలేదు. హృదయం బాధతో మూల్గింది. మౌనంగా తల్లివెంట ఇంట్లోకి నడిచాడు దేవరాజు. నర్సవ్వ నులకమంచం వాల్చి కూర్చుంది. దేవరాజు తల్లి పక్కనే కూర్చుండి కూతురును తొడపై కూర్చోబెట్టుకున్నాడు.

"ఏంది బిడ్డా దేవరాజూ! బీరిపోయి కూర్చున్నవేందిరా!... ఈ వారం పదిరోజుల నుండి మరీ బక్కగైపోతున్నవు. ఎవలన్నా ఏమన్నా అన్నరా..." అడిగింది కొడుకువైపు చూస్తూ.

దేవరాజు మౌనంగా ఉండిపోయాడు. అది గమనించి పద్మనే చెప్పింది. "కరువు పడిందని రంది పెట్టుకున్నడు. ఎక్కడికైనా బతుకపోతనంటున్నడు. ఎటుపోయినా ఏంలాభం లేదని చెబుతున్నా వినడంలేదు"

నర్సవ్వ కొడుక్కు అన్నివిధాలా ధైర్యం చెప్పింది. తాను చిన్నప్పుడు ఎలా కష్టపడింది, తిండి కూడా లేకుండా ఎలా తిరిగిందీ చెప్పింది. కష్టాలు వచ్చినప్పుడు ఎలా ధైర్యంగా ఉండాలో కూడా చెప్పింది. ఆమెకు మనసులో దేవరాజుకంటే ఎక్కువ బెంగగా ఉన్నా పైకి మాత్రం ధైర్యంగా ఉంటుంది.

కష్టాలన్నీ ఏకరువుపెడుతూ ఆమె చెప్పిన మాటలు దేవరాజులో మరింత గుబులును సృష్టించాయి తప్ప ధైర్యాన్ని కలిగించలేదు. నేల చూపులు చూస్తూ మౌనంగా ఉండిపోయాడు. ఇంట్లో గుడ్డి దీపం గాలికి కదలాడుతూ ఆరిపోవడానికి సిద్ధంగా ఉన్నట్టుగా ఉంది.

'దేవరాజూ...' అన్న పిలుపుతో ఉలిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకున్నాడు. ఆ పిలుపు ఎవరిదో గుర్తుపట్టి బయటకు నడిచాడు. చీకట్లో వచ్చిన వ్యక్తి ఎవరో తెలుసుకుందామని బయటకు వచ్చిన పద్మ ఆ వ్యక్తిని చూసి క్షణకాలం విస్తుపోయింది. ఆశ్చర్యంగా భర్తవైపు చూసింది. అతడు పద్మవైపు కూడా చూడకుండా ముందుకు కదిలాడు. పద్మ మనసు ఏదో కీడును శంకించింది. భర్తను ఎక్కడికి వెళ్తున్నావని అడగాలనుకుంది. ఆ అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోయాడు దేవరాజు.

వాళ్లు వెళ్తున్నవైపు భయంభయంగా చూస్తుండిపోయింది పద్మ. దేవరాజు మారిపోతున్నాడనిపిస్తోందామెకు. ఆ మార్పు ఆరోగ్యకరమైనదైతే సంతోషించేదే! కానీ అతడు వెళ్తున్నది దొంగగా ముద్రపడి ప్రాణాలను సైతం తీయడానికి వెనుకాడని వాడివెంట. పేదరికం మనిషిలో ఎంతటి మార్పునైనా తెస్తుందన్న వాస్తవం గుర్తొచ్చిందామెకు. తను పుట్టి పెరిగింది పేదరికంలో కాబట్టి అది కలిగించే బలహీనతలన్నీ తెలుసు ఆమెకు.

"చీకట్లో అక్కడ ఏం చేస్తున్నావే! లోపలికిరా!" అన్న అత్తమాటలతో ఉలిక్కిపడి లోపలికి వెళ్ళింది పద్మ.

"వచ్చింది ఎవరే...? వీడు ఎక్కడికెళ్తున్నాడట. అసలే రోజులు బాగా లేవు. పట్టపగలే దొంగతనాలు జరుగుతున్నాయి. తలు



పులు దగ్గరగా వేసిరా! చీకటిపూట బయటకు వెళ్ళకూడదంటే వినడు" గొణుక్కుంటున్నట్టుగా అడిగింది నర్సవ్వ.

"చీకట్లో కనిపించలేదు..." అబద్ధం చెప్పి బీడీల చేటముందు కూర్చుంది పద్మ. చేతులు బీడీలు చుడుతున్నా, ఆలోచనలన్నీ దేవరాజుపైననే ఉన్నాయి, రాత్రివేళ ఎక్కడికి వెళ్ళాడని ఆలోచిస్తోంది.

వచ్చినవ్యక్తి ఎవరో తెలిస్తే కంగారు పడిపోయేది నర్సవ్వ. ఆమె అలా కంగారుపడి తనను మరింతగా కంగారు పెడుతుందనే అసలు విషయం చెప్పలేదు పద్మ. మూల్గుతూ లేచి గూటిలో ఉన్న ఆముదం సీసా అందుకుంది నర్సవ్వ. కరంటు వెలుతురుకు అలవాటు పడిన కళ్లకి దీపం వెలుతురులో సరిగా కనిపించడంలేదు. కానీ ఆ విషయాన్ని గుర్తుచేసి పద్మను బాధపెట్టడం ఇష్టంలేదు. పద్మ కూడా బీడీలు చేస్తూ అలాగే అనుకుంది.

"కాళ్ళు పాడుగాను. ఒక్కటే నొప్పి, తిమ్మర్లు, ఈ రెండు మూడేళ్ళనుండి ఏ రోగమొచ్చిందో గానీ అంతకుముందు ఈ ఆయాసం ఎక్కడిది. రెండు మూడు కోసులదూరం నుండి వచ్చి పాలు ఇచ్చిపోయే దాన్ని. రెక్కలిరుగు కష్టంచేసుకున్నదాన్ని. నాకెక్కడి రోగమచ్చే! నాలుగు అడుగులు వెయ్యంగనే కాళ్లు కూలబడిపోతున్నయి" కాళ్ళకు ఆముదం రాస్తూ మనవరాలిని కాళ్ళపై కూర్చోబెట్టుకుని అన్నది.

"షుగర్, బ్లడ్‌ప్రెషర్ రోగాలున్న వాళ్ళకు నొప్పులు అట్లనే ఉంటయట. మందులు ఎన్ని వాడినా, ఒకసారి షుగర్ వచ్చిందంటే తక్కువ కాదట" పొడిపొడిగా చెప్పింది పద్మ.

మనవరాలిచేత కాళ్ళను తొక్కించుకుంటూ విరక్తిగా అన్నది నర్సవ్వ. "బతుకు పాడుగాను ఏం బతుకిది. నొప్పులతో రాత్రంతా నిద్రపట్టలేదు. ఏ పంటకైనా పురుగు మందులు చల్లుడేనాయె! రకరకాల మందులు చల్లి ఆ మందులకూడు తినుడాయె! రోగాలు రమ్మంటే ఎందుకు రావు"

"మందులే లేకుంటే ఇంత ఎక్కువ పంట పండేదా...? వెనుకట మీరు కట్టెతొక్కి, బూడిది, పేడలు వేసి పంటలు తీస్తే ఎకరానికి ఐదు బస్తాలు కూడా పండేవికాదు. ఇప్పుడు ముప్పై నలబై బస్తాలు పండుతున్నాయి. ఆ పంట ఇప్పుడు పండిస్తే ఇంత మంది జనానికి సరిపోతుందా!" అడిగింది పద్మ.

"అదే మంచి కాలం. రోగాలు, నొప్పులు ఏవీ ఉండేవి కావు. నూటికొక్కనాడు జ్వరం వస్తే వెల్లిపాయనూనె మరగ కాచి పెయ్యంతా రాసుకుందురు. దగ్గులేస్తే కొండనాలికకు జీడి పెడుదురు. చిన్న పిల్లలకు దగ్గులేస్తే తులసి ఆకు, ఓమను దంచి పోద్దురు" నర్సవ్వ చెబుతుండగా తలుపు చప్పుడయింది. ఆతృతగా అటువైపు తిరిగి చూసింది పద్మ. ఎదురుగా దేవరాజు కనిపించేసరికి మనసు కుదుటపడ్డట్టయింది.

దేవరాజు ఇంట్లోకివచ్చి గొంగడి పరుచుకుని నిద్రపోవడానికుపక్రమించాడు. భోజనం చేయమని అడిగితే తినాలని లేదని చెప్పాడు.

"షుగర్ గోళీలు లేక మూడు రోజులాయె. నొప్పులు ఎక్కువయ్యాయి. రోగం పాడుగాను. కడుపులోకి తిండేలేదంటే మందులు గోళీలకే వందల రూపాయలు కావట్టె! పొద్దున నాలుగైదు గోళీలు కొనుక్కరమ్మంటిగదా! తీసుకచ్చినవా బిడ్డా!" అడిగింది నర్సవ్వ.

ఆమె గొంతు ఎంతో దీనంగా ఉంది. ఎంతో నొప్పి, ఆయాసం ఉంటే తప్ప తల్లి తనతో మందులు తీసుకురమ్మని చెప్పదని అతడికి తెలుసు. రెండేళ్ళక్రితమే పొద్దున ఒకటి సాయంత్రం ఒకటి, షుగర్‌కు సంబంధించిన మాత్ర వేసుకుంటేనే షుగర్ కంట్రోల్‌లో ఉండి నొప్పులు తక్కువగా ఉంటాయని డాక్టర్ చెప్పాడు.




ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తోచలేదు దేవరాజుకు. తల్లి గొంతులోని దైన్యం అతడిని కృంగదీసింది. ఎదిగిన కొడుకుగా తల్లి కనీస అవసరాలు తీర్చలేని అతడి అసహాయతను నిలదీస్తున్నట్టుగా ఉంది. చేతిలో డబ్బులేక మందుల షాపుకు వెళ్ళలేదు. ఇప్పటికే అక్కడ ఐదు వందలకు పైగా బాకీ ఉన్నాడు. మందుల కొరకు వెళ్తే అవి చెల్లిస్తేనే ఇస్తానంటాడని తెలుసు. షాపు మూసి ఉందని అబద్ధం చెప్పేలోగా అన్నది పద్మ.

"నాలుగైదు ఎక్కడ సరిపోతాయి. ఒక్కసారే వందగోళీలు తెచ్చిండు. జొన్న రొట్టె చేసిన. రెండు రొట్టెలు తిని గోళీ వేసుకో! నువ్వు కూడా లేచి అన్నం తిను. ఉపవాసముంటే అప్పులు తీరవు" భర్తను ఉద్దేశించి అంటూ లేచి వెళ్ళి మాత్రలు తెచ్చి నర్సవ్వకు అందజేసింది. దేవరాజు అప్రతిభుడై భార్యవైపు చూస్తుండిపోయాడు. నర్సవ్వ గోళీలను అందుకుని మెత్తకింద దాచుకుని రొట్టె తినడానికని తడకచాటుకు వెళ్ళింది. పద్మ భర్తవద్దకు వెళ్ళి బీడీకట్టను, అగ్గిపెట్టెను అందించింది.

దేవరాజు కళ్ళు మెరిశాయి. అతడి మొహం ఆనందంతో వెలిగిపోయింది. అపురూపంగా వాటిని అందుకున్నాడు. చేతిలో డబ్బులేక రెండు మూడురోజులనుండి బీడీలు తాగడమే మానేశాడు. వాటిని అందుకున్న మరుక్షణమే దిగులు మొదలయిందతనికి. ఇంట్లో చిల్లిగవ్వలేదు. తన అవస్థను గమనించి ఎక్కడ అప్పుచేసి తెచ్చిందో అనుకుంటున్నాడు. ఆ ఆలోచన రాగానే బీడీ ముట్టించాలపించలేదు. భార్యవైపు అసంతృప్తిగా చూశాడు.

భర్త మొహంలో ఏ భావం కదిలినా వెంటనే పసిగట్టగలదు పద్మ. అతడిలోని భావాలను చదివినట్టు నవ్వుతూ చెప్పింది. "నువ్వేం భయపడకు. బాకీ తేలేదు. ఉద్దెర పెట్టలేదు. తట్టెడన్ని బొగ్గులు జమచేసి అమ్మిన. కానుగు కాయ ఏరుకొచ్చి వాటిని తోడుగా అమ్మిన. ఆ డబ్బుతోనే ఇవి తెచ్చిన"

భార్యవైపు అపురూపంగా చూస్తూ బీడీ ముట్టించి తృప్తిగా పొగపీల్చి వదిలాడు. భర్త అవసరాలను గమనించి వాటిని తీర్చడంలోనే సంతోషాన్ని వెదుక్కునే భార్యలు ఎందరుంటారు అనుకున్నాడు.

పద్మ పదవ తరగతివరకు చదువుకుంది. ఆర్థికంగా లేని కుటుంబం. పైగా తల్లిలేని పిల్ల. సవతి తల్లి పెంపకంలో పెరిగింది. ఎంత తొందరగా ఆమె బరువు దించుకుంటే అంత మంచిదనుకున్న సవితితల్లి కట్నం లేకుండా దేవరాజుకిచ్చి పెళ్లిచేసింది.

చదువుకున్న పిల్ల. పైగా అందమైనది. లేని కుటుంబంలో ఎలా ఇముడుతుందో నన్న బెంగ ఉండేది దేవరాజుకు. పెళ్ళి అయిన కొద్దిరోజులకే అందంతోపాటు ఆమెలో అణుకువ, ఆప్యాయతలు కూడా ఎక్కువేనని గ్రహించాడు దేవరాజు. అప్పుడప్పుడూ 'ఈ కష్టాలకు బెంబేలుపడి పారిపోతావనుకున్నాను. కానీ నన్నింత బాగా చూసుకుంటావనుకోలేదు' అంటాడు దేవరాజు.

"చదువు జీవితానికి వెలుగునియ్యాలిగానీ చీకటి చెయ్యకూడదు. నా స్థానంలో ఏ ఆడపిల్ల ఉన్నా ఇలానే చూసుకునేది" అంటూ నవ్వుతుంది పద్మ.

"పద్మా..." ఆర్తిగా పిలిచాడు దేవరాజు.

అక్కడినుండి కదలబోతూ ఏమిటన్నట్టు వెనక్కి తిరిగిచూసింది పద్మ.

"ఇంతకుముందు నేను ఎక్కడికి వెళ్ళానో అని భయపడ్డావుకదూ! ఈ బీడీ కొరకే షాపువద్దకు వెళ్ళాను. వాడు వచ్చిందీ నన్ను బీడీ అడగడానికే! నా వద్ద లేవనడంతో కొని స్తారమ్మని తీసుకెళ్ళాడు. మేం వెళ్ళేసరికి షాపు మూసి ఉంది..." అతడు మరేదో చెప్పబోతుంటే బయట డప్పు చప్పుడు వినిపించింది. ఏదో చాటింపు చేస్తున్నారని బయటకు వెళ్ళారిద్దరు.

చాటింపు వింటుంటే ఇద్దరికీ ఆందోళన మొదలయింది. డప్పు చప్పుడు విని నర్సవ్వ కూడా బయటకు వచ్చింది. చాటింపు ఆగిపోయాక గొణుక్కుంటున్నట్టుగా అన్నది. "ఇది కరువేనాయె! బ్యాంకులో అప్పు ఎలా కడతరు. కూటికి కూడా లేనియాల ఇది. ఇప్పుడు కట్టమంటే ఎక్కడినుండి తెచ్చేది. చంపుక తింటరా ఏంటీ.. ?"

"కరువు అని ఎవరంటున్నారత్తా! మనటు వంటి వాళ్ళకు కరువు. ఊరవతలికిపోయి చూడు. అడుగడుగున బోర్ బాయిలే! బీడు, కంచెభూములన్నీ ఆయకట్టుచేశారు. గడ్డి కూడా మొలవని భూములను పంటభూములుగా మార్చారు. ఇంతకుముందు ఆచితాచి పంట పండిన భూముల్లో ఇప్పుడు గడ్డి కూడా మొలవడంలేదు. బెండ్లు మునిగి గుండ్లు తేలునని బ్రహ్మంగారు చెప్పింది ఇదే!" ఇంట్లోకి నడుస్తూ అన్నది పద్మ.

"అదేమన్నగాని... మనం కూడా కొంత బాకీ ఉన్నంకదా! ఎన్నటినుండో బాకీ తీర్చాలని ఒత్తిడి చేస్తనే ఉన్నరు. ఇప్పటికే రెండు కిస్తీలు బాకీ ఉన్నం. ఈసారి ఊర్కోరట. ఇంటికి తాళం వేస్తరట. ఇప్పుడు ఎక్కడనుండి తెచ్చేది" అసహనంగా కదులుతూ అన్నాడు దేవరాజు.

పద్మ చేయి అప్రయత్నంగా మెడను తడుముకుంది. పసుపుతాడు తప్ప ఏమీ తగల్లేదు. ఉన్న కాస్త బంగారం ఎప్పుడో హరించుకుపోయిన సంగతి గుర్తుకొచ్చింది. చెవిని తడుముకుంటే చీపురుపుల్లలు తగిలాయి. చెవికమ్మలు అమ్మేశాక రంధ్రాలు పూడుకుపోకుండా ఉండేందుకు ఆ ఏర్పాట్లు చేసుకుంది. భర్తను ఎలా ఓదార్చాలో తెలియడం లేదామెకు.

నర్సవ్వకు కూడా భయం పట్టుకుంది. ఇంతకుముందెప్పుడో కో-ఆపరేటివ్ బ్యాంక్‌లో ఎడ్ల బండికొనుక్కోవడానికి ఎల్. టి.లోన్ కింద పదివేలు అప్పు తీసుకున్నారు. ఆ డబ్బు మీదమీదే ఖర్చయిపోయింది. ప్రతీ పంటమీద కొంత కొంత అప్పు కడుతూవస్తున్నారు. పంటలు లేక రెండు కిస్తీల బకాయి చెల్లించలేదు. అప్పు కట్టకపోతే బ్యాంక్‌వాళ్లు చేసే హంగామా గుర్తొచ్చి గుండె దడదడలాడింది. కొడుకు వెంట భయం భయంగా ఇంట్లోకి నడిచింది.

నీరసంగా వెళ్ళి మంచంలో కూర్చున్నాడు దేవరాజు. నర్సవ్వ అతడి పక్కనే చతికిల పడిపోయింది.

"అవ్వా! కష్టాలన్నీ ఒక్కసారి కట్టగట్టుకుని వచ్చినట్టున్నాయి. పుడితే ధనవంతుని ఇంట్లోనన్న పుట్టాలె! లేదంటే పూర్తిగ అడుక్కుతినేటోల్ల ఇంట్లోనన్న పుట్టాలె! ఉండిలేని ఇంట్లో పుట్టకూడదు. ఏది కొనకున్నా కాలం గడువదాయె. ఏది లేకున్నా చిన్నతనమాయె" నిట్టూరుస్తూ బాధగా అన్నాడు దేవరాజు.

"అందరు అట్లనుకుంటే ఎట్లా! లక్షాధికారి గానీ బిక్షగాడు కానీ తినేది ఇదే పిడికెడు అన్నం. బంగారం తినడుగదా. అందరూ ధనవంతులైతే ఎట్ల నడుస్తది లోకం. దేవుడు అందరిని ఒకేరకంగా ఉంచడు. మన చేతికున్న ఐదు వేళ్ళే సమానంగా లేవు. దునియాలో జనమంతా సమానంగా ఎట్లుంటరు. ధనవంతులకూ తెల్లారుతుంది. ఉపవాసం పడుకున్న మనకూ తెల్లవారుతుంది. గట్ల ఫికర్ పడుతరా?" ధైర్యంగా అంది పద్మ.

తను బెంగపడితే కొడుకు మరింతగా బాధపడతాడని గ్రహించి ధైర్యం చెబుతున్నట్టుగా అంది నర్సవ్వ. "ఏంది బిడ్డా బాధ పడుతున్నవు! కడుపుకే గతిలేదు. అప్పు ఎక్కడినుండి కట్టుమంటవని రేపు వాళ్ళు వచ్చినంక అడుగుత. ఇంకో ఆరునెలలు ఆగుమందాం. పంటలు పండితే పూర్తిగా తీర్చేస్తమని చెబుదాం. వాళ్ళు మనకు ఉత్తగనే ఇస్తుంద్రా? మిత్తికి మిత్తి లెక్కగట్టి తీసుకుంటుంద్రు..." ఆమె మాటలు పూర్తికా





నేలేదు. ఇంట్లోకి అడుగుపెట్టాడు కోమటి మల్లయ్య. నర్సవ్వమాటల్ని ఆపి అతడివైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"అది బ్యాంకు విషయం నర్సవ్వా! ఎన్ని రోజులు ఆగుమంటే అన్ని రోజులు ఆగుత రనుకున్నవా! మీరు నీతిలేని మనుషులు. ఉపకారం చేసినోనికే అపకారం చేస్తరు. నాకు ఒక్క నయాపైస బాకీలేమని అంద రితో చెబుతన్నరటగదా! వీడేం చేస్తడు, వాడేం చేస్తడంటే సర్కారోళ్లు ఊర్కుంటరను కుంటున్నవు. మెడపట్టి బయటకు గెంటి ఇల్లుకు తాళం వేస్తరు" కోపంగా అరిచిన ట్టుగా అన్నాడు మల్లయ్య. మనిషి పొట్టిగా లావుగా ఉంటాడు. నడిచిరావడం చేత ఆయాసం వచ్చినట్టుంది. రొప్పుతున్నాడు.

ఆ అరుపులకు చిన్నపిల్లలిద్దరూ ఉలిక్కిపడిలేచి ఏడుపు అందుకున్నారు. పద్మ వారిని సముదాయించడంలో మునిగిపోయింది. నర్సవ్వ మల్లయ్యవైపు భయంగా చూసింది.

"రా... సేటూ... ఇట్ల కూర్చో అప్పుడు కొడుకుని తోలినవుగని నాకు పని ఉండిరా లేదు. రేపు పొద్దున వచ్చి కలుద్దామను కున్న" మంచంమీదినుండి లేస్తూ అన్నాడు దేవరాజు.

"నేను కూర్చుండుడుకు రాలేదు. అటో ఇటో తేల్చుకోవడానికే వచ్చిన. నా బాకీ ఎప్పుడు తీరుస్తవు చెప్పు! ఎన్నిరోజులు ఆగాలి? ఆపద ఉందంటే ఐదువేలు ఇస్తిని. ఏడాదులు గడిచినా వడ్డీలేదు. అసలు లేదు. బయట నా గురించి వేరే రకంగా చెప్పవడితివి. ఇస్తవా? ఇయ్యవా? చెప్పు" గొంతు ఏమాత్రం తగ్గించకుండా అరుస్తు న్నాడు.

నర్సవ్వకు ముచ్చెమటలు పోశాయి. భయంతో నాలుక తడారిపోయి గొంతు పెగలడంలేదు. పద్మకు కూడా భయం పట్టుకుంది. భూదేవి తమ గురించి ఏవేవో కల్పించి చెప్పిందని గ్రహించింది. దేవరాజు ఎక్కడ కోపం తెచ్చుకుని తిరగబడుతాడోనని ఆందోళనగా ఉంది ఆమెకు. సమయం చూసి కలుగజేసుకుని వారిని శాంతింప చేయాలనుకుంది.

అప్పటికే మల్లయ్య అరుపులు విని చుట్టు పక్కలవారు ఆడామగా గుమిగూడారు. వారిని చూసి మరీ రెచ్చిపోతున్నాడతడు. ఆ ఊరిలో చాలామందికి అప్పు ఇచ్చాడు మల్లయ్య. అందులో చాలావరకు రికవరీ కాలేదు. తను మెతక మనిషి అని ఖచ్చితంగా అడగనని ప్రచారంలో ఉండడం వల్ల రికవరీ కావడంలేదని మల్లయ్య నమ్మకం.

దేవరాజు అమాయకుడు. ఏమన్నా కోపం తెచ్చుకోడు. భయపడతాడు. ఇక్కడ ఎంతయినా హంగామా చేయవచ్చు ఇది చూసి మిగతావారుభయపడతారు. అప్పుడు రికవరీ అవుతాయి. ఇది మల్లయ్యకు పుట్టిన ప్లాన్‌కాదు. భూదేవి చెప్పి ఒప్పించిన ప్లాన్. అందుకే హద్దూ, అదుపూ లేకుండా నోటికి వచ్చింది వాగుతున్నాడు మల్లయ్య.

దేవరాజు మౌనంగా కూర్చున్నాడు. మల్లయ్య అరుస్తూనే ఉన్నాడు. గుమికూడిన జనంలో గుసగుసలు మొదలయ్యాయి. కొందరు అప్పు తీర్చనందుకు దేవరాజును తప్పుపడితే మరికొందరు రాత్రిపూట రావడమే కాక ఇంత హంగామా చేస్తాడా అని మల్లయ్యను తప్పుపడుతున్నారు. 'రోగాల కుప్ప. ఎక్కడ డబ్బూ దాని రోగాలకే సాల కపాయె'నని కొందరు నర్సవ్వను తప్పుపడు తున్నారు.

రెచ్చిపోయి ఆవేశంగా మాట్లాడుతున్న మల్లయ్య 'పెండ్లాం' అంటూ బూతుమాట అన్నాడు. అంతవరకు కోపాన్ని అణుచుకుంటున్న దేవరాజు ఆవేశంగా లేచాడు. మాటా మాటా పెరిగింది. ముందుకు దూసుకువస్తున్న మల్లయ్యను పక్కకు నెట్టాడు దేవరాజు. కావాలనే వెల్లకిలా పడిపోయి ఏడ్వడం మొదలెట్టాడు మల్లయ్య.

అతడి ఏడ్పులతో ఇల్లు దద్దరిల్లిపోయింది. అక్కడ గుమికూడినవారిలో ఇద్దరు



# ఎవరు ఎవరెవరు?



ఈ చిత్రంలో ఎంతమంది మనుషులున్నారు? ముగ్గురా? తప్పా? నలుగురా? అదీ తప్పేనండి. ఫ్లోరిడా రాష్ట్రంలో మాడర్‌డేల్ అనే ఊళ్ళో 'మ్యూజియం ఆఫ్ ఆర్ట్' లో తీసిన ఈ చిత్రంలో కోకాకోలా బాటిల్ పట్టుకుని కూర్చున్న పురుషుడు, అతని ఎదురుగా కూర్చుని వున్న లావుపాటి ఆవిడా నిజానికి మనుషులు కారు. అలా కనిపించే బొమ్మలు. పక్కనే ఒంగుని వున్న ఇద్దరూ మనుషులు. మ్యూజియంకి వచ్చిన వారు ఇక్కడ వీరితో... అంటే ఈ బొమ్మ మనుషులతో ఫొటో తీయించుకోందే వెళ్ళరు.

ముగ్గురు మల్లయ్యను ఎత్తినిలబెట్టారు. కాలు విరిగిందని నిలబడలేనని అరుస్తూ మళ్ళీ కూలబడిపోయాడు. దేవరాజు గుండె దడదడలాడింది. పద్మకైతే నోటివెంట మాట రాలేదు. నర్సవ్వకు ముచ్చెమటలు పోశాయి. అక్కడ గుమికూడిన జనం రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

అరగంట అరుపుల తర్వాత ఇద్దరు వ్యక్తులను ఆసరా రమ్మని తిడుతూ వెళ్ళిపోయాడు మల్లయ్య. బాకీ అడగడానికి వెళ్తే కొట్టాడని దారిపొడుగునా చెప్పుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఎవరూ ముద్ద ముట్టలేదు. ఎక్కడివారక్కడే ముడుచుకుని పడుకున్నారు. ఎవరూ నిద్రపోలేదు. పద్మ హృదయం బాధతో నిండిపోయింది. ఎప్పటికప్పుడు తను భర్తను సంతోషపెట్టాలని చూస్తున్నా ఏవో అవాంతరాలు ఎదురొచ్చి అతడిని మరింతగా బాధపెడుతున్నాయి. ఆ విషయం పద్మను కలవరపెడుతోంది.

నర్సవ్వ దీర్ఘాలోచనలో పడిపోయింది. ఆ బాకీ తన గురించి చేశారన్న విషయం ఆమెను మరింతగా కుంగదీస్తోంది. కేవలం ఆ డబ్బు మాత్రమే కాదు కూతురు వద్ద అప్పు తెచ్చిన డబ్బు, కొంత బంగారం, ఏటేటా పండినపంట, కొడుకు, కోడలు కూలీ నాలీ చేసిన రూపాయలు... అన్నీ మందులకే ఖర్చయిపోయాయి.

అంత ఖర్చుచేసినా ఆరోగ్యం కుదుటపడలేదు. షుగర్, బి.పి. రెండూ ఉన్నాయని, అవి పూర్తిగా తగ్గిపోవని ఎప్పుడూ ఇలా మందులను వాడాలని చెప్పాడు డాక్టరు. కొడుకు ఆర్థికంగా పూర్తిగా చితికిపోవడానికి కారణమైన తను ఎందుకు బతకాలన్న ఆలోచన కూడా వచ్చిందామెకు.

దేవరాజుకు కూడా నిద్ర రావడంలేదు. అసహనంగా అటూ ఇటూ దొర్లుతున్నాడు. తల్లి, భార్య నిద్రపోలేదని అతడికి తెలుస్తూనే ఉంది. ఒక్కరినొకరు మాట్లాడించే సాహసం చేయడంలేదు. ఎవరి ఆలోచనల్లో వారున్నారు. మధ్యమధ్య నర్సవ్వ బాధతో మూల్గుతోంది. పద్మ దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తోంది. వారు బాధపడటం చూసి మరింతగా కదిలిపోయాడు దేవరాజు.

ఎప్పటిలా కోడికూత పొద్దుతో పద్మ లేవడం చూశాడు దేవరాజు. ఆమె ఇంటిపనిలో మునిగిపోయింది. చిరుదీపపు గుడ్డివెలుతురులో సైతం కళావిహీనమైన భార్య మొహంలోని మార్పును గమనించాడు. లేచి భార్య వద్దకు నడిచాడు. పొయ్యిలో బూడిదను తోడుతున్న పద్మ అడుగుల చప్పుడు విని వెనక్కితిరిగి చూసి నవ్వడానికి ప్రయత్నించింది. మోకాళ్లపై ఆమె వద్ద కూర్చుని అడిగాడు దేవరాజు.

“వాడెవడో ఏదో అన్నాడని బాధపడుతున్నావా? ఏనుగు పోతుండగా కుక్కలు ఎన్ని మొరుగయి? ఇది కూడా గట్లనే అనుకో. ఎంత కష్టంలనైనా నవ్వుకుంట ఉండి నన్ను నవ్విచ్చేదానివి గిట్ల చిన్నబోయినవేందీ? చిన్నబోయి కూసుంటె బాకీలు తీరుతయా? ”

భర్తవైపు మందహాసం చేస్తున్నట్టుగా చూసింది పద్మ. “నేను చిన్నబోవడమేమిటి? కష్టాల్లో పుట్టి కష్టాల్లో పెరిగిన దాన్ని. వాడేదో అన్నాడని కాదు. నువ్వు అన్నదానికి వాడెన్ని అర్థాలు తీసి చెబుతాడోనని. ఇగుకులో సరుకన్నట్టు వాడు రేపు మన కులసంఘంల పంచాయితి పెట్టినా పెట్టవచ్చు. బడితకర్ర ఉన్న వారిదేబర్రె. పైసలున్నవానిదేమాట. అంతా మనదే తప్పంటరు”

భార్యవైపు అసహనంగా చూశాడు దేవరాజు. అతడికి కోపం వచ్చింది. “అంటే ఏమిటి? వాడు ఎన్ని తిట్టినా పడాలికాని ఎదురు మాటాడకూడదు. నా భార్యను తిట్టినా నేను మౌనంగా ఉండాలి. అంతేనా నువ్వు అంటున్నది” అడిగాడు.

అతడివైపు బాధగా చూసి చెప్పింది పద్మ.

"పేదవాడి కోపం పెదవికి చేటు. సంఘంలో అంతా నీదే తప్పు అంటారు. నువ్వు నెత్తీనోరూ మొత్తుకున్నా ఎవరూవి నరు. బెల్లంచుట్టే ఈగలు ముసురుతయి. పేదవానిపైసల చుట్టే పెద్దలు ముసురుకుం టారు. గొంగట్లో తినుకుంటూ వెంట్రుకలొ స్తున్నయి అన్నట్టుంది మనపని"

ఆ విషయం నిజమేనని అప్పుడనిపిం చింది దేవరాజుకు. సంఘంలో పంచాయతీ పెట్టిస్తాడన్న ఆలోచన అంతవరకూ తట్టలే దతనికి. కులపెద్దలకు దేవరాజు అంటే అసలు గిట్టదు. కల్లు తాగించిన వారివైపే మాట్లాడుతారని ఒకటి రెండుసార్లు వారిని నిలదీసి అడిగాడు. అది మనసులో పెట్టు కుని ఎంత జురుమానా వేయడానికైనా వెనుకాడరు. ఈ విషయం గుర్తుకు రాగానే వెన్నులో చలి మొదలయింది దేవరాజుకు.

అప్పుడే బయటనుండి పిలుపు వినిపిం చింది. వెళ్లి తలుపు తెరిచాడు దేవరాజు. ఎదురుగా గ్రామసుంకరి కనిపించాడు.

"మల్లయ్యసేటును కొట్టినవట. మీ కుల సంఘంల ఫిర్యాదయిండు. ఇయ్యాల పంచా యతున్నదట. ఎటూ పోవద్దు అని చెప్పమ న్నరు పెద్దమనుషులు. అయినా నీకు ఇదేం పాడుబుద్ధి. బాకీ తెచ్చుకుంటవు. అక్కర నొక్కిచ్చుకుంటవు. ఇయ్యిమని వస్తే కొడు తవా? దునియా పూర్తిగ నీతి తప్పింద్రు. అందరు నీలెక్క ఉంటే ఊరిలో ఉప్పురాల్లు అప్పు పుట్టయి. పని ఉన్నప్పుడు కాల్లు పట్టు కుని తర్వాత రాళ్లు పట్టుకున్నట్టున్నది నీ సంగతి" అంటూ గొణుక్కుంటూ వెళ్ళిపో యాడు.

దేవరాజు స్థాణువులా నిలబడిపోయాడు.

"ఏంది బిడ్డా! భయపడుతున్నవా? తప్పు చేస్తే భయపడాలి. తప్పు చేయకుంటే భయమెందుకు? జరిగింది జరిగినట్టుగా చెప్పు. దేవుడిమీద ఒట్టు పెట్టుకోమన్నా పెట్టుకుంటానని చెప్పు. నలుగురున్నచోట న్యాయం ఉంటది. నీమాట నమ్మకుంటే రాత్రి అక్కడున్నవారిని ప్రమాణం చేయించి అడుగుమని చెప్పు. నువ్వు మాత్రం భయ పడకు" కొడుక్కు ధైర్యం చెబుతూ అన్నది నర్సవ్వ.

పద్మ కూడా భర్తకు అన్నిరకాలా ధైర్యం చెప్పింది. మనసులో మాత్రం ఆమెకు భయంగానే ఉంది. మల్లయ్య పలుకు బడిని ఉపయోగించి న్యాయాన్ని అన్యాయం చేయగలడని అనుమానంగా ఉంది. మన ప్రయత్నం మనం చేయాలి కాబట్టి జరిగిన విషయాన్ని ఒకరిద్దరు పెద్దలతో చెప్పమని భర్తకు సూచించింది. నర్సవ్వ కూడా అలాగే చెప్పింది కొడుక్కు.

పొద్దుపొడిచాక బిడియపడుతూనే బయ టకు నడిచాడు దేవరాజు. అప్పటికే ఆ విషయం ఊరంతా పాకిపోయింది. దేవ రాజు గురించి కథలు కథలుగా చెప్పుకుంటు న్నారు. వారి దృష్టిలో దేవరాజు విలన్‌లా మారిపోయాడు. మల్లయ్యను పొడవడానికి కత్తి తీశాడని, వారం తిరగకముందే నరికి చంపుతానని బెదిరించాడని చెప్పుకుంటు న్నారు. ఒకరిద్దరు ఈ విషయాన్ని సూటిగా దేవరాజునే అడిగారు. పేదవాడికోపం ఎన్ని అనర్థాలను తెచ్చిపెడుతుందో అర్థమైంది అతడికి.

ఇద్దరు ముగ్గురు కులపెద్దల ఇండ్లలోకి వెళ్లి జరిగింది చెప్పడానికి ప్రయత్నించాడు దేవరాజు. వారు వినలేదు. అతడినే తప్పు బట్టారు. అలా కొట్టాల్సింది కాదని చెప్పారు. కొట్టలేదని దీనంగా చెప్పినా ఎవరూ నమ్మలేదు. పంచాయతీలో తీర్పు ఎలా ఉంటుందో అప్పుడే తెలిసిపోయింది దేవరాజుకు. నీరసంగా ఇంటిమొహం పట్టాడు.

ఊరిమధ్యలో, వేపచెట్టుకింద పంచాయతీ మొదలయింది. కులపెద్దలు కూర్చున్నారు. గ్రామస్థులు చుట్టూ గుమికూడారు. మల్లయ్య ఇద్దరు వ్యక్తుల్ని ఆసరా పట్టుకుని కుంటుతూ వచ్చాడు. జరిగిందేమిటో

ముందుగా దేవరాజును చెప్పమన్నారు. మొదటినుండి జరిగిందంతా వివరించి చెప్పాడు దేవరాజు. మధ్యలో నర్సవ్వ లేచి చెప్పడానికి ప్రయత్నిస్తే 'ఆడపెత్తనం ఇక్కడ కూడానా?' అంటూ ఆమెను అడ్డుకున్నారు పెద్దలు.

తర్వాత మల్లయ్య వంతు వచ్చింది. విషయాన్ని పూర్తిగా వక్రీకరించి చెప్పాడు. తను బాకీ చెల్లించుమని అన్నందుకే చితకబాదాడని ఏడుస్తూ చెప్పాడు. కావాలంటే అక్కడున్న సాక్షులను అడగమన్నాడు. ఊరందరికీ ఆపదలో అప్పు ఇచ్చి ఆదుకుంటున్నానని, అవసరానికి నా వద్దకు అప్పుకు వచ్చి అవసరం తీరాక చేయి చేసుకుంటే తనగతి ఏం కావాలని ప్రశ్నించాడు. సహాయం చేయడం తప్పా? లేక అప్పు ఇచ్చి అడగడం తప్పా? అని కులపెద్దలను నిలదీశాడు.

ఇద్దరు చెప్పిందీ విన్నాక, మనిషికి ఇద్దరి చొప్పున పంజూలని కోరుకోమన్నారు. వారు చెప్పిన తీర్పును ఒప్పుకోవాలని చెప్పారు. వెంటనే ఒప్పుకున్నాడు మల్లయ్య. అందులో ఉన్న ఇద్దరు వ్యక్తుల పేర్లు చెప్పాడు. తనను ఇరుకున పెడుతున్నట్టు గ్రహించాడు దేవరాజు. అయినా ఒప్పుకోక తప్పలేదు. తనకు అనుకూలంగా ఉండే ఇద్దరు వ్యక్తుల్ని కోరుకున్నాడు. ఈ నలుగురు పంజూలు ఒక్కచోట చేరారు. తాము చెప్పిన తీర్పును ఎవరు ఒప్పుకోకపోయినా ఐదువేల జరిమానా చెల్లించాలని షరతు పెట్టారు.

నలుగురు పంజూలూ దూరంగా వెళ్ళారు. వాదోపవాదాలు జరిగాయి. సాక్షులను విచారించారు. సాక్షులు ఏం చెబుతున్నారో దేవరాజు ఊహించాడు. తప్పు తనదే అవుతుందని చెబుతారని తెలుసు. తీర్పు తెలిసిందే కాబట్టి ఎలా ఉంటుందోనన్న ఆతృతలేదు. దూరంగా కూర్చుండి చర్చిస్తున్న పంజూలవైపు నిస్సహాయంగా చూస్తుండిపోయాడు.

గంట తర్వాత తీర్మానం కాగితంతో ముందుకువచ్చారు. గోలగోలగా ఉన్న ఆ ప్రదేశమంతా నిశ్శబ్దంగా మారిపోయింది. ముందుగా తీర్మానంపై దేవరాజు, మల్లయ్యలు ఒప్పుకున్నట్టు సంతకం తీసుకున్నారు. తర్వాత తీర్పును చదివి వినిపించారు.

బాకీ తీసుకుని సకాలంలో తీర్చకపోవడం దేవరాజు చేసిన మొదటితప్పు, చెయ్యి చేసుకోవడం రెండవ తప్పు. అప్పు తీసుకున్నవారంతా ఇలా చేస్తే ఊరిలో అప్పు ఎలా పుడుతుంది? ఇకముందు ఇలా చేసేవారికి ఇదొక గుణపాఠం కావాలి. అందుకు దేవరాజుకు వెయ్యి రూపాయల జరిమానా విధిస్తున్నాం. జరిమానా రూపాయలు, మల్లయ్యకు బాకీపడిన రూపాయలు వారంరోజుల్లో చెల్లించాలి. వారం దాటాక కూడా చెల్లించనిచో దేవరాజు పొలం మల్లయ్య స్వంతం అవుతుంది. బాకీపడిన డబ్బులు పట్టుకుని మిగిలిన డబ్బులు నెలరోజుల్లో మల్లయ్య దేవరాజుకు చెల్లించాలి. ఇది పంచాయతి తీర్పు సారాంశం.

నర్సవ్వ కోపంగా అరిచింది. తన పొలంలో అడుగుపెట్టే దమ్ము ఎవరికీ లేదని సవాల్ విసిరింది. పెద్దలందరి తప్పులను ఎత్తిచూపుతూ శాపనార్థాలు పెట్టింది. ఇప్పుడు మనమేం అరిచినా లాభంలేదని అత్తను వారించి ఇంటికి లాక్కెళ్ళింది పద్మ. తను కోరుకున్న పంజూలను మరోసారి కలిశాడు దేవరాజు. తాము చేసేదేంలేదని, సాక్షులందరూ మల్లయ్యకు అనుకూలంగా చెప్పారని అందుకే అలా తీర్పు చెప్పాల్సివచ్చిందన్నారు. మల్లయ్య వేసిన ఎత్తుగడ అప్పుడు పూర్తిగా అర్థమైపోయింది దేవరాజుకు. అతడి పొలంపైననే మల్లయ్య పొలం ఉంటుంది. అది ఆరు ఎకరాలుంటుంది. జీతగాళ్ళతో వ్యవసాయం చేయిస్తాడు మల్లయ్య. అతడు మూడుచోట్ల బోర్‌బావుల్ని తవ్వించాడు. నీటిచుక్క కూడా బయటకు రాలేదు.

దేవరాజుది మదురుపొలం. వరుసగా రెండు వానలు కొడితే ఊటపుడుతుంది. జియాలజిస్టులు కూడా బోర్ అంటూ వేస్తే దేవరాజు పొలంలోనే వేయాలని మల్లయ్యపొలంలో బోర్‌వేస్తే నీళ్లు రావని చెప్పారు. అప్పటినుండి దేవరాజును పొలం అమ్మమని ఒత్తిడి తెస్తున్నాడు మల్లయ్య. దేవరాజు ఒప్పుకోవడంలేదు. ఇప్పుడు ఇలాగైనా పొలంను ఆక్రమించుకోవాలని చూస్తున్నాడని గ్రహించాడు.

వారం రోజుల్లో అప్పు తీర్చడం సాధ్యం కాదని దేవరాజుకు తెలుసు. చూస్తూ చూస్తూ పొలంను అమ్ముకోవడం, అదీ అప్పుల కిందికి అతడికి ఇష్టంలేదు. ఆలోచిస్తూ నీరసంగా ఇంటికి చేరుకున్నాడు. ఇంటిముందు జనం గుమిగూడి కనిపించేసరికి గుండెదడదడలాడింది. అందరినీ తోసుకుంటూ ఆతృతగా ఇంట్లోకి వెళ్ళాడు.

నులకమంచంమీద స్పృహలేని స్థితిలో ఉంది తల్లి. పద్మ కొంగుతో గాలి విసురుతోంది. కూతుర్లు ఇద్దరూ ఏడుస్తున్నారు. ఆర్.ఎం.పి. డాక్టర్ బీ.పీ. టెస్ట్ చేస్తున్నాడు. దేవరాజు వెన్నులో వణుకు మొదలయింది.

"అవ్వకు ఏమైందీ? ఇప్పటిదాకా మంచిగనే ఉండెగదా!" కంగారుగా అడిగాడు దేవరాజు.

"ఏం కాలేదు. కళ్లు తిరుగుతున్నాయని పడుకుంది. ఇంటిముందునుండి వెళ్తుంటే డాక్టర్‌ను పిలిపించాను. ఏంకాదు. తగ్గిపోతుంది" ధైర్యంగా చెప్పింది పద్మ. ఎంత ధైర్యంగా చెప్పినా ఆమె గొంతులో జీరను గుర్తించాడు దేవరాజు. అతడి మనసెందుకో కీడును శంకిస్తోంది. కళ్లలో నీళ్లు తిరుగుతూ దుఃఖం పొంగివస్తుంటే తమాయించుకుంటూ డాక్టర్‌వైపు ఆందోళనగా చూశాడు.

బీ.పి., టెంపరేచర్, హార్ట్‌బీటింగ్ చెక్‌చేసి దేవరాజును పక్కకు పిలిచాడు డాక్టర్. అయోమయంగా అతడి వెంట నడిచాడు దేవరాజు.

"దేవన్నా... బీ.పి. బాగా పెరిగింది. అర్జంటుగా సిరిసిల్లకు తీసుకుపోవాలి. లేకపోతే ప్రాణానికి హాని. ఎంత తొందరగా హాస్పిటల్‌కు తీసుకుపోతే అంత మంచిది" చెప్పాల్సింది చెప్పి వెళ్ళిపోయాడు ఆర్.ఎం.పి. డాక్టర్. అప్పటికే అక్కడికి చేరుకున్న పద్మ అతడి మాటలు విన్నది.

చేతిలో చిల్లిగవ్వలేదు. ఇప్పటికిప్పుడు జీపు కిరాయితో తీసుకుని సిరిసిల్లకు వెళ్ళాలి. అక్కడ టెస్టులు, మందులు, డాక్టర్ ఫీజుకు డబ్బు కావాలి ఎలా? నీరసంగా వెళ్ళి తల్లి పక్కన కూర్చున్నాడు దేవరాజు. తల్లి బతకదన్న ఆలోచన ఒకవైపు, ఆమెకు సరియైన వైద్యం చేయించలేని నిస్సహాయత మరోవైపు అతడిని కృంగదీస్తున్నాయి. పద్మ మౌనంగా బయటకు వెళ్ళి అరగంట తర్వాత వచ్చింది.

"దవాఖానకు వెళ్దాం. జీపు, ఆటో, ఏది దొరికినా కిరాయికి తీసుకునిరా. సిరిసిల్లకు వెళ్ళాలి" భర్తను పురమాయించింది పద్మ. ఎవరినో డబ్బు చేబదులు అడుక్కొచ్చిందని గ్రహించాడు దేవరాజు. ఎంత తెచ్చావు, ఎక్కడ తెచ్చావని అడగలేదు. అప్పటికప్పుడు డబ్బు అప్పు పుట్టడమే మహాభాగ్యమనుకుని నీరసంగా బయటకు వెళ్ళి జీపుతో తిరిగివచ్చాడు.

అప్పటిక్కూడా నర్సవ్వ స్పృహలోకి రాలేదు. ఇంటికి తాళంవేసి పిల్లలతో సహా బయల్దేరుతుండగా ఇంటిముందు జీపు ఆగింది. బ్యాంక్ మేనేజర్, మరో ముగ్గురు వ్యక్తులు అందులోనుండి కిందికి దిగారు. అప్పటికే అక్కడికి చేరుకున్న సుంకర్లు ఇద్దరు 'దేవరాజు అంటే ఇతనే' అంటూ దేవరాజును చూపించారు.

జీపు ఎక్కబోతూ వారివైపు చూసి ఆగిపోయింది పద్మ. దేవరాజుకు నోటమాట రాలేదు. వచ్చింది ఎవరో తెలిసిపోతూనే





ఉంది. ఏదో సర్దిచెబుతామని కూతురును ఎత్తుకుని అటువైపు నడిచాడు దేవరాజు. అతడు నోరు తెరిచి ఏదో అనేలోపే అందు కున్నాడు బ్యాంక్‌మేనేజర్ తన యాసభాషతో.

"ఏమైందయ్యా! అప్పు గట్టవా? నోటీసు పంపి ఎన్నిరోజులయింది. అప్పులివ్వాలి... మీ ఇంటికి తిరగాలి. డబ్బు తీసుకురా! ఆయనగారి బాకీ ఎంతుందో చూడవయ్యా!" చెప్పి పక్కనున్న క్లర్క్‌వైపు చూశాడు.

లిస్ట్‌లో దేవరాజుపేరును చూసి 'ఆరువేల నాలుగువందలు' అని చెప్పాడు క్లర్క్. "విన్నావా? మొన్నటిరోజే. కట్టేస్తే నాలుగు వందలు తక్కువ అవుతుండె. చెబితే విని పించుకుని చావరు. ఆలస్యం చేయకు. డబ్బు తీసుకురా" చెప్పాడు మేనేజర్.

రుణాలు వసూలు కావడంలేదని ఛైర్మన్ మీటింగ్ ఏర్పాటుచేసి కోపగించుకోవడంతో కోఆపరేటివ్ బ్యాంకు మేనేజర్ స్వయంగా ఊర్లు తిరుగుతున్నాడు. మనిషి కోపిష్టి. కోపం వచ్చిందంటే విచక్షణను కోల్పోతాడు. ఆ విషయం దేవరాజుకు తెలుసు. అందుకే అతడి నోరు పెగలడంలేదు. అతడి పరిస్థితి గమనించి ముందుకు కదిలింది పద్మ.

"మా అత్తకు ఆరోగ్యం బాగులేదు. హాస్పిటల్‌కు వెళ్తున్నాం. రెండుమూడురోజుల్లో మీ బాకీ తీర్చేస్తాం. ఇప్పుడు ఆపదలో ఉండగా మీరు బలవంతం చేయడం ఏం బాగాలేదు" మేనేజర్‌తో నిర్భయంగా చెప్పింది.

గయ్యిమని లేచాడు మేనేజర్. అధికారులు తనమీద చూపించిన కోపాన్ని అతడు ఇక్కడ చూపించాడు. అతడి ఆవేశం చూసి ఎవరూ మాట్లాడలేదు. అందరూ మౌనంగా ఉండిపోవడంతో అతడు మరింతగా రెచ్చిపోతూ కనిపించాడు. పద్మకు ఆవేశం ముంచుకొచ్చింది. ఆవేశపడటానికి అది తగిన సమయం కాదని తెలుసు. అలాగని మౌనంగా ఉంటే మరింతగా అతడు జులుంను ప్రదర్శిస్తాడని గ్రహించి భర్తకు జీపు ఎక్కమని సైగచేసింది. దేవరాజు జీపు ఎక్కి కూర్చున్నాడు.

"మనిషి ప్రాణాలతో చెలగాటం ఆడితే అప్పుకాదు, మీ ఉద్యోగానికే ఎసరు వస్తుంది. మా అత్తకు ఏదైనా జరిగితే మీపై చర్య తీసుకోవాల్సి వస్తుంది. ముందు అడ్డు తొలగండి. ఇప్పుడు అప్పు తీర్చం. మీ ఇష్టమున్నపని చేసుకోండి" అంటూ జీపు ఎక్కి కూర్చుంది.

ఆ మాటలకు మేనేజర్ గతుక్కుమన్నాడు. ఆవేశం చల్లారిపోయింది. అయినా బింకం వదలకుండా హెచ్చరిస్తున్నట్టుగా చెప్పాడు. "మీకిది లాస్ట్ ఛాన్స్. మూడురోజుల టైం ఇస్తున్నాను. పేషెంట్‌ను తీసుకుపోతున్నారని విడిచిపెడుతున్నాను. బ్యాంక్‌కు వచ్చి అప్పు చెల్లించండి. అలా జరక్కపోతే నాలుగవనాడు మీ ఇంటికి తాళం వేస్తాం"

అప్పటికి మరో గండం గడిచింది. ఇద్దరూ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు. భార్యవైపు కృతజ్ఞతగా, మెచ్చుకోలుగా చూశాడు దేవరాజు. కళ్ళతోనే నవ్వింది పద్మ. జీపు నెమ్మదిగా ముందుకు కదిలింది. అంతవరకూ అక్కడ వేడుకను చూస్తున్న జనం బరువుగా అక్కడనుండి కదిలారు. కొందరు దేవరాజువైపు జాలిగా చూస్తుంటే, మరికొందరు పద్మవైపు 'గడుసు పిండమే' అన్నట్టుగా చూస్తున్నారు. మరి కొందరు రభస అంతగా జరగనందుకు అసంతృప్తిగా కదిలారు.

హాస్పిటల్‌నుండి ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రయింది. వచ్చేప్పుడు లాస్ట్ బస్‌కు వచ్చారు. నర్సవ్వ కొద్దిగా కోలుకుంది. అవసరమైన అన్ని పరీక్షలుచేసి మందులు రాసి ఇచ్చాడు డాక్టర్. ఎక్కువ టెన్షన్ పెట్టుకోవద్దని, టెన్షన్ పెట్టుకుంటే అలాగే కోమాలోకి వెళ్ళే ప్రమాదం ఉందని హెచ్చరించాడు. పిల్లలిద్దరూ నిద్రపోయారు. కూతురును భుజంపై ఎత్తుకుని, మరో చేత్తో తల్లిని నడి

పించుకుంటూ వచ్చాడు దేవరాజు. చిన్నకూతురును ఎత్తుకుని చేతి సంచితో వెంట వచ్చింది పద్మ.

తాళం తెరిచి ఇంటిలోకి నడుస్తుండగా పక్కింటి సునంద, 'పద్మక్కా! మీకు లెటర్ వచ్చింది' అంటూ ఒక కవరును తెచ్చి ఇచ్చింది. కవరును అందుకుని గూట్లో దాచింది. పిల్లలిద్దరినీ పడుకోబెట్టి బియ్యం కుండలో చేయి పెట్టింది పద్మ. ఖాళీ కుండ తగిలింది చేతికి. కుండ పొద్దున్నే ఖాళీ అయిపోయిన విషయం గుర్తొచ్చింది.

పక్కనే వున్న నూకల కుండలో చెయ్యిపెట్టింది పద్మ. అడుగున గింజలు తగిలాయి. దోసిడికి అందలేదు. కుండ బోర్లిస్తే తవ్వ కూడా నిండలేదు. ఎలాగో ఈపూట గడిచిపోతుంది. రేపు పస్తులు ఉండవలసిందే అనుకుని నూకల్ని కడిగి పొయ్యిమీద పెట్టింది. తల్లిని మంచంలో పడుకోబెట్టి మాత్రలు వేసి వచ్చాడు దేవరాజు.

"కారటు చదివినవా? ఎక్కడినుండి వచ్చింది? ఎవ్వరు రాసిండ్రు" భార్య పక్కన కూర్చుంటూ అడిగాడు దేవరాజు.

"మీ మామ రాసిండు. అల్లున్ని పండక్కు రమ్మని రాసిండు. వారంపదిరోజులు ఉండుమని రాసిండు. కట్నాలు పెడుతడట" పరిహాసమాడుతూ అంది పద్మ.

"ఆ.. మామ రాత్తడు! నూటికొక్కనాడు అత్తగారిల్లనిపోతే ఎప్పుడు పోతడో అని ఎదురు చూస్తడు. కోళ్ళను తెమ్మంటనా, గొర్లను తెమ్మంటనా...? ఉడికిన కూడు పెట్టుడుకే ఉలికిపడుతడు. నాకు అత్తగారి సొమ్ము బాకీలేదు. తులాలు మాసాలు పెట్టకున్నా కడుపునిండ కూడైనా పెట్టరు" ఆవులిస్తూ అన్నాడు దేవరాజు.

భర్తవైపు చురుగ్గా చూసింది పద్మ. "పుట్టుపూర్వం మేనమామలకెరుక అన్నట్టు అన్ని ఎరుకుండి కొత్తగ మాట్లాడుతవేం దయ్యా! రోలు పొయ్యి మద్దెలతోని చెప్పుకుందట. నీకు ఒక్క దిక్కయితే నాకు రెండు దిక్కులు అన్నట్టు మనకంటే గతిలేని సంసారం వాళ్ళది. నీకు యాడికెళ్ళి తెచ్చిపెట్టమంటవు. తనకుంటే తరగదట. ఒకరిస్తే నిండదట. దేవుడు కరుణించి మనకష్టం మనకు ఫలించాలిగానీ ఒకరికి చెయ్యిచాపి అడుక్కుంటమా" అంటూ గూట్లో దాచిన కవరును తేవడానికి వెళ్ళింది పద్మ.

అప్పుడే తల్లి పిలవడంతో మంచంవద్దకు వెళ్ళాడు దేవరాజు. మూల్గుతూ లేచి కూర్చుంది నర్సవ్వ. కొడుకును పక్కన కూర్చోమని చెప్పడం మొదలెట్టింది. "రెక్కలిరుగ కష్టం చేసినదాన్ని. ఇప్పుడు రోగాల కుప్పనైపోతిని. ఎక్కడి డబ్బు నా రోగాలకే సరిపోతలేదాయె. ఏదోపని చేసుకుని బతుకుదామంటే ఇప్పుడే కరువచ్చె. ఎట్ల బిడ్డా! ఈ అప్పులన్ని ఎట్ల తీరుస్తవు... ఎట్ల బతుకుదాం..." ఆమె గొంతు జీరబోయింది. కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయి.

తల్లి మాటలకు దేవరాజు హృదయం బరువెక్కింది. గొంతు పెగల్చుకుని మెల్లిగా అన్నాడు. "అవ్వా! నువ్వు బాధపడకు. నీ ఆరోగ్యం బాగలేదు. నేను ఎట్లనో తీరుస్త. ఏ అయ్యదగ్గరైనా జీతముంట. నిన్ను రంది పెట్టుకోకుమన్నడు డాక్టర్. ఇట్ల బాధపడితే మళ్ళీ బి.పి. పెరుగుతది. ఇప్పుడు ఎవరు బాధపడి ఏం చెయ్యలేం. నువ్వు కండ్లు మూసుకుని పండుకో"

"కాదు బిడ్డా! కాలం గడుస్తుంటే వడ్డీ పెరుగుతదిగని తగ్గుతదా! నేనొక ఉపాయం చెబుతాను విను. నువ్వు వెంటనే చెల్లెదగ్గరికి పో! దానిది ఉన్న కుటుంబమేనాయె. అల్లుడు మస్కట్ పోయి బాగానే సంపాయించె. బిడ్డను కలిగిన ఇంట్లకు ఇయ్యాలెనని ఎంత బాధపడలేదు. ఎన్ని అప్పులు చెయ్యలేదు. ఇక్కడి విషయాలన్నీ చెప్పు. కండ్లల్ల కదులుతున్నవట. అవ్వ రమ్మన్నదని తోలుకరా.

"ఇక్కడికి వచ్చినంక నేను కాళ్ళు పట్టుకుని బతిమాలుత. ఒక్కయాబయివేల బాకీ

ఇవ్వమంట. ఈచిల్లర బాకీలన్నీ కట్టేద్దాం. కొద్ది కొద్దిగా చెల్లెదగ్గరి అప్పు తీర్చేద్దాం. బావ కూడా మస్కట్‌నుండి మొన్ననే వచ్చిండు. చేతిలో ఎంతోకొంత డబ్బు కూడా ఉంటుంది"

దేవరాజుకు నిజమేననిపించింది. చెల్లెలివద్ద అప్పు తెస్తే వెంటనే తీర్చాలన్న తొందర ఉండదు. ఎప్పుడు చేతికి డబ్బువస్తే అప్పుడు తీర్చవచ్చు. వడ్డీ కూడా ఎక్కువగా ఉండదను కున్నాడు. అంతలోకే ఆమెవద్ద ఇంతకు ముందు అప్పు తెచ్చిన పదివేల రూపాయలు గుర్తుకొచ్చాయి. అవి ఇవ్వమని ఆమె చేస్తున్న ఒత్తిడి గుర్తుకొచ్చింది. మనసు బాధతో మూల్గింది. దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు.

"అలిగి అక్క ఇంటికి, చెడి చెల్లెలింటికి పోవద్దంటరు. ఇంతవరకే పదివేలు అప్పు ఇచ్చె ఇప్పుడు ఏమని అడుగుదాం! చెల్లె మన దైతే బావ మనవాడైతడా! అక్క చుట్టంకానీ లెక్కచుట్టంగాదు అనే మనిషి అతడు. మొహం ముందు ఒకమాట అంటడు. చాటుకు ఒకమాటంటడు"

"మనవాళ్ళు మనను అంటరు. వాళ్ళు అన్నారని బాధపడుతరా! ఈ కష్టాల్లోంచి బయటపడ్డవాళ్ళం కావాలి. తోడబుట్టిన చెల్లె లినే అడుగుతున్నవుకాని మందిని అడుగుతు న్నవా? ఆపదలో ఉన్నాంకాబట్టి అడుగు తున్నాం. అయినా నువ్వేం అడగకు. నేనే అడుగుతా. అవ్వ ప్రాణం బాగలేదని చెప్పి వెంటపెట్టుకురా. వాళ్ళు మన లెక్క గరీబు లైతే ఎందుకడుగుదుము" కొడుక్కు సర్దిచెబు తున్నట్టుగా అంది నర్సవ్వ. అప్పుడే అక్కడికి వచ్చింది పద్మ. ఆమెచేతిలో ఉత్తరం ఉంది. దానిని దేవరాజుకు అందిస్తూ చెప్పింది.

"మనం అంతదూరం వెళ్ళాల్సిన అవసరం లేదు. వదిన ఉత్తరం రాసింది. మనం తెచ్చిన అప్పు గురించి భార్యాభర్తలిద్దరికి గొడవవుతున్నదట. ఉత్తరం ముట్టిన వెంటనే డబ్బు తీసుకుని రమ్మని రాసింది. డబ్బు తెస్తేనే ఇంట్లో ఉండాలని బాధపెడు తున్నడట"

సముద్రంలో మునిగిపోతున్నవాడికి కాస్త ఆధారం కనిపించి మాయమైనట్టనిపించింది నర్సవ్వకు. పద్మ మాటలు నమ్మాలనిపించడం లేదు ఆమెకు. "అలా ఎందుకు రాస్తది...? అన్నంటె ప్రాణమిస్తది నా బిడ్డ. నువ్వు చదు వురా! అందులో ఏం రాసిందో...? " కోడలు వైపు నమ్మలేనట్టుగా చూస్తూ అంది నర్సవ్వ.

నిరాసక్తిగా ఉత్తరం అందుకుని చదివాడు దేవరాజు. ఉత్తరం పక్కనబెట్టి తల్లి మొహం లోకి దీనంగా చూశాడు. నర్సవ్వ మొహం పాలిపోయింది.

"అందరు ఒక్కసారే పగబట్టినట్టయింది. ఈమెకు ఇప్పుడే అవసరమచ్చినయటనా? మస్కట్‌పైసలన్ని ఏమయినయట! ఇప్పుడు ఏంచేద్దాం. మల్లయ్యకు బాకీతోపాటు జరి మానా కట్టకపోతే ఉన్నపొలం పోతది. పొలంపోతే పోయిందిగానీ... వాని ఇష్టము న్నంతరేటు ఇస్తనంటడు. బయటివారెవరైనా కొనుక్కుంటే ఎక్కువరేటు ఇస్తరు" బాధగా తనలోతనే గొణుక్కుంది నర్సవ్వ. మౌనంగా నేలచూపులు చూస్తుండిపోయాడు దేవరాజు. పద్మ కూడా ఆలోచనలో పడిపోయింది.

ఎవరో పిలిస్తే మౌనముద్రనుండి బయట పడి తలుపువద్దకు వెళ్ళి చూశాడు దేవరాజు. బయట ముగ్గురు వ్యక్తులు కనిపించారు. వారివద్ద అప్పు తీసుకున్నాడు దేవరాజు. కూడబలుక్కుని వచ్చినట్టున్నారు. దేవరాజును చూడగానే ఆగ్రహం వెళ్ళగక్కుతూ అప్పు ఎప్పుడు తీరుస్తావని ఒత్తిడి చేశారు. తను పొలం అమ్ముతున్నట్టు ఎవరో చెప్పారట. పొలం అమ్మగానే ముందుగా తమ బాకీనే తీర్చమని హెచ్చరించారు. పొలం అమ్మటంలే దని వారితో ఖచ్చితంగా చెప్పాడు దేవరాజు. అమ్మినా అమ్మకపోయినా వారంపదిరోజుల్లో బాకీ తీర్చాలని, లేదంటే తిప్పలు తప్పవని చెప్పివెళ్లారు.

ఇంట్లోకి వచ్చి గుడ్డిదీపం వెలుతురులో నీర సంగా కూలబడిపోయాడు దేవరాజు. బలవం



తాన తల్లీకొడుకులను భోజనానికి కూర్చోబెట్టింది పద్మ. వారిద్దరూ తినగా మిగిలిన గుప్పెడు మెతుకుల్ని తినబోతూ ఆగిపోయింది పద్మ. పెద్దకూతురు గుర్తొచ్చింది. రోజూ పొద్దున లేవగానే ఆకలి అంటూ ఏడుపు మొదలెడుతుంది. వెంటనే ఆ మెతుకుల్ని కంచంలో పెట్టి ఉట్టిమీద దాచింది. కడుపులోని ఆకల్ని చంపడానికి రెండు చెంబుల నీళ్ళు గటగటా తాగి ఇల్లును సర్ది పక్కమీదికి చేరింది.

అప్పటికి దేవరాజు మెలకువలోనే ఉన్నాడు. అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడని గమనించి హితబోధ చేస్తున్నట్టుగా చెప్పింది. "అల్లరిపడితే బాకీ తీరుతదా? కానున్న కార్యం కాకమానది. చేను అమ్మేద్దాం. బాకీలన్నీ కట్టేద్దాం. కిస్మత్ మంచిగుంటె సంపాయించుకుంటం లేకుంటే లేదు. ఇంట్ల అల్లరపెట్టుకుంటే రందితోనే చచ్చిపోతం"

అటుపక్కనుండి ఇటుపక్కకు దొర్లి మౌనంగా జేబులోనుండి కాగితం తీసి పద్మకు అందించాడు దేవరాజు. దాన్ని అందుకుని చదివింది పద్మ. ఎవరివద్ద ఎంత బాకీ ఉన్నదో అందులో రాసి ఉంది. అప్పు తెచ్చింది తక్కువే అయినా ఒకచోట అప్పు తీర్చడానికి మరోచోట అప్పుచేయడంతో మిత్తికి మిత్తి తగిలి లక్షవరకూ అయికూర్చున్నాయి.

"ఏనుగు ఎత్తంత అప్పులు చేసి ఏకుల గుల్లతో తీర్చినట్టుంది మనకథ. పొలం అమ్మితే వచ్చేది అరువైవేలు. అదీ ఎవ్వరైనా కావాలని కొంటేనే. మన్నకై మనం అమ్ముతామంటే నలభై ఐదు వేలకు ఒక్కపైస ఎక్కువ రాదు. మన అప్పు లక్ష. పొలం అమ్మామని తెలిస్తే ఎవరూ ఊర్కోరు. బాకీ తీర్చేయమని ఒత్తిడిచేస్తారు. అందుకే పొలం అమ్మడం కంటే అమ్మకపోవడమేమంచిది" నిరాసక్తిగా చెప్పాడు దేవరాజు.

"అమ్మకపోతే అప్పులు ఇంతకు ఇంతై కూర్చుంటాయి. లక్ష రూపాయలకు మూడు రూపాయల చొప్పున వడ్డీ కడితే నెలకు మూడువేయిలవుతుంది. కడుపు, కాలు కట్టుకుంటే ఏంలాభం. అసలు తక్కువాయె, మిత్తి ఎక్కువాయె. ఇల్లు గూడా అమ్మేద్దాం. ఏచెట్టు కిందనన్నా గుడిసె వేసుకుని ఉందాం. రంది పెట్టుకుని ఈ ఇంట్లో ఉండే కంటే రందిలేక గుడిసెలో ఉన్నది నయం" నిద్రకు ఉపక్రమిస్తూ చెప్పింది పద్మ. ఆమె మాటల్లో వేదాంతం ధ్వనించింది.

దేవరాజు మౌనంగా ఉండిపోయాడు. ఒక్కొక్కక్షణం గడిచిపోతూ అతడిలో మరింత భయాన్ని నింపుతోంది. ఈరాత్రి ఇలాగే నిలిచిపోతే బావుండుననిపిస్తోంది. వెలుతురును చూడాలంటే భయం. వీధిలోకి వెళ్ళాలంటే భయం. ఎవరినోటవెంట ఎలాంటి మాటలు వినాల్సివస్తుందోనన్న భయం. అతడిలాగే భయపడుతున్న మరో వ్యక్తి నర్సవ్వ. వారిభయంతో పనిలేకుండా కాలం కరిగిపోతూనే వుంది.



తెల్లవారినాక ఒక నిశ్చయానికి వచ్చినట్టు దేవరాజు బయటకు వెళ్ళిపోయాడు. ఇంటి పని పూర్తిచేసుకుని వంటపనివద్ద ఆగిపోయింది పద్మ. చిన్నకూతురు లేచి ఏడుస్తుంటే పాలు పట్టి పడుకోబెట్టింది. పెద్దకూతురు





లేచి మారాం చేస్తుంటే రాత్రి దాచి ఉంచిన అన్నంలో వెల్లిపాయి కారం కలిపి ముందుం చింది.

సూర్యుడు పైపైకి లేస్తుంటే కడుపులో ఆకలి నిద్రలేస్తోంది. ఎవరింటికి వెళ్ళి అరువు తేవాలన్నా నామోషీగా ఉంది. అప్పటికే చుట్టుపక్కల వారివద్ద బియ్యం, కారం, చింత పండు అరువయింది. అప్పటికే నర్సవ్వ లేచి మొహం కడుక్కుని కూర్చుంది. ఏం చేయాలో తోచడంలేదు పద్మకు. చూస్తుండ గానే సమయం గడిచిపోతోంది.

అప్పుడే ఇంట్లోకి అడుగు పెట్టాడు కోటయ్య. ఆవేళ తండ్రిని చూసి సంతోషప డాలో బాధపడాలో తెలియలేదు. ఆప్యాయ తగా పలకరించి కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళు ఇచ్చింది పద్మ. నర్సవ్వలేచి 'బాగు న్నావా అన్నా... ఏం జెస్తుంద్రు' అని పల కరించింది. కోటయ్య నవ్వుతూ సమాధానం చెప్పి కాళ్ళు కడుక్కుని వచ్చి కూర్చున్నారు.

'తాత వచ్చిండు' అని మనవరాలు పరు గెత్తుకుని రాగానే ఎత్తుకుని ముద్దాడి సంచి లోనుంచి అరటిపళ్ళ పొట్లం తీసి అందిం చాడు. పొట్లం అందుకుని నానమ్మ వద్దకు చేరి విప్పి ఇవ్వమని మారాం చేసింది. రెండుపండ్లు ఇవ్వగానే తీసుకుని బయటకు వెళ్ళింది. ఆలోచించి లాభం లేదని సుశీల వద్దకు వెళ్ళింది పద్మ. వారింటికి దూరంలో ఉంది సుశీల వాళ్ళ ఇల్లు. ఏదైనా అత్యవస రమనుకుంటే మాత్రమే వెళ్తుంది వారింటికి పద్మ. ఎట్టి పరిస్థితిలోనూ సుశీల వాపసు పంపదని ఆమెకు గట్టినమ్మకం.

పద్మను చూడగానే 'మీ నాయన వచ్చిన ట్టున్నడు' అని పలకరించింది సుశీల.

"అవునక్కా... ఇంట్లో బియ్యం నిండుకు న్నాయి. ఏం చెయ్యాలో తోచడంలేదు. ఆయన ఇవన్నీ పట్టించుకోడు. సమయానికి ఉంటే తింటాడు. లేకుంటే లేదు. మా అత్త సంగతి నీకు తెలిసిందేనాయె. ఉప్పుకు ఊరి లోకి పరుగెట్టాలన్నా, పప్పుకు పల్లెలోకి ఉర కాలన్నా నేనేనాయె" చెప్పింది పద్మ బాధగా.

"అందుకే అంటారు పద్మా! గతిలేని సంసారం చెయ్యచ్చుకానీ సుతిలేని సంసారం చెయ్యరాదు. భార్యాభర్తలు ఇద్దరు ఒక్కమాటమీద ఉంటేనే సంసా రంలో సుతి ఉంటుంది. నీకు ఈ రెండూ లేవాయె. ఒక్కదానివి. ఎంతకని గడుపుకొ స్తవు. నువ్వు కాబట్టి పట్టుకొని ఉంటున్నవు. నా అటువంటిదాన్నయితే ఈ మొగుడూ వద్దు, ఈ సంసారం వద్దని పట్టపగలు పుట్టింటికి చేరుకుందును" పద్మవైపు జాలిగా చూస్తూ అంది సుశీల.

ఆ మాటలకు పద్మ నిండుగా నవ్వింది. అన్ని కష్టాలను అనుభవిస్తూ కూడా చెక్క చెదరని ఆత్మవిశ్వాసంతో ఉన్న పద్మను చూసి కాస్త ఆశ్చర్యపోయినా ఆ సమ యంలో ఆమెకు అది అవసరమేనని గుర్తిం చింది సుశీల.

"ఆడజన్మ పాడుగాను చెల్లే... పాడుజన్మ! మొగవానికి ఎక్కడ కూర్చున్నా చెల్లుతది. మనకు తెల్లారింది మొదలు దొమ్మరోడు డోలు కొట్టుకున్నట్లు ఊపిరాడని పని. అందుకే ఆడపుట్టుక పుట్టుడుకంటే అడవిల చెట్టయి పుట్టుడు నయమంటరు. నా మొగుడు ఐదారేండ్లాయె ఇంటిమొహం చూడక. మస్కట్ ల మన్నువడా... మస్క టంటూ పోయిండేమో... ఇంటివద్ద పిల్లలు ఉన్నారా సచ్చిండ్రా అన్న ధ్యాసలేదు. ఇదిగో వస్తున్నా... అదిగో వస్తున్నానంటూ ఏడాది గడువవట్టె. ఇంతవరకూ రాలేదు" విసు క్కుంటూ అంది సుశీల.

"ఆడజన్మకీ ఒక అర్థం ఉందక్కా. మగా డికి జన్మనిచ్చేది, జీవితాన్నిచ్చేది, జీవితాన్ని పంచేది ఆడదేకదా! ఆడది లేకపోతే మగాడు ఎక్కడా ముందడుగువెయ్యలేడు. ఇల్లును చక్కదిద్ది దీపం పెట్టాలన్నా ఇంటి దీపం ఆర్పివేయాలన్నా ఆడదానికే సాధ్యం" సుశీలను సముదాయిస్తూ చెప్పింది పద్మ.

ఆ విషయంపై ఇంకా బాగా చర్చించేది కానీ ఆమెకు వెళ్లిపోవాలని తొందరగా ఉంది.

"ఏమిటోనే! నువ్వు చదువుకున్నదానివి. ఏదేదో చెబతావు. నాకుమాత్రం నిన్ను చూసినప్పుడల్లా గుండె బరువెక్కుతుంది" అంటూ గంపలో నాలుగు తవ్వల బియ్యం, నాలుగు బీరకాయలు, పెసరపప్పు పెట్టి ఇచ్చింది.

పద్మ కళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి. "అక్కా తోడబుట్టిన తోడువు కాకపోయినా అంతకంటే ఎక్కువగా నన్ను ఆదుకుంటు న్నావు. నీ మేలు జన్మలో మరిచిపోలేను" ఆమె చేతిని ఆప్యాయతగా అందుకుని కళ్ళ లోకి ఆర్తిగా చూస్తూ చెప్పింది పద్మ.

మందహాసం చేస్తున్నట్టుగా నవ్వుతూ అంది సుశీల, "అట్లెందుకు చెల్లే! ఎడమ చెయ్యి ఆడితేనే కుడిచెయ్యి ఆడుతుంది. నీ దగ్గర ఉంటే నాకు ఇయ్యవా ఏంది? వరుసగా రెండుమూడేండ్లనుండి మస్కట్‌కు లెటర్లు రాస్తున్నావు, చదువుతున్నావు. నీకు సాధ్యమైన సహాయం నువ్వు చేస్తలేవా ఏందీ!"

గంపను తీసుకుని ఎవరికి కనబడకుండా కొంగును కప్పుకుని అక్కడినుండి కదిలింది పద్మ. నాలుగు అడుగుల్లో ఇల్లును చేరుకుని పెరటి తలుపుగుండా ఇంట్లోకి వెళ్ళింది. తన కుటుంబ పరిస్థితులు తండ్రికి తెలియడం ఆమెకు ఇష్టంలేదు. రెండు నిమిషాల్లో వంటపనిలో మునిగిపోయింది.

"తమ్మునికి పిల్లను చూడబోవాలె. గొల్లపెల్లికాడ ఒక సంబంధం ఉన్నదట. రేపు వస్తం అని చెప్పాం. నువ్వు ఈరోజు మన ఇంటికి వస్తే ఇంటినుండి రేపు జీపులో పోవచ్చు అల్లుడిని రేపు బస్సుకు గొల్లపెల్లి రమ్మందాం! నువ్వు బట్టలు సర్దుకుని రెడీ అవు బిడ్డా!" వచ్చినపని చెప్పాడు కోటయ్య.

పద్మకు వెళ్ళాలని ఉన్నా వెళ్ళలేని పరిస్థితి. పిల్ల తండ్రి ఎవరు? సంబంధం ఎలా కుదిరింది. పిల్ల ఎలా ఉంది లాంటి ప్రశ్నలు అడుగుతూ వంట పూర్తిచేసింది. భోజనం చేయమంటే అల్లుడు వచ్చాక చేస్తానని కూర్చున్నాడు కోటయ్య. అత్తకు అన్నాన్ని పెట్టి, తిన్న తరువాత కంచం కడిగింది పద్మ. కూతురుకు స్నానం చేయించింది. గంట గడిచినా దేవరాజు ఇంటికి రాలేదు.

ఎక్కడికి వెళ్ళినా భోజనం వేళకు ఇంటికి వచ్చే భర్త రాకపోవడంతో పద్మలో ఆందోళన మొదలయింది. తండ్రిని బలవంతం చేసి భోజనానికి కూర్చోబెట్టింది. భోజనం చేసి చాలా సేపటివరకూ ఎదురుచూస్తూ కూర్చున్నాడు కోటయ్య. దేవరాజు రాలేదు.

తను ఇంకా బంధువులకు చెప్పవలసి ఉందని, కూతురు బయల్దేరితే ఇంటివద్ద దింపి మరో ఊరు వెళ్తానని చెప్పాడు కోటయ్య. పద్మకు వెళ్ళాలనిపించలేదు. భర్త ఎక్కడికి వెళ్ళాడో తెలియదు. ఈమధ్య ఆందోళనగా తిరుగుతున్నాడు. ఇద్దరం కలిసి రేపు గొల్లపల్లికి వస్తామని తండ్రిని ఒప్పించి పంపించింది పద్మ.

నర్సవ్వను కూడా తప్పకుండా రావాలని చెప్పివెళ్ళాడు కోటయ్య. నవ్వుతూ 'సరే' అంది నర్సవ్వ. తండ్రిని వీధి చివరివరకూ సాగనంపి, భర్త గురించి ఇద్దరు ముగ్గురిని అడిగింది పద్మ. కనబడలేదనే సమాధానం వచ్చింది. ఎక్కడికి వెళ్ళి ఉంటాడని ఆలోచిస్తూ ఇంటికి చేరుకుంది పద్మ.

"వాడింకా రాలేదు. ఎక్కడికెళ్ళాడే" ఇంట్లోకి అడుగుపెట్టగానే అడిగింది నర్సవ్వ.

"ఏమో అత్తా! ఎక్కడికి వెళ్ళేది నాకు చెప్పలేదు" పెదవి విరుస్తూ చెప్పింది పద్మ.

"ఇద్దరు పిల్లలతండ్రి అయినా వాడికి బుద్ధిరాలేదు. బజార్లు తిరుగమరిగిండు. పనిచేసుకుని బతకాలె బిడ్డా అంటే వినడు. వీనికి అన్నీ తండ్రి గుణాలే వచ్చినయి. చల్లటి పూట పొద్దున యాడనన్నా బండెడు ఎండుకట్టెలు కొట్టుకుని అమ్ముకుంటే నూరు రూపాయలస్తయి. చిన్నతనంలో ఇంటిపె

త్తనం చేతికివస్తే చిప్ప చేతికి వస్తదట. నువ్వు అన్నం తిను పో! తిరిగి తిరిగి వాడే వస్తడు" కొడుకుపై విసుక్కుంటూ అంది నర్సవ్వ.

అప్పుడే కూతురు నిద్రలేచి ఏడ్వడంతో తొట్టె (ఊయల)వద్దకు వెళ్ళింది పద్మ. కూతురుకు నూనెతో తలంటి స్నానం చేయించింది. నుదుటన బూడిద బొట్టుపె ట్టింది. తుమ్మకాయలు నూరి చేసిన కాటు కతో కళ్ళను దిద్ది కూతురు చెంపన దిష్టి చుక్క పెట్టింది. ఊయలలో పడుకోబెట్టి జోలపాట పాడుతూ తన పనులు చేసుకుం టోంది. పద్మ కంఠం బావుంటుంది. జోల పాట పాడితే సంగీతంలేని సినిమా పాటలా ఉంటుంది.

కోడలువైపు మురిపెంగా చూస్తూ నవ్వు కుంది నర్సవ్వ. మా దేవరాజు అదృష్టం కాక పోతే ఇన్ని మంచిగుణాలున్న భార్య దొరక డమేమిటి అనుకుంది. పద్మనే లేకుంటే మరెన్ని కష్టాలొచ్చేవో గుర్తు తెచ్చుకుంది. ఈ పిల్ల కాబట్టి సరిపోయింది. ఇంకెవరు కోడలుగా వచ్చినా ఇదివరకే చచ్చిపోయేుం టిని" అనుకుంది.

నర్సవ్వకు చిన్నతనంలో జరిగిన సంఘట నలు గుర్తొచ్చాయి. భర్త కూడా గుర్తొ చ్చాడు. అతడి తిక్కచేష్టలు గుర్తొచ్చాయి. అతడు కూడా దేవరాజులాగే ఆలోచన లేకుండా పనిచేసేవాడు. ఇంటి సమస్యలు, అవసరాలు నర్సవ్వే చూసుకునేది. అత్తామా మలు నర్సవ్వను చూసి 'పిల్లకు మంచి నేర్పు ఉంది' అని మురిసిపోయేవారు. మొహంముందు మెచ్చుకుంటే నెత్తికెక్కుతుం దని కస్సుబుస్సులాడుతున్నట్లు ఉండేవారు. చాటుగా మెచ్చుకునేవారు. తన గురించి అత్తామామలు ఏమనుకుంటున్నారో చాటుగా విని మురిసిపోయేది నర్సవ్వ.

నర్సవ్వ ఇంట్లోకి అడుగుపెట్టిననాడు బయట గుంటెడు పొలం కూడా లేదు. ఇల్లు తాటికమ్మల గుడిసె. 'రెక్కలే చుట్టాలు. ఇల్లే కన్నతల్లి. కష్టం చేసుకుని బతకాలి' అంటూ నర్సవ్వను వెంటబెట్టుకుని కూలిపనికి వెళ్ళేది అత్త. మామ వంగి కష్టం చేసేవాడు కాదు. మక్కగటుక జొన్నరొట్టె తప్ప వరి అన్నం దొరికేదికాదు. పండుగ లకు ఒక్కపూట మాత్రం బియ్యం వండే వారు.

అప్పుడు సాగుభూములు చాలా తక్కువ. ఒక్కోసారి రెండుమూడేండ్ల కరువు వచ్చేది. మోటబావులున్నవారే పంట పండించుకునే వారు. నర్సవ్వ భర్త జీతం ఉండేవాడు. అత్తాకోడళ్ళు ఇద్దరూ కూలీకి వెళ్ళేవారు. మామ ఇష్టమున్ననాడు పనిలోకి వెళ్ళేవాడు. ఇష్టంలేనినాడు ఈతచెట్లల్లో, ఊరిలో కాలం గడిపేవాడు. ఒక్కొక్కనాడు నర్సవ్వ భర్త కూడా పనిలోకి వెళ్లనని మొండికేసేవాడు. కొడుకూ తండ్రిలాగానే తిరుగుళ్ళకు అలవా టుపడుతున్నాడని నర్సవ్వ అత్త బాధపడిపో యేది.

ఒకసారి తను జీతం ఉండనని మొండి పట్టు పట్టాడు నర్సవ్వ భర్త. యజమాని రాత్రనకా పగలనకా తనతో పని చేయిస్తు న్నాడని, పనిచేసినా తిడుతున్నాడని తల్లితో మొరపెట్టుకున్నాడు. ఊరిలో వ్యవసాయదా రులు ఎందరున్నారో వేళ్ళమీద లెక్కగట్టి చెప్పవచ్చు. దొరవారిది, కర్నం పంతులుది, పోలీస్ పటేల్‌ది, మాలీస్ పటేల్‌ది కాక మరో నలుగురు ఐదుగురు రైతులకు మాత్రమే వ్యవసాయాలుండేవి. ఎవరైనా వీరి పంచన చేరి బతకాల్సిందే. ఒకరివద్ద జీతం మానేస్తే ఇంకొకరు జీతం కుదుర్చుకు నేవారు కాదు.

కొడుకు జీతం ఉండనని చెప్పడంతో తల్లికి గుండె దడ పట్టుకుంది. కూటిగింజ లకు అప్పుచేసి, ఆ బాకీ తీర్చడానికే జీతం కుదిర్చింది. అవి తీరకుండానే పని మానేస్తే ఎలా? పైగా కొడుక్కు ఇప్పటికే 'చేతకాని వాడు, వంగలేనివాడ'ని పేరు వచ్చింది. ఇంకొకరు జీతం కుదుర్చుకోరు. రెక్కలిరగ



కష్టం చేయడన్న పేరుంది కాబట్టి ఎవరూ కూలికి కూడా పిలవరు. కొడుకును ఎలాగో బతిమాలి పనిలోకి పంపింది.

అదే ఏడు ప్లేగువ్యాధి వచ్చింది. జనం ఊరు విడిచి ఊరిబయట గుడిసెలు వేసుకున్నారు. అయినా వ్యాధి జనాన్ని విడువలేదు. చాలామందికి జ్వరాలు వచ్చాయి. నర్సవ్వ అత్తమామలు చనిపోయారు. గుండె పగిలిపోయేలా ఏడ్చింది నర్సవ్వ. ఇంటిపెద్ద దిక్కు చనిపోవడం, భర్త ఇంటి గురించి పట్టించుకోకపోవడం ఆమె బాధ్యతను మరింతగా పెంచింది. గుండెను రాయి చేసుకుంది. అప్పటికింకా పిల్లలు పుట్టలేదు.

ఊరు విడిచేటప్పుడు ఉన్న జనంలో సగంమంది మాత్రమే మళ్ళీ ఊరు చేరుకున్నారు. సగంమంది చనిపోయారు. ఉన్నవారు ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని వ్యాధి మళ్ళీ ఎప్పుడు విరుచుకుపడుతుందోనని భయంభయంగా కాలం గడుపుతున్నారు. భర్త జీతం మానేశాడు. నర్సవ్వ కష్టంతోనే ఇల్లు గడవాలి. ఎదురు మాట్లాడినా, ఇలా తగదని బుద్ధి చెప్పినా, "ఆడదానివి. నువ్వా నాకు చెప్పేది" అని చావబాదేవాడు. ఇరుగు పొరుగువారు కూడా నర్సవ్వనే తప్పు పట్టేవారు. ఆడది అణిగిమణిగి ఉండాలని హితవు చెప్పేవారు.

ఒకరోజు భర్త నెమ్మదిగా ఉన్నప్పుడు బతిమాలుతూ చెప్పింది నర్సవ్వ, "ఒక్క ఆడదాన్ని రెక్కల కష్టం చేస్తే సంసారం ముందుకు సాగదు. నేను ఒక్కదాన్నీ ఎంత కని చేస్తాను. నన్ను కూడా కూలీకి ఎవరూ పిలవడంలేదు. నువ్వు ఎవరివద్దనైనా జీతం ఉంటే నీ వెంట నన్ను కూలీకి పిలుస్తరు"

ఆ మాటలకు భర్త కోపగించుకున్నాడు, మాటామాటా పెరిగింది. దెబ్బలతో నర్సవ్వ వీపు కమిలిపోయింది. ఇరుగుపొరుగువారు కూడా జాలి చూపలేదు. "ఇద్దరు ముగ్గురు పిల్లలకు తల్లులమైనా మొగుడిముందు నిలబడి మాట్లాడం. అటువంటిది నువ్వు అట్లా అంటావా?" అని నర్సవ్వనే తప్పుపట్టారు. బాధలు భరించలేక పుట్టింటికి వెళ్ళిపోయింది నర్సవ్వ.

నర్సవ్వను తల్లిదండ్రులు కూడా ఆదరించలేదు. చావైనా బతుకైనా కట్టుకున్నవానితోనే అని హితవు చెప్పారు. పని చేసిన రెక్కలు చెడిపోవు. చెయ్యని రెక్కలే చెడిపోతాయి. నలుగురు మెచ్చేట్టు నడుచుకుంటే దేవుడు నీకు అన్యాయం చెయ్యడు. నీ ఇంటిని నీవు చక్కదిద్దుకోవాలని చెప్పి కూతురును వెంటబెట్టుకుని వెళ్ళాడు తండ్రి. నర్సవ్వ ఏడ్చి మొత్తుకున్నా వినలేదు. వెళ్తూ వెళ్తూ ఊరు అంచున ఉన్న వాగులోనుండి ఇసుకను సంచిలో మూటగట్టి కూతురు నెత్తిమీదపెట్టి మోయించుకుని వెళ్ళాడు. బరువుకు నిలువెల్లా చెమట పుట్టింది నర్సవ్వకు. ఆయాసం ముంచుకొచ్చింది.

ఇంటికి చేరగానే ఇసుక మూటను విప్పి గుమ్మంలో పోసి కూతురుచేత తొక్కించాడు. అలా చేస్తే పుట్టింటికి రాకుండా చక్కగా కాపురం చేసుకుంటారని ఒక నమ్మకం. ఆ నమ్మకం నిజమే అయింది. నర్సవ్వ మళ్ళీ పుట్టింటి గడప తొక్కలేదు. భర్తలో మార్పు రాకపోయినా ఎప్పటికైనా మారుతాడన్న ఆశతో అక్కడే ఉండిపోయింది. తల్లీతండ్రీ ఎప్పుడైనా వచ్చి చూసి వెళ్ళేవారు. అంతదూరం కాలినడకతో వచ్చినా, ఒక్కరోజు కూడా ఉండేవారుకాదు. భోజనంచేసి వెళ్ళిపోయేవారు. మొదట భర్త చేష్టల్ని ఏడుపుగొంతుతో తల్లిదండ్రులకు ఏకరువు పెట్టుకునేది నర్సవ్వ. కొన్ని రోజుల తర్వాత చెప్పడం మానేసింది. తన కష్టాలు వారికి చెప్పి బాధపెట్టడం ఇష్టమనిపించలేదు.

నర్సవ్వకు ఆ జీవితం అలవాటయిపోయింది. వంట చేసి తానింత తిని సద్దిమూట గట్టుకుని కూలీకి వెళ్ళేది. వంట అంటే అది అరగంట పని. కూడుకు రాత్రి

లేచి మక్క గటుకను విసుర్రాయితో విసి రేది. కుండతో ఎసరుపెట్టి మెత్తగా గటు కను ఉడుకపోసేది. అందులోకి కొంత కార్థం నూరిపెట్టేది. ఎవరైనా చల్లపోస్తే కలుపుకుని తాగేది. లేదంటే నీళ్ళతో కలు పుకుని ఉప్పు వేసుకుని అంచున కారం పెట్టుకుని తాగేది. భర్త ఎప్పుడో ఇష్టమున్న ప్పుడు వచ్చి తిని పోయేవాడు.

పిల్లలు లేకపోవడంతో ఊరంతా 'గొడ్రాలు' అని నిందించడం మొదలెట్టారు నర్సవ్వను. ఆ మాటలకు నర్సవ్వ ఎంతో మథనపడింది. ఆమె భర్తకు మరో పెళ్ళి చేసుకోమని సలహా ఇచ్చారు. 'నువ్వు అయ్యకు ఒక్క కొడుకువు. నీకు ఆ ఒక్కడు కూడాలేడు. చస్తే అగ్గిపెట్టే దిక్కులేదు. దేశం గొడ్డుబోయిందా! ఇంకో పెళ్ళిచేసుకో' అని మిత్రులు సలహా ఇచ్చారు. అతడు నవ్వి ఊరుకునేవాడు. ఏనాడూ భార్యతో పిల్లల ప్రస్తావనకానీ పెళ్లి ప్రస్తావనకానీ తేలేదు. అతడి మనసులో ఏముందో తెలి యక ఆలోచనల్లో పడిపోయేది నర్సవ్వ.

ఒకనాడు భర్తతో 'నామూలంగా నీవంశం ఆగిపోరాదు. వేరే లగ్గం జేసుకో' అని అడి గింది నర్సవ్వ. అతడి మనసులో ఏముందో తెలుసుకోవడానికే కానీ అలా రెండవ పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు ఆమెకు. సమాధా నంగా అతడు నవ్వి "పిచ్చిదానా! కీడెరుగని పిల్ల మొగని పెళ్ళికి పోయిందన్నట్టు, నేను ఇంకో పెళ్ళి చేసుకుంటనంటే నువ్వే వద్ద నాలి. ఏడవాలి, తిట్టాలికానీ... ఇలా మరో పెళ్ళి చేసుకొమ్మని అడుగుతారే! నా వంశం నిలిచినా నిలబడకపోయినా నీతోనే! మని షికి పెళ్ళి ఒక్కసారే... ఒక్కరితోనే జరుగు తది. రెండవసారి జరిగేది పెళ్ళి కాదు. అట్ల చేసుకున్నవాడు మనిషి కాదు. మళ్ళీ ఒకసారి ఈమాట నా ముందు అనకు" అంటూ కోపగించుకున్నాడు.

ఆ మాటలతో నర్సవ్వ కళ్లల్లో నీళ్ళు తిరి గాయి. జీవితంలో ఎన్నడూ లేని తృప్తి కలి గింది. భర్తపై ఆరాధనాభావం ఏర్పడింది. అతడి మంచి మనసును తాను అర్థంచేసు కోలేదని తననుతాను తిట్టుకుంది. రెక్కలు ముక్కలు చేసుకుని అయినా ఉన్నంతలో తన కడుపు మాడ్చుకుని అయినా అతడికి కడుపునిండా భోజనం పెట్టడం మొదలె ట్టింది. ఆయేడే కడుపులో నలుసు పడింది. వారి సంతోషానికి హద్దు లేకుండా పోయింది.

గర్భంతో ఉండి కూడా ఇండ్లకు మట్టిని మోసేది నర్సవ్వ. రెండుమూడు మైళ్ళ దూరంవరకు నడిచి కూలీకి వెళ్ళేది. కొడుకు పుట్టేవరకూ కూలీ మానలేదు. కొడుకు పుట్టాక భర్తలో చెప్పలేని మార్పు వచ్చింది. పెద్ద రైతుకు జీతంకుదిరాడు. నర్సవ్వకు తమలపాకు తినే అలవాటుంది. చుట్ట తాగడం మాని ఆ డబ్బుతో తమలపాకులు కొని తెచ్చేవాడు. అతడికి పనిచేతగాదు అన్నవారే మంచి పనిమంతుడన్నారు.

పండంటి కొడుకు, భర్తలో మార్పు నర్స వ్వకు సంతోషాన్ని కలిగించాయి. కొడుకు పుట్టడంవల్లనే భర్త మారాడని అందరితో చెప్పుకుని మురిసిపోయేది. ఆ ఆనందం ఎన్నిరోజులో మిగల్లేదు. రెండు సంవత్స రాలు తిరక్కుండానే జీవితం విషాదంలోకి నెట్టివేయబడింది. అప్పుడు నర్సవ్వకు మూడవ నెల.

మొక్కజొన్న కావలికి వెళ్ళిన భర్త శవమై తిరిగి వచ్చాడు. మంచెమీద పడుకున్న ప్పుడు పాము కరిచింది. వెంటనే ఇంటికి తిరిగివస్తూ దారిలోనే నురుగులు కక్కుతూ చనిపోయాడు. తెల్లవారేవరకూ ఎవరూ చూడలేదు. నర్సవ్వ గుండె చెరువైపో యింది. ఒంటరి పక్షిలా మిగిలిపోయింది. కొద్దిరోజుల తర్వాత ఎవరినైనా మారుమ నువు చేసుకొమ్మని, పిల్లల్ని ఎవరికైనా ఇచ్చి వేయమని అందరూ హితవు చెప్పారు. నర్సవ్వ ఒప్పుకోలేదు. ఆమెకు భర్త మాటలే గుర్తుకువచ్చాయి. పెండ్లి ఒక్కసారే జరుగు



తుందని మనసును రాయిచేసుకుంది. కూతురును కొడుకును చూస్తూ కాలం గడిపింది.

"అవ్వా" అన్న పిలుపుతో ఆలోచనల్లోంచి తేరుకుంది నర్సవ్వ. ఎదురుగా దేవరాజు కనిపించాడు. ఉత్సాహంగా ఉన్నాడు. అంత హుషారుగా ఉండడం ఎప్పుడూ చూడలేదామె. కొద్దిగా ఆశ్చర్యంవేసింది.

కాళ్ళు, చేతులు కడుక్కుని ఈలవేస్తూ భోజనానికి కూర్చున్నాడు దేవరాజు.

బయటకు వెళ్ళిన పద్మ అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టింది. భర్తలోని ఉత్సాహాన్ని చూసి అబ్బురపడిపోయింది. దగ్గరగా వచ్చి పక్కనే కూర్చుంటూ, "ఏంటీ... ఈరోజు బాగా మురుస్తున్నవు. ఇంత సంతోషంగా ఎన్నడుండలేదు. ఏదన్నా లాటరీ టికెట్ తగిలిందా ఏంది!" నవ్వుతూ అడిగింది పద్మ. భర్తలోని ఉత్సాహాన్ని చూస్తుంటే ఆమెకు ఎంతో తృప్తిగా ఉంది.

ముద్ద నోట్లో పెట్టుకుని ఏదో చెప్పబోతుండగా పొలమారింది దేవరాజుకు. చెంబుతో నీళ్ళను అందించింది పద్మ. నీళ్ళు తాగి చెప్పాడు దేవరాజు.

"యాదగిరి మస్కట్‌నుండి వచ్చిండు. మనిషి మంచిగ నిగనిగ దొడ్డుగయిండు. డబ్బు బాగానే సంపాదించిండు. ఇక్కడున్నపుడు మన లెక్క పొద్దుంటె మాపు, మాపుంటె పొద్దుకు లేకుండె. ఐదేండ్లలోనే ఊరిని కొనేట్టు అయిండు. అదృష్టమంటే అట్లుండాలె"

"వాడెట్లయితే మనకేందిరా! వాడికి డబ్బుంటే మనకిత్తుండా ఏంది? వాడు సంపాయిస్తే నువ్వెందుకు మురుత్తన్నవు. నీకేమన్న ఇస్తనన్నడా!" వెటకారంగా అడిగింది నర్సవ్వ. ఆమె మాటలకు పద్మ నవ్వింది.

"యాదగిరి అంటే సుశీలక్క భర్తకదా! పొద్దున్నే గుర్తుచేసింది. ఎట్లుంటడో నేను చూడలేదు. నా పెళ్ళి కాకముందే పోయిండట గదా! జీతం బాగానే ఉందట. ఎప్పుడచ్చిండు" ఆసక్తిగా అడిగింది పద్మ.

"పొద్దున వచ్చిండు. పదిహేను విజాలు తెచ్చిండట. పదిహేను మంది రెడీగా ఉంటే వారం రోజుల్లో మస్కట్ పంపిస్తడట. విజాకు అరవై వేలు ఖర్చయితయట. నెలకు పదివేల జీతమట. ఆరు నెలల్లో బాకీ తీర్చవచ్చు నేను కూడా వెళ్దామనుకుంటున్న" అన్నం తింటూ చెప్పాడు దేవరాజు.

భర్తవైపు దెబ్బతిన్నట్టుగా చూసింది పద్మ. ఆమెలో ఆందోళన మొదలయింది. నర్సవ్వకైతే మొదట నోటమాటరాలేదు. కొడుకువైపు కోపంగా చూసి మందలిస్తున్నట్టుగా అన్నది. "ఏందిరా దేవరాజూ! ఆగమాగం చెయ్యవడితివి. నువ్వు మస్కట్ పోతావురా! కూట్లె రౌతు తియ్యనోడు ఏటిలో రౌతు తీస్తనన్నడట. ఇక్కడ వంగి కష్టంచేయడం చేతకావడంలేదు కాని మస్కట్‌పోయి కష్టం చేస్తడట. వాని మోసపుమాటలు నమ్మినవా...? ఎక్కడున్నయిరా అరవైవేలు, ఆ అరవై వేలున్నంక బతుకు ఇట్లెందుకుంటదిరా!"

తినడం ఆపి తల్లివైపు కోపంగా చూశాడు దేవరాజు. ఉత్సాహం ఆపుకోలేక చెప్పాడు కానీ ఇప్పుడు ఎందుకు చెప్పానా అనిపిస్తోంది. ఈ విషయం ఏమాత్రం బయటకు పొక్కినా ఎంత ప్రమాదమో అతడికి తెలుసు. అందుకే గొంతు తగ్గించి రహస్యం చెబుతున్నట్టుగా అన్నాడు. "నువ్వు నోరు మూసుకోవే అవ్వా! నేను మస్కట్ చేరుకునేదాకా ఎవరికీ తెలియకూడదు. తెలిస్తే ముందుగా అప్పులు కట్టి కదలమంటారు. ఏదైనా బతుకుతెరువు పని మొదలుపెట్ట భయం. నన్ను ముందుకుపోనీయరు. మీరు ముందుకు పోరు"

అతడు అన్నం తినేవరకు ఆగింది నర్సవ్వ. ఏదైనా కోపగించుకుంటే భోజనం మధ్యలోనే లేచిపోతాడని భయం. భర్త పక్కనే కూర్చుండి తల్లీకొడుకులవైపు నీర





# ఏరినముత్యాలు

★ నీ ఆనందాన్ని నలుగురికీ పంచు, కానీ విషాదాన్ని మాత్రం నీలోనే దాచుకో.

-వివేకానంద

★ అహింస సద్గుణంలాంటిది. హింస అసమర్థతవంటిది.

-గాంధీజీ

★ కవుల లక్ష్యం సౌందర్యం, దార్శనికులది సత్యం.

-ఎమర్సన్

★ ఖర్చుపెట్టాక బాధపడే బదులు ఖర్చుపెట్టడానికి ముందుపడే బాధని 'బడ్జెట్' అంటారు.

-వాల్

★ విరిగిపోవడం కంటె వంగిపోవడం మేలు.

-స్కాట్‌లేండ్

★ నిన్ను నీవు తెలుసుకుంటే, భగవంతుని తెలుసుకున్నట్లే.

-రామకృష్ణ పరమహంస

★ పంచదారలో మాధుర్యమున్నట్లు ప్రతీ ప్రాణిలో దైవత్వమున్నది.

-డోన్

★ మోకాళ్ళపై కూర్చుని జీవించుటకన్నా, పాదాలపై నిలబడి మరణించుట మేలు.

-ఫోర్ట్స్

★ ఆశతో జీవితం గడిపేవారు ఉపవాసంతో మరణిస్తారు.

-ఫ్రాంకిన్

★ గ్రంథానికి మూల్యం ఎవరూ చెల్లించలేరు. అది ముద్రణకు మాత్రమే.

- షేక్స్‌పియర్

★ చెడును గూర్చి కాకిలా గోలచేయకు. మంచిని గూర్చి కోయిలలా గానం చేయి.

-టాగూర్

★ మహాత్ములను నిందించువాడు మహాపాపి, దేశద్రోహి.

-నెహ్రూ

★ మంత్రులు మారలేదని గగ్గోలు పెట్టకు. నీవెంత మారావో పరీక్షించి తెలుసుకో.

-సి.నా.రె.

★ తన జీవితంలో కళను సృజించువాడే నిజమైన కళాకారుడు.

-ఎ. నాగేశ్వరరావు

★ నీవు చిన్నవాడివైతే ప్రపంచం చాలా చిన్నది. నీవు పెరిగావా ప్రపంచం చాలా చిన్నదైపోతుంది.

- శ్రీశ్రీ

-సేకరణ: పి.ఎ. ప్రభాకర్ దత్తు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన భాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

నవంబర్ **చతుర** నవల **ఎడారిమంటలు**

**సమీక్షకుని పేరు:** ................................................................

**చిరునామా:** ................................................................

................................................................

................................................................

................................................................

సంగా చూస్తుండిపోయింది పద్మ. పుట్టింటికి భర్తతో వెళ్ళాలన్న ఉత్సాహం ఆమెలో అడుగంటిపోయింది. దేవరాజు భోజనం పూర్తిచేశాక మొదలెట్టింది నర్సవ్వ.

"చేతిలో చిల్లిగవ్వలేదు. ఇదివరకే ఆగమైపోయాం. ఊబిలో కూరుకుపోయినట్టుంది బతుకు. ఎవరో పోతున్నారని మనం గూడా పోదామనవద్దు. అందిన కాడికే కాలుజాపుకోవాలి. అందని దూరానికి పరుగెత్తి అందరినీ బాధపెట్టవద్దు. మనకండ్లముందే మస్కట్ పోతా, మస్కట్ పోతామని ఎంతమంది సంసారాలు ఖరాబుచేసుకోలేదు. ఎంతమంది నష్టపోలేదు. ఇప్పటికే తల్లి పిల్లల నిడిచి ఎంతమంది బొంబాయి చుట్టూ తిరుగుతలేరు"

"ఇది అట్లగాదవ్వా! కంపెనీ విసా. మోస ముండదు. పైగా గ్రూప్ విసా. నేనింకా యాదరిగితో మాట్లాడలేదు. ఈరోజే మాట్లాడుతా. మనం ఎవ్వరితో చెప్పవద్దు. యాదగిరిని బతిమాలి ఎవరికీ తెలియకుండా పొలం కొనుమంట. అదే డబ్బుతో నన్ను మస్కట్ పంపుమంట. ఏడాదిలో అన్ని బాకీలు తీరిపోతయి. నాలుగు డబ్బులు నిలువకు కూడా వస్తాయి"

ఎంగిలి కంచాన్ని కడుగుతూ భర్త మాటల్ని వింటోంది పద్మ. ఆమె గుండెలో ఏదో గుబులు మొదలయింది. నర్సవ్వకు అసహనంగా ఉంది. మరింతగా కోపాన్ని తెచ్చుకుంటూ అన్నది కొడుకుతో.

"వాడు చేతులెత్తేసిండనుకో. ఎకరం చేను పోతది. అప్పులు అప్పుల్లానే మిగిలిపోతాయి. ఇంత ఎండ్రిన్ తాగి చచ్చుడైతది. ఎప్పటికీ కరువే ఉండదు. చేతనైనకాడికి కూలీనాలీ చేసుకుని ఇక్కడే బతుకు. లేనిపోని ఆశలు పెట్టుకోకు"

దేవరాజు మౌనంగా ఉండిపోయాడు. తల్లితో వాదించడం అనవసరమనుకున్నాడు. తను చేయాల్సిందేదో చేసుకోవాలనుకున్నాడు. చివరిగా ఈ విషయం మాత్రం ఎవరితో చెప్పవద్దని హెచ్చరించాడు. నర్సవ్వ మొహం చిన్నబోయింది. పద్మ పెదవి విప్పలేదు. తనేం చెప్పినా వినిపించుకోడని తెలుసు. దేవరాజుకు తెలియకుండా సుశీలకు తన బాధను చెప్పుకోవాలనుకుంది. సుశీల ద్వారా యాదగిరికి చెప్పించి మస్కట్ పంపే ప్రయత్నం విరమింపజేయాలనుకుంది. అలా నిర్ణయించుకున్నాకే ఆమె మనసు తేలికపడింది. బాధగా చూస్తున్న అత్తవైపు తిరిగి యాదగిరి ఒప్పుకున్ననాటికి చూద్దాం! నువ్వెందుకు బాధపడుతున్నవు అత్తా. ఇటు అనగానే అటు అవుతుందా? దానికి ఎంత కథ ఉంటది" అని ధైర్యం చెప్పింది.

కొద్దిసేపటి తర్వాత దేవరాజు బయటకు వెళ్ళిపోయాడు. యాదగిరిని చూద్దామని సుశీల ఇంటికి వెళ్ళింది పద్మ. నర్సవ్వ మాత్రం దిగులుగా నులక మంచంలో కూలబడిపోయింది.



యాదగిరి ఇల్లు సందడిగా ఉంది. ఇంటినిండా జనం గుమిగూడారు. సుశీల రెక్కలు కట్టుకుని ఎగురుతున్నట్టు హడావుడిగా తిరుగుతోంది. వాలు కుర్చీలో రిలాక్స్‌డ్‌గా కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు

యాదగిరి. ఏవరైనా కొత్తవారు రాగానే లేచి ఆలింగనం చేసుకుని పరామర్శిస్తున్నాడు.

అతడి చుట్టూ కూర్చున్న జనం రకరకాల ప్రశ్నలు అడుగుతున్నారు. వారికి ఓపిగ్గా సమాధానం చెబుతున్నాడు యాదగిరి. అతడు మాట్లాడే తీరు, కూర్చునేతీరు ఠీవీని ఒలికిస్తోంది.

"మస్కట్‌లో వానలు పడుతాయా యాదన్నా!" ఒక వ్యక్తి అడిగాడు.

యాదగిరి నవ్వుతూ అతడివైపు తిరిగి చెప్పాడు. "వానలు అసలే ఉండవు. పచ్చని చెట్లు ఉన్నచోటనే వానలు కురుస్తాయి. అక్కడ అడవులంటూ లేనేలెవ్వు. మనదగ్గర కురిసినట్టు అక్కడ కురిస్తే ఇండ్లన్నీ మునిగి పోతాయి. ఎందుకంటే అక్కడ నేలంతా రాతినేలనే. నీళ్ళు ఇంకిపోవు. రెండుమూ డేండ్లకు ఒక్కసారి తుంపురు తుంపురుగా వర్షంపడితేనే అంతటా నీళ్లే కనబడతాయి. అక్కడ వాన కొట్టిన్నాడు పెద్ద పండుగ"

అతడినుండి ఫారిన్ సెంట్ వాసన గుప్పుమంటోంది. చేతికి గోల్డ్‌కలర్ వాచ్, వేళ్ళకు ఉంగరాలు, మెడలో గొలుసు, ఖరీదైన సూటు... గొప్పింటి బిడ్డలా ఉన్నాడు. తమలో ఒకడు, తమకంటే హీనంగా బతికినవాడు అంతగా ఎదిగిపోవడం అక్కడ కూర్చున్న చాలామంది జీర్ణించుకోలేకపోతున్నారు. వారి చూపుల్లో, మాటల్లో ఆ భావం వ్యక్తమౌతోంది.

"అక్కడ ఏం పని చేసినవు బిడ్డా!" ఒక ముసలమ్మ అడిగింది.

"అక్కడ పని తేలిగ్గా ఉంటదవ్వా! తిన్న అన్నం కూడా అరగదు. నేను చేసే పని మరీ తేలిక. ఫోర్‌మెన్ పని అంటరు. రోజూ కూలీలు ఎందరు వస్తున్నారో రాసుకోవాలి. నెల నిండాక డబ్బుల్ని లెక్కగట్టి ఇవ్వాలి. ఒక్కోసారి పని కాంట్రాక్టు నేనే తీసుకుని పనిచేయించేవాన్ని" చెప్పాడు యాదగిరి.

"మళ్ళీ రిటర్న్ విజా తెచ్చుకున్నవా...?"

"ఇస్తానన్నారుగానీ నేనే తెచ్చుకోలేదు. అదే కంపెనీకి పదిహేను మంది వర్కర్లు కావాలి. వచ్చేప్పుడు పదిహేను వీసాలు తెచ్చిన. పాస్‌పోర్ట్ రెడీగా ఉంటే వారం పదిరోజుల్లో మస్కట్ పంపిస్త. క్లీనింగ్ సెక్షన్‌ల పని. తిండి కంపెనీదే! జీతం పది వేలు. ఖర్చయిన డబ్బు ఆరు నెలల్లో తీరి పోతాయి" చెప్పాడు యాదగిరి అందరివైపు పరిశీలనగా చూస్తూ. వచ్చిన్నుండి అవే మాటలు వల్లెవేస్తున్నట్టు చెబుతున్నాడు యాదగిరి.

ఒక్కొక్కరు ఖాళీ అవుతున్నారు. మళ్ళీ కొత్త వారు వస్తున్నారు. వీసాలు తెచ్చాడన్న విషయం తెలిసాక రద్దీ మరీ ఎక్కువయింది. మస్కట్ వెళ్ళాలనుకునేవారు అప్పుడే అడగడం ఇష్టంలేక, అలాగని ఉత్సాహాన్ని ఆపుకోలేక అక్కడి పరిస్థితుల గురించి క్షుణ్ణంగా అడుగుతున్నారు. అటువంటి వారికి మరీ ఓపిగ్గా ఇప్పుడే వెళ్ళి అక్కడ వాలిపోవాలన్నంత బలమైన కోరిక కలిగేట్టుగా చెబుతున్నాడు యాదగిరి.

వచ్చిననుండి అదేపనిగా వీసాల గురించి, మస్కట్ గురించి చెప్పడం సుశీలకు విసుగును కలిగించింది. బలవంతం చేసి స్నానానికి లేవదీసింది. వచ్చినవారిని కూర్చోమని చెప్పింది. పని ఉన్న వారు మళ్ళీ కలుస్తామని వెళ్తున్నారు. పనిలేనివారు అక్కడే కూర్చుంటున్నారు. అప్పుడే పద్మ ఆ ఇంటిలోకి అడుగుపెట్టింది. ఆమెను చూడగానే సుశీల మొహం వికసించింది. ఆప్యాయంగా పలకరించి కూర్చోమని చెప్పింది.

పద్మ కూర్చోకుండా ఆమెతో వంటింట్లోకి వెళ్ళింది. సుశీల వంటచేస్తుంటే సహాయం చేయడం మొదలెట్టింది.

"పొద్దున్నే కదా అక్కా నువ్వు గుర్తుచేసింది. అలా తలుచుకున్నావో లేదో ఇలా వచ్చాడు బావ. ఇక నీ బాధలన్నీ తీరిపోయాయి. ఇకముందు నువ్వు హాయిగా బతకవచ్చు అన్నీ బావే చూసుకుంటాడు"




సుశీల పెదాలపై సంతృప్తికరమైన నవ్వు మెరిసింది. "ఈ బాధలు ఇప్పటివి కాదు పద్మా! నా పెళ్ళయినాడే మొదలయ్యాయి. నీకంటే ఎక్కువ కష్టాలు అనుభవించాను. పొద్దున తింటే మాపున, మాపున తింటే పొద్దున తినేదాన్ని కాదు. విపరీతమైన అప్పులు! వాళ్ళు ఇంటి చుట్టూ తిరుగుతూ అనే మాటలు! కండ్ల వెంట నీరు కారని దినమంటూ ఉండేది కాదు. అదృష్టం బావుండి, మస్కట్ వెళ్ళాక... ఇప్పుడిలా మూడు పూటలా తింటున్నాం"

"అదేంటక్కా! పొద్దున పుట్టింటికి వెళ్ళేదా న్నని అన్నావు. ఎందుకు వెళ్ళలేదు" అంటూ కిలకిల నవ్వింది పద్మ.

అప్పుడే వంటింట్లోకి అడుగు పెట్టాడు యాదగిరి. పద్మను చూసి ముగ్ధుడై కొన్ని క్షణాలు అలాగే చూస్తుండిపోయాడు. అతడి రాకను గమనించి కొంగును నిండుగా సర్దుకుని సిగ్గుపడుతూ నిలబడిపో యింది పద్మ.

పొడవుకు తగిన లావు, అందమైన మొహం. పొందికైన అవయవ సౌష్టవం, పసిడి రంగు మేనిఛాయ, నవ్వితే గుంటలు పడే చెంపలు అతడిని ఆకర్షించాయి.

"ఈమె ఎవరు...?" పద్మను కన్నార్పకుండా చూస్తూ అడిగాడు భార్యను.

"దేవరాజు భార్య. పెద్దత్త కోడలు. నీకు ఈమెనే లెటర్లు రాస్తుండె. చదువుకున్న పిల్ల. చాలా మంచిది" వంటపనిలో మునిగిపోతూ చెప్పింది సుశీల. అతడు పద్మను కొరుక్కుతినేలా చూడడం గమనించలేదు. అలా గమనిస్తే ఆమెకు పాతజ్ఞాపకాలు గుర్తుకు వచ్చేవి. అణువంతయినా మార్పు రాని అతడి ప్రవర్తనపై ఆమెకు విరక్తి కలిగేది.

పద్మకు అతడు కొత్త కాబట్టి అంతా కొత్తగా ఉంది. అతడి చూపుల్లోని భేదాన్ని పసిగట్టడంలేదు. యాదగిరి ఆమెకు దగ్గరగా వచ్చి జాలిని చూపిస్తున్నట్టుగా అన్నాడు. "అరెరె... మసిగుడ్డకు మాణిక్యాన్ని అంటగట్టినట్టు ఆ సన్నాసికి ఇంత మంచి పిల్లను అంటగట్టినరేందీ! పాపం... పిల్ల జీవితం ఖరాబు చేసింద్రు. ఇంట్ల కాలు ఇవతల పెట్టని కుటుంబంలో ఉండాల్సింది"

ఆ మాటలకు పద్మ మనసు నొచ్చుకుంది. అతడు జాలిని కురిపిస్తుంటే ఆమెకు ఒళ్ళంతా కంపరం మొదలయింది. చేదుతిన్నట్టుగా మొహం పెట్టి అతడివైపు చూసింది. అదే పనిగా యాదగిరి తన అందాన్ని పొగుడుతుంటే అక్కడ ఉండలేక "నా కూతురు ఏడుస్తది. నేను వెళ్తున్నానక్కా" అని బయటపడింది.

ఆమె ఇంట్లోంచి బయటపడినా, యాదగిరి మనసులోంచి బయటపడలేదు. ఆమె వెళ్తున్నవైపే చూస్తుండిపోయాడు.

పద్మ వెళ్ళిపోతుంటే ఏదో వెలితిగా అనిపించింది యాదగిరికి. తనను పలకరించవచ్చిన వారితో కొద్దిసేపు మాట్లాడి, భోజనానికి కూర్చున్నాడు. పిల్లలిద్దరినీ చదువులకొరకని తన చెల్లెవద్ద ఉంచింది సుశీల. అత్తామామ వేరుగా ఉంటున్నారు. కొడుకు వచ్చాడని తెలియగానే పలకరించడానికి వచ్చారు. ఇక్కడే భోజనం చేయమని వారిని బలవంతం చేసింది సుశీల. పెళ్ళికి వెళ్ళాలని, వచ్చాక ఇక్కడే ఉంటామని చెప్పి వెళ్లారు. ఇప్పుడు భార్యాభర్తలిద్దరే మిగిలారు.

"మళ్లీ ఇదో కొత్త దుకాణం పెట్టుకున్నారేంటీ...? ఆ వీసాలు ఎందుకు తెచ్చారు. మీకు మళ్లీ వెళ్ళాలని ఉంటే రిటర్న్ వీసా తెచ్చుకోనుంటిరి. ఈ ఏజంట్ దందా మంచిదనుకుంటున్నారా! మన కండ్ల ముందు ఎంతమంది ఏజంట్‌లు ఊరువిడిచి పారిపోలేదు. ఎంతమంది పొలాలు, ఇల్లు అమ్ముకోలేదు. ఇన్ని రోజులు ఏం తిన్నామో, ఎక్కడున్నామో ఎవరికీ తెలియదు. ఇప్పుడు మంది కండ్లల్ల ఉంటం. అందరు మన గురించే మాట్లాడుకుంటరు"

భోజనం వడ్డిస్తూ మనసులోని మాటను బయటపెట్టింది సుశీల.

ఆమెను వెర్రిదాన్ని చూసినట్టుగా చూసి అన్నం కలుపుతూ చెప్పాడు యాదగిరి. "డబ్బు విలువ నీకు తెలియదు. ఇంతకు ముందు మనింటి మొహం చూడనివారు ఇప్పుడు పిలవకున్నా ఇంటికి వస్తున్నారు. ఎందుకు వస్తున్నారో తెలుసా? చేతుల్లో డబ్బు ఆడుతోంది కాబట్టి. తెల్లగుంటే దేవుడంటరు. నల్లగుంటే దయ్యమంటరు. ఈ రోజు నాలుగు డబ్బులు మన చేతిలో ఉన్నాయి కాబట్టి మనం తెల్లగా కనబడుతున్నాము. నేను వీసాలు వట్టిగ తేలేదు. ఒక్కొక్క వీసాకు పది వేలు మిగులుతాయి. ఆ లెక్కన చూస్తే లక్షా యాభైవేల లాభం. ఏం పని చేస్తే అన్ని రూపాయలిస్తరు చెప్పు!"

భర్తవైపు క్షణకాలం తొట్రుపాటుగా చూసింది సుశీల. అతడు డబ్బుకు ఎంత విలువనిస్తాడో అర్థమైంది. ఇంతకు ముందులా లేడని అతడి గుణం మారిందని తెలిసిపోయిందామెకు. అతడిని మార్చాలనే ప్రయత్నంలో పక్కనే కూర్చుంటూ నెమ్మదిగా చెప్పింది. "డబ్బు ముఖ్యం కాదండీ! పరువు... పరువు ముఖ్యం. కంపెనీ సరిగా జీతాలివ్వకున్నా, పని మధ్యలోనే ఆగిపోయినా వాళ్ళు మనని తిడతారు. మస్కట్ అనగానే పొలం, నగలు, ఇల్లు అమ్ముకుని నిలువ నీడలేకుండా చేసుకుని కొండంత ఆశతో వెళ్తారు. అక్కడ జీతాలు సరిగా ఇవ్వక వాళ్ళు అప్పులపాలైపోతే ఆ ఉసురు ఎవరికి తగులుతుంది? ఆ పాపపు కూడు తినుడుకంటే పస్తులుండుడు మంచిది కదా!"

భార్యవైపు కోపంగా చూశాడు యాదగిరి. అతడికి కోపం వచ్చిందని గ్రహించింది సుశీల. వచ్చిరాగానే అతడితో వివాదానికి దిగానేమో అనుకుంది. యాదగిరి మౌనంగా భోజనం చేస్తున్నాడు. కావాలనే సంభాషణను బంధువులమీదికి మళ్ళించింది సుశీల. ఐదునిమిషాల్లో అతడి కోపాన్ని పోగొట్టి మామూలు మనిషిని చేసింది.





యాదగిరి భోజనం చేసి బయటకు రాగానే ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వారి క్షేమసమాచారాలు తెలుసుకుని వారి కుటుంబ సభ్యులను పేరుపేరునా గుర్తుచేశాడు యాదగిరి. మస్కట్‌లో ఐదేళ్ళ జీవితం అతడికి మాటకారి తనాన్ని నేర్పింది. డబ్బు హుందాను కలిగించింది. కొద్దిసేపు మాట్లాడి వారు వెళ్ళిపోయారు. అప్పుడే దేవరాజు ఇంట్లోకి అడుగుపెట్టాడు. అతడిని చూడగానే ఈర్ష్య కలిగింది యాదగిరికి. పద్మలాంటి అందమైన భార్య అతడికి తగదన్న భావన కలిగింది.

దేవరాజును ఆలింగనం చేసుకుని కుశల ప్రశ్నలు వేసి కూర్చోమన్నాడు యాదగిరి. దేవరాజు కింద కూర్చోబోతుంటే కుర్చీ చూపించింది సుశీల. యాదగిరి సిగరెట్టు, అగ్గిపెట్టె చేతికి అందించాడు. ఇద్దరూ మాటల్లోపడ్డారు.

దేవరాజు తన మనసులోని మాటను చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు కానీ చెప్పడానికి ధైర్యం చాలడంలేదు. చేతిలో డబ్బు లేదు. ఎలా వెళ్తావని ఎగతాళి చేస్తాడనిపించింది. ధైర్యం చేసి ఒకటి రెండుసార్లు చెప్పడం మొదలెట్టినా ఎవరో రావడంతో ఆపివేశాడు.

"నీతో తీరిగ్గా మాట్లాడాలి యాదన్నా! పొద్దుగూకినంక కలుస్తా. అప్పుడైతే నువ్వు కూడా తీరిగ్గా ఉంటావు. ఇప్పుడు వచ్చిపోయేటోల్లు చాలామంది ఉన్నారు" తను వచ్చి చాలా సేపయిందని గుర్తించాక లేస్తూ అన్నాడు.

"అలాగేరా! నీకేం సహాయం కావాలన్నా సిగ్గుపడకుండా అడుగు. అన్నదమ్ములులేనోనివి. నేనే అన్ననను కో! అడిగితే యాదన్న ఏమంటాడో అనుకోకు. నేను నీవలెనే కష్టపడ్డ మనిషిని. ఇప్పుడు నాలుగు డబ్బులు కనపడగానే గొప్పవాన్ని కాలేదు"

దేవరాజు భుజం తడుతూ అన్నాడు యాదగిరి.

దేవరాజు పొంగిపోయాడు. అతడికి కొండంత ధైర్యం వచ్చింది. తన పొలాన్ని కొని తప్పకుండా మస్కట్ తోలిస్తాడన్న ధైర్యం కలిగింది. యాదగిరికి వీడ్కోలు చెప్పి బయటపడ్డాడు. రోడ్డువెంట నడుస్తుంటే ఎక్కడవిన్నా ఇదే విషయం చర్చనీయాంశమయ్యింది. మస్కట్ వెళ్లిన వ్యక్తి ఒక్కసారి పదిహేను వీసాలు తేవడం ఆ ఊరిలోనే కాదు చుట్టుపక్కల గ్రామాల్లో ఎక్కడా ఇంతవరకు జరగలేదు.

ఆలోచనల్లో తేలిపోతూ ఇంటికి చేరుకున్నాడు దేవరాజు. నర్సవ్వ మూల్గుతూ మంచంలో పడుకుంది. పద్మ ఏడుస్తున్న చిన్న కూతురును సముదాయిస్తోంది. కొడుకు ఇంట్లోకి అడుగుపెట్టగానే లేచి కూర్చుంది నర్సవ్వ.

"దేవీ... అప్పుడు మీ మామ వచ్చిండురా! మీ బావమరిదికి పిల్లను చూడబోతున్నారట. గొల్లపెల్లికి రమ్మన్నారు. రేపు వాగుగడ్డ బస్సుకుపోండి. మళ్ళీ పొద్దుగూకే బస్సుకు రావచ్చు. బలవంతంచేసి ఇంటికి రమ్మంటే అటే పోయి రేపు పొద్దున రండి. ఇక్కడ ఏం పనిలేదు. వాళ్లను తొందరపెట్టరాకుండ్రి"

"నేను పోతేగదా తొందరపెట్టడానికి. పద్మ, నువ్వు ఇద్దరు పొండి. ఇప్పుడే లగ్గమైతుందా? " విసుగ్గా అన్నాడు దేవరాజు. అతడివైపు వింతగా చూసింది నర్సవ్వ. అత్తగారింటికనగానే ఎగిరి గంతేసే కొడుకు అలా ఎందుకంటున్నాడో అర్థంకాలేదు. కూతురును సముదాయించడంలో పడి వారి మాటల్ని వినడంలేదు పద్మ.

"అట్లంటే ఎట్లరా! నీ బావమర్ది పెళ్ళిపెట్టుకుంటే నువ్వు వెళ్ళవా? అంత తీరికలేని పనేముంది నీకు? నన్ను పొమ్మంటున్నవు గదా... నేనెటుపోవాలిరా? బస్సుదాక నడిస్తేనే కళ్ళు తిరిగిపడిపోతా. తినేదాన్నా తాగేదాన్నా! షుగర్ రోగం వచ్చిననుండి అన్నం తినుడే లేదాయె. పొద్దుమాపు పచ్చజొన్న గటుకనేనాయె! అక్కడికి పోయి నాకు జొన్న గటుక పెట్టుమనాలా!" కోపంగా లేచి నిలబడుతూ అన్నది నర్సవ్వ.

తల్లికోపాన్ని చూసి క్షణకాలం బెదిరిపోయినా నిర్లక్ష్యంగా ఉండిపోయాడు దేవరాజు. తను మౌనంగా ఉంటే వెళ్ళడానికి ఒప్పుకున్నాడనుకుంటుందని విసుగును ప్రదర్శిస్తూ అన్నాడు. "నా బాధ నాకుంది. మీ బాధ మీకుంది. పెళ్ళిళ్ళకు, పేరంటాలకు వెళ్ళే ఓపిక నాకు లేదు. నీ యిష్టం ఉంటే వెళ్ళు. లేదంటే మానుకో. పద్మను బస్సు ఎక్కిస్తే వెళ్తది. దాని ఇష్టమున్నప్పుడు తిరిగిరాని"

తల్లి ఏదో చెప్పబోతుంటే వినిపించుకోకుండా బయటపడ్డాడు దేవరాజు. భర్త అలా వెళ్ళిపోతుంటే వింతగా చూస్తూ అత్త వద్దకు వచ్చి ఏం జరిగిందని అడిగింది పద్మ. జరిగిన విషయం చెప్పకుండా విసుగ్గా గొణుక్కోవడం మొదలెట్టింది నర్సవ్వ. అత్తా కోడళ్ళమధ్య ఎలాంటి రహస్యాలుండవు. తీరిగ్గా ఉన్నప్పుడు ఆవిడే చెబుతుందని మౌనంగా ఉండిపోయింది పద్మ.

★ ★ ★

సాయంత్రం అవుతుండగా బయటకు వచ్చాడు యాదగిరి. ఊరు ముందటిలా లేదు. పూర్తిగా మారిపోయింది. జనాభా పెరిగిపోయింది. ఇండ్లు కొత్తవి వెలిశాయి. రోడ్లు వెడల్పు చేయబడ్డాయి. ఊరిమధ్యలోకి వచ్చిపోతుంది బస్సు. అతడు వెళ్ళేప్పుడు చిన్నగా ఉన్న పిల్లలందరు పెద్దవారైపోయారు. ఎవరు ఎవరో గుర్తుపట్ట వీలు లేకుండా ఉంది.

యాదగిరిని చూసి అందరూ పలకరిస్తున్నారు. చేతిలో చెయ్యి కలిపి ఆలింగనం చేసుకుంటున్నారు. కుశలప్రశ్నలు వేస్తూ, మస్కట్ విశేషాలు అడిగి తెలుసుకుంటు

న్నారు. యాదగిరి వెళ్ళి గాంధీవిగ్రహం వద్ద కూర్చున్నాడు. ఊరి మధ్య ప్రదేశం అది. అక్కడ రెండు చిన్న హోటల్‌లు, వర్క్ షాపు, మార్కెట్, చికెన్ సెంటర్‌లున్నాయి. ఊరిలో ఎవరిని కలుసుకోవాలనుకున్నా అక్కడికి వస్తే చాలు. పొద్దున్నో సాయంత్రమో తప్పకుండా ఒక్కసారైనా అక్కడికి వస్తారు. ఎప్పుడూ జనంతో సందడిగా ఉంటుందాప్రదేశం.

యాదగిరి అక్కడికి చేరుకోగానే అక్కడ అటూ ఇటూ తిరుగుతున్న జనం పోగయ్యారు. వారందరికీ చాయ్‌లు ఆర్డర్ ఇచ్చాడు యాదగిరి. చాయ్ తాగుతూ వారడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. ఇంతకుముందు 'అరేయ్', 'ఒరేయ్' అనే వారందరూ 'యాదగిరీ' అని గౌరవంగా పిలుస్తున్నారు. సమవయస్కులు, కొద్దిగా పెద్దవారు, చిన్నవారు 'యాదన్నా' అంటున్నారు.

"ఐదేండ్లలో ఎంతగా మారిపోయాడు! మనిషి రంగుతేలి తెల్లగయిండు. బక్కగా ఉండేవాడు ఎంతలావయిండు. వేషం, భాష అన్నీ మారిపోయినయి. కుమ్మరోల్లకు జీతానికున్నప్పుడు గిట్లనే ఉండెనా!" అక్కడ గుమిగూడిన జనంలో ఒకరు అన్నారు.

"ఇక్కడుంటే పిచ్చివానివలె తిరుగుతుండె. మస్కట్‌పోయి డబ్బు సంపాయించుకున్నడు. దేనికైనా అదృష్టం కావాలి. మస్కట్ ఎందరో పోయారు. ఏం లాభం? యాదగిరి లెక్క ఎవరు సంపాయించిండ్రు!" మరో వ్యక్తి అన్నాడు.

"లంబడోల్ల పిల్లను గుంజులాడుడే మంచిదయింది. వాళ్ళు కొట్టేందుకు ఇంటిమీదికి వస్తే బొంబాయి పారిపోయె. అక్కడినుండి అటే మస్కట్ వెళ్ళిపోయె" ఒక వ్యక్తి గుసగుసగా అన్నాడు మరో వ్యక్తితో.

"తంతే పోయి గారెల బుట్టలపడ్డట్టయింది. అప్పుడు ఊరంతా అప్పుచేసినవాడు ఇప్పుడు ఊరందరికీ అప్పు ఇచ్చేటట్టు ఉన్నాడు. అప్పుడు ఉప్పురాళ్ళు కూడా ఉద్దెర నమ్మకపోదురు. ఇప్పుడు ఏది కావాలంటే అది కూర్చున్నచోటకు నడిచివస్తది" మరో వ్యక్తి అన్నాడు గుసగుసగా.

అక్కడ గుమిగూడిన వ్యక్తుల్లో కొందరు యాదగిరి గురించి మాట్లాడుకుంటున్నారు. మరికొందరు యాదగిరితో మాట్లాడుతున్నారు. అప్పుడే అక్కడికి ఆ ఊరి సర్పంచ్ వచ్చాడు. రెడ్డి కులస్తుడు. తాతలు తండ్రులనాటినుండి ఆ ఊరిలో వారి కుటుంబంనుండే సర్పంచులయ్యారు. అతడంటే అందరికీ గౌరవం, భయం కూడానూ! అతడి రాకను గమనించి అందరూ లేచి నిలబడి నమస్కారం చేశారు. యాదగిరి కూడా లేచి నిలబడి నమస్కారం చేసి "బాగున్నరా బాపూ" అని అడిగాడు.

సర్పంచ్ యాదగిరి దగ్గరికి వచ్చి భుజంపై చేయివేసి "ఏమోయ్ యాదగిరి! ఎప్పుడు వచ్చినవు. అంత బాగేనా! ఐదేండ్లు అటే పోతివి... విజాలు కూడా తెచ్చినవట గదా! మన ఊరివారినే పంపించు. వేరే ఊరివాళ్ళకు చాన్సు ఇవ్వకు. నాలుగు డబ్బులు సంపాదించుకుంటే నీ పేరు మరిచిపోరు" అన్నాడు నవ్వుతూ.

సర్పంచ్ యాదగిరి భుజంపై చేయివేసి అంత చనువుగా మాట్లాడడం అక్కడున్నవారిని ఆకర్షించింది. సర్పంచ్ మెప్పును పొందేందుకు ప్రయత్నిస్తూ అతడికి వంత పాడారు. పదిహేను మందిని తమ ఊరివారినే పంపించాలని కోరారు.

అక్కడనుంచి చర్చ వీసాల గురించి సాగింది.

★ ★ ★

యాదగిరి అరచేతిలో వైకుంఠాన్ని చూపించాడు. రెండు సంవత్సరాల్లో సంపాదించే డబ్బును వేళ్లమీద లెక్కగట్టి చెప్పాడు. "ఇక్కడ మన్నుతిని మన్ను కక్కినా ఏడాదికి పదివేలు రూపాయలు

సంపాదించం. అక్కడ రెక్కలు బొక్కలు నొయ్యకుండా నెలకు పదివేల సంపాదిస్తం. తీసుకుపోయిన బాకీ ఆరేడు నెలల్లో తీరిపో తది. మిగిలిన ఏడాదిన్నరలో లక్షన్నరదాకా సంపాదించుకోవచ్చు. రోజూ చస్తూ బతికే కంటే ధైర్యం చేసి రెండేళ్లు పోయివస్తే చాలు. ఇంకా సంపాదించుకోవాలనే కోరిక ఉంటే రిటర్న్ విసా తెచ్చుకోవచ్చు" అక్కడు న్నవారిని ఉద్దేశిస్తూ అన్నాడు యాదగిరి.

మస్కట్ విశేషాలు ఒక్కొక్కటి వారు అడగడం, యాదగిరి వర్ణించి చెప్పడంతో అందరికీ అదో కొత్త ప్రపంచంలా అనిపి స్తోంది. కొద్దిసేపు మాట్లాడి సర్పంచ్ వెళ్ళి పోయాడు. చాలాసేపు అందరితో ఓపిగ్గా మాట్లాడి ఇంటి మొహం పట్టాడు యాద గిరి. అప్పటికే ఒకరిద్దరు తాము విసాలను కొని మస్కట్ పోతామని యాదగిరితో చెప్పారు. వారికి డబ్బు వివరాలు ఖర్చులతో సహా చెప్పాడు. రెండు రోజుల్లో ఆలోచించు కుని ఏ విషయం చెబుతామన్నారు. సరేన న్నాడు యాదగిరి.

ఇంటికి వెళ్తూ దేవరాజు ఇంటిముందు ఆగాడు యాదగిరి. ఇంటి తలుపులు మూసి ఉన్నాయి. వెళ్ళి తలుపును నెట్టాడు యాద గిరి. "ఎవరూ? " అన్న పద్మ మాటలు విని పించాయి. బయటనే నిలబడి 'నేను యాద గిరిని పద్మా. పెద్దవ్వ ఉన్నదేమో మాట్లాడి పోదామని వచ్చిన' అన్నాడు యాదగిరి.

కూతురును ఎత్తుకుని బయటకు వచ్చి యాదగిరిని చూసి నవ్వుతూ లోనికి ఆహ్వా నించింది పద్మ. ఇంట్లోకి వెళ్ళి నులకమం చంమీద కూర్చున్నాడు యాదగిరి.

"నా పెద్దబిడ్డ ఏడిస్తే ఇప్పుడే బయటకు పోయింది అత్త. రెండు మూడేండ్లనుండి ప్రాణం బాగలేదు. హాస్పిటల్లు తిరుగుడవు తుంది. ఎన్ని మందులు వాడినా తగ్గుత లేదు" చెప్పింది పద్మ.

పద్మ చిన్న కూతురువైపు ఆశ్చర్యంగా చూసి, "నీకు ఇద్దరు బిడ్డలా! నిన్ను చూస్తే అలా అనిపించదు. నిన్న మొన్న లగ్గమై నట్టు ఉంటవు. మీది ఏ ఊరు? మీ నాన్న ఏంజేస్తడు? చూస్తే చదువుకున్న పిల్లవు. ఏదన్నా ఉద్యోగం దొరుకలేదా? " అడిగాడు యాదగిరి.

అతడి మాటలకు సిగ్గుపడుతూ నవ్వింది పద్మ. నవ్వినప్పుడు ఆమె మొహం మరిం తగా వికసించింది. కూతురును తొట్టెలో పడుకోబెట్టి ఊపుతూ అతని ప్రశ్నలకు బదులు చెప్పింది.

"దేవరాజు లేనట్టున్నాడు. ఎక్కడికి వెళ్ళిండు. పొద్దున కనిపించాడు. మళ్ళీ కలు వలేదు" అడిగాడు యాదగిరి.

"ఎక్కడికి వెళ్ళాడో తెలియదు. పొద్దున్నే వెళ్లాడు. ఇంతవరకు రాలేదు. మీ దగ్గరికే వచ్చాడనుకున్నా" చెప్పింది పద్మ.

"వాడు ఎక్కడ కూర్చుంటే అక్కడే గంటలు గడుపుతాడు. ఏ అరుగుమీద కూర్చున్నాడో! మళ్ళీ కలుస్తా. నాతో మాట్లా డాలి అన్నాడు. కలవనేలేదు. మస్కట్ వెళ్తాడటనా? " అడిగాడు యాదగిరి.

కూతురు నిద్రపోవడంతో తొట్టెను ఊపడం ఆపి గోడకానుకొని నిలబడి చెప్పింది పద్మ. "ఏమో! నాకేం తెలుసు. నాతో చెప్పి చేస్తడా? మస్కట్ లేదు, ఏంలేదు. ఇక్కడున్నవాళ్లు బతకడంలేదా? వర్షాలు పడాలిగానీ అక్కడ చేసేపని ఇక్కడ చేస్తే బతకలేమా!"

నవ్వును తెప్పించే విషయం ఏదీ లేకపో యినా పెద్దగా నవ్వాడు యాదగిరి. "బలే తమాషాగా మాట్లాడుతవు పిల్లా నువ్వు. ఎంతైనా చదువుకున్నవారి తెలివి వేరుగా ఉంటది. తెలివిగలపిల్ల ఆలోచనలు తెలి విగా ఉంటాయన్నట్టు చదువుకున్నవారి ఆలోచనలు వేరుగా ఉంటాయి" ఆమెవైపు పరిశీలనగా చూస్తూ మెచ్చుకోలుగా అన్నాడు యాదగిరి.

చిన్నగా నవ్వింది పద్మ. తన భర్తను మస్కట్ పంపకూడదని బతిమాలాలను



కుంది. కానీ అతడితో పరిచయం లేకపోవడంతో మౌనంగా ఉండిపోయింది. ఎలాగైనా సుశీల చేత చెప్పి ఆ ప్రయత్నం సాగనీయకుండా చూడాలనుకుంది. సుశీలతోనైతే ఎందుకు, ఏమిటన్న విషయం వివరంగా చెప్పవచ్చుననుకుంది.

యాదగిరి మాటల నేర్పుతో ఆమెను నవ్విస్తూ పరీక్షగా చూస్తున్నాడు. అప్పుడే కూతురు ఉలిక్కిపడి లేచి ఏడ్వడంతో ఎత్తుకుని పాలు ఇవ్వడం మొదలెట్టింది పద్మ. అతడు కూలింగ్ గ్లాసెస్ పెట్టుకున్నాడు కాబట్టి చూపుల్ని ఎక్కడ కేంద్రీకరించాడో తెలియడంలేదు పద్మకు.

"రాకరాక మీ ఇంటికి వచ్చిన. ఏం మర్యాద చేసుడులేదా! కనీసం చాయైనా ఇయ్యకపోతివి. మా దేవరాజు ఉంటే ఇప్పుడు ఎంతో హడావుడి చేస్తుండె. కూల్ డ్రింక్స్ తెస్తుండె. ఎంతైనా పరాయివాళ్ళు పరాయివాళ్ళే. మీ ఊరికి వస్తేనైతే మాట గూడా మాట్లాడేట్టు లేవు" నవ్వుతూ అన్నాడు యాదగిరి.

"అట్లేంకాదు. పాలు లేక చెయ్యలేదు. అయినా మా అటువంటి గరీబుగాళ్ళ దగ్గర తాగుతరా మీరు. మీరెక్కడ మేమెక్కడ" అంటూ లేచి దీపం వెలిగించింది పద్మ. అప్పటికే చీకటిపడింది. ఏదో అడగబోయి అడుగుల చప్పుడు విని తలుపువైపు చూశాడు యాదగిరి. మనవరాలితో ఇంట్లోకి వస్తూ కనిపించింది నర్సవ్వ. ఆమెను చూసి లేచి నిలబడి "బాగున్నావా పెద్దవ్వా? " అన్నాడు.

నర్సవ్వ దగ్గరగా వచ్చి యాదగిరిని చూసి ఆలింగనం చేసుకుని, "నువ్వా బిడ్డా యాదగిరీ! ఏం బాగుండుడు బిడ్డా! రోగాలతో వశమైతలేదు. చావలేక బతుకుతున్నను. నువ్వు బాగున్నవా? చాలా రోజులకు వచ్చినవేందిరా" అంది.

"బాగనే ఉన్న పెద్దవ్వా! వద్దామంటే కంపెనీ పంపించలేదు. ఇంకో ఏడాదివరకూ పంపించనన్నారు. నేను ఉండనని కొట్లాట పెట్టుకున్న. అవ్వకు బాగలేదని టెలిగ్రాం ఇవ్వుమని ఇంటికి లెటర్ రాసిన. వీళ్ల ఇంటినుండి రెండు టెలిగ్రాంలు ఇచ్చాక పంపించారు. నేను లేకపోతే మా కపిల్‌కు చెయ్యి విరిగినట్టు ఉంటది. అందుకే నన్ను పంపించడానికి ఇష్టపడలేదు" మంచంమీద కూర్చుంటూ చెప్పాడు.

నర్సవ్వ అతడి పక్కనే కూర్చుంది. మాట్లాడుతూ నర్సవ్వ చేతిలో ఉన్న పాపను ఎత్తుకుని ముద్దు చేశాడు యాదగిరి.

కొద్దిసేపు మాట్లాడి వెళ్ళొస్తానని చెప్పి లేచాడు యాదగిరి. వెళ్ళిపోతూ "సుశీలక్క నిన్ను రమ్మన్నది. అప్పుడే చెబుతామంటే నాకు గుర్తులేదు" అని అబద్ధం చెప్పాడు పద్మతో. అతడిని వాకిలివరకూ సాగనంపి వెనక్కి వచ్చింది పద్మ.

ఆవేళ అతడు ఇంట్లోకి రావడం, పద్మ అతడితో చనువుగా మాట్లాడడం నర్సవ్వకు నచ్చలేదు. వీడు ఎలాంటివాడో తెలియదు. తెలిస్తే అలా చేసేది కాదనుకుంది. వాడి కళ్ళు మంచివి కావు. సంసారాలను కూలుస్తాడు. వాడి విషయం కోడలుకు చెప్పాలనుకుంది. కోడలుపైన నమ్మకం లేకకాదు గానీ కష్టాల్లో ఉన్న తమపైన మరో నింద రావడం ఆమెకు ఇష్టంలేదు. డబ్బు ఎన్ని తప్పులనైనా కప్పిపుచ్చుతుందనుకుంది. సమయం చూసి అతడెలాంటివాడో వివరంగా కోడలుకు చెప్పాలనుకుంది.

కూతురు నిద్రపోగానే పద్మ బయటకు నడిచింది. ఆలోచనల్లోంచి తేరుకున్న నర్సవ్వ కోడలును ఎక్కడికని అడిగింది. సుశీల ఇంటికి వెళ్తున్నానని చెప్పింది పద్మ. నర్సవ్వకు కోపం ముంచుకొచ్చింది. పైకి మాత్రం గంభీరతను ప్రదర్శిస్తూ "మాపటివేల పరాయి ఇండ్లకు పోగూడదు. వాడు ఈరోజే వచ్చాడు. తాగుడో, తినుడో ఏదో పనిమీద ఉంటడు. పోయేదుంటే పొద్దున పోయి కలువు. ఇప్పుడు మాత్రం వద్దు.




దునియా మంచిగలేదు. ఎవరు చెడ్డవారు, ఎవరు మంచివారు తెలుస్తలేరు. బట్టకాల్చి మీదవేసి బదనాం చేస్తరు"

అత్త చెప్పిన మాటలు నిజమేననిపించింది పద్మకు. వెనక్కి తిరిగి వచ్చింది. ఏ విషయంలోనూ తన మాటను కాదనని కోడలువైపు వాత్సల్యంగా చూసింది నర్సవ్వ.

యాదగిరి ఇంటికి చేరుకునేసరికి దేవరాజు కనిపించాడు. 'నేను మీ ఇంటికి వెళ్తే నువ్వు మా ఇంటికి వచ్చినవా' అంటూ నవ్వి ఇంట్లోకి వెళ్ళాడు యాదగిరి. అరగంటలో స్నానం చేసి లుంగీకట్టుకుని వచ్చాడు. విసాల గురించి తెలుసుకుని ఇద్దరు వ్యక్తులు రావడంతో వారికి అన్ని విషయాలు చెప్పి పంపించాడు యాదగిరి.

చాపను పరిచి దేవరాజును కూర్చోమని చెప్పి తలుపులు మూసివచ్చి విస్కీబాటిల్ బయటకు తీశాడు. సుశీల కోడికూర, రొట్టెలు తెచ్చి వారిముందు ఉంచింది. ఎవరు వచ్చినా లేడని చెప్పమని భార్యతో చెప్పి బాటిల్ మూత విప్పాడు. విస్కీని గ్లాసులో పోసి సోడా బాటిల్ ఓపెన్ చేసి కలిపి దేవరాజుకు అందించాడు.

మందు తాగడం అలవాటు లేదని చెప్పాడు దేవరాజు. 'పెద్దపెద్ద సేట్లనే అప్పు అడిగితే కొడుతున్నవు. నీకు ఈ మందు ఒక లెక్కనారా! కొడితే అదే అలవాటవుతుంది. ఇది లేకపోతే నాకు నిద్రేపట్టదు. తీసుకొని తాగు" అంటూ బలవంతం చేశాడు యాదగిరి. మొహమాట పడుతూ గ్లాసును అందుకున్నాడు దేవరాజు.

మొదటిపెగ్గు గొంతులో నుండి జారాక తన బాధల్ని చెప్పుకోవడం మొదలెట్టాడు దేవరాజు. ఊ కొడుతూ వింటున్నాడు యాదగిరి. సుశీల వారికి కావలసిన వస్తువులను అందిస్తోంది. తన బాధలన్నింటినీ ఏకరువు పెట్టి చివరగా అన్నాడు దేవరాజు బతిమాలుతూ.

"నీకు దండం పెడతా యాదన్నా! ఇక్కడుంటే నేను బతుకను. నన్ను ఎట్లయినా చేసి మస్కట్ పంపించు. నా పొలం, ఇల్లు కుదువ బెట్టుకో. లేదంటే వాటిని కొనుక్కో. వాటిని అమ్మి నీకు డబ్బులు ఇస్తుంటిగానీ అప్పులవాళ్లు బతకనీయరు. వాటిని నువ్వు కొన్నట్టు, నేను మస్కట్ వెళ్తున్నట్టూ ఎవరికీ తెలియకూడదు. తెలిస్తే అప్పులు కట్టి ఊరినుండి కదులమంటరు"

తాగుడు అలవాటు లేకపోవడంతో తొందరగానే కైపెక్కింది దేవరాజుకు. ఏం మాట్లాడుతున్నాడో కూడా తెలియడంలేదు. చెప్పిందే పదిసార్లు చెబుతున్నాడు. మధ్య మధ్య ఏడుస్తున్నాడు.

యాదగిరి అతడి మాటలను శ్రద్ధగా వింటున్నాడు. ఒకసారి దేవరాజు ఆస్తినంతా లెక్కగట్టాడు. ఇల్లు, పొలం కలిపి లక్ష రూపాయలు విలువ చేస్తాయి. విసాకు అరవైవేలు పోగా నలభైవేయిల లాభం. కొద్దిసేపు ఆలోచించి వాటిని కొనడానికి ఒప్పుకున్నాడు. అప్పటికి దేవరాజు బాగా తాగి ఉన్నాడు. ఏదేదో వదురుతున్నాడు. రెండుసార్లు లేచి యాదగిరి కాళ్లపైబడి ఏడ్చాడు. అప్పులవలన తను ఎలా సతమతమవుతున్నది మళ్ళీ ఒకసారి తడబడుతున్న గొంతుతో వినిపించాడు.

తాగడం పూర్తయ్యాక తూలుతూ లేచాడు దేవరాజు. అడుగులు తడబడుతున్నాయి. కళ్ళు మూసుకుపోతున్నాయి. యాదగిరి మాత్రం మామూలుగానే ఉన్నాడు. దేవరాజును చూస్తుంటే అతడికి నవ్వు పుట్టుకొస్తోంది. "మిగిలిన విషయాలు రేపు మాట్లాడుకుందాం. ఇంటికి వెళ్లు" అన్నాడు యాదగిరి. దేవరాజు వెళ్ళలేదు. చెప్పినా వినకుండా ఏదేదో మాట్లాడుతున్నాడు. అతడి పరిస్థితిని చూసి సుశీలకు బాధ కలిగింది. భర్తపై కోపం వచ్చింది. 'అతడిని ఇంటికి పంపించండి' అని భర్తకు సైగ చేసింది. అతికష్టంమీద అతడిని ఒప్పించి బయటకు తీసుకునివచ్చాడు యాదగిరి.



"వదినె ఒక్కదానికి వచ్చిపోయే చుట్టాలతో ఇబ్బందిగా ఉంటది. నేను వచ్చానని తెలిస్తే ఎక్కడెక్కడివారో వస్తారు. వంట చేయడం కష్టమైతది. రేపు పద్మను పంపించు. వంటావార్పులో సహాయం చేస్తది. అన్నం ఇక్కడనే తింటది. మీ కష్టం నేనేం మరిచిపోను. ఏదో రూపంలో ఇస్తాను" అతడిని వెళ్ళమని చెబుతూ అన్నాడు యాదగిరి.

"అన్నా... నువ్వు దేవుడివి. అలా అనకూడదు. అదెంతపని. మా కష్టం మరిచిపోనంటావేంటి? రేపు పొద్దున్నే పంపిస్తా. దానికి ఇంటి వద్ద ఏంపనిలేదు. ఇంకా వేరే పనులేవైనా ఉంటే నాకు చెప్పు. చేస్తడో లేదో అనుకోకు. నీ చెప్పులు మోసుకురమ్మన్నా మోసుకస్త. నువ్వు అన్నవు. నేను తమ్ముణ్ణి. నీకు ఏంచేసినా తప్పులేదు" చేతులు అడ్డంగా ఊపుతూ అన్నాడు దేవరాజు.

"పనివుంటే చెప్పనురా? చెబుతానుగానీ నీ భార్య చదువుకున్న పిల్ల. నీ మాట వింటదో వినదో! మా గురించి మీరు గొడవ పెట్టుకోకండి. దానికి ఇష్టం ఉండి వస్తేనే సరి. బలవంతమేంలేదు. ఇట్లా ఎందుకంటున్నానంటే ఇంతకుముందే సుశీలక్క రమ్మన్నదని నేను చెప్పాను. అయినా రాలేదు. దానికి ఇలాంటి పనిచేయడం ఇష్టం లేనట్టుంది" చిన్న చురకను అంటిస్తూ చెప్పాడు యాదగిరి.

ఏదో అన్యాయం జరిగిపోయినట్టు ఉగ్రరూపం దాల్చాడు దేవరాజు."దాని సంగతి తేలుస్తానుండు. మీ ఇంట్లో పనిచేయడానికి దానికి ఇష్టం లేదా? నువ్వు రమ్మని చెప్పినా రాదా? "అనుకుంటూ తూలుతూ వెళ్ళిపోయాడు.

యాదగిరి నవ్వుకుంటూ ఇంట్లోకి నడిచాడు. సుశీలకు మాత్రం బాధ కలిగింది. భర్త ఇంట్లోకి వచ్చాక నొచ్చుకుంటున్నట్టుగా అంది.

"ఏంటండి! ఆయనతో అలా చెప్పారు. అలవాటు లేకుండా తాగించే తప్పు చేశారంటే మళ్లీ ఇదొకటి. ఇంటికివెళ్ళి తాగిన మైకంలో పద్మను ఏమంటాడో ఏంటో! ఆయన అసలే మొరటుమనిషి"

యాదగిరి అమాయకంగా మొహం పెట్టాడు. ఏదో ఒకటి చెప్పకపోతే బావుండదని ఆమెపై ప్రేమను నటిస్తూ చెప్పాడు. "ఏదోమాట వరుసకన్నాను. వీడు ఇంతగా ఫీలైపోతాడని నాకు తెలియదు. సుశీ! నువ్వు పొద్దంతా ఇంటిపని,వంటపనితో సతమతమవుతుంటే చూడలేకపోతున్నాను. రేపటినుంచి నన్ను చూడడానికి బంధువులు వస్తారు. వంటపని బాగానే ఉంటుంది. అందుకే అలా చెప్పాను"

భర్త మాటలకు లోలోపల మురిసిపోయింది సుశీల. అతడు తనమీద చూపిస్తున్న ప్రేమకు సంతోషం వేసినా, పద్మ గుర్తుకు రాగానే మనసు బాధతో మూల్గింది. దేవరాజు మొండిమనిషి. పైగా తాగిన మైకంలో ఉన్నాడు. చేయి చేసుకోడు గదా అనుకుంది. పద్మ తెలివైనది. ఎప్పుడెలా మాట్లాడాలో తెలుసు. దేవరాజు పరిస్థితిని గమనించి అంత దూరం రానివ్వదన్న ఆలోచన కూడా వచ్చింది. ఏదిఏమైనా అతడికి తాగించి తన భర్త తప్పుపని చేశాడనుకుంది.

యాదగిరికి మాత్రం ఆనందంగా ఉంది. దేవరాజును అడ్డం పెట్టుకుని పద్మను లొంగతీసుకోవచ్చు. అతడిని మస్కట్ పంపి ఇల్లు, పొలం స్వాధీనం చేసుకోవచ్చు. డబ్బు ఆశ చూపి పద్మను తనకు అనుకూలంగా మార్చుకోవచ్చు. అతడిలోని మూర్ఖత్వం మరోసారి నిద్రలేచింది. భర్త మనసులో ఏముందో తెలియని సుశీల అతడివైపు అనురాగంగా చూస్తూ మరోసారి దేవరాజుకు తాగించకూడదని చెప్పాలనుకుంది.

తూలుతూ ఇంటికి చేరుకున్నాడు దేవరాజు. తలుపులు మూసివున్నాయి. అప్పుడే




వారు నిద్రపోతున్నారనుకున్నాడు. కోపంగా తలుపులు బాదుతూ పద్మను పిలిచాడు. పద్మ తలుపు తెరిచేసరికి కొద్దిగా లేట యింది. ఒక్కసారిగా వెగటువాసన గుప్పు మంది. ఆశ్చర్యంగా నోరు తెరుస్తూ అలాగే నిలబడిపోయింది.

తూలుతూ ఇంట్లోకి అడుగుపెట్టాడు దేవ రాజు. "ఏమిటే! ఇప్పుడే నిద్రపోయారు. అంత కష్టం ఏంచేశారని నిద్రముంచుకొ చ్చిందే! సుశీల చూడు ఇంకా మెలకువతోనే ఉంది." పద్మ వైపు కోపంగా చూస్తూ అన్నాడు దేవరాజు. అతడి మాటలు ముద్ద ముద్దగా ఉన్నాయి. తాగి ఉన్నాడని గ్రహిం చింది పద్మ. అతడు ఎక్కడ తాగాడో కూడా తెలిసిపోయింది. తను ఏం మాట్లాడినా అతడు మరేదో అంటాడని మౌనంగా లోప లికి వెళ్లింది పద్మ.

ఆమె మౌనం దేవరాజులో మరింత కోపాన్ని పెంచింది. తులూతూ ముందుకు పడబోయి గోడను పట్టుకున్నాడు. పద్మవైపు అసహనంగా చూసి చేతిని పట్టుకుని వెనక్కి లాగాడు. అడ్డం పడబోయి నిలదొక్కుకుని భర్తవైపు భయంగా చూసింది.

"ఏమే! నా మాటంటే నీకు అంత అలుసా? ఇప్పుడే పడుకున్నావేంటంటే జవాబు చెప్పవేం. ఒళ్లు పొగరెక్కిందా? యాదన్న రమ్మన్నడట. ఎందుకు వెళ్ళ లేదే? ఆయన ఎవరనుకున్నావే! నాకు అన్న. అంటే దేవుడు. ఇప్పుడు ఆయనే మనకు దేవుడు. ఆయన చల్లగా చూస్తేనే మనకు బతుకుదెరువు. యాదన్న కన్నెర్ర జేస్తే మనం మాడి మసైపోతామే!" అరుస్తు న్నట్టుగా అన్నాడు దేవరాజు.

నర్సవ్వ గాఢనిద్రలో ఉంది. గురక సన్నగా వినపడుతోంది. ఆమె ఎక్కడ నిద్ర లేస్తుందోనన్న భయం పట్టుకుంది పద్మకు. అత్త లేవకముందే భర్తను సముదాయించి పడుకోబెట్టాలనుకుంది.

"ఏంటీ... అట్ల అరుస్తున్నవేంది. అత్త లేస్తే తిడుతది. ఇంతవరకు తాగుడు లేకుండె. ఇప్పుడు ఇది కూడా అలవాట యిందా? సుశీలక్క రమ్మన్నదట. కానీ చీక టి పడిందని వెళ్ళలేదు. రేపు పొద్దున్నే వెళ్ళి కలిసివస్తాను. నువ్వు పడుకో. ఆమె లేస్తే బయటకు వెళ్ళగొట్టి తలుపేస్తది" అతడిని సముదాయిస్తున్నట్టుగా అన్నది. ఆమెకు దుఃఖం ఆగడంలేదు.

"లేస్తే లేవనీ. అది లేస్తే నాకు భయమా? లేచి నన్నేం జేస్తదే. నన్ను ఎవ్వరూ ఏం చెయ్యలేరు. నేను పనిచేస్తలే నని ఊరకే తిరుగుతున్నానని మీరు నన్ను చులకన చేస్తున్నరు. గంజిలోని ఈగలెక్క తీసిపారేస్తున్నరు. ఒక్క నెలరోజులాగండి. నేను మస్కట్ వెళ్తాను. అదీ ఎవ్వరికీ తెలి యకుండా వెళ్తాను. ఐదేండ్లవరకు రాను. యాదన్నకంటే ఎక్కువ సంపాదిస్త. అప్పు డుగానీ మీరు నాకు విలువనివ్వరు" గట్టిగా అరిచాడు.

ఆ అరుపులకు చిన్నకూతురు నిద్రలేచి కెవ్వుమని అరిచి ఏడుపు అందుకుంది. పద్మ కూతురు వద్దకు వెళ్ళింది. నర్సవ్వకు అప్పుడే మెలకువ వచ్చింది. కొడుకు అరు పులు విన్నది. ఎన్నడూ అతడు అలా అరిచి ఎరుగడు. ఏం జరిగిందోనని కంగారుగా లేచివచ్చింది. దేవరాజు మాటతీరు మొదట అనుమానాన్ని కలిగించింది. దగ్గరికి వెళ్ళాక విస్కీవాసన గుప్పు మనడంతో ఆమె అను మానం నిజమయింది.

కొడుకు తాగివచ్చాడని తెలిశాక నర్సవ్వ గుండె దడదడలాడింది. 'నీ తలపండు పగుల. అడ్డమైనోని సోపతి పట్టి తాగుడు నేరుస్తున్నావురా. నీ బతుక్కు అదొక్కటే తక్కువైందారా' అంటూ బావి వద్దకు నడి చింది. కుండనిండా నీళ్లు తెచ్చి అతడి నెత్తి మీద కుమ్మరించింది.

దేవరాజు కోపం చల్లారిపోయింది. రెండు నిమిషాల్లో మత్తు పూర్తిగా దిగిపోయింది. బట్టలన్నీ తడిసి వణుకు మొదలయింది.



ఉలుకూ పలుకూ లేకుండా మౌనంగా ఉండి పోయాడు.

"ఏంటిరా దేవీ! ఇదివరకే అప్పులతో ఆగమైపోయాం. ఇప్పుడు నువ్వు మరింత ఆగం చెయ్యవడితివి. ఉండాలెనా ఎక్కడికైనా పోవాలెనా చెప్పురా! నీకు ఇదేం పోయేకాలంరా! తాగుడంటే తెలియనోడివి ఎట్ల తాగుతున్నవురా! యాదిగాని సంగతి నీకు తెలియదురా! వాడు పెద్దదొంగ. నిన్నూ, నీ సంసారాన్ని నాశనం చేస్తడు. నువ్వు పిచ్చి పట్టినట్టు వాని వెంట తిరుగుతున్నవు. మళ్లీ ఈసారి నువ్వు వానింటికిపోయినా, వాడు నీ ఇంటికి వచ్చినా చెప్పులదండ మెడకు వేస్త. నీకు కూటికే గతిలేదు. తాగి తందనాలాడితే డబ్బు యాడికెళ్ళి తెస్తాననుకుంటున్నావురా! రేపు పొద్దున వానింటికి పోయి దుమ్ము దులిపివస్తా!" కోపంగా అన్నది నర్సవ్వ.

దేవరాజు నోరు విప్పలేదు. మౌనంగా బట్టలు మార్చుకున్నాడు. తడిసిన బట్టల్ని పిండి ఆరవేశాడు. తువ్వాలుతో తలను తుడుచుకున్నాడు. పద్మ కూతురును పడుకోబెట్టి అలాగే పడుకుంది. నర్సవ్వ కొడుకును తిడుతూనే ఉంది. ఇవేవీ పట్టించుకోకుండా ఏదో గుర్తుకు వచ్చినట్టు ఇనుపపెట్టె వద్దకు వెళ్ళి తెరిచాడు దేవరాజు.

పెట్టెలో ఉన్న బట్టల్ని పక్కన బెట్టి అడుగున చూశాడు. వెదుకుతున్న వస్తువు కనిపించలేదు. గాబరా మొదలయిందతనికి. బట్టల్ని దులిపి వెదకడం మొదలెట్టాడు. అతడిలో క్షణక్షణానికి ఆందోళన అధికమైంది. బట్టల్ని దూరంగా విసిరికొట్టి ఇనుపపెట్టెను బోర్లించి చూశాడు. అతడు ఏ వస్తువుకొరకు వెదుకుతున్నాడో ఇద్దరికీ అర్థమైపోయింది. మౌనంగా ఆలోచిస్తూ పడుకున్నారు.

కొద్దిసేపు వెదికి లేచి నిలబడి తల్లివైపు చూసి ఆందోళనగా అడిగాడు. "అవ్వా! నా పాస్‌పోర్ట్ ఇందులో పెట్టాను. కనబడుత లేదు. ఎవలన్నా తీసినారా"

"ఆc... తీసిన. తీసి నువ్వు ఎప్పుడు అడుగుతావోనని దాచిపెట్టిన. ఇంట్లో నాకేం పనుంది. నీ పాస్‌పోర్ట్‌ను చూసుకుంటూ కూర్చోవడమే! అది తీసిననాటినుండే ఆగమైపోయినవు. వద్దు వద్దన్నా వినక అప్పుడు రెండు, మూడువేలు నాశనం జేస్తివి. ఏపని చక్కగా చేసినవు. ఇద్దరు పిల్లల తండ్రివైనా నీకు బుద్ధి రాకపాయె. ఇప్పటికీ అగాదంగానే రోడ్లవెంట తిరుగవడితివి" కోపంగా అన్నది నర్సవ్వ.

దేవరాజుకు భయం పట్టుకుంది. పాస్‌పోర్ట్ మిస్సయితే తను మస్కట్ వెళ్లలేడు. మళ్ళీ కొత్త పాస్‌పోర్ట్ కొరకు దరఖాస్తు చేయడం, ఎంక్వయిరీ, ఈ పనులన్ని పూర్తయ్యేవరకు రెండు నెలలు గడుస్తాయి. అప్పటికి వీసాలన్ని అమ్ముడుపోతాయి. కొద్దిసేపు ఆలోచించి దీపం పట్టుకుని ఇల్లంతా వెదికాడు. పాస్టపోర్ట్ నిజంగానే దొరకకపోతే ఎంత బావుండుననుకుంటున్నారు అత్తా, కోడళ్లు. దేవరాజుకు మాత్రం ఏడుపు ముంచుకొచ్చింది.

పాస్టపోర్ట్ కొరకు ఎంత కష్టపడింది గుర్తుకొచ్చిందతనికి. రెండు రోజులు స్కూల్‌కు వెళ్ళి పుట్టినతేదీ, సర్టిఫికెట్‌ను రాయించుకుని హైదరాబాద్ వెళ్ళాడు దేవరాజు. ఫారం కొనుక్కుని బ్రోకర్‌కు ఇస్తే నింపడానికే మూడువందలు తీసుకున్నాడు. పుట్టినతేది సర్టిఫికెట్ చెల్లదని డి.ఇ.ఓ. అటెస్టెడ్ కావాలని చెప్పాడు ఆఫీసర్. అక్కడే బ్రోకర్‌ను పట్టుకుని కోర్టునుండి పుట్టిన తేది సర్టిఫికెట్‌ను తీసుకుని అప్లయ్ చేసి ఇంటికివచ్చేసరికి నాలుగురోజులు గడిచాయి. రెండువేల రూపాయలు ఖర్చయింది.

మధ్యలో ఎంక్వయిరీకి అంటూ పోలీసు వచ్చాడు. అతడు ఇంటికి వస్తేనే భయం పట్టుకుంది. వచ్చిన విషయం చెప్పి ఐదు వందలు అడిగాడు. తాను తప్పుడు రిపోర్ట్





ప్రాస్తే పాస్‌పోర్ట్ రాదని బెదిరించాడు. బతిమాలి మూడు వందలిచ్చి పంపించాడు దేవరాజు. నెలా పదిహేనురోజుల తర్వాత పాస్‌పోర్ట్ వచ్చింది. దానిని అందుకున్ననాడు అతడి ఆనందానికి హద్దులేకుండాపోయింది. ఆనాటినుండి ప్రతీరోజు ఒక్కసారైనా దాన్ని చూడకుండా ఉండలేకపోయాడు. అపురూపంగా దాన్ని చూసుకుంటూ పెట్టెలో భద్రంగా దాచుకుంటున్నాడు.

భార్యో, తల్లో తీసి దాచిపెట్టలేదుకదా అన్న అనుమానం కలిగిందతనికి.

అతడి ఆందోళనను గమనించి పెదవి విప్పింది పద్మ. "పాస్‌పోర్ట్ ఎక్కడికీ పోదు. తెల్లవారినంక చూసుకోరాదా! ఇప్పుడే విమానం ఎక్కుతున్నట్టు చేస్తున్నవు. ఎక్కడ పెట్టినవో గుర్తుకు తెచ్చుకో. మళ్ళీ ఎక్కడి వస్తువులు అక్కడనే పెట్టు. ఇల్లన్ని బట్టలు పరిచి అంగడి చెయ్యకు".

పట్టువదలకుండా వెదుకుతున్నాడు దేవరాజు. అరగంట ప్రయత్నం తర్వాత పాస్‌పోర్ట్ దొరికింది. అప్పుడుగానీ దేవరాజు మనసు కుదుటపడలేదు. పాస్‌పోర్ట్‌ను తెరిచి తృప్తిగా తన ఫోటోను చూసుకున్నాడు. దానిని కళ్ళకద్దుకున్నాడు. బట్టలన్నీ పెట్టెలో సర్ది పాస్ట్‌పోర్ట్‌ను కూడా అందులో దాచి పెట్టి మూతపెట్టి మూలకు భద్రపరిచాడు.

అతడు వెదుకుతున్నంతసేపూ గొణుగుతూనే ఉంది నర్సవ్వ. యాదగిరిని శాపనార్థాలు పెడుతోంది. పద్మ మౌనంగా పడుకుంది. ఆమెకు నిద్ర రావడంలేదు. కూతురు ఉలిక్కి పడుతున్నప్పుడల్లా జోకొడుతోంది. దేవరాజు గొంగడి అందుకుని దులిపి కిందపరిచి నడుము వాల్చాడు. అతడు పడుకుంటున్నాడని తెలిశాక నీరసంగా అన్నది పద్మ.

"గిన్నెలో అన్నమున్నది. పెట్టుకుని తిను. పొద్దటినుండి తినకనేపోతివి. ఇప్పుడు మళ్ళీ వట్టి కడుపుతోనే పడుకోవడితివి. నీకొరకన్ని బీరకాయ కూర వండిన"

అటునుండి ఇటువైపుకు తిరిగి తలెత్తకుండానే "ఆకలిగా లేదు" అంటూ పడుకున్నాడు దేవరాజు. వారిద్దరి మాటలు విన్నది నర్సవ్వ. ఆమెకు కడుపులో దేవినట్టయింది. 'ఈ పిచ్చిపిల్లకు వాడంటే ఎంత ప్రేమ ఉంది. ఆ పిచ్చోడు దాన్ని మనిషిలెక్కన కూడా చూడడు. దీనికి ఎందుకంత వెర్రి ప్రేమ' అనుకుంది.

దేవరాజు మాటలు విన్నాక పద్మకు ఆకలి గుర్తుకు వచ్చింది. భర్త ఆకలితో వస్తాడని అతడికొరకు అన్నాన్ని కాపాడి తాను మంచినీళ్ళతో కడుపు నింపుకుంది. లేచి అన్నం తిందామనుకుంది. 'పెద్దకూతురు' గుర్తుకు రాగానే ఆ ప్రయత్నం మానుకుంది. పొద్దున లేవగానే అన్నం అంటూ కంచం పట్టుకుంటుందామె. కూతురుకు నిద్రాభంగం కాకుండా లేచివెళ్ళి అన్నాన్ని కూరను ఉట్టిమీద పెట్టి వచ్చింది.

తెల్లవారాక ఎవరూ ఎవరితో మాట్లాడుకోవడంలేదు. దేవరాజు కాలుగాలిన పిల్లిలా ఇంట్లోకి, బయటకు తిరుగుతున్నాడు. అతడిని ఒక కంట గమనిస్తూనే తన పనిలో మునిగిపోయింది పద్మ. మస్కట్ పేరు చెప్పి ఏజంట్‌లు ప్రజలను ఎలా మోసం చేస్తున్నారో ఆలోచిస్తోంది. అరవైవేల రూపాయలు వడ్డీకి అప్పు తెచ్చి ఏం సంపాదిస్తారో అర్థం కావడంలేదు ఆమెకు. అదే అరవైవేలతో ఇక్కడే ఏదో వ్యాపారం చేసుకుని బతుకవచ్చునన్నది ఆమె అభిప్రాయం.

కొందరైతే తులం బంగారానికి తులంనర చొప్పున ఏడాదిలో చెల్లించే విధంగా బంగారాన్ని అప్పు తీసుకుపోతారు. రెండు మూడేండ్లు వెట్టిచాకిరి చేసి అప్పు ఇచ్చినవారినే అభివృద్ధి చేస్తారు. మస్కట్‌నుండి వచ్చాక తమ ఉనికిని చాటుకోవడానికి పండుగలు చేస్తూ మళ్ళీ అప్పు చేస్తారు. ఎప్పుడూ తన చుట్టూ ఉన్నవారితోనే పోల్చు

కుని తన గొప్పతనాన్ని ప్రదర్శించడానికి ప్రయత్నిస్తారు. కానీ ఆ ఆలోచనల్లోంచి బయటపడి పొదుపు చెయ్యరు అనుకుంది.

'పద్మా' అన్న పిలుపుతో తేరుకుని వెనక్కి తిరిగి చూసింది పద్మ. 'నిన్ను సుశీలక్క రమ్మన్నది. ఏదో పని ఉందట' ఎటువైపో చూస్తూ చెప్పాడు దేవరాజు.

అదే అవకాశంగా తీసుకుని 'నిన్న మా నాన్న వచ్చిండు. గొల్లపెల్లికాడ మా తమ్ముని పిల్లను చూస్తరట. ఈరోజు మనలను రమ్మన్నాడు' అని చెప్పింది.

ఆమెవైపు కోపంగా చూశాడు దేవరాజు. అతడికి ఇష్టంలేదని గ్రహించింది పద్మ. ఏమంటాడో అనుకుని అతడివైపు ఆసక్తిగా చూసింది. "మీ నాన్న వస్తే నన్ను కలిసి చెప్పిండా? నీకు చెప్పాడు. నువ్వే వెళ్లు. నా ఇంటికి వచ్చి నాకే చెప్పకపోతే నేను ఎలా వెళ్ళాలి!" నిష్టూరంగా అన్నాడు దేవరాజు.

అప్పుడే అక్కడికి వచ్చింది నర్సవ్వ. కొడుకు మాటలకు కోపగించుకుంది. అతడు చాలా సేపటివరకు ఎదురుచూశాడని చెప్పింది. దేవరాజు వినిపించుకోలేదు. తను రాలేనని ఖచ్చితంగా చెప్పి బయటకు వెళ్ళిపోయాడు.

ఇప్పుడు అలాగే అంటాడు. తీరా బస్ టైంకు వచ్చి తొందర పెడతాడు అనుకుని బట్టలు సర్దుకుని పిల్లలను రెడీచేసి తాను రెడీ అయికూర్చుంది పద్మ. రెండు బస్‌లు వెళ్లిపోయాయి. దేవరాజు రాలేదు. ఇక వెళ్ళేందుకు వీలులేదని నిర్ణయించుకున్నాక నిరాశతో బాధపడుతూ ఇంటిపనిలో మునిగిపోయింది. నర్సవ్వ పద్మను ఒక్కదాన్నే వెళ్ళమని బలవంతం చేసింది. ఆమెకు ఒంటరిగా వెళ్ళడం ఇష్టంలేదు. అందుకే ఒప్పుకోలేదు.

ఎక్కడెక్కడో తిరిగి సాయంత్రం ఇంటికి వచ్చాడు దేవరాజు. వస్తూనే తాను రేపు హైదరాబాద్ వెళ్తున్నట్టు తల్లితో చెప్పాడు. అతడి మాటలు ఎవరూ పట్టించుకోలేదు. కోపంతో ఎవరూ మాట్లాడలేదు. ఎవరితోనో మాట్లాడుతున్నట్టుగా తను మెడికల్ టెస్ట్ కొరకు వెళ్తున్నానని రెండు మూడు రోజుల వరకూ రానని చెప్పాడు.

దేవరాజు తెల్లవారగానే ఎవరికీ చెప్పకుండా బయల్దేరాడు. అతడి వెంట మరో వ్యక్తి ఉన్నాడు. హైదరాబాద్‌లో ఏదో పని ఉంటే వెళ్తున్న వ్యక్తికి అడ్రస్ ఇచ్చి ఆ అడ్రస్ వద్ద దేవరాజును దింపివెళ్ళమని చెప్పాడు యాదగిరి. అతడు సరేనన్నాడు. తాను మెడికల్ టెస్ట్ కొరకు వెళ్తున్నానని ఎవరితో చెప్పలేదు దేవరాజు. నిజానికతడు మెడికల్ టెస్ట్ కొరకు వెళ్ళడంలేదన్న విషయం అతడికే తెలియదు. అతడి అమాయకత్వానికి నవ్వుకున్నాడు యాదగిరి.



ఏదో పనిమీద బయటకు వెళ్తున్న నర్సవ్వ దూరం నుండి కూతురు రావడం చూసి నవ్వుతూ ఎదురెళ్లి పలకరించింది. వనజ మాత్రం పొడిపొడిగా రెండు మాటలు మాట్లాడి మొహం ముడుచుకుని ముందుకు కదిలింది. ఎప్పుడు వచ్చినా ఆప్యాయతగా ఆలింగనం చేసుకుని ఆరోగ్యం ఎలా ఉందని అడిగే కూతురు మొహంలో ముందటి ఉత్సాహం లేకపోవ

దంతో కంగారుపడింది నర్సవ్వ. కూతురు వెంట నడుస్తూ మెల్లిగా అడిగింది.

"ఏంది బిడ్డా! ఇలా చెప్పా చేయకుండా వచ్చినవు. అల్లుడేడీ? పిల్లలు కూడా రాలేదు. అంత బాగేగదా? "

"ఏం బాగుంది? ఇస్తే వియ్యం, కొడితే కయ్యం. నేను కారటు రాసిన. మీకు ముట్ట లేదా? తియ్యటి మాటలు చెప్పి అప్పు తీసుక వస్తిరి. తిరిగి చెల్లించకపోతిరి. ఆ నల్ల మొకుపోడు ఎక్కడున్నాడు! అక్కరున్న ప్పుడు చెల్లె చెల్లె అని చుట్టు తిరిగాడు. ఇప్పుడు అటువైపు వస్తనేలేడు" కోపంగా అంటూ ఇంట్లోకి ప్రవేశించింది వనజ.

ఆడకూతురును చూసి చేతుల్లో ఉన్న పనిని విడిచిపెట్టి నవ్వుతూ ఎదురు వచ్చింది పద్మ. ఆమెను చూడగానే మూతి విరిచింది వనజ. ఆమె రాసిన ఉత్తరం గుర్తుకు వచ్చి క్షణకాలం కలవరపడినా నవ్వును మొహాన పులుముకుని అడిగింది పద్మ.

"బాగున్నవా వదినే! అన్నా పిల్లలు ఎవ్వరు రాలేదేంటీ? అన్న మస్కట్ ఎప్పుడు పోతుండట"

"అవ్వా, అన్నా మతిమరుపు మనుషులు. వాళ్లకు తెలియకపోతే నీకన్నా తెలువదా? అప్పు తెచ్చిన జాగల మల్లా కట్టిరావాలని చెప్పవా? " మంచంలో కూర్చుంటూ కోపంగా అడిగింది వనజ.

పద్మకు ఏం మాట్లాడాలో తెలియలేదు. మౌనంగా ఉండిపోయింది.

కూతురు పక్కన కూర్చున్న నర్సవ్వ ఆమెను శాంత పరచాలని పెదవి విప్పింది. "కారటు ముట్టింది బిడ్డా! ఇక్కడగూడా బాకీ లన్నీ మెడమీద ఉన్నట్టున్నాయి. ఎక్కడా బాకీ పుడుతలేదు. పొలం అమ్మినంక తీసు కత్తనని ఆగి పోయిండు. నేనైతే పొలం అమ్ముడెందుకు? చెల్లెనే మూప్పై నలుపైవే యిలు బాకీ అడుగు అని అన్నకు చెప్పిన. వాడే వద్దన్నడు"

తల్లివైపు కోపంగా చూస్తూ అన్నది వనజ. "నీకేందే? ఉద్దెరంటే ఊర్లుకొం టావు. బాకీ అంటే భయంలేదు. మీకు అప్పు ఇచ్చినందుకు నన్ను ఎంతో బాధ పెడుతుండు. అప్పుడెప్పుడో రెండేండ్ల కింద ఆయన మస్కట్ నుండి రాకముందు తీసు కున్న బాకీ! వచ్చేలోపే ఆయనకు తెలియ కుండా ఇయ్యుమని చెప్పిన. మిమ్మల్ని మిత్తి ఇయ్యుమన్ననా? అసలుకసలు ఇయ్యుమన్న. ఇప్పుడు ఆయనకు తెలిసి పోయే. ఇంతకు ముందు ఎన్నిసార్లు ఇచ్చినవు అని నన్ను తైతక్కలాడియ్యవట్టె!"

నర్సవ్వ కూతురువైపు బాధగా చూసింది. దుఃఖం పొంగివస్తోంది. ఆపదలన్నీ చెప్పు కుని ఊరట పొందుదామనుకుంటే కూతురు అలా రుసరుసలాడడం ఆమెను బాధకు గురిచేసింది. దుఃఖాన్ని మింగుకుని నేల మీద గీతలు గీస్తూ చెప్పింది గద్గదంగా "అన్న ఊరికి పోయిండు. వచ్చాక మాట్లా డుదాం. ఎక్కడైనా బాకీ తెచ్చి ఇస్తాం. ఇవ్వ కపోతే మాటరాదా? "

"అన్న వచ్చి ఏం చేస్తడే! చెట్టుకు కాసినయా! తెంపుకస్తడనడానికి. మీకు ఎన్న టినుండో చెబుతున్న. ఆయన రాకముందే ఇవ్వండి అని. అన్ని లెక్కలు చూసుకుని ఫలానా డబ్బు ఏమైందని ఖచ్చితంగా అడిగె. చెప్పితే ఇంకెన్ని ఇచ్చినవో అని తిట్ట వట్టె, కొట్టవట్టె. మీరు ఈ అప్పు విషయం మరిచిపోతిరి. ఏం చేస్తరో చెయ్యండి. నేను రేపు పొద్దున బస్సుకు వెళ్తా. అప్పటిలోపు డబ్బు కావాలె" మరింతగా కోపం తెచ్చు కుంటూ అరిచింది వనజ.

ఏం మాట్లాడినా మరింతగా రెచ్చిపోతుం దని అక్కడినుంచి వెళ్లిపోయి తన పనిలో మునిగిపోయింది పద్మ. ఇరుగుపొరుగు వారెవరైనా వింటారేమోనన్న భయంతో కూతురును శాంతపరచాలని గొంతును దీనంగా మార్చి చెప్పింది నర్సవ్వ.

"అరుపులు ఎందుకు బిడ్డా! ఇవ్వనంటు

న్ననా. బాకీ తీర్చుడు తీర్చుడే! రేపేవెళ్తా కావాలంటే ఎట్ల. వాడు ఎప్పుడొస్తడో ఏమో! రెండు మూడు రోజులయిన ఆగితే ఏ అయ్య కాళ్ల మొక్కి అయినా డబ్బు నీకిస్త. ఆడపిల్ల దీవనా, ఆర్తివాని దీవన ఒక్కటె అంటరు. నిన్ను బాధ పెడతనా బిడ్డా!"

"బాధపెట్టవు... ఇయ్యవు. నువ్వు మంచి దానివైతే నా బాకీ ఎన్నడో తీరె! నేను అడిగే వరకు నీకు గుర్తుకురాలేదు. కింద మంటపెట్టి ఏర్పడకుండా మీద నీళ్ల జల్లుతవు. అందరు కట్నాలు కానుకలకొరకు కొట్లాడితే నేను ఇచ్చిన బాకీ కొరకు కొట్లాడుదుంది. అవ్వా! నువ్వు ఏమన్నజెయ్యి. రేపు పొద్దుగల్ల పైసలతోని నన్ను బస్సు ఎక్కియ్యి. రేపు డబ్బు తీసుకుని వెళ్లకపోతే నన్ను ఇంట్లకు రానియ్యడు" కచ్చితంగా చెప్పింది వనజ.

నర్సవ్వ ఆవేదన కోపంగా మారింది. తమ బాధలన్నింటినీ తెలిసి కూడా పరామర్శించడం పోయి పరాయివ్యక్తిలా నిలదీయడం సహించలేకపోయింది. కూతురు వైపు ఈసడింపుగా చూస్తూ అడిగింది.

"తల్లికి ధనముంటే బిడ్డ దొర్సానట. బిడ్డకు ధనముంటె తల్లి పనిమనిషిట. సామెత తప్పుపుట్ట లేదు బిడ్డా! ఇప్పుడు నా పరిస్థితి అలాగే ఉంది. నీకు ఎంత ధనముంటే నాకేంటి? పరాయి మనుషుల్ని నిలదీసి అడిగినట్టు అడుగవడితివి. నేను ఇక్కడ రోగాలతో సచ్చిపోతున్న ఒక్కసారన్నా అవ్వా ఈ నూరు రూపాయలు తీసుకొని మందులు కొనుక్కో అన్నవా? దవాఖానల సూపిచ్చినవా?

"ఎప్పుడు, నీ మొగుడు నీ పిల్లలేనాయే! నేను గూడా నిన్ను చిన్నప్పుడు గారాబంగా సాదిన. బిడ్డను కలిగిన ఇంట్లకు ఇస్తే ఆపదకు ఆదుకుంటుందని కడుపు కట్టుకుని కూడబెట్టిన డబ్బు సరిపోకపోతే అప్పుతెచ్చి నీ పెళ్లి చేసిన. నేను అప్పుడు ఎంతో బాధపడి ఉన్న ఇంట్లోకి ఇస్తేనేగదా నీకు ఈ రోజు ఇంత సిరి వచ్చింది. ఉన్నదున్నట్టు అంటే కోడలు ముందట పలుచనైపోతవని ఊరుకుంటున్నకానీ నా మనసులో ఎన్ని బాధలున్నాయో నీకేం తెలుసు!"

వనజ తల్లి మాటలకు మరింతగా రెచ్చిపోయింది. తన వద్దనే బాకీ తీసుకుని తీర్చకపోవడమే కాకుండా అలా మాట్లాడుతుంటే అవమానం జరిగినట్టుగా ఫీలయింది. వెంటనే కళ్లు నులుముకుంటూ ఏడుపు గొంతుతో అన్నది. "అయితే ఏం చేయాలంటవే! మొగన్ని విడిచిపెట్టి రమ్మంటవా? ఇల్లుకు ఇల్లు నీకెత్తియ్యమంటవా? ఆడపిల్ల సొమ్ముకు ఆశపడుతారె! బాకీ ఇచ్చి అడిగితే కోపమచ్చిందా? నన్ను నా మొగుడు ఎన్ని మాటలంటుండో నీకేం తెలుసు"

తను అలా మాట్లాడితే కూతురు కాస్తనైనా జాలిచూపుతుందనుకుంది. ఒకవేళ జాలి చూపకపోయినా మౌనంగానైనా ఉండిపోతుందనుకుంది. కానీ ఇలా ఏడుస్తూ మరింతగా అరుస్తుందని ఊహించలేదు. ఇంకేం మాట్లాడినా మరింత అల్లరి చేస్తుందని నోరు మెదపలేదు. ఇంట్లోంచి వచ్చి వనజను సముదాయించింది పద్మ. అర గంట శాపనార్థాల తర్వాత మరోసారి తన నిర్ణయాన్ని ఖచ్చితంగా చెప్పి శాంతించింది వనజ.

కూర వండడానికి నూనె లేకపోతే అరువుకని సుశీల వద్దకు వెళ్లింది పద్మ. యాదగిరి, సుశీల ఇద్దరే ఉన్నారు ఇంట్లో. బిడియపడుతూనే ఇంట్లోకి అడుగుపెట్టింది పద్మ. పద్మను చూడగానే నవ్వుతూ పలకరించింది సుశీల.

"ఏమయింది పద్మా! మా ఇంటివైపే వస్తలేవు. అంత తీరకుండా పని చేస్తున్నవా? దేవరాజుతోని రెండుమూడు సార్లు చెప్పిన. ఇంట్ల ఏదన్న ఆసరా అయితది రమ్మనమని. నువ్వు రానేలేదు" అడిగాడు యాదగిరి.

అత్తకు జ్వరం వచ్చిందని చెప్పి సుశీలతో





వంటింట్లోకి నడిచి అడిగింది పద్మ. "మా వదిన వచ్చింది. కూర వండుదామంటె నూనెలేదు. ఆయన వచ్చినంక తెప్పిచ్చి ఇస్త. రెండు పావుల మంచినూనె పొయ్యి"

"రెండు పావులుకాదు! నాలుగు పావులు తీసుకపో. మళ్లా నీకున్నప్పుడే తీసుకురా. వనజ ఎందుకచ్చిందట. అవ్వను చూసి పోదామని వచ్చిందా?" అడిగింది సుశీల.

"కాదు. రెండేండ్లకింద అత్తకి బాగలేక పోతే పదివేలు బాకీ తెచ్చినము. అది కట్టుమని ఒత్తిడి చేస్తోంది. ఇంట్లో కూర్చుండి ఏడుస్తోంది. రేపు పొద్దున వరకు అందాలె నట. ఇప్పటికిప్పుడు తీసుకరమ్మంటే ఎక్కడి నుండి తెచ్చేది" నూనెను అందుకుంటూ బాధగా చెప్పింది పద్మ.

"గోరుపోటు మీద రోకలి దెబ్బ అన్నట్టుంది. ఆమెకు ఇప్పుడే బుద్ధి పుట్టిందటనా? మొగనికి ఏదో విధంగా సర్ది చెప్ప లేదటనా? ఆయన మంచివాడే! ఇవన్నీ ఈమె మాటలే! అనవసరంగా ఆయన పేరు చెబుతుంది" తన అభిప్రాయాన్ని చెప్పింది సుశీల.

ఆ మాటలు వింటున్న యాదగిరి ఇంట్లోకి వెళ్లి పద్మను అడిగాడు. "ఎన్నివేలు బాకీ ఉన్నరు? ఆమె ముందే రోకలి బండలకు నార తీసే మనిషి. ఆమె దగ్గర తీసుకస్తరా? మనుషుల గుణాలు తెలుసుకుని మెదలుకోవాలె"

అంతవరకు తమ సంభాషణ యాదగిరి విన్నాడని తెలియగానే పద్మ మరింతగా బిడియ పడింది. పదివేలు అంటూ ముక్తసరిగా సమాధానం చెప్పి అక్కడి నుండి కదలబోయింది.

"ఇప్పుడు ఐదు వేలు ఇస్తాను. ఆమెకు ఇచ్చేయి. మిగిలిన డబ్బు నెల రోజుల్లో చెల్లిస్తానని చెప్పు. కొంతకాకపోయినా కొంతైనా రాబట్టాలని ఆమె అలా పట్టుపట్టింది. ఐదు వేలు ఇస్తే సంతోషంతో వెళ్లిపోతుంది" పద్మవైపు చూస్తూ అన్నాడు యాదగిరి.

అతడి మాటలకు పద్మతోపాటు సుశీల కూడా ఆశ్చర్యపోయింది. ఏదో మాట వరుసకు అంటున్నాడేమో అనుకున్నారిద్దరూ. వారు నమ్మకపోవడం గమనించి బీరువాలో నుండి నోట్ల కట్టల్ని తీసి అందిస్తూ అన్నాడు. "దేవరాజు పొలమూ, ఇల్లూ ఎలాగూ అమ్ముతానన్నాడు. వాడికి డబ్బు ఇవ్వాల్సిందేకదా? వచ్చాక మేమిద్దరం లెక్క చూసుకుంటాం. నువ్వు తీసుకెళ్లు. వాడే మైనా అంటే నేను మాట్లాడుతాను"

ఏం చెప్పాలో అర్థం కాలేదు పద్మకు. ఆ డబ్బును తీసుకుని వనజకు ఇచ్చి ఇప్పుడే వెళ్లిపో అని చెప్పాలన్నంత కసిగా ఉంది. కానీ అంత డబ్బు ఎవరి అనుమతి లేకుండా తీసుకోవడం ఆమెకు ఇష్టంలేదు. అందుకే నిరాకరిస్తూ అంది. "మీ తమ్ముడు వచ్చాకనే ఇవ్వండి. లేదంటే మా అత్తను తోలిస్త ఆమెకు ఇవ్వండి. వాళ్లకు తెలియకుండా నేను తీసుకపోయి ఇస్తే ఎప్పుడు ఏమాట వస్తదో ఏమో"

సుశీలకు కూడా ఇష్టంలేదు. భర్త దుబారా ఖర్చులు ఎక్కువగా చేస్తున్నాడని లోలోపల కోపంగా ఉందామెకు. చాలా రోజుల తర్వాత ఇంటికి వచ్చాడు. అందుకనే ఒత్తిడి చేయలేకపోతోంది. సలహా ఇస్తున్నట్టుగా మాత్రం అన్నది భర్తతో "అంత డబ్బు ఎలాగని తీసుకుంటది. దేవరాజు రాని. వచ్చినంక లెక్క చూసుకుందురు. చేను అమ్ముతనని వట్టి మాటలు అనగానే సరిపోతుందా? పాలివాళ్లు పక్కవాళ్లు అందరినీ అడుగవద్దా? తీరా కొన్న తర్వాత మాకెందుకు చెప్పలేదని బెదిరిస్తరు"

"ఎవలకిస్తే ఏముందే? పద్మ మాత్రం ఇచ్చిన తర్వాత ఇయ్యలేదంటదా? వాడి కంటే ఇదేనయం. ఆకలంత పోయినంక అన్నమెందుకన్నట్టు బాధలన్నీ పోయినంక బాకీలెందుకే? వాడు పట్నం వెళ్లాడు. ఎప్పుడు వస్తాడో తెలియదు. పెద్దవ్వకు ఇస్తుంటిని గని. ఆమె గుణం నాకు



నచ్చదు. ఎలాగో మాట్లాడుద్ది సూటిపోటి మాటలంటది. ఇందులో నాకేదో లాభం ఉన్దనుకుంటది. ఎవరేమనరు తీసుకో" అంటూ పద్మ చేయిలాగి డబ్బును చేతిలో ఉంచాడు.

పద్మకు అతడు చెప్పింది నిజమే అనిపించింది. భర్త ఎప్పుడు వస్తాడో తెలియదు. అత్త ముక్కుసూటి మనిషి. ఎప్పుడు ఎలా మాట్లాడుతుందో తెలియదు. ఆడకూతురు పట్టుదల గల మనిషి. రేపటికిగానీ డబ్బులు సర్దకపోతే ఎంత గొడవ చేస్తుందో తెలియదు. అందుకే డబ్బును తీసుకుంటూ యాదగిరితో అన్నది "ఐదు వేలకు రోఖా రాసుకో బావా! నేను సంతకం చేస్త. తమ్ముడు వచ్చిన తర్వాత సంతకం చెయ్యి మంట. ఏ లెక్కకు ఆ లెక్కనే ఉండాలే. చేను, ఇల్లు అంటె దాని లెక్క మీరే చూసుకొండి"

ఆమె మాటలకు ఫకాలున నవ్వాడు యాదగిరి. పద్మ చేయి వదలకుండానే భార్యవైపు తిరిగి అన్నాడు. "చూసినవా! ఇది ఎంత నీతిగల మనిషో! డబ్బు తీసుకోనేలేదు. రోఖా రాసిస్తనంటుంది. వాళ్లు ఈ మాత్రమైనా గంజిగటుక తాగుతున్నారంటే దీనివల్లనే" అంటూ పద్మ చేయిని వదలి ఆమెవైపు తిరిగాడు యాదగిరి.

"నువ్వు రోఖా మీద సంతకం చెయ్యనవసరంలేదు. నీ మీద ఆ మాత్రం నమ్మకం లేనిదే ఇస్తున్ననా? దేవరాజు వచ్చిన తర్వాత చూసుకుంటాం. నువ్వు వెళ్లు" అన్నాడు. డబ్బులు తీసుకొని వెళ్లిపోయింది పద్మ. సుశీల ముభావంగా ఉండిపోయింది.

పద్మ ఇంటికి వెళ్లేసరికి తల్లీకూతుళ్ల వాగ్వివాదం మళ్లీ మొదలయింది. "ఏం చెయ్యాలె బిడ్డా! అదృష్టం తక్కువ వుండి నీ దగ్గరికి అప్పుకు వచ్చిన. ఇంతగా ఒత్తిడి చేస్తావని తెలియదు. వాడురాని. వచ్చినంక మాట్లాడుదాం. కాళ్లుచేతులు కూలవడ్డాయి. నాకు అప్పు ఎవరిస్తరు" నర్సవ్వ అంటోంది.

"ఎవరు అప్పు ఇయ్యకపోతె ఇల్లును కుదువబెట్టు. ఎక్కడికన్నా వెళ్లి తీసుకురా! రేపటిలోగా ఇవ్వకపోతే మాత్రం నేను ఊర్కోను. ఏదో నవ్వులాటకంటున్నానను కుంటున్నావు నువ్వు. నాకు కోపం వస్తే ఏం చేస్తానో తెలియదు" తన నిర్ణయాన్ని ఏమాత్రం సడలించకుండా అన్నది.

పద్మ పొయ్యిలోని కట్టెల్ని ఎగదోసి అగ్గి రాజేసి మంట చేసింది. పది నిముషాల్లో కూరవండి భోజనానికి రమ్మని పిలిచింది వనజను.

"తిన్నట్టె ఉన్నది బతుకు. అప్పు ఇచ్చి అడగబోతే మీకు దుఃఖం రావట్టె. అడగ్గానే అప్పు ఇచ్చినప్పుడు మంచి మాట. ఇప్పుడు ఇయ్యిమని అడిగితె చెడ్డ మాట. రెండేండ్ల కొద్దీ అడుగలేదు. ఏం బాధలేదు. ఇయ్యాల్ల అడిగితె అన్నీ యాదికస్తయి. నాకు ఎంత బాధ ఉందో అర్థం చేసుకోరు. అక్కడ నా మొగడు నన్ను పెనం మీది పేలాలవలె ఎగిరిస్తుండు. మనసునొచ్చే మాట అననోడు మీ మూలంగా చెయ్యి చేసుకుంటుండు" లేవకుండానే అన్నది వనజ.

పద్మ వెంటనే ఐదు వేలు తెచ్చి వనజకు అందించి చెప్పింది. "ఈ ఐదు వేలు తీసుకో. మిగతా ఐదువేలు అన్న వచ్చిన తర్వాత తీసుకొస్తడు. లేచి కాళ్లుచేతులు కడుక్కొని భోజనం చెయ్యి. అవ్వమీద అలిగితే బువ్వ మీద అలుగుతరా? "

కాసేపు బెట్టుచేసినా చివరికి వారి మీద జాలితో ఒప్పుకుంటున్నానని బెట్టు సడలించి లేచింది వనజ. డబ్బును లెక్కపెట్టుకుని బ్యాగ్‌లో పెట్టుకుంది. నర్సవ్వకు మాత్రం అయోమయంగా ఉంది. అంత డబ్బు అప్పటికప్పుడు ఎలా వచ్చిందో అర్థం కాలేదు. ఎలాగైతేనేం కూతురు బాధ వదిలింది. ఎక్కడ తెచ్చిందో తర్వాత తనే చెబుతుంది అనుకుంది.

డబ్బుచేతిలో పడ్డాక నవ్వుతూ మాట్లాడ్డం మొదలెట్టింది వనజ. "అవ్వా ఇన్ని అప్పులు




ఎట్ల తీరుస్తరు. రెండుమూడేండ్లు గడిస్తే వడ్డీ ఎంతవుతుంది. చేసిన కష్టంతో అప్పు లోల్లనే సాదుడుగా వట్టె. తెచ్చుడేకాని ఇచ్చుడు లేదాయె. ఎట్ల బాగుపడుతారే" అడిగింది భోజనం చేస్తూ తల్లితో.

నర్సవ్వ విషాదంగా మొహం పెట్టి వేదాంత ధోరణిలో అంది "నెత్తి నిండా పేలుంటే దురద ఉండదట. ఊరునిండా అప్పులుంటె బాధ ఉండదట. సగం మునిగితె చలి ఉంటది. నిండా మునిగాక చలి ఎక్కడ ఉంటది. మేం నిండా మునిగాం. బతికినా దేవుని దయే సచ్చినా దేవుని దయే"

"మడుగులవడ్డ బర్రె మనిషికింత రుద్దినట్టు చస్తే చస్తిరిగని అప్పులోల్లను ముంచి చావకండి. తిట్టి శాపనార్థాలు పెడుతరు. కొంతలో కొంత అప్పుతీర్చుండి. తింటె గుట్టలాగయట. నువ్వు ఒక అంగన్‌బడి తెచ్చుకో నుంటివి. మా ఊరిలో ఇద్దరికి వచ్చినయి. మొన్నమొన్ననే పెళ్లయింది వాళ్లకు. నువ్వు కూడ కొంత చదివినవేమో కదా!" పద్మను ఉద్దేశించి అంది.

"ఏదైనా అదృష్టం కావాలి వదినా! పుట్టెడు ఆముదంల దొర్లితే పుట్టెడు అంటుతుందా? ఏదో అంటేంత అంటుతది. కిస్మత్ ఇట్లున్నది. ఇట్ల నడుస్తుంది" భోజనం వడ్డిస్తూ చెప్పింది పద్మ.

ఎంతగా వారించినా వినకుండా వనజ అదే రోజు సాయంత్రం వెళ్లిపోయింది. వెళ్తూ తల్లికి వంద రూపాయలు ఇచ్చింది. నర్సవ్వ తీసుకోలేదు. ఆ డబ్బుల్ని ఆమె చేతిలోనే ఉంచి పిల్లలకు పండ్లు కొనుక్కొని వెళ్లమని చెప్పింది. వనజ వెళ్లాక చాలాసేపటివరకు మామూలు మనిషి కాలేదు నర్సవ్వ. కన్నకూతురు అలా పరాయి వ్యక్తిలా ప్రవర్తించడం జీర్ణించుకోలేకపోయింది.

పద్మ బీడీలు చేస్తూ కూర్చుంది. ఐదువేల సంగతి చెబుదామని మర్చిపోయింది. కోడలే చెబుతుందని ఎదురు చూసింది నర్సవ్వ. ఆమె చెప్పకపోయేసరికి తనను నిర్లక్ష్యం చేస్తోందని మనసు చిన్నబుచ్చుకుంది. ఆ విషయం అంతటితో తేలిపోయేదే కాని యాదగిరి రావడంతో సీరియస్‌గా మారిపోయింది.

యాదగిరి వస్తూనే "వనజ వెళ్లిపోయిందా, డబ్బులు ఇచ్చావా" అంటూ పద్మను అడిగాడు. నర్సవ్వను పట్టించుకోలేదు. పద్మ వెళ్లి యాదగిరి దగ్గర అప్పు తెచ్చిందనుకుంది నర్సవ్వ. ఏం మాట్లాడక ముభావంగా ఉండిపోయింది. అప్పుడే బ్యాంకు వాళ్లు అప్పు తీర్చమని వచ్చారు. వారికి ఏదో సర్ది చెప్పి పంపించాడు యాదగిరి. పద్మ అతడివైపు కృతజ్ఞతగా చూసింది. నవ్వుకుంటూ వెళ్లిపోయాడు యాదగిరి. తాము పాము పడగ నీడలో ఉన్నామని గ్రహించింది నర్సవ్వ. ఆ పాము కాటు వేయకముందే అది పడగ నీడ అని తన వాళ్లు గుర్తించేలా చేయాలనుకుంది.

సాయంత్రం అవుతుండగా కూతుళ్లను అత్తకు ఒప్పగించి బయటకు వెళ్తుంటే ఎక్కడికని అడిగింది పద్మను నర్సవ్వ. సుశీల బియ్యం చేయడానికి పిలిచిందని, వెళ్తున్నానని చెప్పింది పద్మ. నర్సవ్వ మనసు కుతకుతలాడింది. కానీ వద్దని వారించలేకపోయింది.

"ఇంట్లో ఉండి నేనేం చేస్త. నేను గూడా వస్తాను. పదా!" అంటూ తలుపుకు గొళ్లెం వేసి ఆమె వెంట నడిచింది నర్సవ్వ మనుమరాండ్లతో.

తేపతేపకు ఏదో పనిమీద ఇంట్లోకి రావడం పద్మతో మాట్లాడడం చేస్తున్నాడు యాదగిరి. ఏవో జోకులు వేస్తూ నవ్విస్తున్నాడు. అతడి మాటలకు విరగబడి నవ్వుతోంది పద్మ. ఏవో పనులు పురమాయించి సుశీలను అక్కడ ఉండనివ్వడంలేదు. నర్సవ్వకు ఒళ్లంతా కంపరంగా ఉంది. కానీ ఏమీ అనలేకపోతోంది. ఎలాగో పొద్దు

గడిపి ఇంటికి చేరుకున్నారు.

"చెడి బతికిన నాడికి కూలీ పోకూడదట. పెండ్లాం చచ్చినవానికి మారుమానం పోగూడదట. తిన్న కాడికాయె. ఉన్నకాడి కాయె. ఇంకెవరికి కైకిలుపోయినా సరేగానీ మన సాటివాళ్ల ఇండ్లకు కైకిలుపోకు బిడ్డా! ముందు ముచ్చటాడుతరు. వెనుక వెక్కిరి స్తరు" హెచ్చరిస్తున్నట్టుగా చెప్పింది నర్సవ్వ.

"ఏదో అప్పుకు బదులుకు పోయిన. అట్ల నుకుంటే ఎట్లనత్తా! వసుదేవుడు పోయి గాడిది కాళ్లు పట్టుకున్నడట. గాచారం తక్కువున్నప్పుడు ఎట్లనో ఎల్లదీసుకోవాలె. మనందున పాపమే లేకపోతే భయమేలేదు" అత్త అనుమానాన్ని గ్రహించి చెప్పింది పద్మ.

★ ★ ★

రెండు రోజుల తర్వాత దేవరాజు హైద రాబాద్ నుండి ఊరిలో దిగాడు. బస్సు దిగుతూనే చక్కగా యాదగిరి ఇంటివైపుకు నడిచాడు. ఆ ఇంట్లో ఎవరూ లేకపోవ డంతో తన ఇంటికి చేరుకున్నాడు. తన ఇంట్లో యాదగిరి ఉండడం గమనించి సంతోషించాడు. నెత్తిమీదున్న పెద్ద సూట్ కేస్‌ను బలవంతంగా కిందదించుకుని చెప్పాడు.

"ఈ సూట్ కేస్ నీదేనట. నీకు ఇయ్యమ న్నరు. ముందు మీ ఇంటికి వెళ్లాను. ఎవరూ లేకపోవడంతో ఇక్కడికి తెచ్చాను. మెడికల్ టెస్టు అందరిది ఒకేసారి చేస్తాన న్నారు. వీలైనంత తొందరలో మనుషుల్ని తీసుకుని రమ్మన్నరు"

నిజానికి యాదగిరి దేవరాజును మెడి కల్ టెస్టుకొరకు పంపలేదు. లగేజి ఎక్కు వగా ఉండి కొంత సామాను అక్కడ బంధు వులింట్లో పెట్టివచ్చాడు. దానిని తేవడానికే పంపించాడు. ఆ ఊరు మనిషి ఒకరు హైదరాబాద్ వెళ్తుంటే అడ్రస్ ఇచ్చి దేవరా జును ఆ అడ్రస్‌లో విడిచిపెట్టమని చెప్పాడు.

సూట్ కేస్ తెరిచి వద్దన్నా వినకుండా ఒక చీర, రెండు మూడు ఆట వస్తువులు పద్మకు ఇచ్చి దాన్ని దేవరాజుకు ఎత్తి తన ఇంటివైపు నడిచాడు. సూట్ కేస్‌ను ఇంట్లో పెట్టగానే దేవరాజుకు కట్టెలు కొట్టే పనిని పురమాయించి బయటపడ్డాడు యాదగిరి. అరగంటలో మళ్లీ ఇంటికి వచ్చాడు. అతడి వెంట నలుగురు వ్యక్తులున్నారు. వారు పాస్‌పోర్ట్, పదివేల రూపాయలతో వచ్చారు. వారివద్ద నుండి డబ్బును, పాస్ పోర్ట్‌ను తీసుకుని రిజిష్టర్‌లో పేరు రాసుకు న్నాడు యాదగిరి.

అప్పటికి పదిమంది మాత్రమే జమ అయ్యారు. తీరా సమయానికి రామని అంటారని పాస్‌పోర్టుతో పదివేలు అడ్వాన్స్ తీసుకుంటున్నాడు యాదగిరి. మిగిలిన యాభైవేలు ముంబాయి వెళ్లేముందు ఇవ్వా లన్న షరతు పెట్టాడు. డబ్బున్నవారు తమ స్వంత డబ్బుతో, లేనివారు అప్పు తెచ్చి అప్పు పుట్టనివారు పొలం, నగలు అమ్మి డబ్బు రెడీ చేసుకుంటున్నారు. కొందరు మస్కట్ మిత్తి పేరున నూటికి ఐదు రూపాయలు వడ్డీకి తెస్తే మరికొందరు మరో అడుగు ముందుకు వేసి తులం బంగారానికి ఏడాదికి తులంన్నర చొప్పున ఇచ్చేవిధంగా అప్పు తెస్తున్నారు.

వారందరికి యాదగిరి సంపాదనే కనిపి స్తోంది. తాము రెండుమూడేండ్లలో లక్షాధి కారులమైపోతామన్న ధీమాను కలిగించే యాదగిరి మాటలే వారిని వెనుకడుగు వేయనివ్వడంలేదు. మరో ఐదుగురు వ్యక్తులు కావాలికాబట్టి వారి వేటలో పడ్డాడు యాదగిరి.

పొద్దంతా కట్టెలుకొట్టి ఇంటికి వెళ్లడానికి సిద్ధమౌతుండగా కలిశాడు దేవరాజుకు యాదగిరి "అన్నా నా సంగతి ఎటూజెప్పక పోతివి. నా బతుకు కుడితల పడినెలుక లెక్క ఉన్నది. నా సంగతి చెప్పు" అంటూ




అడిగాడు దేవరాజు.

"నిన్ను వీరందరితో తోలిస్తునుగని ఊరంతా తెలుస్తది. అప్పులు కట్టేదాక ఊరు పొలిమేర దాటనియ్యరు. ఎవరికి తెలియకుండా ఒక్కన్నే పంపిస్త. వాళ్లుపోయిన వారం పది రోజులకు నిన్ను పంపిస్త. నువ్వేం రంధిపెట్టుకోకు" అన్నాడు యాదగిరి.

అప్పుడే లక్షాధికారి అయిపోయినట్టు మురిసిపోయాడు దేవరాజు. ఇంట్లోకి పిలిచి మళ్లీ మందు విందు చేశాడు యాదగిరి. తూలుతూ ఇంటి మొహం పట్టాడు దేవరాజు అతడు గుమ్మంలోకి అడుగుపెట్టగానే తాగి వచ్చాడని అత్తాకోడళ్లు ఇద్దరూ గుర్తుపట్టారు.

"యాదన్న మస్కట్‌నుండి తెచ్చిండు. వద్దన్నా బలవంతం చేసిండు. నేను ఒక్కటే గ్లాసు తాగిన. వేరోల్లయితే మూడు నాలుగు గ్లాసులు తాగుతరట" ఎవరూ అడుగక ముందే తడబడుతూ చెప్పాడు దేవరాజు.

నర్సవ్వ మనసు గిలగిలలాడిపోయింది. ఒకవైపు కొడుకు, మరోవైపు కోడలు సాలెగూడులో చిక్కుకున్నారనిపిస్తోందామెకు. ఆదిలోనే తుంచేస్తే తప్ప అందులోంచి బయటపడటం అసాధ్యమని తెలిసిపోతోంది. అందుకే నెత్తిని కొట్టుకుంటూ గొంతువిప్పింది.

"దేవిగా! నన్ను ఉండనియ్యవురా... చంపుతవు. నువ్వు చెయ్యవట్టి ఎప్పుడో పిట్టలెక్క నోరు తెరిచి చచ్చిపోత. ఎన్నడన్న ఇలా తాగినావురా? ఇవ్వాల్ల వాడుతాగిస్తడు. అలానే అలవాటు అయినంక ఎవరు తాగిస్తరురా. లంగలతో తిరిగి పూర్తిగా చెడిపోయినవు"

తూలుతూ ఇంట్లోకి నడిచి తల్లివైపు ఒక్క క్షణం తీక్షణంగా చూస్తూ అన్నాడు దేవరాజు. "లంగలకే మంచిగున్నది. ఏది తాగక, ఎవ్వలను ఏమనక నా అంతల నేనుంటే ఏమన్న లాభం ఉన్నదా...? యాదన్న చూడు లంగన్నరు, దొంగన్నరు, ఎన్నెన్నో తిట్టిండ్రు. అటువంటివాడు ఇప్పుడు దొర అయిపోయిండు. ఎప్పుడు నలుగురు చుట్టూ తిరుగుతున్నరు. అన్నా అన్నా అంటున్నరు. అందుకనే నాలుగేండ్లు మస్కట్ పోతనంటున్న. అట్లయితెనే నా దరిద్రం పోతది"

అతడి మాటలు అస్పష్టంగా ఉన్నాయి. కళ్ళు ఎర్రబడ్డాయి. తూలుతూ వెళ్ళి మంచంలో వాలిపోయాడు. పద్మ వెళ్ళి తల కింద దిండును సవరించి కాళ్లను చక్కగా సర్ది దుప్పటి కప్పుతుంటే గుర్రుగా చూస్తూ అంది నర్సవ్వ. "నువ్వు వానికి బాగా అలుసు ఇచ్చినవే. నువ్వు వాన్ని చెడగొట్టినవు. వాడు తానా అంటే నువ్వు తందానా అన్నవు. అందుకనే వాడు అట్ల తయారయిండు. లగ్గం గాకముందు ఇంత అగాదంగా తిరుగలేదు. చెప్పినపని చేసిండు"

అత్తవైపు బాధగా చూస్తూ చెప్పింది పద్మ. "అతడిని రోడ్ల వెంట తిరుగుమని చెప్పానా? తాగుమన్ననా? మధ్యలో నేనేం చేసినా? ఎవరిబుద్ధి వారికి రావలిగనీ ఒకరు చెబితె వస్తదా? పుర్రెకో గుణమట జిహ్వాకో రుచియట. పుట్టు గుణమా పెట్టు గుణమా అన్నట్టు పుట్టుకతో వచ్చిన గుణం ఎటుపోతది"

ఆ రాత్రి ఎవరూ భోజనం చేయలేదు. వార్చిన గంజిలో అన్నం వేసి మెత్తగా పిసికి కూతురుకు తాగించింది పద్మ. అత్తా కోడళ్ళు ఒకటి రెండు మాటలు తప్ప ఎక్కువగా మాట్లాడుకోలేదు. దేవరాజు గురించే ఆలోచిస్తున్నారు. వారి ఆలోచనలకు మరింతగా పని కల్పిస్తున్నట్టు మల్లయ్య మనిషిని తోలించాడు. అతడు వచ్చి వాయిదా అయిపోయిందని రెండు రోజులు ఎక్కువ గడువు ఇస్తున్నాడని ఆలోపల కూడా బాకీ తీర్చకపోతే పొలంమీద ఆశ వదులుకోవాలని చెప్పి వెళ్ళాడు.



అతడి మాటల్ని పట్టించుకునే స్థితిలో లేడు దేవరాజు. మత్తులో జోగుతూ నిద్ర పోతున్నాడు. అత్తా కోడళ్ళు ఇద్దరూ భయంతో ముడుచుకుని పడుకున్నారు. ఆకాశం మేఘావృతమై గాలి లేచింది. గాలి తాకిడికి దీపం ఆరిపోయింది. మళ్ళీ వెలిగిద్దామనుకుంటె కిరోసిన్ నిండుకుంది. తలుపులు మూసి గడియ వేసి తనలో తాను కుమిలిపోతూ పడుకుంది పద్మ.

తెల్లవారగానే లేచి మొహంమీద నీళ్ళు చల్లుకుని, నుదుటన కుంకుమ అద్దుకుని సుశీల ఇంటికి బయల్దేరింది. అంత పొద్దున్నే వచ్చిన పద్మను చూసి జాలిపడుతూ ఏమిటని అడిగింది సుశీల. పద్మ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. దుఃఖాన్ని దిగమింగుకుంటూ చెప్పింది.

"ఆయన రోజూ తాగి వస్తున్నాడక్కా! మాది అతుకుల బొంత సంసారం. ఎక్కడ బోయినా ఏడే మానికలన్నట్టున్నది. అలా తాగుడుకు అలవాటైతే మేమింత విషం తాగవల్సిందే! ఎవలు పోశారంటే బావ పేరు చెప్తుతుండు. ఊరన్నీ బాకీలున్నయి. బాకీలెట్ల తీరాలని మేమేడిస్తె మళ్ల మస్కట్ పోతనంటుండు. వట్టిగనేపోతారా...? చేను, ఇల్లు అమ్మిపోతడట. రామేశ్వరంబోయినా శనేశ్వరం తప్పదన్నట్టు అక్కడకుపోయినంక కూడా జీతం తక్కువున్నదనుకో. రెంటికి చెడ్డ రేవడన్నట్టయితది మా బతుకు"

సుశీలకు కూడా నిజమే అనిపించింది. జరుగరానిదేదైనా జరిగితే వారికి ఇంకేం ఆధారం లేదుకనుక వెళ్ళక పోవడమే మంచిదనుకుంది. పద్మను ఓదార్చి పంపించింది. అప్పటికింకా యాదగిరి లేవలేదు. లేవగానే ఏమేం చెప్పాలో అతడికి ఎలా జెప్పాలో ఊహించుకుంది.

యాదగిరి నిద్రలేవగానే మెల్లగా విషయం కదిపింది. దేవరాజు ఇంటి పరిస్థితి పూర్తిగా చెప్పింది. పద్మ పడుతున్న యాతనను చెప్పింది. వాళ్ళకు ఏదైనా జరిగితె మనం అల్లరిపాలవుతాం అని బెదిరించింది. అతడికి మందు అలవాటు చేయవద్దని, మస్కట్ పంపవద్దని హెచ్చరించింది. ఆమె మాటలన్నింటినీ మౌనంగా విన్న తర్వాత "కాకమీద ఉన్నప్పుడే ఇనుము సాగుతుంది. కష్టాల్లో ఉన్నప్పుడే మనిషి తాగుతాడు. తాగినప్పుడే మన మాట వింటాడు" అని మళ్ళీ మౌనంగా ఉండిపోయాడు.

అతడు చెప్పిన మాటలకు అర్థం తెలియ లేదు సుశీలకు. చెప్పిందే మళ్ళీ చెప్పింది. యాదగిరి మౌనంగా విన్నాడు. అతడి మౌనాన్ని పూర్తిగా అంగీకారం అనుకుంది సుశీల. యాదగిరి స్నానం చేసి బట్టలు వేసుకుని సెంటు స్ప్రే చేసుకుని బయటకు వెళ్ళాడు.

వీధిలో నడుస్తుండగా దేవరాజు కన్పించాడు. 'అరే దేవీ...' అంటూ పిలిచాడు. దేవరాజు దగ్గరగా వచ్చాడు. ఇద్దరూ ఒక వీధి అరుగుమీద కూర్చున్నారు. తను ఐదు వేలు పద్మకు ఇచ్చిన విషయం చెప్పాడు. పద్మనే ఏడుస్తూ బతిమాలితే ఇచ్చానని అబద్ధం చెప్పాడు. తనతో చెల్లెలు వచ్చిన విషయం ఇంట్లో ఎవరూ చెప్పనందుకు బాధపడ్డాడు దేవరాజు. పైకిమాత్రం నవ్వుతూ కనిపించాడు. అతడిని మరింతగా క్షోభకు గురిచేస్తూ చెప్పాడు యాదగిరి.

"దేవీ... నువ్వేమో మస్కట్, మస్కట్ అని వెంట పడుతున్నావు. నీ భార్యనేమో వద్దు వద్దంటుంది. ఈ రోజు పొద్దున మా ఇంటికి వచ్చి ఒక్కటే ఏడుపు. నా భర్తను మస్కట్ పంపియ్యద్దని నా భార్యతో మొరపెట్టుకుందట. అందరి పెండ్లాలు పోవాలని కోరుకుంటె పద్మ సాగనిస్తలేదు. నువ్వు ఆనందంగా బతుకుడు ఆమెకు ఇష్టం లేదేమో!"

వెర్రివానివలె చూశాడు దేవరాజు. మొదటినుండీ అయిష్టతను చూపుతున్న పద్మ

అలాగే చెప్పి ఉంటుందనుకున్నాడు. యాద గిరి ఎక్కడ తన మనుసు మార్చుకుంటాడో అని బతిమాలటం మొదలుపెట్టాడు.

"అది అలాగె అంటది యాదన్నా! నువ్వ నమ్మకు. ఆస్తినంతా అమ్మి బాకీలు చెల్లించినాక నేనెట్ల బతుకాలె. ఎవ్వరికీ తెలియకుండా ఈ డబ్బుతో మస్కట్ వెళ్ళి బాకీలు తీర్చాలనుకుంటున్నాను. నీకు ముందే చెబితె సరేనంటివి. ఇప్పుడు పద్మ ఏదో అన్నదని మానుకొంటె ఎలా...? "

"ఇంట్ల గెలిచి రచ్చ గెలువాలెరా! ముందుగా నీ భార్యను ఒప్పించు. లేదంటే అది అప్పులోల్లందరికీ తెలియజేస్తది. నీకూ ఇబ్బందే నాకూ ఇబ్బందే. మొగడు పెండ్లాలది ఒక్కటె మాటుండాలెగని ఇదేందిరా చెరో మాట"

"నేను దాన్ని ఒప్పిస్తా యాదన్నా! నువ్వయితే మనుసుమార్చుకోకు..." దేవరాజు చెబుతుండగా యాదగిరిని చూసి ఇద్దరు వ్యక్తులు అటువైపు రావడంతో ఆపివేసాడు. వారు వచ్చి యాదగిరితో వీసా విషయం మాట్లాడ్డం మొదలెట్టారు.

కొద్దిసేపు అక్కడే ఉండి యాదగిరికి చెప్పి ఇంటికి చేరుకున్నాడు దేవరాజు. అతడికి కోపంగా ఉంది. ఇంట్లో తల్లిలేదు. పద్మ బీడీలు కట్టలు కడుతూ కూర్చుంది. భార్యవద్దకు చేరుకుని ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా అడిగాడు. "వనజ వచ్చిందట. నాకెందుకు చెప్పలేదు? యాదికిలేదా? చెప్పాలనిపించలేదా? "

ఆ మాటలు ఉచ్చరించిన తీరుకు కలవరపడి తలెత్తింది పద్మ. భర్త కోపంగా ఉన్నాడని గ్రహించి చిరునవ్వును పెదాలపై పులుముకుంటూ "అవ్వ చెప్పిందనుకున్నా. ఆ విషయంలో దాచడానికేముంది...? వచ్చి లొల్లిపెట్టింది. సుశీలక్క వాళ్ళు ఐదువేలు ఇచ్చారు. అవి ఇస్తేనే గడపదాటింది"

"ఆ కథంత చెప్పకు. ఈ విషయం నాకెందుకు చెప్పలేదు...? వేలకు వేలు అవతల బాకీలు తెచ్చి కట్టినా నాకు చెప్పవు. అవి ఎక్కడినుండి తీరుస్తాననుకున్నవు" మరింత కోపంగా అడిగాడు.

"ఆ విషయం చెబితే నువ్వెక్కడ బాధపడుతావోనని చెప్పలేదు. ఇప్పటికే పుట్టెడు రంది పెట్టుకున్నావు. స్వంత చెల్లెలు కూడా ఇలా చేసిందంటే మరింత బెంగపడుతావనుకున్నా. అయినా పట్నం వెళ్లి వచ్చిన నుండి ఎప్పుడన్న కుదురుగా ఇంట్లో ఉన్నవా...? తోకలేని గాలిపటం లెక్క ఆగమాగం తిరుగవడితివి" భర్తను సముదాయిస్తున్నట్టుగా అంది.

"నీయవ్వ... నువ్వు చెప్పేదొకటి చేసేదొకటి. ఇంత ప్రేమ ఉన్న దానివి నేను మస్కట్ పోతనంటే ఎందుకు వద్దని చెప్పినవే..." అంటూ కోపంగా వెళ్ళి ఆమె చేతిలో ఉన్న బీడీల చేటను బలంగా తన్నాడు దేవరాజు. బీడీలన్నీ చెల్లాచెదురై పోయాయి. కట్టలు పైకి ఎగిరి కిందపడ్డాయి. తంబాకు మొహమంతా చిమ్మింది. కండ్లలోపడి మంట పుట్టింది. దారం బింగిరి చక్రంలా తిరుగుతూ వెళ్ళి గచ్చులో పడింది.

దేవరాజు అదేకోపంతో ఆమె జడను పట్టి పైకి ఎత్తాడు. పద్మ కండ్లను నులుముకుంటూ నిస్సహాయురాలిగా నిలబడిపోయింది. ఆమె వీపుమీద పిడిగుద్దులు గుద్దుతూ ముందుకు తోశాడు. ముందుకు తూలి పడి బలంగా గోడను ఢీకొంది పద్మ. ఆమె నుదుటికి గాయమై రక్తం కారడం మొదలెట్టింది.

బయటకు వెళ్లిన నర్సవ్వ అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టింది. కొడుకు కోడలును కొడుతున్నట్టు గ్రహించింది. అన్యోన్యంగా ఉండడమే తప్ప ఎన్నడూ వాదులాడుకుని ఎరుగరు. అలాంటిది ఏకంగా చేయి చేసుకోవడం జీర్ణించుకోలేని నర్సవ్వ కొన్ని క్షణాలు బిత్తర చూపులు చూసినా వెంటనే తేరుకుని పరుగుపరుగున ముందుకు వస్తూ

అరిచింది. "దేవిగా... నీకు వినాశనకాలం వచ్చిందిరా... ఇక ఉండవురా... నీ చేతులు పాడైపోను! దాన్ని కొడుతున్నవేందిరా... అది లేకపోతే నీ బతుకు కుక్కబతుకవుత దిరా... నీ తలపండు పలుగ... నీ మొద లార... పోరిని సంపితివిగదరా"

నర్సవ్వ వెళ్ళి కోడలును లేవనెత్తి మీదికి దూసుకువస్తున్న కొడుకును వెనక్కి తోసి పద్మను నీటి గోళెంవద్దకు నడిపించుకు వెళ్ళింది. ముంతతో నీళ్ళు తీసుకుని కొడుకును తిడుతూనే మొహం కడిగింది. పొయ్యి దగ్గరకు వెళ్ళి పసుపు డబ్బా తెచ్చి నుదుటికి పసుపును అద్దింది. పక్కింటికి వెళ్ళి కాసు, సున్నం తెచ్చి దంచి తలకు కట్టుకట్టింది. అప్పటికే దేవరాజు బయటకు వెళ్ళిపోయాడు.

కుమిలిపోతూ మంచంలో ఒరిగిపోయింది పద్మ. ఆమె పక్కనే కూర్చుండి భర్తను తలచుకుని ఏడ్వడం మొదలెట్టింది నర్సవ్వ. ఆ ఏడుపుకు ఇరుగుపొరుగువారు పోగయ్యారు.

"ఊర్కుండు నర్సక్కా ఊర్కో! జానెడు పోరగండ్లున్నరు. వాళ్ళను చూసుకుంటూ పొద్దు గడుపుకోవాలె. పుట్టిన్నాటినుండి పుట్నాలగంప అన్నట్టూ ఎన్నడూ సుఖం లేదు. మొగడు అంతకాయె. కొడుకు ఇంత కాయె. శెనిగలు బుక్కి చెయ్యికడుకున్నట్టు గావట్టె" అంటూ నర్సవ్వను ఓదార్చారు.

పద్మకు కూడా బిగ్గరగా ఏడ్వాలని ఉంది. కానీ ఏడ్వలేక పోతోంది. అలా ఏడిస్తేనైనా కొంత ఊరట కలిగి గుండె బరువు తగ్గేదేమో! ఏడ్పు ఆపాక రిలీఫ్‌గా కనబడింది నర్సవ్వ. చుట్టూ చేరిన వారు ఓదార్పు మాటలు చెప్పి కన్నీళ్ళు తుడిచి వెళ్ళిపోయారు.

నర్సవ్వ కోడలువైపు తిరిగి ఆప్యాయతగా తలను నిమిరి పూడుకు పోయిన గొంతుతో అన్నది. "సాధువులాంటి దానివి. నిన్ను కొట్టుడుకు చేతులెట్ల వచ్చినాయో! వాని చేతులు పడిపోను. ఏ జన్మల బంధమో బిడ్డా! కన్నకూతురికంటే ఎక్కువ మెదిలి నవు. ఇంట్ల మాట బయటపడకుండా కండ్ల సూపుతో నడుచుకున్నవు. పొద్దుగల్ల లేచి ఎవల మొహం చూసినవో! ఇది వాడికి పుట్టిన బుద్ధిగాదు. ఇదిగాదు బిడ్డా ఇది అంటే అట్లనే నడుస్తుండె. ఆ యాదిగాడు బాడుకావు ఎట్ల ఆడిత్తే వీడు అట్ల ఆడుతుండు"

పద్మ కన్నీళ్ళు కారుస్తూ మౌనంగా ఉండిపోయింది. అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టాడు కోటయ్య. కూతురు పెండ్లి చూపులకు వస్తానని రాకపోవడంతో ఏ ఆపద వచ్చిందోననుకుని వచ్చాడు కంగారుగా. అదీ తన రెండవ భార్యకు తెలియకుండా!

వస్తూనే తలకు గాయం చూసి కంగారు పడ్డాడు. మనిషి ఎత్తుకు తగిన లావుతో ఉండి గుబురు మీసాలతో చూపరులకు భీతిని గొల్పే విధంగా ఉంటాడు. ఏడుస్తున్న కూతురును దగ్గరకు తీసుకుని ఏం జరిగిందని వాకబు చేశాడు. పద్మ చెప్పకూడదని ఎంతగా వారించినా నర్సవ్వ వినలేదు. పూసగుచ్చినట్టు అంతా చెప్పేసింది.

కాసేపు అల్లుడి మీద చిందులు తొక్కాడు కోటయ్య, కూతురును తన వెంట రమ్మని బలవంతం చేశాడు. నాలుగు రోజులు వెళ్ళి రమ్మని నర్సవ్వ కూడా చెప్పింది. పద్మ ఒప్పుకోలేదు. ఆయాసంతోనే లేచి తండ్రికి భోజనం పెట్టింది పద్మ. కోటయ్యకు అన్నం సహించలేదు. కూతురు పరిస్థితి చూస్తుంటే హృదయం ద్రవించింది. అయినా ఏమీ చేయలేని పరిస్థితి. నాలుగు రోజులు తన వెంట రమ్మంటున్నాడే తప్ప ఆ నాలుగు రోజులైనా తన ఇంట్లో ప్రశాంతంగా కూతురును తన భార్య ఉండనివ్వదని అతడికి తెలుసు. రెండవ భార్య గయ్యాళి. ఆమె నోరుకు భయపడి తనే నోరు మూసుకున్నాడు.

తండ్రి అసహాయస్థితి కూతురుకు




తెలుసు. అక్కడికంటే ఇక్కడే నయం అన్నది అనుభవపూర్వకంగా తెలుసు. తన అదృష్టాన్ని తనే తిట్టుకుంటుంది తప్ప తండ్రితో ఎన్నడూ పినతల్లి గురించి చెప్ప లేదు.

తిన్నాననిపించుకుని లేచాడు కోటయ్య. చేయి కడుక్కుని అల్లుడికోర్కై ఎదురు చూస్తూ కూర్చున్నాడు. ఎలాగైనా రెండు రోజులు వెంట తీసుకొని వెళ్ళాలని ఉందత నికి. పద్మే పట్టు సడలించడంలేదు.

పొద్దునంటూ వెళ్ళిన దేవరాజు మధ్యాహ్నం దాటాక ఇంటికి చేరుకున్నాడు. ఎదురుగా మామ కనిపించినా పలకరించ లేదు. కాళ్ళుచేతులు కడుక్కుని వెళ్ళి భోజ నానికి కూర్చున్నాడు. ముభావంగా వెళ్ళి కంచంలో అన్నం పెట్టి కూరవేసి వచ్చింది పద్మ. మారు అన్నాన్ని తనే పెట్టుకుని తిన్నాడు. అల్లుడికి, కూతురుకు చెప్పేవి ధంగా చెప్పి ఇంటికి వెళ్ళిపోయాడు పద్మ తండ్రి.



వారంరోజుల్లో పదిహేను మందిని రెడీ చేశాడు యాదగిరి. మొదటనే పాస్‌పోర్ట్, పదివేల రూపాయలు అడ్వాన్స్‌గా తీసుకు న్నాడు. ముంబాయికి ఫోన్ చేసి పదిహే నుమందిని రెడీచేశాను, ఎమిగ్రేషన్, వీసా, ఫ్లయిట్ టికెట్ల విషయం చూసుకో'మ్మని చెప్పాడు. పాస్ పోర్ట్‌లను ట్రూకాపీలు తీయించి పార్శిల్ పోస్ట్‌లో పంపించాడు.

ముంబాయి ఆఫీసునుండి రెండురోజుల్లో రిప్లయ్ వచ్చింది. వాళ్ళు డేట్ ఇచ్చి ఆ రోజు రమ్మని చెప్పారు. వారు ఇచ్చిన డేట్ లోపల చేరుకునేందుకు వీలుగా బస్ టికెట్లు బుక్ చేశాడు యాదగిరి. అందరినీ డబ్బు రెడీ చేసుకొమ్మని చెప్పాడు. చెప్పిన ప్రకారం అంతా డబ్బు రెడీ చేసుకున్నారు. ఏజంట్‌కిచ్చే అరవై వేలు పోను, మీద ఖర్చులకొరకు ఐదువేలు రెడీ చేసుకున్నారు. అంత దూరం డబ్బుతో వెళ్తే క్షేమంకాదని బ్యాంక్‌లో డి.డి.లు తీయించాడు యాద గిరి.

ముంబాయి వెళ్ళడానికి రెండే రోజులు మిగిలి ఉన్నాయి. మస్కట్ వెళ్ళే వారం దరు తమ బంధువులను, మిత్రులను ఇంటికి ఆహ్వానించి విందులు చేస్తున్నారు. వారు కూడా మస్కట్ వెళ్ళే వ్యక్తికి ఏదో రూపంలో తమ సహాయాన్ని అందిస్తు న్నారు. తల్లిదండ్రులు, భార్యాపిల్లలు కన్నీరు కారుస్తుంటే ఓదారుస్తున్నారు.

యాదగిరికి ఎంతో ఆనందంగా ఉంది. తను మస్కట్‌నుండి వస్తూ రెండురోజులు ముంబాయిలో ఉండడం తనకు పరిచయ మున్న ఏజెంట్ వద్దకు కలుద్దామని వెళ్ళడం, అతడు వీసాలు రెడీగా ఉన్నాయని చెప్పడం, పదిహేనుమందిని పంపిస్తానని హామీ ఇచ్చి రేటు కుదుర్చుకోవడం అన్నీ గుర్తొచ్చాయి. నెల రోజులు కష్టపడితే లక్షా యాభైవేల రూపాయలు లాభం వస్తున్నా యన్న ఊహనే అతడికి మధురంగా ఉంది. మొదటి బ్యాచ్ వెళ్తే మళ్ళీ వెళ్ళడానికి చాలా మంది రెడీగా ఉన్నారు. వీరు వెళ్ళాక మరి కొన్ని వీజాలు తేవాలనుకుంటున్నాడు యాదగిరి.

యాదగిరి ఏజంట్‌గా మారిపోయాక

చుట్టుపక్కల ఊర్ల వారందరికీ తెలిసిపో యాడు. ముక్కూమొహం తెలియనివారు కూడా వచ్చి తమను పరిచయం చేసుకుని తాము కూడా వెళ్తామని వీజాలు ఉంటే చెప్పమని అడుగుతున్నారు. మొదట లేవని చెప్పాడు. ఎక్కువ మంది రావడంతో అత డికొక ఐడియా వచ్చింది. ఎవరు వస్తే వారి వద్దనుండి పాస్‌పోర్ట్ పదివేల రూపాయలు అడ్వాన్స్‌గా ముందుగానే తీసుకోవాలనుకు న్నాడు. ఆఫీసులో పాస్‌పోర్ట్ ఇచ్చి డబ్బును బ్యాంక్‌లో వేస్తే వడ్డీ వస్తుంది.

ఈ ఆలోచన రాగానే వచ్చిన వారందరి వద్ద అడ్వాన్స్ తీసుకుంటూ బ్యాంక్‌లో వేయడం మొదలెట్టాడు. వేరే ఊరు వ్యక్తు లవద్దనే కాకుండా తన ఊరివారివద్దనుండి కూడా అడ్వాన్స్ తీసుకోవడం మొదలె ట్టాడు.

సుశీలకు ఈవిషయం నచ్చడంలేదు. ఎప్పటికప్పుడు భర్తను హెచ్చరిస్తూనే ఉంది. యాదగిరి పట్టించుకోవడంలేదు. ముంబాయికి వెళ్లేరోజు రానేవచ్చింది. పొద్దున్నే ఆఫీసుకు ఫోన్‌చేసి బయల్దేరు తున్నామని చెప్పాడు. ముంబాయి బస్సు ఎక్కాలంటే ఐదుకిలోమీటర్లు నడిచి పక్క ఊరు వెళ్ళాలి. నడవడం కుదరదని జీపు కిరాయికి మాట్లాడుకున్నారు.

వారి ప్రయాణం ఊరేగింపులా సాగింది. మస్కట్‌కు వెళ్లే వ్యక్తులు, వారి తాలూకు బంధువులు, మిత్రులు, కుటుంబ సభ్యులు వెంట వచ్చారు. జీపును ఊరి చివర నిలబె ట్టారు. ఏడ్పులు, ఓదార్పులు, అప్పగింతలు పూర్తయ్యాక జీపు కదిలింది. యాదగిరి అందరినీ సముదాయించాడు. ఓదార్పు మాటలు చెప్పి జీపు ఎక్కాడు. వెంట దేవ రాజును కూడా తీసుకెళ్ళాడు. పక్క ఊరు వెళ్ళాక అరగంట తర్వాత ముంబాయి బస్సు వచ్చింది. బస్సులో ఎక్కి కూర్చున్నాక యాదగిరి మనసు కుదుటపడింది. ముంబాయి బస్సు ఎక్కారని అందరికీ చెప్ప మని దేవరాజును వెనక్కి పంపించాడు.

పొద్దుగూకుతుండగా ఊరిలోకి అడుగుపె ట్టాడు దేవరాజు. అతడు వచ్చాడని తెలియ గానే అందరూ చుట్టుముట్టి ప్రశ్నల వర్షం కురిపించారు. బస్సు సరిగ్గా సమయానికే వచ్చిందని, అందరూ ఎక్కారని చెప్పాడు దేవరాజు. ఎందుకోకాని అతడి మనసంతా వెలితిగా ఉంది. డబ్బు రెడీగా ఉంటే వీరి తోనే వెళ్ళేవాడు. అందరితో కలిసివెళ్తే ధైర్యంగా ఉండేది. తను వెళ్ళేప్పుడు ఎవరొ స్తారో ఎవరు రారో అనుకున్నాడు. ఒకవేళ తనను ఒంటరిగా పంపిస్తే ఎలా? అనుకు న్నాడు. ఆరోజు రాత్రి తల్లి, భార్యలతో మాట్లాడలేదు. దిగులుగా నిద్రపోయాడు దేవరాజు.

అతడు భయపడ్డట్టుగానే జరిగింది. వారం రోజుల్లో యాదగిరి తిరిగి వచ్చాడు. వస్తూనే బ్రీఫ్‌కేస్ ఇంట్లోపెట్టి స్నానంచేసి దేవరాజు ఇంటికి వెళ్ళాడు. అతడు వచ్చి నట్టు ఎవరికీ తెలియదు కాబట్టి వివరాలు అడగడానికి ఎవరూ రాలేదు. హఠాత్తుగా కళ్ళముందు ప్రత్యక్షమైన యాదగిరిని చూసి కొద్దిసేపు విస్తుపోయినా, ఏదో భయం కలిగింది పద్మకు. మొహం ముడు చుకుని పొడిపొడిగా పలకరించి తన పనిలో మునిగిపోయింది. ఇంట్లో నర్సవ్వ కూడా లేదు.

"ఏం చేస్తున్నవు పద్మా! కారం నూరుతు న్నవా? మీకు తిండికే తిప్పలాయె. కూరలు ఎక్కడనుండి తెస్తవు! ఇప్పుడైనా తమ్మునికి మంచిగ వండిపెట్టు. వానికి వీసా తెచ్చిన. వారంరోజుల్లో పంపిస్తా. చాలా డబ్బు సంపాదిస్తడు" చనువుగా ఆమెవద్దకు వెళ్ళి అన్నాడు యాదగిరి.

పద్మ మౌనంగా తన పనిలో మునిగిపో యింది. ఆమెకు తనమీద కోపంగా ఉందని, అందుకే ఇంటికి రావడం మానేసిందని గ్రహించాడు యాదగిరి. ఇల్లంతా కలియ జూస్తూ "దేవరాజు లేడా" అని అడిగాడు.




"ఉన్నడు. ఇప్పుడే లేచి మొహం కడుక్కుంటున్నడు" చేస్తున్న పనిని ఆపకుండానే పొడిపొడిగా చెప్పింది పద్మ.

తనతో అలా నిర్లక్ష్యంగా మాట్లాడడం సహించలేకపోయాడు యాదగిరి. లోలోపల కోపంగా ఉన్నా పైకి మాత్రం నవ్వుతూ ఇంటివెనక ఉన్న పెరట్లోకి వెళ్ళి దేవరాజును పలకరించాడు.

హఠాత్తుగా దైవం ప్రత్యక్షమైనట్టుగా సంబరపడిపోయాడు దేవరాజు. యాదగిరిని ఇంట్లోకి రమ్మని చెప్పి మంచం వాల్చి కూర్చోబెట్టాడు. పద్మవైపు ఓరగా చూస్తూ కూర్చున్నాడు యాదగిరి. అతడి పక్కనే కూర్చుంటూ ముంబాయి సంగతులు అడిగాడు దేవరాజు.

"అవన్నీ తర్వాత మాట్లాడుకుందాం! ముందు నీ సంగతి చెప్పు. ఇప్పుడు వీసాలు లెవ్వు. వారందరినీ బతిమాలి నీ కొరకని ఒక వీసా తెచ్చిన. సూపర్ మార్కెట్‌లో సరుకులు అందించడం. ఎనిమిది గంటల డ్యూటీ. జీతం పదివేలు. తిండి కంపెనీదే! వెళ్తవా... వెళ్ళవా? నువ్వు కాదంటే మరొకరిని పంపిస్త" పద్మవైపు విలాసంగా చూస్తూ అడిగాడు యాదగిరి.

యాదగిరివైపు వింతగా చూశాడు దేవరాజు. "అలా మాట్లాడుతవేందన్నా! నేను ఎన్నటినుండో వెళ్తానంటున్నాను. ఇప్పుడు కొత్తగా అడిగినట్టు అడుగుతవేందన్నా! మొన్న పద్మ అన్న మాటలు మనసున పెట్టుకున్నవా ఏంది...? దానికేం తెల్వాది. నేనే చెబుతున్న గదా! తప్పకుండా వెళ్తాను. నాకు ఇక్కడ బతుకుదెరువు ఎక్కడుంది" దీనంగా అన్నాడు.

చేస్తున్న పనిని ఆపి తమ మాటలను వింటుందేమోనని చూశాడు యాదగిరి. కానీ పద్మ వీరివైపు కన్నెత్తికూడా చూడలేదు. తన పనిలో తాను మునిగిపోయింది. గటగటమని చప్పుడు చేస్తూ ఆమె చేతిలో రోకలి తిరుగుతోంది. ఆ చప్పుడులో ఎవరేం మాట్లాడుతున్నారో తెలియడం లేదు. వినాలనే ఆసక్తి కూడా లేదామెకు.

"అరే దేవీ... నేను ఇప్పుడే చెబుతున్నాను. తర్వాత నన్ను ఎవరూ ఏమి అనవద్దు. ముందుగనే ఆలోచించుకోండి. అవ్వను, పద్మను, మీమామను... అందరిని తెలుసుకుని నిర్ణయించుకో. వారందరు సరేనంటే నే వెళ్ళు. లేదంటే ఇక్కడే ఉండు. నన్నుమాత్రం తర్వాత ఇబ్బంది పెట్టి నానా మాటలనకూడదు" విషయాన్ని మరింతగా సాగదీస్తూ అన్నాడు యాదగిరి.

"నిన్ను ఎవరూ ఏమనరు. నా అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతది. చెడినా బతికినా నాదే బాధ్యత. నన్ను మస్కట్ పంపే ఏర్పాటు చెయ్యి. దారి చూపించినవారిని తిడుతమా! ఎవరో ఏదో అన్నరని వెనకముందాడకు" దృఢంగా చెప్పాడు దేవరాజు.

"అయితే డబ్బుల విషయం ఎలారా? ఎన్ని ఇస్తానంటున్నవు" అడిగాడు యాదగిరి. అతడి మాటలకు బిక్కమొహంవేస్తూ పిచ్చి చూపులు చూశాడు దేవరాజు. కొద్దిసేపటి తర్వాత తేరుకుని నేల గీతలుగీస్తూ చెప్పాడు. "డబ్బు ఎక్కడిదన్నా! అది లేకనే కదా ఈ తంటాలన్ని. చచ్చిపోతే శవంమీద చల్లడానికైనా చిల్లరలేదు. అంతా తెలిసి కూడా డబ్బు అంటావేంది? నీకు మొదటనే చెప్పాను. నా పొలం, ఇల్లు కుదువబెట్టుకో! ఇప్పుడు తీసుకురమ్మంటే ఎక్కడినుండి తెచ్చేది. పొలం అమ్ముకుని ఇద్దామంటే బాకీ ఉన్నవాళ్ళు ఆగరు. వారికి పంచాలంటే వచ్చిన డబ్బు చాలదు"

"అరే! ఎట్లరా మరి. డబ్బు లేదంటవు. మస్కట్ వెళ్తనంటవు. నాకు ఆఫీసులో వట్టిగనే వీసా ఇస్తరనుకుంటున్నవా? అరువై వేలు కట్టాలె. అట్లయితెనే తోలిస్తరు. నీ పొలం నువ్వే అమ్ముకో. నాకిస్తే నేనేం చేసుకోవాలి" పద్మకు వినిపించాలని గట్టిగా అన్నాడు యాదగిరి.

"నువ్వు ఏమైనా చేసుకో! సాదినా నువ్వే!

చంపినా నువ్వే! నువ్వు ఎట్లచెబితే అట్లనే చేస్త. నన్ను మస్కట్ పంపే ప్రయత్నం చెయ్యి" బతిమాలుతున్నట్టుగా అన్నాడు దేవరాజు.

అతడివైపు జాలిగా చూస్తూ అన్నాడు యాదగిరి. "నీతో వచ్చి పడ్డ చిక్కేఇదిరా! డబ్బులేదంటవు. మస్కట్ వెళ్తానంటవు. నిన్ను చూస్తే జాలివేస్తది. మీ అవ్వ మాటలు వింటే కోపమొస్తది. మా ఇంటికి వెళ్ళి టేబుల్‌మీద బ్రీఫ్‌కేస్ ఉంది పట్టుకు రాపో! నేనే వెళ్ళుంటిగానీ, వీధిలో ఎవరో ఒకరు అడ్డగించుకుని మాట్లాడిస్తారు. ఇంటికి చేరుకునేసరికి లేటవుతుంది. వీసా కాగితాలు నీకిచ్చి కొన్ని వివరాలు చెప్పాలి"

వింటినుండి సంధించిన బాణంలా దూసుకువెళ్ళాడు దేవరాజు. యాదగిరి అంత తొందరగా ఒప్పుకున్నందుకు అతడికి తృప్తిగా ఉంది. అప్పటికి కారం నూరి గిన్నెలో ఎత్తడం మొదలెట్టింది పద్మ.

"మీ అత్త ఎక్కడికి వెళ్ళింది పద్మా" అడిగాడు యాదగిరి.

"మార్కెట్‌కి వెళ్ళింది" ముభావంగా సమాధానమిచ్చింది పద్మ.

"అయితే గంటవరకు రాదన్నమాట. దేవరాజు కూడా అరగంటవరకు రాడు. మన మాటాముచ్చటా పూర్తయిపోతాయి" అంటూ ఆమెవద్దకు వెళ్ళాడు యాదగిరి. కంగారుగా పక్కకు జరిగింది పద్మ. ఆమె చేయిని అందుకుంటూ అన్నాడు యాదగిరి.

"నువ్వు అరిచావనుకో. లోకం నీ మొగుడినే తప్పు పడుతుంది. మనిద్దరినీ కలిపి బయటకు వెళ్ళాడని నిందవేస్తుంది. అప్పుల బాధలో ఉన్నారు కాబట్టి నా ద్వారా డబ్బును ఆశిస్తున్నావన్న నింద నీకు వస్తుంది. నీ మొగుడు వచ్చాక చెప్పావనుకో. ఇప్పుడు వాడు నీ మాటలేవీ వినేస్థితిలోలేడు. నేనేది చెపితే అదే రైటు వాడికి. ఎలా చెప్పాలో నాకు బాగా తెలుసు.

"అందుకే ఆ ప్రయత్నాలన్నీ మానుకుని నా మాట విను. ఈ రాత్రికి మా ఇంటికిరా! ఇంట్లో ఎవరూ లేరు. నువ్వు కోరినంత డబ్బు ఇస్త. నీ భర్తను మస్కట్ పంపిస్త. మనకు ఎవరూ అడ్డు ఉండరు. అలా రాలేదనుకో బలవంతంగానైనా నిన్ను నాదాన్ని చేసుకుంటాను"

క్షణకాలం తత్తరపడినా కుదురుగా నిలబడింది పద్మ. అరుస్తుందని, పెనుగులాడుతుందని ఏదేదో ఊహించుకున్న యాదగిరి ఆమె మౌనంగా ఉండడంతో రెట్టించిన ఉత్సాహంతో దగ్గరికి లాక్కున్నాడు.

అతడి ప్రయత్నాన్ని అడ్డుకుంటూ అంది పద్మ. "నీ ఐశ్వర్యాన్ని చూసి లొంగిపోవడానికి నేను కులటను కాను. అరిచి కేకలు పెట్టి అల్లరి పాలయ్యేందుకు అమాయకురాలను అసలే కాదు. భర్తనో, మరెవరినో ఆశ్రయించి రక్షణ పొందేందుకు అసమర్థురాలిని అంతకంటే కాదు. ఒరేయ్ యాదగిరీ! నేను సిరిసంపదలకు పేదను కావచ్చు గుణగణాలకు కాదురా! నీ కుక్కబుద్ధి నాకు ముందే తెలుసు. కానీ మొరగడానికి ఆలస్యమౌతుందనుకున్నాను.

"ఇక్కడే కాదు. మరెక్కడా ఇలాంటి కూతలు కూయకుండా చేస్తాను. నీకు డబ్బున్నంత మాత్రాన ఎవరినైనా లొంగదీసుకోవచ్చుననే నీ అభిప్రాయాన్ని మారుస్తాను. జీవితంలో మరొక ఆడదాన్ని కన్నెత్తి చూడకుండా చేస్తాను"

బలవంతంగా ఆమెను తనవైపుకు తిప్పుకోబోయాడు యాదగిరి. గిన్నెలోని కారంను అందుకుంది పద్మ. బలంగా మొహంపైకి విసిరింది. పచ్చి మిరపకాయల కారం యాదగిరి కళ్ళనిండా నిండింది. గొంతులో నుండి వస్తున్న గావుకేకను లోలోపల అణుచుకుంటూ గచ్చు వద్దకు పరిగెత్తాడు యాదగిరి. కండ్లు మూసుకుని పరుగెత్తడం వల్ల గోడకు ఢీకొన్నాడు. తలకు చిన్న గాయమై రక్తం కారడం మొదలెట్టింది.

అంతకుముందే అక్కడికి చేరుకుంది




నర్సవ్వ. గుమ్మం వద్ద ఆగిపోయి కోడలు మాటలు విన్నది. ఆమె కళ్లు చెమర్చాయి. యాదగిరి మీద కోపంతో ఇంట్లోకి వచ్చింది. హఠాత్తుగా ప్రత్యక్షమైన అత్తను చూసి కంగారుపడింది పద్మ. కళ్ళతోనే కోడలును అభినందిస్తూ కుండలదొంతి వద్దకు నడిచింది. జీడిగింజల్ని గుప్పెట్లో పట్టుకొచ్చి పెనంమీద పోసి మండుతున్న పొయ్యిమీద ఉంచింది. నిమిషాలమీద బుసబుసమని పొంగడం మొదలెట్టాయి జీడిగింజలు.

కండ్లు మూసుకున్నా భగ్గుమని మండుతున్నాయి యాదగిరికి. చేతుల్ని గాలిలో ఆడిస్తూ వెళ్ళి కంచుమూతను వెదికి పట్టుకుని నీళ్ళు ముంచుకునేసరికి ఐదునిమిషాలు దాటింది. వంగి మొహం కడుక్కుంటుండగా బుసబుస పొంగిన జీడిగింజల్ని తెచ్చి వీపుమీద కుమ్మరించింది నర్సవ్వ. కెవ్వుమని అరిచి లేచి నిలబడ్డాడు. నల్లటి షర్ట్‌మీద జీడిమరక ఏర్పడకపోయినా షర్టంతా తడిసిపోయింది. జీడి వీపుపై చర్మానికి పట్టుకుంది. అది ఎంతమేర చర్మానికి అంటుకుంటే అంతవరకు పుండు అవడం ఖాయం.

తొందరగా మొహం కడుక్కుని షర్ట్‌ను విప్పేశాడు యాదగిరి. తెల్లని షర్ట్ అయితే మరక స్పష్టంగా కనిపించేది. పక్కనే ఉన్న మసిగుడ్డతో వీపును తుడుచుకున్నాడు. అలా చేయడంవల్ల ఖాళీవీపు భాగంలో కూడా జీడి అంటి పుండు అయ్యే అవకాశం ఎక్కువయింది. షర్ట్‌ను కూడా తుడుచుకుని తొడుక్కుంటూ విసవిసా బయటకు నడిచాడు. అతడి కళ్లు కారంచేత ఎర్రబడి చూడాలంటే ఇబ్బందిగా ఉంది.

వెంటపడి ఎవరో తరుముకువస్తున్నట్టు ముందుకు నడిచాడు యాదగిరి. అతడు వీధిమలుపు తిరుగుతుండగా దేవరాజు ఎదురొచ్చాడు. అతడి చేతిలో బ్రీఫ్‌కేస్ ఉంది. యాదగిరిని చూడగానే ఆశ్చర్యంగా 'ఏంటిది యాదన్నా... ఆగమాగం ఉరికస్తున్నవు' అన్నాడు.

ఏంలేదని అతడికి పొడిపొడిగా చెప్పి ఇంటివైపు నడిచాడు యాదగిరి.

దేవరాజుకు మళ్ళీ భయం పట్టుకుంది. యాదగిరి మనసు మార్చుకున్నాడేమోనను కుని బిక్కుబిక్కుమంటూ అతడి వెంట నడిచాడు.

ఎవరితో మాట్లాడకుండా ఇంటికి చేరుకున్నాడు యాదగిరి. కళ్లు మండుతున్నాయి. వీపు కూడా మండుతోంది. సబ్బుతో బాగా రుద్దుకుని స్నానం చేశాడు. వీపులో జీడి ఎంతమేరకు అంటిందో కనిపించడం లేదు. అప్పటికే అతడు వచ్చినట్టు ఊరంతా తెలిసిపోయింది.

యాదగిరి డ్రెస్ చేసుకుని బయటకు వచ్చేసరికి ఇరవై ముప్పైమంది వరకు జమయ్యారు. ఇంతకుముందు మస్కట్ వెళ్ళిన పదిహేనుమంది తాలూకు బంధువులు వారు. క్షేమసమాచారాలు అడగడానికి వచ్చారు. కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతూ వారడిగిన ప్రశ్నలకు ఓపిగ్గా సమాధానమిచ్చాడు యాదగిరి. వారందరూ ఈపాటికి పనిచేసుకుంటూ ఉంటారని, వారం పదిరోజుల్లో లెటర్ వస్తుందని, ఎలాంటి బెంగపెట్టుకోవద్దని ధైర్యం చెప్పాడు.

"వారు బాగుపడితే నీ పేరే గుర్తు చేసుకుంటరు బిడ్డా! ఇక్కడ బతకలేనివారెవరున్నరు. వద్దు వద్దని చెప్పినా వినకపోయిరి. అందరు కూడబలుక్కుని మాకు పుట్టెడు రంది పెట్టిరి. రెండేండ్లు ఎట్ల తెల్లవారాలె. ఎట్ల పొద్దుగూకాలే!" అనుకుంటూ వెళ్ళిపోయారు.

అందరు వెళ్ళిపోయేవరకు ఓపిగ్గా అక్కడే కూర్చున్నాడు దేవరాజు. మధ్య మధ్య యాదగిరికి అగ్గిపెట్టె, మంచినీళ్లు అందించాడు. వారంతా వెళ్ళిపోయాక దీనంగా అడిగాడు. "నా సంగతేం చెప్పలేదు. నన్ను ఎప్పుడు తోలిస్తవో చెప్పు. ఇక్కడుంటే

మాత్రం నేను బతకలేను"

కసినంతా లోలోపల అణుచుకుంటూ దేవరాజువైపు జాలిగా చూసి చెప్పాడు యాదగిరి. "దేవీ! అవ్వ కావాలీ, బువ్వ కావాలీ అంటే ఎలారా? నువ్వు ఎప్పుడు డబ్బు తెస్తే అప్పుడే తోలిస్తా! నాకు చేతనైన సహాయం ఒక్కటి మాత్రం చేయగలను. చేను, ఇల్లు అమ్మేయ్. అప్పులవాళ్ళు నిన్నేం అనకుండా ఉండే పూచీనాది. మస్కట్ వెళ్తన్నాను. అక్కడ పదివేల జీతం ఉంటుంది. వెళ్ళగానే మీ అప్పు తీర్చేస్తానని చెప్పు. వారు నమ్మకపోతే నా వద్దకు రమ్మను. వారికి సర్దిచెబుతాను. పొలం, ఇల్లు వెంటనే అమ్మేసి డబ్బు తీసుకునిరా!"

కొంతసేపు ఆలోచించాడు దేవరాజు. అప్పులవాళ్ళు అడ్డుకోకపోతే సరే! మస్కట్ వెళ్ళాక ఏడాదిలో అప్పులన్నీ తీర్చవచ్చు. అందరికీ సర్దిచెప్పాలి. వినకుంటే మిత్తి ఎక్కువిస్తానని చెప్పాలి. ఎలాగైనా ఇక్కడి నుండి బయటపడాలి. వారు ఒప్పుకోకపోతే యాదగిరికి చెప్పి ఒప్పించాలి అనుకున్నాడు.

"పొలంను, ఇల్లును అమ్మి డబ్బు ఇస్తాను. అప్పులవాళ్ళు అడిగితే నువ్వే సర్ది చెప్పాలి." అని బయటకు నడిచాడు దేవరాజు. అతడిని వెనక్కి పిలిచి "ఇల్లు అమ్ముతున్నాను. తల్లి, భార్యాపిల్లలు ఎక్కడుంటారోనని బెంగపడకు. నా ఇల్లు పెద్దదిగానే ఉంది. రెండు గదులు ఖాళీగా ఉన్నాయి. వాళ్ళకు ఇష్టమైతే ఉండుమను" అన్నాడు యాదగిరి. తలూపుతూ వెళ్ళిపోయాడు దేవరాజు.

అక్కడనుండి బయటపడి నేరుగా మల్లయ్య ఇంటికి వెళ్ళాడు దేవరాజు. అప్పటికే మల్లయ్య నాలుగు అవకాశాలు ఇచ్చాడు. దేవరాజుతో పంచాయతీ, జరిమానా తగలడం... ఆ దెబ్బతో ఊరిలో ఉన్న బాకీలు సగంకంటే ఎక్కువే వసూలయ్యాయి మల్లయ్యకు. తన ప్లాన్ అనుకున్న దానికంటే సక్సెస్ కావడంతో దేవరాజు పట్ల మెతకవైఖరిని అవలంబిస్తూ అవకాశాలు ఇస్తున్నాడు.

దుకాణంలో కూర్చుండి సరుకులు అమ్ముతున్న మల్లయ్య దేవరాజును చూసి అప్పు తీర్చడానికి వచ్చాడనుకున్నాడు. తను ఏమాత్రం పట్టు సడలించినా వడ్డీ తగ్గించమని బతిమాలుతాడనుకుని మొహం చిట్లించి తిట్లదండకాన్ని వల్లిస్తూ దేవరాజు వద్దకు వచ్చాడు.

"ఏమిరా దేవరాజూ! పిల్లగాండ్ల పరాచికాలనుకుంటున్నవా... లేక నవ్వులాటకు అనుకుంటున్నాననుకుంటున్నవా? ఏదో పోనీ కూటికి గతిలేనివాడని వాయిదాలిస్తుంటే అలుసుగా తీసుకుంటున్నవు. ఇవ్వాలని ఉందా లేదా చెప్పరాదు. ఊకూకె నిన్ను అడుగుడేందీ, ఈ వాయిదాలేందీ!" కోపంగా అరిచాడు మల్లయ్య.

దేవరాజు గుండె దడదడలాడింది. ఆనాటి రాత్రి జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. నెమ్మదిగా అరుగు అంచున కూర్చుండి చెప్పాడు. "పొలం అమ్ముదామనుకుంటున్నాను సేటూ! నువ్వేగదా కొంటానంటివి. నాకు విసా వచ్చింది. మస్కట్ పోతున్న. యాదన్న తోలిస్తుండు. ఇప్పుడు అరవైవేలు కావాలె. చేను, ఇల్లు అమ్ముదామనుకుంటున్న. అలాగైతేనే అరవైవేలు జమ అయ్యేట్టున్నవి"

మల్లయ్య కోపం చల్లారిపోయింది. అతడిలో దురాశ మేల్కొంది. అత్యవసరం కాబట్టి పొలంను, ఇల్లును చవకగా కొనేయవచ్చు తన అప్పు వడ్డీతో వసూలు చేసుకోవచ్చు ఈ కరువులో నగదు డబ్బుతో వాటిని కొనడానికి ఎవరూ ముందుకు రారు. అందుకే తను ఏ రేటు అంటే అదే రేటు ఖాయం. ఇంత తొందరగా ఒప్పుకుంటే అతడికి అనుమానం రావచ్చు అందుకనే మొదట కొనలేనని చెప్పాలనుకున్నాడు.




"నువ్వు ఇల్లే అమ్ముకో, పొలమే అమ్ముకో! నేను మాత్రం కొనను, కొనలేను. నా బాకీ కట్టిన తర్వాతనే ఊర్లెనుండి కదలాలి. లేదంటే నీమీద కోర్టులో కేసు వేస్త. మస్కట్ కాదుగదా. ముంబాయి వెళ్ళ కుండా చేస్తరు. నేను అసలే తిక్కమనిషిని. నా తల తిరిగిందంటే ఎవరు చెప్పినా వినను. నేను ఏదో పాపమని ఓపిక పడు తుంటే నువ్వు నవ్వులాటనుకుంటున్నవు" గొంతు తగ్గించి అన్నాడు మల్లయ్య.

"ఎవరు కొంటరు సేటూ! పక్కన మీరే ఉన్నారు కాబట్టి మీరే కొనాలి. ఇల్లు కూడా కొనేసెయ్. నీ బాకీ డబ్బులు పట్టుకుని మిగతావి ఇచ్చేయ్. ఇప్పటికిప్పుడు కొనా లంటే ఎవరూ ముందుకు రారు. వచ్చినా రెండు కిస్తాలంటరు. లేదా మూడు కిస్తా లంటరు. ఒక్కసారి మాత్రం డబ్బు ఇవ్వరు. నాకు డబ్బు ఎప్పుడు చేతికొస్తే అప్పుడే వెళ్లడం" బతిమాలుతున్నట్టుగా అన్నాడు దేవరాజు.

ఇద్దరి మధ్యా అరగంటవరకూ చర్చ సాగింది. ముందుగా ఒప్పుకోలేదు మల్లయ్య. తర్వాత ఒప్పుకున్నాడుగానీ తనకు రేటు నచ్చితేనే తీసుకుంటానని చెప్పాడు. దేవరాజు తల్లీ, భార్యా కూడా ఒప్పుకోవాలని షరతు పెట్టాడు. దేవరాజు మనసు తేలికపడింది. సాయంత్రం తల్లితో వస్తానని ఆనందంగా ఇంటికి వెళ్ళాడు దేవ రాజు.

ఇంట్లో ఎలాంటి అలికిడి లేదు. మంచం పరుచుకుని తల్లి పడుకుంది. పద్మ ఒక మూల చాప పరుచుకుని పడుకుంది. ఏ రాత్రికో తప్ప పద్మ పగటిపూట ఏదో ఒక పనిచేస్తుంది తప్ప పడుకోవడం ఇంతవ రకూ చూడలేదు. ఆమెపై చేయి చేసుకున్న నుండీ ఇద్దరికీ మాటల్లేవు. అప్పుడప్పుడూ పద్మ బలవంతంగా మాట్లాడించినా ముభా వంగానే ఉంటున్నాడు దేవరాజు.

మంచం వద్దకు వెళ్ళి 'అమ్మా ఏమైందే పడుకున్నవు' అంటూ పలకరించాడు. నర్సవ్వ సమాధానం చెప్పలేదు. భార్య వద్దకు వెళ్లాడు. ఇద్దరు కూతుర్లను పక్కలో వేసుకుని మూడంకెవేసి పడుకుంది. దేవరా జును చూసి దిగులుతో మరింతగా ముడు చుకుంది.

భార్య తలపై చేయివేసి నిమురుతూ "పద్మా ఏమైందే? అవ్వ అక్కడ పడుకుంది, నువ్వు ఇక్కడ పడుకున్నావు. ఏదో చెడ్డ గడియవచ్చింది. నీపై చేయి చేసుకున్నం దుకు ఎంత బాధపడుతున్నానో తెలుసా? సంసారమన్నాక ఎన్నో ఉంటాయి. ఇట్ల తిరిగి పడుకుంటే ఎట్లా? " బాధగా అన్నాడు దేవరాజు.

అతడివైపు కన్నెత్తికూడా చూడలేదు పద్మ. ఆమెకు దుఃఖం ముంచుకొస్తోంది. బలవంతంగా దుఃఖాన్ని దిగమింగుకుంటూ చెప్పింది. "నాకు చేతనైతలేదు. అన్నం, కూర వండిపెట్టాను. పెట్టుకుని తిను"

కొద్దిసేపు పద్మను బతిమాలాడు దేవ రాజు. పద్మ లేవలేదు. మెల్లిగా తల్లి వద్దకు వెళ్ళాడు. అతడి కళ్లలో నీళ్లు తిరిగాయి. గొంతు బొంగురుగా మారిపోయింది.

"అవ్వా! ఇంకో వారంరోజులు గడిస్తే మీరు కనబడాలన్నా నేను కనబడను. ఐదేండ్లవరకూ మీ ఆపద చూడరాను. అవ సరాలు చూడరాను. మీరు నా ఆపద చూడరారు. ఈ నాలుగురోజులైనా కొట్లాడు కోకుండా కలిసివుందాం! నాకు విసా వచ్చింది. ఎవరు వద్దన్నా ఎవరుకాదన్నా వెళ్తాను. ఇక్కడుంటే అప్పుల బాధతోనే మరణిస్తాను. ఏడాదిలో అసలు, వడ్డీ తీరుస్త. మీరు బాధపడి నన్ను బాధపెట్ట కండి" ఏడుస్తున్నట్టుగా అన్నాడు దేవరాజు.

ఆ మాటలకు నర్సవ్వ హృదయం కదలి నట్టయింది. దిగ్గున లేచి కూర్చుని కొడుకు వైపు జాలిగా చూసింది. ఆమె కళ్లలో కూడా నీళ్ళు తిరిగాయి. దుఃఖం పొంగివ చ్చింది. భర్తను తలచుకుని పెద్దగా



ఏడ్వడం మొదలెట్టింది. దేవరాజు మంచం మీద కూర్చుని కన్నీరు కారుస్తూ కాలిగోటితో నేలగీతలు గీస్తున్నాడు. పద్మ లేచి అత్తను ఓదార్చడం మొదలెట్టింది.

ఆమె ఏడుపు విని ఇరుగు పొరుగువారు వచ్చారు. "మంచివాళ్ళకే కష్టాలు వస్తాయి. దేవతలకే కష్టాలు తప్పలేదు. మనమెంత?" అని ఓదార్చారు. "మస్కట్ వెళ్తానని మంకు పట్టు పట్టె. ఇక్కడ మాత్రం ఏముంది? ఎందరు వెళ్ళడంలేదు. వెనుకటికి కాశికి పోతే కాటికి పోయినట్టే అందురు. ఇప్పుడు బస్సులు, రైల్లు విమానాలాయె! గంటలో దునియా మొత్తం తిరిగివస్తున్నరు. వెళ్తే వెళ్ల నియ్యి. రెండు మూడేండ్లు ఉండివస్తడు" అని నర్సవ్వకు సర్దిచెప్పారు.

గుండె బరువు తగ్గేవరకు ఏడ్చింది నర్సవ్వ. మనసును రాయి చేసుకుంది. లేచి కొడుక్కు భోజనం వడ్డించింది. అతడు భోజనం చేస్తుంటే మోకాళ్లు ముడుచుకుని ఎదురుగా కూర్చుంది. ఇంతకుముందు జరిగిన సంఘటనే ఆమె కళ్లముందు కదులుతోంది. ఆ విషయం కొడుక్కు చెప్పకూడదని మొదటనే నిర్ణయించుకుంది. ఈ విషయం మనసులోనే దాచుకోవాలని కోడలుకు కూడా చెప్పింది. సరేనని ఒప్పుకుంది పద్మ.

మారన్నం పెడుతూ పెదవి విప్పింది నర్సవ్వ. "వాడు మంచివాడు కాదు బిడ్డా! పక్కలో పాములాంటివాడు. ఎప్పుడు కాటు వేస్తడో తెలియదు. నువ్వు వాడిని నమ్మి తిరుగుతున్నవు. వాడు మన కుటుంబాన్ని చెల్లాచెదురు జేస్తడు. ఇల్లు, పొలం అమ్మి బాకీలు కడదాం. ఎక్కడికైనా వెళ్లి కూలీ నాలీ చేసుకుని బతుకుదాం" హితవు చెప్పింది నర్సవ్వ. కొడుకు మారతాడన్న నమ్మకం మాత్రం లేదామెకు.

తల్లివైపు నవ్వుతూ చూశాడు దేవరాజు. "నమ్మినవాడిని చెడగొట్టి ఎవరూ బాగుపడరు. అయినా యాదన్న అటువంటివాడు కాదు. మస్కట్ నుండి వచ్చిననుండి చూస్తున్న. మాటంటే తప్పడు. ఒకరికి పెట్టుడేగాని ఒకరిది తినేమనిషి కాదు. అయినా ఆయన ఎటువంటోడైతే మనకెందుకు? మస్కట్ పంపిస్తాననంటున్నాడు. నేను వెళ్తానంటున్నాను. మీకేం కష్టమైతుంది. ఎంతమంది వెళ్తలేరు" కటువుగా అన్నాడు దేవరాజు. తాను అలా మాట్లాడితేనే తల్లి మౌనంగా ఉంటుందని అతడి ఉద్దేశం.

నర్సవ్వ కళ్లను కొంగుతో అద్దుకుంది. "ఇక నిన్ను విడిచి ఉండడమే కష్టంరా దేవీ! ఒక్క కొడుకని ఒళ్ళో పెట్టుకుని సాదుకున్న. నా ఆరోగ్యం ఏం బాగాలేదు. ఎప్పుడు చస్తానో తెలియదు. రోజుకొక్క తీరుగా ఉంటుంది ప్రాణం. నిన్ను విడిచిపెట్టి ఎన్నడైనా వారం రోజులు కూడా ఉన్నానటరా! ఐదేండ్ల పొద్దు వట్టిగనే గడుస్తుందా! కండ్ల వెంట ఎన్ని నీరు కారిపోవాలి" గద్గదస్వరంతో అన్నది.

పద్మ మౌనంగా గోడకు జారిగిలబడి శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. దుఃఖంతో ఆమె గుండె చెరువవుతోంది. మౌనంగా వెక్కుతోంది. దేవరాజు భోజనం పూర్తిచేసి చేయి కడుక్కుంటూ చెప్పాడు.

"అవ్వా! నన్ను అర్థం చేసుకోండి. నేనేం సుఖపడేందుకు వెళ్తున్నానా! నాకు మాత్రం మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళాలని ఉంటుందా? ఇన్నిరోజులు గారాబంగా ఏ బాధలు తెలువనియ్యకుండ పెంచినవు. ఇప్పుడు నాకు ఇద్దరు పిల్లలున్నరు. ఇక్కడ తినుకుంట తిరిగితే ఎట్ల బతుకుత. అవకాశం రాకపోవడం వేరు. ఇప్పుడు వచ్చాక ఎందుకు వదులుకోవాలి? నేను ఎవరెన్ని చెప్పినా వినను. మీరు ఏదేదో చెప్పి నన్ను ఆగం చెయ్యకండి. మీరు ఆగం కాకండి. ఏడ్చుకుంట సాగనంపకుండ్రి. చల్లగా దీవించి పంపుండ్రి"

తమ మాట వినడని అత్తా కోడళ్ళిద్దరికీ




అర్థమైపోయింది. కొద్దిసేపు ఎవరూ ఎవరితో మాట్లాడుకోలేదు. ముందుగా నర్సవ్వే తేరుకుంది. కొడుకు తన దారిలో రానందుకు వాడి దారిలో తనే వెళ్ళడం మంచిదనుకుంది. తను వద్దు వద్దని పట్టుబడితే ఏ అఘాయిత్యం చేసుకుంటాడోనని భయపడి తనకు తాను సర్ది చెప్పుకుంది. పద్మ మాత్రం ఎటూ తేల్చుకోలేక దిగులుగా అలాగే కూర్చుండిపోయింది. ఇద్దరు కూతుళ్లను దగ్గరికి తీసుకుని కొద్దిసేపు ముద్దు చేశాడు దేవరాజు.

తర్వాత డబ్బు విషయం చర్చకు వచ్చింది. ఇల్లు, పొలం అమ్మి కడుతున్నట్టు తల్లికి చెప్పాడు దేవరాజు. ఆ మాటలకు విలవిలలాడిపోయింది నర్సవ్వ. ఇల్లు అమ్మేశాక ఎక్కడుండాలో తెలియలేదు ఆమెకు. కిరాయికి ఉండడమంటే నామోషీగా అనిపించింది. తల్లికి ఈ అనుమానం వచ్చిందని గ్రహించి యాదగిరి ఇంట్లో ఉండవచ్చని చెప్పాడు దేవరాజు. చెట్టు కిందైనా ఉంటాంకానీ వాడి ఇంట్లో ఉండమని ఖచ్చితంగా చెప్పింది నర్సవ్వ. విచిత్రంగా చూశాడు దేవరాజు. అతికష్టంమీద తల్లిని ఒప్పించి మల్లయ్య వద్దకు తీసుకుని వెళ్ళాడు. పద్మను కూడా రమ్మన్నాడు కానీ ఆమె వెళ్లలేదు.

పొలం అమ్మకూడదని వారిస్తే కొడుకు ఎక్కడ ఆగమైతాడోనని ఒప్పుకుని బయల్దేరింది నర్సవ్వ. పొలం అమ్మడానికి ఆమె అంత తొంగరగా ఒప్పుకోవడం పద్మకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

తల్లీ కొడుకులిద్దరూ మల్లయ్య వద్దకు చేరుకునేసరికి యాదగిరి కనిపించాడక్కడ. మల్లయ్యతో ఏదో విషయం చర్చిస్తున్నాడతడు. వీరిని గమనించి చెప్పడం ఆపివేశాడు. యాదగిరి అక్కడ ఉండడం నర్సవ్వకు కోపాన్ని కలిగించినా దేవరాజుకు మాత్రం చెప్పలేని సంతోషం కలిగింది. ఇద్దరు ముగ్గురు పెద్దలను పిలిపించి ఇల్లుకు, పొలానికి రేటు కట్టాడు మల్లయ్య. మార్కెట్ రేటు రెండింటికి కలిసి లక్షరూపాయలుంటుంది. కెనాల్ కింది పొలం. అదీ ఊరు అంచుననే! ఇల్లు చిన్నగా ఉన్నా ముందు వెనక ఖాళీ ప్రదేశం ఎక్కువగా ఉంది. రోడ్డుపక్కనే కాబట్టి షట్టర్లు వేసి దుకాణాలు పెట్టవచ్చు. వచ్చిన పెద్దలు మల్లయ్యకు అనుకూలంగా అరవైవేలకే ధర కట్టారు. నర్సవ్వకు భయం పట్టుకుంది. లక్షరూపాయలకు ఒక్క పైసా తక్కువ ఇవ్వనని ఖచ్చితంగా చెప్పింది.

దేవరాజుకు నోటమాట రాలేదు. లక్ష రూపాయలు ధర కడతారనుకున్నాడు. వారు అలా ఏకపక్షంగా మాట్లాడడం నచ్చలేదు. అలాగని అమ్మేది లేదని ఖచ్చితంగా చెప్పలేకపోతున్నాడు. తన అవసరాన్ని గమనించే అలా మాట్లాడుతున్నారని తెలిసిపోయింది.

"వాడేదో మొండిపట్టు పట్టాడని అమ్ముతున్న. నేను అమ్మేదిలేదని చెబితే వీడు ఎక్కడ ఆగమైతడోనని ఇక్కడికి వచ్చిన. బేరం అంటే ఉప్పుకు ఉప్పు అద్దుకున్నట్టు సరిగ్గా ఉండాలికానీ ఇలా సగంరేటు తక్కువ ఉంటదా! మాకు అవసరం ఉంది కదా అని తక్కువ రేటుకు అడిగితే ఇస్తమా... పొలం మంచిదేనాయే. ఇసుక పాతరలెక్క పంటపండుతది. ఇల్లు కొత్తదేనాయె. అలా ధర కట్టడం ఎంతవరకు న్యాయం?" అక్కడున్నవారిని ఉద్దేశించి అన్నది నర్సవ్వ.

"నువ్వు అమ్ముతానన్నవు కాబట్టి నాకు నచ్చిన ధరను నేను అడిగాను. నీ ఇష్టం ఉంటే అమ్ము. లేదంటే లేదు. ఇంతకంటే ఐదు పైసల రేటు ఎక్కువ ఇవ్వను. ఈ కరువులో కూటికి బతుకుడే కష్టమనుకుంటే లక్షలు పెట్టి పొలాలు ఎవరు కొంటరు. బేంక్‌లో వేసుకున్నా వడ్డీ అయినా వస్తది" నిరాసక్తిని ప్రదర్శిస్తూ అన్నాడు మల్లయ్య.

తల్లీకొడుకులిద్దరూ అసహాయంగా మిగిలి

పోయారు. అక్కడినుండి వెళ్ళిపోదామన్నా వెళ్ళలేని పరిస్థితి. యాదగిరి దేవరాజుపై జాలిని చూపుతూ సరియైన రేటుకు కుదుర్చుకోమని మల్లయ్యకు సలహా ఇచ్చాడు. "నా ఇష్టం. నేను అదే రేటును ఇస్తాను. అమ్మడం అమ్మకపోవడం వారి ఇష్టం" అన్నాడు మల్లయ్య.

నర్సవ్వ వెళ్ళిపోవడానికి సిద్ధమవుతుంటే కూర్చోమని చెప్పి మల్లయ్యను బతిమాలాడు దేవరాజు. మరో అరగంట చర్చల తర్వాత ఐదువేలు ఎక్కువిస్తానని అంతకంటే ఒక్క పైసా ఎక్కువ పెట్టలేనని చెప్పాడు మల్లయ్య. దేవరాజును పక్కకు పిలిచి, లేటయితే వీసా క్యాన్సిల్ అవుతుందని మళ్ళీ అంత జీతం ఉన్న కంపెనీ దొరకదని, ఇప్పటికిప్పుడు మల్లయ్య తప్ప ఎవరూ డబ్బు ఇచ్చి కొనరని, మస్కట్ వెళ్ళాక ఇంతకంటే ఎక్కువే సంపాదించుకోవచ్చునని నచ్చజెప్పాడు యాదగిరి. అతడి మాటలు బాగా పనిచేశాయి. తల్లివద్దని వారించినా ఒప్పుకున్నాడు దేవరాజు. దిగులుతో ఇంటిమొహం పట్టింది నర్సవ్వ.

మల్లయ్య తన బాకీ లెక్కచూసుకున్నాడు. వడ్డీ అసలుపోగా యాభైవేయిల రూపాయలు వస్తాయని వారంరోజుల్లో ఇస్తానని చెప్పాడు. వీసాకు ఆ డబ్బు సరిపోదు. మిగతా డబ్బు ఎలా అని ఆలోచిస్తున్నాడు దేవరాజు. స్టాంపు పేపర్లు రాసి అమ్మినవారిది, కొన్నవారిది సంతకం తీసుకున్నాడు. అనుకున్న ప్రకారం దేవరాజును ఒప్పించినందుకు యాదగిరికి పదివేల రూపాయలిచ్చాడు మల్లయ్య. మార్కెట్ రేటు ప్రకారం తనకు ఇంకో పాతికవేలు లాభం వచ్చినందుకు సంతోషంగా ఉంది అతనికి.

ఈ విషయం తెలిసిన అప్పులవాళ్ళు కోపంగా దేవరాజు ఇంటికి వెళ్ళారు. యాదగిరి ఇచ్చిన వీసా ట్రూకాపీ వారికి చూపిస్తూ మస్కట్ వెళ్ళగానే పంపిస్తానని బతిమాలాడు దేవరాజు. వారు యాదగిరిని కూడా కలుసుకున్నారు. వెళ్ళేది నిజమేనని చెప్పడంతో దేవరాజును ఇబ్బంది పెట్టలేదు. వారు ఎంత బాధ పెడతారో అనుకున్న దేవరాజు హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.

ఆరోజు రాత్రి మళ్ళీ నిద్ర కరువైంది వారికి. ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా ఆలోచిస్తున్నారు. కష్టపడి సంపాదించుకున్న పొలం, బిందెతో నీళ్లు మోసి కట్టుకున్న ఇల్లుతో ఆరోజుతో రుణం తీరిపోయిందన్న ఆలోచనే జీర్ణించుకోలేకపోతోంది నర్సవ్వ. పద్మకు భర్త దూరమవుతున్నాడన్న బాధ ఒకవైపు యాదగిరి తనను అలా అడగడం మరోవైపు బాధిస్తున్నాయి. దేవరాజుకు ఈ బాధలేవీ లేకపోయినా మిగిలిన పదివేలు ఎక్కడనుండి తేవాలన్న ఆలోచన పురుగులా తొలుస్తోంది.

తెల్లవారగానే అప్పుకొరకు బయల్దేరాడు దేవరాజు. అప్పటికే అతడికి వీసా వచ్చిన విషయం, ఇల్లు, పొలం అమ్మిన విషయం ఊరంతా తెలిసిపోయింది. వాటిని అమ్మాక కూడా అప్పు కొరకు తిరగడంతో అతడిని వింతగా చూస్తున్నారు. అంత తక్కువ రేటుకు అమ్మేది కాదని చెబుతున్నారు. కులంచెడినా సుఖమైనా దక్కాలి. సెంటు భూమిలేకుండా అమ్మినా వీసాకు సరిపడ డబ్బులయినా రావాలి. ఇలా ఎందుకు తొందర పడ్డావని అడుగుతున్నారు. అప్పు మాత్రం పుట్టలేదు. వారంరోజుల గడువు ఇచ్చి, తర్వాత వెళ్ళాలని చెప్పాడు యాదగిరి. దేవరాజుకు భయం పట్టుకుంది.

భర్త తన మనసు మార్చుకోడని తెలిశాక తన నిర్ణయం మార్చుకుంది పద్మ. ఆమె అలా మారడానికి అన్నివిధాలా నచ్చచెప్పింది నర్సవ్వ. భర్త దిగులును గమనించి ఒకసారి వచ్చి కలిసిపొమ్మని తండ్రి వద్దకు మనిషిని పంపింది. మరునాడు కోటయ్య వచ్చాడు. పరిస్థితినంతా వివరించి చెప్పింది





పద్మ. అల్లుడు మస్కట్ వెళ్ళడం అతడికి ఇష్టమే! చాలీచాలని బతుకులతో జీవితాంతం కష్టపడేకంటే రెండు మూడేండ్లు కష్టపడితే కొంత డబ్బు నిలవకు వస్తుందని, అలాగైనా కష్టాలు తీరుతాయని అతడి ఆశ.

అందుకే కూతురు దిగులు పడుతుంటే ధైర్యం చెప్పాడు. అక్కకు కూడా ధైర్యం చెప్పాడు. యాదగిరిని కలిసి డబ్బు వివరాలు, పని, జీతం, అన్నీ చర్చించాడు. మొదటిసారిగా తనకు మద్దతు లభించినందుకు కొండంత ఆనందమనిపించింది దేవరాజుకు.

పదివేలు తక్కువ పడ్డాయని అతడికి ఇంతకుముందే ఐదువేలు ఇచ్చేదని, కావున పదిహేను ఎక్కడైనా అప్పుతెచ్చి ఇవ్వమని తండ్రిని కోరింది పద్మ. పుట్టి బుద్ధెరిగిన నుండి ఏదీ కోరని కూతురు అలా అడగడంతో కాదని చెప్పలేకపోయాడు కోటయ్య. చివరిక్షణంలో డబ్బు తక్కువైతే వీసా కాన్సిల్ అవుతుందన్న భయం పట్టుకుందతనికి. అతడి చేతిలో కూడా డబ్బు లేదు. ఆర్థికంగా అంతంత మాత్రంగానే ఉన్నాడు. వెంటనే ఇంటికి వెళ్ళి భార్యకు, కొడుక్కు తెలియకుండా పదిహేను వేల రూపాయలు అప్పుతెచ్చి కూతురుకు ఇచ్చాడు. ముందుగా ఐదువేల రూపాయలు యాదగిరికి ఇవ్వమని పంపించింది పద్మ. ఖర్చులకని మల్లయ్యను బతిమాలితే మూడువేలు అప్పు ఇచ్చాడు.

ఒకరోజు ఊర్లన్నీ తిరిగి బంధువులందరికీ చెప్పి వచ్చాడు దేవరాజు. ఒక్కొక్కరు ఇంటికి చేరుకుంటున్నారు. రెండు బస్తాల బియ్యం, మిగతా వంటసరుకులు తెచ్చిపెట్టాడు దేవరాజు. పొద్దుంటే మాపు, మాపుంటే పొద్దుకు లేని ఆ ఇంట్లో మూడు పూటలా పొయ్యి వెలుగుతోంది. ఇంటికి అవసరమయ్యే కట్టెలు, ఇల్లు అలకడానికి ఎర్రమట్టి, ముగ్గు వేయడానికి సుద్ద మొదలగునవన్నీ తెచ్చిపెట్టాడు. ఇల్లు అమ్మినా తాము అందులోనే ఉండి కిరాయి ఇస్తామని మల్లయ్యను ఒప్పించింది నర్సవ్వ.

చేపలు, కల్లు, కోడిమాంసం, రొట్టెలు, మటన్ వండిపెట్టడం మొదలెట్టింది పద్మ. గుండెను ఎంతగా రాయి చేసుకుందామన్నా మనసును బాధ ఆవహిస్తూనే ఉంది ఆమెకు. తనలో తాను కుమిలిపోతూ కన్నీరును భర్తకంటపడకుండా దాచుకుంటోంది. నర్సవ్వకు కూడా దిగులుగానే ఉన్నా తాను ఏమాత్రం అధైర్యపడినా కోడలు ఏడుస్తుందని పైకి గంభీరతను ప్రదర్శిస్తోంది.

తను మస్కట్ వెళ్తున్నానని నెలకు పదివేల జీతం ఉంటుందని, లక్షాధికారిని అవుతానన్న ఆలోచన దేవరాజును ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. తన వాళ్ళను విడిచి వెళ్తున్నాననే బాధ ఏ మూలనో ఉన్నా డబ్బు సంపాదన అనే ఆలోచన దానిని కప్పివేస్తోంది. హుషారుగా తిరుగుతున్నాడు దేవరాజు. అతడి ఆనందంలోనే తాను తృప్తిని వెదుక్కుంటోంది పద్మ. తినే పదార్థాలేవి కనపడినా ఖర్చుకు వెనకాడకుండా కొంటున్నాడు. ఏమాత్రం అడ్డు చెప్పకుండా ఏది అడిగినా వండిపెడుతోంది పద్మ.

దేవరాజు చెల్లెలు, బావ, పిల్లలు వచ్చారు. దూరపు బంధువులు కూడా వచ్చారు. అరకొరగా ఆ కుటుంబానికి ఆరు నెలలపాటు సరిపోయే ఖర్చులన్నీ వారంరోజుల్లోనే పూర్తయ్యాయి. దూరదృష్టి ఉండి దేవరాజు నుండి ఎంతో కొంత ఆశించే మిత్రులు, ప్రత్యేకంగా తమ ఇంటికి తీసుకుని వెళ్ళి విందు ఇస్తూ 'నువ్వు మస్కట్ నుండి తిరిగి వచ్చాక మాతో మాట కూడా మాట్లాడుతావో లేదో' అంటూ ముందే చురకను అంటిస్తున్నారు.

జీవితంలో ఎన్నడూ లేనంతగా ఖర్చు చేశాడు దేవరాజు. ఇద్దరు ముగ్గురు మిత్రుల వద్ద కొద్దిపాటి డబ్బును అప్పు తీసుకున్నాడు. అతడు వెళ్తున్నది నిజమేనని



తెలిశాక ఇంతకంటే ఎక్కువ వసూలు చేసు కోవచ్చుననే ధీమాతో దగ్గరకు రానీయని వారు కూడా అడగగానే అప్పు ఇస్తున్నారు. బంధుమిత్రుల అడ్రస్‌లన్నీ పాకెట్ డైరీలో వ్రాసుకున్నాడు దేవరాజు.

అనుకున్న ప్రకారం వారంరోజుల తర్వాత డబ్బు ఇచ్చాడు మల్లయ్య. దానికి పదివేలు కలిపి యాదగిరికి ఇచ్చాడు దేవరాజు. యాదగిరి బస్‌టికెట్లు బుక్ చేశాడు. మెడికల్ సర్టిఫికెట్, ఖర్చులకు మూడువేల రూపాయలు వెంట తెచ్చుకొమ్మన్నాడు యాదగిరి.

ప్రతిరోజూ దేవరాజు ఇంటికి వెళ్తూ పద్మతో మాట్లాడాలని ప్రయత్నిస్తూ విఫలమవుతున్నాడు యాదగిరి. రోజురోజుకు అతడిలో పట్టుదల పెరిగిపోయింది. భార్యను పంపించి పద్మను తీసుకురమ్మని చెప్పాడు. అసలు విషయం ఆమెకు తెలియదు కాబట్టి ఇంటికి రావడం మానేశావెందుకని పద్మను నిలదీసింది. సుశీలకు ఏ సమాధానం చెప్పక మౌనంగా ఉండిపోయింది పద్మ. దేవరాజును పంపాక పద్మను లొంగదీసుకోవడానికి ఒక తిరుగులేని ప్లాన్‌ను ఆలోచించాడు యాదగిరి. దేవరాజు వెళ్ళగానే అమలు చేయాలనుకున్నాడు.

★ ★ ★

ఆరోజు మధ్యాహ్నంపూట చిన్న సూట్‌కేస్‌తో బయలుదేరాడు దేవరాజు. ఒక దుప్పటి, ఒకలుంగీ, ఒక డ్రెస్, కొన్ని పిండి వంటలు ఉన్నాయి అందులో. ముంబాయిలో ఎక్కువరోజులుండేది లేదని, అందుకే ఎక్కువగా వస్తువులు తెచ్చుకోవద్దని చెప్పాడు యాదగిరి. అంతవరకూ ధైర్యంగా తిరిగిన దేవరాజు వెళ్లేముందు మాత్రం బేలగా మారిపోయాడు. ఒక్కడే వెళ్తున్నాడనే ఫీలింగ్ కలిగిందతనికి. పద్మ భర్త మీదపడి బావురుమని ఏడ్చింది. నర్సవ్వ కూడా కొడుకు మొహాన్ని తడుముతూ బావురుమంది. బంధువులు కన్నీరు పెట్టుకున్నారు. పద్మను, నర్సవ్వను ఓదార్చారు.

భర్త బయటకు అడుగుపెట్టగానే కుప్పలా కూలిపోయింది పద్మ. బస్సు వెళ్ళిపోతుందని యాదగిరి తొందర చేయడంతో భార్యకు ఏడుస్తూనే ధైర్యం చెప్పాడు దేవరాజు. గుండెనిండా దిగులుతో గడపదాటి తల్లివైపుకు తిరిగి అన్నాడు. "అవ్వా! నీ ఆరోగ్యం జాగ్రత్త. పద్మ, పిల్లలు పైలం. మంచిగ కలిసి ఉండండి. నువ్వు అప్పులున్నయని రంది పెట్టుకోకు. ఏడాదిలో అన్నిటిని తీరుస్తా! మందులు మంచిగ వాడుకో. నామీద రంది పెట్టుకోకు"

బస్టాండువరకూ బంధువులందరూ వెంటవెళ్లారు. కొడుకు పదిలమని యాదగిరికి చెప్పాలనుకుని మానుకుంది నర్సవ్వ. ఆ ఊరిలో బస్సు ఎక్కి పక్కఊరిలో దిగారిద్దరు. అక్కడ గంటవరకు ఎదురుచూస్తే ముంబాయి బస్సు వచ్చింది. పదహారు గంటల ప్రయాణం తర్వాత ముంబాయి చేరుకున్నారిద్దరు.

ఇంటివద్ద బంధువులంతా ఆరోజే వెళ్ళిపోయారు. అత్తాకోడళ్లు ఇద్దరే మిగిలారు. సర్వస్వం కోల్పోయి వైరాగ్యం ఆవహించిన వ్యక్తుల్లా మారిపోయారు. దేవరాజును గుర్తుచేసుకుని కుమిలి కుమిలి ఏడుస్తున్నారు.

★ ★ ★

ముంబాయిలో దిగగానే ఆటో తీసుకుని ఆఫీస్‌కు వెళ్ళారిద్దరూ. యాదగిరి హిందీలో ఏదో మాట్లాడాడు. ఆఫీసులో ఉన్న వ్యక్తి ఏదో బదులిచ్చాడు. యాదగిరి మొహంలో చిరునవ్వు కనిపించింది. దేవరాజుకు హిందీరాదు. ముఖకవళికలనుబట్టి అంతా సవ్యంగా జరుగుతోందని పసిగట్టాడు. వారి సంభాషణలో రెండుమూడు సార్లు ప్లేన్ రెడీ, మెడికల్ రిపోర్ట్ అన్న పదాలు విని పించి పరిస్థితి కొద్దిగా అర్థమైంది.





కొద్దిసేపు మాట్లాడాక సూట్‌కేస్ అక్కడే ఉంచి బయల్దేరమన్నాడు యాదగిరి "ఎక్కడికి! మెడికల్ రిపోర్ట్‌కా?" అని అడిగాడు దేవరాజు. అవునన్నట్టు తలూపాడు యాదగిరి. తను అదేరోజు ప్లేన్ ఎక్కుడే అనుకున్నాడు దేవరాజు. అదే విషయం యాదగిరిని అడిగాడు. రెండుమూడు రోజులు పడుతుందని చెప్పాడు యాదగిరి. కొద్దిగా అసంతృప్తికి గురయ్యాడు దేవరాజు.

ఇద్దరూ కలిసి హాస్పిటల్‌కు వెళ్ళారు. యాదగిరికి పరిచయం ఉన్న డాక్టర్ అతడు. మెడికల్ చెకప్‌కు ఎవరినైనా అక్కడికే తీసుకువెళ్తుంటాడు. దేవరాజుతో ఎనిమిది వందలు ఫీజు కట్టించి మెడికల్ చెకప్ చేయించాడు. హెచ్.ఐ.వి., ఇ.సి.జి., బి.పి., షుగర్ టెస్ట్‌లు చేశాక హైడ్రోసిల్ ఉందని ఆపరేషన్ చేయాలని చెప్పాడు డాక్టర్?

ఆ విషయం ఇంతకుముందే నాతో ఎందుకు చెప్పలేదని నిలదీశాడు యాదగిరి. దేవరాజు బిక్కమొహం వేశాడు. గుండెలో రాయిపడ్డట్టయింది. "నువ్వు అడిగావా... చెప్పడానికి? అయినా దీంతో నష్టమేమిటి? ఇది ఉండగా నేను ఇక్కడ పనిచేయడం లేదా? చిన్నప్పుడు కబడ్డీ ఆడుతుండగా కాలువట్టి గుంజినప్పుడయింది. ఇదేం రోగమా నొప్పా?" అమాయకంగా అడిగాడు దేవరాజు.

"మస్కట్ పోవాలంటే అన్ని మంచిగుండాలె. మనకు వేలకువేలు జీతం ఇచ్చేది కూసుండి తినుడుకు కాదు, కష్టం చెయ్యడానికి. కష్టం ఎట్లజేస్తం...? అన్ని మంచిగ ఉంటెనే గదా? అక్కడ జెరమొచ్చి పడుకుంటె వండి పెడుతరనుకున్నావా? నువ్వు ఇప్పుడు మెడికల్‌లో ఫేలయినట్టే! ఒక్క మాట ముందుగ చెప్పితే నీ పాస్‌పోర్ట్ తీసుకోకపోనుంటిని" విసుగ్గా అన్నాడు యాదగిరి.

దేవరాజు గుండె దడదడలాడింది. యాదగిరిని బతిమాలుతున్నట్టుగా అన్నాడు. "యాదన్నా! ఇంతదూరం చేసుకచ్చినవు. ఇదొక్కటి చెయ్యి. ఏనుగెల్లింది. తోకచిక్కింది. ఇక్కడ నన్ను ఆపేస్తే ఏమొహం పెట్టుకుని ఊర్లెకు పోవాలె, ఇక్కడ ఏ బస్సుకిందో, రైలుకిందో పడి చావమన్నా చస్తాను కానీ ఇంటి మొహం చూడను. అక్కడ నా కంటూ ఏమిలేదు"

మొదట వినిపించుకోలేదు యాదగిరి. కాళ్ళబేరానికి వచ్చి ఏడుస్తుండడంతో ఒప్పుకున్నాడు. అదనంగా రెండువేలు అవుతాయిని, డాక్టర్‌కు లంచం ఇవ్వాలని అబద్ధం చెప్పాడు. తన వెంట తెచ్చుకొన్న డబ్బులోంచి రెండు వేల రూపాయలు తీసి ఇచ్చాడు దేవరాజు. అతడివద్ద కేవలం రెండువందలు మాత్రమే ఉన్నాయి. మూడు రోజులు గడిస్తే చాలు. డబ్బు ఎందుకు? అనుకున్నాడు దేవరాజు.

రెండువేలు జేబులో పెట్టుకుని, గదిలోకి వెళ్ళి డాక్టరుతో మాట్లాడి అరగంట తర్వాత బయటకు వచ్చాడు యాదగిరి. అతడిచేతిలో కాగితాలున్నాయి. బయట కూర్చున్న దేవరాజుకు క్షణమొకయుగంలా గడిచింది. తెలిసిన దేవుళ్ళందరికీ మొక్కుకున్నాడు. యాదగిరి రాగానే లేచి నిలబడి ఏమైందని ఆతృతగా అడిగాడు.

"నువ్వు అదృష్టవంతుడివిరా దేవరాజు. ఇంకో డాక్టర్ ఉంటే మరో జన్మక్కూడా నీకు సర్టిఫికెట్ ఇచ్చేవాడుకాదు. ఈ డాక్టర్ మంచివాడు. మనం ఒక గంట లేటుగా వచ్చినా నెలరోజులవరకు మళ్ళీ కనిపించేవాడు కాదు. ఎక్కడికో వెళ్ళి పోతున్నాడట. అన్నీ ఓ.కే. చేశాడు. ఐదు వేలకు తక్కువ తీసుకోనన్నాడు. బతిమాలి రెండువేలు ఇచ్చి వచ్చాను" నవ్వుతూ దేవరాజు భుజం మీద చేయివేసి చెప్పాడు.

కొండంత బరువు దిగినట్టయింది దేవరాజుకు. ఒకసారి రిలీఫ్‌గా ఫీలయ్యాడు. ఇద్దరూ కలిసి ఆఫీసుకు వెళ్ళారు. కాగితా

లను, ఒరిజినల్ పాస్‌పోర్ట్‌ను ఆఫీసులో ఇచ్చారు. అప్పటికే సాయంత్రం అయింది. రెండు రోజుల తర్వాత రమ్మని చెప్పాడు ఆఫీసులో ఉన్న వ్యక్తి.

ఆఫీసుకు దగ్గరలోనే ఒక చిన్న గదిని దేవరాజు కొరకు అద్దెకు కుదిర్చాడు యాదగిరి. అందులో ఇదివరకే ముగ్గురు వ్యక్తులున్నారు. కాళ్ళు చాచి పడుకోవడానికి క్కూడా వీలులేదు. పక్కనే మురికి కాలువ. దోమల బాధ ఎక్కువ. ముక్కుపుటాలు అదిరిపోయే దుర్వాసన. హోటల్‌లో భోజనం చేసి అందులో పడుకోవాలి. యాదగిరి బంధువులింట్లో ఉంటానని, మరునాడు కలుస్తానని వెళ్ళిపోయాడు.

ఆరోజు రాత్రి దేవరాజుకు నిద్రపట్టలేదు. కొండదోమలు చుట్టుముట్టి రక్తాన్ని పీల్చాయి. దుర్వాసనకు తలనొప్పి మొదలయింది. ఊపిరిపీల్చుకుందామన్నా గాలిలేనట్టు ఇరుకుగా ఉంది. ఒక్కరుకూడా మసలుకోవడానికి కష్టమే అందులో. రెండుగోడలమధ్య ఖాళీ ప్రదేశం ఉంటే పైకప్పుగా ఒకరేకును వేసి రోజువారీగా కిరాయికిస్తున్నారు దాన్ని. మనిషికి రోజుకొక్కింటికి ఇరవై రూపాయలు. అంత చవకగా గదులు దొరకడం ఆ ప్రదేశంలో చాలా అరుదు.

కాళ్ళు ముడుచుకోవడానిక్కూడా వీలులేకుండా కదలకుండా, మెదలకుండా జాగారం చేశాడు దేవరాజు. మిగతా ముగ్గురూ తన లాగే మస్కట్ వెళ్దామని ఇక్కడికి వచ్చిన వారేనని వారి మాటలద్వారా గ్రహించాడు. అటువంటి రూంలు ఏడు ఉన్నాయి అక్కడ. దాదాపు ఇరవై ముప్పై మంది ఉన్నారక్కడ. రెండే రోజులు కదా అని తన నుతాను ఓదార్చుకున్నాడు. అందరికీ కలిపి ఒకే లెట్రిన్‌కం బాత్‌రూం. అక్కడ పనవాలంటే రాత్రినుండి క్యూ కట్టాలి.

ఆ రూంలోనే రెండు రోజులు గడిపాడు దేవరాజు. యాదగిరి వస్తాడని ఎదురు చూశాడు. యాదగిరి మళ్ళీ కనిపించలేదు. తనవద్ద ఉన్న రెండువందల రూపాయల్లోంచి రెండురోజుల కిరాయి చెల్లించాడు. రోజుకొక్క పూట పక్కనే ఉన్న చిన్న హోటల్‌లో భోజనం చేశాడు. వందరూపాయలు మాత్రమే మిగిలాయి.

మూడవనాడు యాదగిరి వస్తాడని పొద్దున్నే కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసి వచ్చాడు దేవరాజు. గదిలోకి వచ్చి చూస్తే షర్ట్ జేబులో డబ్బుల్లేవు. అందరినీ అడిగి చూశాడు. ఎవరూ చూడలేదని చెప్పారు. దేవరాజుకు బాధ కలిగింది. ఎలాగూ ఈరోజు వెళ్తున్నాను కదా అని సర్ది చెప్పుకున్నాడు.

అక్కడున్నవారిలో ఎక్కువమంది తన లాగే వచ్చారని తెలుసుకున్నాడు. ఒకరిద్దరితో పరిచయం ఏర్పడింది. వారికి తను ఈరోజు మస్కట్ వెళ్తున్నట్టు చెప్పాడు. వారు దేవరాజువైపు జాలిగా చూసి నవ్వారు. దేవరాజు మధ్యాహ్నంవరకు యాదగిరికొరకు ఎదురుచూసి ఆఫీసుకు వెళ్ళాడు. ఎవరిని అడిగినా యాదగిరి గురించి తెలియదని చెప్పారు. మొదటి రోజు తను చూసిన వ్యక్తి ఆఫీసులోలేడు.

యాదగిరి సాయంత్రంవరకు అక్కడే ఉన్నాడు. తను పాస్‌పోర్ట్ ఇచ్చానని మస్కట్ వెళ్ళేది ఉందని ఆఫీసులో చెప్పాడు. ఒక వ్యక్తి పాస్‌పోర్ట్‌లన్నీ తిరగేసి రేపురమ్మని చెప్పాడు. దేవరాజుకు ఆకలిగా ఉంది. రూంకు వచ్చి నీళ్ళుతాగి పడుకున్నాడు.

తెల్లవారగానే మళ్ళీ ఆఫీసుకు వెళ్ళాడు. ఎవరూ సరియైన సమాధానం చెప్పడం లేదు. యాదగిరి ఎవరో తెలియదన్నారు. దేవరాజుకు భయం పట్టుకుంది. బాధగా రూంకు తిరిగి వచ్చాడు. అన్నం తినక రెండురోజులయింది. కళ్ళు తిరుగుతున్నాయి. తన బాధనంతా రూంలో ఉన్న మరో వ్యక్తితో చెప్పుకుని ఏడ్చాడు.

"అరే తమ్మీ! మేము మూడునెలలవు తుంది ఆఫీసులచుట్టూ తిరగవట్టి. నువ్వూ మాలాగే మోసపోయావు. ఇప్పుడు ఇంటికి వెళ్ళడానికి మొహం చెల్లకనే ఇక్కడుంటు న్నాము. గంటెపుస్తెలు అమ్మి డబ్బులు కట్టి నము. నువ్వుగట్ల అధైర్యపడకు, నిన్ను తోలుకవచ్చిన ఏజెంట్‌ను దొరికిచ్చుకుని తోలిస్తవా డబ్బు ఇస్తవా అని అడుగు" అంటూ ధైర్యం చెప్పి యాభైరూపాయలు బదులిచ్చాడు.

మరునాడు కోపంగా ఆఫీసుకు వెళ్ళాడు దేవరాజు. అక్కడ ఉన్న వ్యక్తిని డబ్బులు ఇవ్వమని నిలదీశాడు. అతడు హిందీలో ఏవో మాటలన్నాడు. మరో వ్యక్తి వచ్చి నువ్వు మాకు ఒక్కపైస ఇవ్వలేదు. ఎవరికి చ్చినవో వాన్నె అడుగు. ఇక్కడికి మళ్ళీ వచ్చినవంటె పోలీసులకు పట్టిస్త అని బెది రించి దేవరాజును బయటకు నెట్టివేశాడు.

యాదగిరి తనను మోసం చేశాడని గ్రహించాడు దేవరాజు. ఇంటికి వెళ్ళిపోదా మనుకున్నాడు. ఏం మొహం పెట్టుకుని వెళ్ళాలి. అప్పులవాళ్ళకు ఏమని బదులు చెప్పాలి. తల్లి, భార్య వద్దని వారించినా వినలేదు. వారికి ఏ సమాధానం చెప్పాలి. తను ఇక్కడ ఉంటే కాస్తనైనా ఊరట ఉంటుంది వారికి. తను అక్కడికి వెళ్తే బాధ పడతారు అనుకుని ఆ ఆలోచన మానుకు న్నాడు.

అప్పటికే ఇల్లు కిరాయి బకాయిపడ్డాడు. అప్పులయ్యాయి. రూంలోంచి ఖాళీచెయ్యా మంటున్నాడు ఓనర్. కాస్త వసతులున్న గదిలోకి మారుదామంటే కిరాయి ఎక్కువ. ఏంచెయ్యాలో పాలుపోలేదు. అపరిశుభ్ర మైన ఇరుకు గదిలో ఏదో ఆశతో ఇన్నాళ్ళు ఉన్నాడు. గంటలతరబడి క్యూలో నిలబడి కాలకృత్యాలతోపాటు అక్కడే స్నానం చేయడం అసహ్యమనిపించింది. వెంట ఒక్కటే దుప్పటి తెచ్చుకున్నాడు. కప్పుకుంటే పరుచుకోవడానికి, పరుచుకుంటే కప్పుకోవ డానికి లేదు.

బాగా ఆలోచించి ఇంటికి వెళ్ళకూడదనే నిర్ణయించుకున్నాడు దేవరాజు. అక్కడ ఉండాలంటే డబ్బు కావాలి. రూంలో ఉన్న ఒక వ్యక్తితో కలిసి లేబర్ అడ్డా దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు. బిల్డింగ్ కాంట్రాక్టర్ వద్ద కూలీ పని దొరికింది. అక్కడ తనలాగా వచ్చి కూలీ చేసుకుంటున్నవారు చాలా మంది ఉన్నారని గ్రహించి కాస్త ఊరట పొందాడు. ఇంటికి ఉత్తరం రాయాలన్నా భయంగానే ఉంది. అందుకే ఆ పని కూడా మానుకున్నాడు. అరగంట ఆలస్యమైతే గుమ్మం వద్ద నిలబడి తనకొరకు ఎదురు చూసే భార్య గుర్తొచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరి గాయి.

పొద్దంతా కూలీకి వెళ్ళడం, సాయంత్రం ఆఫీసుకు వెళ్ళడం, యాదగిరి వస్తాడని రాత్రి వరకూ ఎదురుచూడడం, నిరాశగా తిరిగి వచ్చి పడుకోవడం, మళ్ళీ సాయంత్రం ఆశతో ఆఫీసుకు వెళ్ళడం దినచర్యగా మారి పోయింది దేవరాజుకు. మధ్యలో రెండురో జులు జ్వరం వచ్చింది. మందులు కొనడా నికైనా కూలీకి వెళ్ళక తప్పలేదు.

అతికష్టంమీద నెలరోజులు గడిచాయి. నెలరోజుల్లో ఎంతోమంది కలిశారు దేవరా జుకు. తమ కష్టాలు చెప్పుకున్నారు. ఏజెంట్ ఎలా మోసం చేసిందీ చెప్పుకు న్నారు. బతుకుదెరువు కోసం భార్య, పిల్ల లను వదిలి గల్ఫ్ పోదామని వచ్చి ఇక్కడ చిక్కుపడ్డ కథలు విన్నకొలది దేవరాజు హృదయం తరుక్కుపోతోంది. ఈ ప్రయ త్నంలో ఎందరు ఆత్మహత్య చేసుకున్నదీ, ఎన్ని కుటుంబాలు కూడు, గుడ్డకు కరువై అల్లల్లాడుతున్నదీ చెప్పారు వారు. గడప లోపల ఉన్న సుఖం కైలాసంలో కూడా ఉండదని భార్య చెప్పిన మాటలు గుర్తుకొ చ్చాయి దేవరాజుకు.

"నేను ఎవలు చెప్పినా వినలేదు. ఏజెం ట్‌గాని మాయమాటలు నమ్మి ఇల్లు,



పొలం అమ్ముకుని వచ్చాను. నేను ఇంటికి వెళ్తే అవ్వ గుండె పగిలి చస్తది. అప్పులోల్లు బతుకనీయరు. ఇక్కడుంటె నేను బతికెట ట్టులేను. నేనేం చెయ్యాలె. మూడురోజుల్లో తోలిస్తానన్నాడు. నెలరోజులైనా పత్తాలేడు" ఏడుస్తూ బాధనంతా చెప్పుకున్నాడు దేవ రాజు. "ఏజెంట్ స్వంత ఊరివాడే కాబట్టి ఎక్కడికీ వెళ్ళడని, తప్పకుండా వస్తాడని" ధైర్యం చెప్పారు వారు.

వారంరోజులు గడిచాక ఒకరోజు ఉదయం ప్రత్యక్షమయ్యాడు యాదగిరి. దేవరాజుకు కోపం, దుఃఖం ముంచుకొ చ్చాయి. తనను మోసం చేశావని ఆవేశంగా విరుచుకుపడ్డాడు. యాదగిరి నవ్వడం తప్ప మరో సమాధానం చెప్పలేదు. అతడి ఆవేశం చల్లారిపోయి అరవడం మానివేశాక నెమ్మదిగా చెప్పాడు యాదగిరి.

"నీ అదృష్టం మంచిదిరా దేవరాజు! ఇంతకుముందు కంపెనీకంటే ఇది చాలా మంచిది. మున్సిపాలిటీ పని. రోడ్డుమీద కాగితాలు ఏరి సంచిలో వేసుడు. డ్యూటీ ఎంతనో ఓవర్‌టైం అంత. తిండి కంపెనీదే! ఏ నెల జీతం ఆ నెలాఖరులో ఇచ్చుడు. పది వేల జీతం, ఓటీ చేసుకుంటే ఐదు వేలు. మొత్తం పదిహేను వేలు. నాక్కూడా అంత జీతం లేకుండె!

"నీ ఇష్టమున్నన్ని సంవత్సరాలుండు. వచ్చేప్పుడు రిటర్న్ విజా ఇస్తరు. నాలుగు నెలల చుట్టీ ఇస్తరు. జీతం గూడా కట్టి స్తరు. కష్టపడినందుకు మంచి పనిదొరి కింది. కూర్చుండి తిన్నా తరగని పైస సంపాయిస్తవు"

ఉన్నకాస్త ఆవేశం చల్లారిపోయింది. దేవ రాజు కాసేపు అలకను, బింకాన్ని ప్రదర్శించి మామూలుగా మారిపోయాడు. కంపెనీ గురించి, అక్కడ వసతుల గురించి యాద గిరి వివరించి చెబుతుంటే పొంగిపో యాడు. సూట్‌కేస్ పట్టుకుని అందరికీ చెప్పి ఆఫీసుకు బయల్దేరాడు. తను ఒక్క డినే వెళ్తున్నానన్న భయం మళ్ళీ ఆవహిం చింది. తనతో మీరెవరైనా వస్తున్నారా అని అడిగాడు యాదగిరిని.

అది అరుదైన అవకాశమని, అటువంటి కంపెనీలో ఎక్కువ ఖాళీలు ఉండవని చెప్పాడు యాదగిరి. ఒక్కడు వెళ్ళినా ఎలాంటి ప్రాబ్లమ్ ఉండదని అక్కడ దిగ గానే కంపెనీ వ్యక్తి కారులో వచ్చి తీసుకు పోతాడని, భయపడకూడదని ధైర్యం చెప్పాడు యాదగిరి.

మొండిధైర్యం చేసుకొని ముందుకు కది లాడు దేవరాజు. ఆఫీసుకు చేరుకున్నాక రెండు గంటల్లో పనులన్నీ పూర్తిచేశాడు యాదగిరి. తనను మెడపట్టి నెట్టిన వ్యక్తి కూడా అక్కడ ఉన్నాడని గుర్తించాడు దేవ రాజు. అతడు దేవరాజును ఎప్పుడూ చూడ నట్టు నటించాడు. ఎయిర్‌పోర్ట్‌కు ఫోన్ చేసి టైం వివరాలు కనుక్కున్నాక టాక్సీలో ఎయిర్‌పోర్ట్‌కు బయల్దేరారు నలుగురు వ్యక్తులు.

తను వెళ్తున్నాననే ఆనందం ఒకవైపు. అందరినీ విడిచి వెళ్తున్నాననే బాధ మరో వైపు కుదిపేస్తుంటే దేవరాజు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దుఃఖం పొంగుకు వచ్చింది. కన్నీళ్ళు తుడుచుకుంటూ యాదగిరితో అన్నాడు, "యాదన్నా! నా పిల్లలు, పెళ్లం ఎట్లుంటరో? ఎప్పుడన్న అటు దిక్కు తొంగి చూడు. ఏమన్న అవసరం పడితే తెచ్చి ఇయ్యి. అవ్వ పాణం బాగుండది. అప్పుడ ప్పుడు దవాఖానకు తోలుకపోయి డాక్టర్‌కు చూపించు. నామీద జరంత దయ ఉంచు. పద్మ బెంగటిల్లుతది. ఏం కాదని ధైర్యం చెప్పు. మల్లయ్య ఇల్లు ఖాళీ చెయ్యమంటే నీ ఇంట్లో ఉండనియ్యి"

యాదగిరి ధైర్యం చెబుతున్నట్టుగా అన్నాడు. "నువ్వేం బాధపెట్టుకోకురా దేవ రాజు. నేను ఇంటిదగ్గరనే ఉంటిని. ఆ మాత్రం చూడనా...? నువ్వు వచ్చేదాక ఏ అవసరమున్నా తీరుస్త. నువ్వు గూడా





అప్పుడప్పుడు కారటు పెయ్యి. పిరికిసన్నాసి. వట్టిగ బెంగటిల్లకు. కష్టపడంది పైసరాదు. ఎవ్వల తెరువు బోకు"

"యాదన్నా! ఒక్కన్నే పోవడితిని. అక్కడ ఎటుపోవాలో తెల్వదాయె. ఎవలన్న అక్కడ ఉంటరా? నేనే అని వారికి ఎట్ల తెలుసు" అడిగాడు దేవరాజు దుఃఖాన్ని ఆపుకుంటూ.

"నిన్ననే ఫోన్ చేసినం. ఈ ఫ్లైట్‌కు వస్తున్నట్టు తెలిపినం. ఇంతకుముందు గూడా ఫోన్ చేశాం. నీ ఫోటో ఒకటి అటు పంపించినం. అక్కడి కంపెనీ పెద్దాయనను హరిబాబు అంటరు. హరిబాబు కారులో ఎయిర్‌పోర్ట్‌కు వస్తడు. నిన్ను చూసి గుర్తు పట్టి కారులో తీసుకుపోతడు. ఎవలు రాక పోయినా అక్కడ టాక్సీ డ్రైవర్లుంటరు. వారికి నీ పాస్‌పోర్ట్ చూపిస్తే హరిబాబుద గ్గరికి తీసుకపోయి అప్పగిస్తరు. అక్కడ మోసం దొంగతనం ఉండదురా! బాగా నీతి ఉన్నరాజ్యం" అని చెప్పాడు యాదగిరి.

టాక్సీ ఎయిర్‌పోర్ట్ ముందు ఆగింది. దేవరాజు, యాదగిరి ఇద్దరే దిగారు. మిగి లిన వారు అదే టాక్సీలో వెళ్ళిపోయారు. ట్రావెలింగ్ బాల్కనీలో కాసేపు కూర్చున్నా రిద్దరూ. అనౌన్స్‌మెంట్ వినిపించగానే దేవ రాజును వెళ్ళమని సైగజేశాడు యాదగిరి. దేవరాజుకు ఇల్లు, పిల్లలు, భార్య, తల్లి గుర్తు కొచ్చారు. ఒక్కసారిగా యాదగిరిపైబడి బావురుమని ఏడ్చాడు.

అతడికి సర్దిచెప్పి ముందుకు కదిలిం చాడు యాదగిరి. బాల్కనీలోంచి ఎలా ముందుకు కదిలాడో, నిచ్చెన మెట్లెక్కి ఎలా ప్లేన్‌లోకి అడుగుపెట్టాడో తెలియదు దేవ రాజుకు. ఎయిర్‌హోస్టెస్ సీటు చూపిస్తే కూర్చున్నాడు. బెల్టును బిగించి వెళ్ళిపోయిం దామె. భయంతో కళ్ళు మూసుకున్నాడు దేవరాజు. చిన్న కుదుపుతో విమానం రన్ వేమీద పరుగెత్తడం మొదలెట్టింది. దేవ రాజు గుండె దడదడలాడింది. చల్లటి వాతావరణంలో కూడా నుదుటన చెమట పట్టింది. విమానం గాలిలోకి లేస్తుంటే ఎత్తైన కొండమీదనుండి అగాధంలోకి జారి పోతున్నట్టు అనిపించింది. సీటును బిగ్గ రగా పట్టుకుని కర్రలా బిగుసుకుపోయాడు దేవరాజు. చెప్పలేని భయం పట్టుకుంది.

మస్కట్ ఎయిర్‌పోర్ట్‌లో విమానం దిగింది. సీట్లోంచి లేవబోయి బెల్టు బిగించి ఉందని గ్రహించాడు దేవరాజు. అది విప్ప డానికి ఇబ్బంది పడుతుంటే ఎయిర్ హోస్టెస్ నవ్వుతూ వచ్చి సహాయంచేసింది. లేచి నిలబడితే ఒళ్ళు తూలుతోంది. నిలదొ క్కుకుంటూ ముందుకు నడిచాడు. అందరి వెంట రన్‌వే మీదినుండి చెకింగ్ గ్యాలరీ లోకి వచ్చాడు. బాంబేలో ఉన్నంత రద్దీ లేదు. ఎటు చూసినా అద్దాల గదులే కనిపి స్తున్నాయి. ఎయిర్‌పోర్ట్ చిన్నగా ఉంది. పాస్‌పోర్ట్, విజా, టికెట్ చెకింగ్ తర్వాత లగేజి గ్యాలరీలోకి వచ్చి సూట్‌కేసును చైన్ మీదినుండి అందుకుని ముందుకు కది లాడు.

అక్కడ రెండు గేట్‌లున్నాయి. ఎటువైపు వెళ్ళాలో తెలియలేదు దేవరాజుకు. కొద్ది సేపు ఆలోచించి ఎదురుగా ఉన్న గేట్‌వైపు నడిచాడు. విశాలమైన హాలు దాటిన తర్వాత బయటకు దారి కనిపించింది. ఐదు నిమిషాల్లో రోడ్డుమీదికి వచ్చి చూసి ఆశ్చర్య పోయాడు దేవరాజు. ఒకేసారి నాలుగు బస్సులు వెళ్ళేంత విశాలంగా ఉన్న తారు రోడ్డు. చుట్టూ పచ్చని చెట్లు, గడ్డి, పూల చెట్లు. ఎండకు తారు మెరిసిపోతోంది. కాలి నడకన వెళ్తున్న మనుష్యులు కనిపించ లేదు. కార్లు రాకెట్‌లా దూసుకుపోతు న్నాయి. ఆ స్పీడ్‌లో ఏదైనా యాక్సిడెంట్ జరిగితే కారుది ఒక్క పార్టు కూడా కనిపిం చదనుకున్నాడు. రోడ్లు చెత్తా చెదారం లేకుండా శుభ్రంగా ఉన్నాయి.

అతడి చూపులు తన కొరకు వచ్చే కారుకై వెదుకుతున్నాయి. హరిబాబు రాలేదు.

ఫోన్ అందలేదా ఏమిటి...? అనుకున్నాడు. దిక్కులు చూస్తూ అక్కడే నిలబడ్డాడు. క్షణక్షణానికి భయం అధికమౌతోంది. అంతలోనే ఒక కారు పక్కగా వచ్చి ఆగింది. అందులో కూర్చున్న వ్యక్తి దేవరాజును కారెక్కమని సైగచేశాడు. అతడే తన యజమాని అనుకొని కారెక్కాడు దేవరాజు.

రెండు గంటల ప్రయాణం తర్వాత కారు ఒక బిల్డింగ్ ముందు ఆగింది. రెండంతస్థుల బిల్డింగ్ అది. చుట్టూ కనుచూపుమేరలో జనసంచారం కనిపించలేదు. ఒంటరిగా ఉందా బిల్డింగ్. లోపలికి అడుగుపెట్టాడు దేవరాజు. తలకు తెల్లటి గుడ్డ, ఫుల్‌డ్రెస్‌తో ఉన్న వ్యక్తి ఎదురొచ్చి అరబ్బీలో ఏదో మాట్లాడుతూ ఒక గదిని చూపించాడు. అతడేం మాట్లాడాడో తెలియలేదు దేవరాజుకు. అతడు చూపించిన గదిలోకి వెళ్ళాడు. ఇండియాలోలాగే పైన సిమెంట్ స్లాబ్‌రూఫ్ ఉందాగదికి. గది చిన్నగా ఉన్నా అటాచ్‌డ్ బాత్‌రూం, రెండు కుర్చీలున్నాయి. ఇంటిచుట్టూ పూలచెట్లు, రెండుమూడు కర్జూరపు చెట్లున్నాయి. గోతులు తవ్వి మట్టిపోసి చెట్లను పెంచుతున్నారని గ్రహించాడు దేవరాజు. చుట్టూ చెట్లూరాళ్ళూలేని ఎత్తైన గుట్టలు కనిపిస్తున్నాయి.

తనను ఇంతకుముందు ఎయిర్‌పోర్ట్ నుండి తీసుకువచ్చిన వ్యక్తి ఇంటి అవసరాలను చూస్తున్నాడు. ఫుల్‌డ్రెస్ వేసుకున్న వ్యక్తి అతడికేవో పనులు పురమాయిస్తున్నాడు. అరబ్బుల ఇండ్లలో హౌస్‌బాయ్‌లుంటారని, ఇంటి అవసరాలన్నీ వారే చూస్తారని విన్నాడు దేవరాజు. ఇతడు కూడా హౌస్‌బాయ్ అయిఉండవచ్చునని అనుకున్నాడు. అతడు దేవరాజుకంటే రెండుమూడు సంవత్సరాలు వయసులో పెద్దవాడిలా ఉన్నా మనిషి ఏదేశంవాడో కాని బలంగా, ఎత్తుగా కండపట్టి ఉన్నాడు.

యజమానితో అరబ్బీలో మాట్లాడ్డంబట్టి చూస్తే చాలా ఏండ్లనుండి అక్కడ పనిచేస్తున్నట్టుగా అనిపించాడు. యజమానిని కపిల్ అని సంబోధిస్తున్నాడు అతడు.

ఆరోజు దేవరాజుకు ఎవరూ పని చెప్పలేదు. గదిలోనే కూర్చుని గడిపాడు. హౌస్‌బాయ్, కపిల్ ఇద్దరే కనిపిస్తున్నారు. ఇంట్లో ఎవరూ ఉన్నట్టు ఆనవాళ్ళు కనిపించడంలేదు. కపిల్ ఇంట్లోకి వెళ్ళాక, ఏదైనా పనిపడితే డోర్‌వద్దకు వెళ్ళి ఫోన్ అందుకుని మాట్లాడుతున్నాడు హౌస్‌బాయ్. లోపలికి మాత్రం వెళ్ళడంలేదు.

రాత్రి వరకూ దేవరాజును ఎవరూ పలకరించలేదు. గదిలో ఏ.సి. ఉంది. గదిలో ఒక మూల హాస్పిటల్స్‌లో ఉండే బెడ్‌లాంటిది ఒకటి ఉంది. దానిపై నడుం వాల్చాడు దేవరాజు. అలాగే కన్నంటుకుంది. హౌస్‌బాయ్ వచ్చి కుదిపేవరకూ మెలుకువ రాలేదు. కరెంటు వెలుతురును చూశాక రాత్రి అయిందని గ్రహించాడు. హౌస్‌బాయ్ తన వెంటరమ్మని సైగచేస్తూ ఒక గదిలోకి తీసుకుని వెళ్ళాడు.

అక్కడ మధ్యలో చాపలాంటిది పరిచారు. దానిమీద ఒక పెద్ద పాత్ర ఉంది. అందులో పెద్దపెద్ద మాంసంముక్కలు అన్నంతో కలిపి ఉన్నాయి. చుట్టూ పదిమందివరకు ఉన్నారు. తోపులు ధరించి, తలకు రింగ్, రింగ్ చుట్టూ తెల్లని గుడ్డను ధరించారు. ఒకరిద్దరు టోపీలు పెట్టుకున్నారు. దిండ్లకు ఒరిగి కూర్చుని పాత్రలోని మాంసంముక్కల్ని, అన్నాన్ని తీసుకుని తింటున్నారు. ఒకరు సగం తిన్న మాంసం ముక్కను మరొకరు తింటున్నారు.

వారు తినే విధానం చూస్తుంటే అసహ్యం వేసింది దేవరాజుకు. ఎవరిదివారు పళ్ళాల్లో పెట్టుకుని తినవచ్చుగదా అనుకున్నాడు. దేవరాజును చూడగానే కపిల్ నవ్వుతూ తాను తింటున్న మటన్ ముక్కను అందించాడు. తీసుకోకపోతే ఏమంటాడోనన్న




భయంతో తీసుకుని నోట్లో పెట్టుకున్నాడు.
మాంసం వెగటు వాసన వేసింది. చప్పగా ఉంది. అన్నం బిర్యానీలాగ ఉన్నా రుచిగాలేదు. చేతులకు అంటుకునేంత నూనె ఉంది అందులో. నవ్వుతూ ఏదో మాట్లాడుకుంటూ భోజనం చేస్తున్నారందరూ. ఎంగిలనేది లేదు. వరుసగా నీళ్ళ బాటిల్స్ ఉన్నాయి అక్కడ. కొద్దిగా తిని నీళ్ళతోనే కడుపు నింపుకున్నాడు దేవరాజు.

వెళ్ళి పడుకున్నాడు కానీ నిద్రపట్టలేదు. తెల్లవారేముందు దూరంగా కోడి కూత విని పించి ఆశ్చర్యపోయాడు. అక్కడ కూడా కోళ్ళు ఉంటాయని అర్థమైపోయింది. ఆరోజు చెట్లకు నీళ్ళను పెట్టే పనిని అప్పగించాడు హౌస్‌బాయ్. తనది మున్సిపాలిటీ పని అని యాదగిరి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. ఏదైతే ఏమిటిలే అనుకున్నాడు. పని మాత్రం తేలిగ్గా ఉందనుకున్నాడు. ఆరోజు సైగలతో హౌస్ బాయ్‌కి చెప్పి ఒక ఉత్తరాన్ని కొనితెమ్మన్నాడు. అతడు అరబ్బీలో ఏదో అంటూ లెటర్ అని అనగానే తలూపాడు దేవరాజు. హౌస్‌బాయ్ ఉత్తరం తేగానే క్షేమంగా చేరుకున్నట్టూ, పనిలో జాయిన్ అయినట్టూ, పని ఎక్కువ ఏమిలేదని, పేరుపేరునా అందరిని అడుగుతూ ఉత్తరం రాసి ఇంటి అడ్రస్ రాశాడు. ఫ్రం అడ్రస్ తెలియదతనికి. హౌస్‌బాయ్ కిచ్చి అడ్రస్ అన్నాడు. అతడు అర్థంచేసుకున్నట్టు తలూపి అడ్రస్ రాసి పోస్ట్‌చేశాడు.

మరునాడు కమాండర్ జీపులో కూర్చోబెట్టుకుని బయటకు వెళ్ళాడు కపిల్. ఎక్కడికి వెళ్లేది దేవరాజుకు తెలియదు. జీపు తారురోడ్డును వదిలి మట్టిరోడ్డును పట్టింది. అది మట్టి రోడ్డులా కూడా లేదు. అంతా రాతి నేల, పైన సన్నని ఇసుక. గాలి వేగంగా వీస్తే దుమ్ములా పైకి లేస్తోంది. ఎండ బాగా ఉందక్కడ. రాతినేల వేడెక్కి వాతావరణం కూడా వేడిగా ఉంది. అక్కడక్కడా చిన్నచిన్న ముళ్ళపొదలు తప్ప ఎక్కడా ఒక చెట్టుకూడా లేదు. పెద్దపెద్ద రాతిగుట్టలున్నాయి. బండరాళ్ళు కూడా ఒక్కటి కూడా కనిపించడంలేదు.

గుట్టలన్నీ ఒకే సైజులో ఉన్నట్టుగా సన్నని ఇసుకతో నున్నగా ఉన్నాయి. గాలికి కయ్యలు కోసినట్టు గుట్టలపై గీతల్లాగా కాలువలున్నాయి. ఎత్తు పల్లాలను దాటుతూ జీపు ముందుకు దూసుకుపోతోంది. మూడు గంటల ప్రయాణం తర్వాత జీపు ఒకచోట ఆగింది.

అక్కడ వందల ఎకరాలమేరకు నేలంతా చదునుగా ఉంది. ముండ్లచెట్లు ఎక్కువగా ఉండి ఎడారిలా ఉంది. అక్కడ టాటి పత్రితో వేసిన గుడారం ఒకటి ఉంది. దాని ముందు ఇనుపతీగలతో అల్లిన తడికలను అమర్చి అందులో గొర్లను ఉంచారు. అవి వింతగా అరుస్తున్నాయి. ఒక్కొక్క గొర్రె పెద్ద సైజు ఎలుగుబంటిలా ఉంది. వేడి గాలి మందంగా వీస్తున్నదక్కడ.

ఆ ప్రదేశం చూడగానే తను చేయవలసిన పని ఏమిటో అర్థమైపోయింది దేవరాజుకు. అతడి గుండె దడదడలాడింది. గొర్ల కాపరి జీవితం ఎంతో కష్టమని ఎందరో చెప్పగా విన్నాడు. వేళకు తిండి, స్నానం ఉండదని, ఎండలో తిరుగుతుంటే చర్మం బొబ్బలెక్కుతుందని మనిషి అన్నవాడు కనిపించడని విన్నాడు. తన అసంతృప్తిని తెలియజేస్తూ తాను మున్సిపాలిటి పని అంటే వచ్చానని, గొర్లుకాయలేనని కపిల్‌తో చెప్పాడు. చెప్పాక, తాను చెప్పింది అతడికి అర్థంకాలేదని సైగలద్వారా చెప్పాలని ప్రయత్నించాడు.

అతడిని వారిస్తూ టాటిపత్రితో వేసిన గుడారం (ఖైమా)లోకి లాక్కుపోయాడు కపిల్. పైన టాడిపత్రి ఉన్నా లోపల మాత్రం అట్టలున్నాయి. రెండు గదులతో ఇల్లువలెనే ఉందాగుడారం. లోపల కిరోసిన్ స్టవ్, వంటపాత్రలు, నీటి పాత్రలున్నాయి. కొన్ని రోజులనుండి వాడినట్టుగా ఉన్నాయి.

ఎవరో తనలాగే ఇంతకుముందు ఇక్కడ గొర్లను కాపలాకాసినట్టు గుర్తుపట్టాడు

ఒకవైపు ప్లాస్టిక్ సంచుల్లో గొర్లదానా ఉంది. వాటిని బయటకు తీసుకురమ్మని సైగ చేశాడు కపిల్. ఒక బస్తాను ఎత్తి భుజంమీద వేసుకుని బయటకు వచ్చాడు దేవరాజు. గొర్లముందు ఇనుప పాత్రలున్నాయి. వాటిలో దానాని పోశాడు. ఎంత పరిమాణంలో పోయాలో చూపించాడు కపిల్.

దాదాపుగా వందయాభై, రెండు వందల వరకు ఉంటాయి గొర్లు. పిల్లల్ని వేరుగా, తల్లులను వేరుగా ఉంచారు. దానా వేయాల్సింది తల్లులకు మాత్రమే. దేశదేశాల్నుండి వచ్చిన ఎందరో వ్యక్తులతో పనిచేయించుకోవడంలో అనుభవమున్న వాడిలా ఉన్నాడు కపిల్. సైగలతోనే పనిని పురమాయిస్తున్నాడు.

నీళ్ళడ్రమ్ములోనుండి నీళ్ళను ముంచి డబ్బాల్లో పోశాడు దేవరాజు. తర్వాత గొర్ల పాలు పిండుమని ఆజ్ఞాపించాడు కపిల్. మామూలుగా బర్రె పాలు పితికినట్టుగా పితుకబోయాడు దేవరాజు. ఒక గొర్రెను ముందుకు లాగి వెనక కాలు నొకదాన్ని తన కాలిని మడిచి అదిమిపట్టి పాలను ఎలా పితకాలో చూపించాడు కపిల్. రెండుమూడు గొర్ల పాలు పితికాక అలవాటైపోయింది దేవరాజుకు. ఒక్కొక్కటి అరలీటరు పాలు ఇస్తుంది. అలా పదిహేను గొర్ల పాలు పితికి జీపులో ఉన్న డబ్బాలో పోశాడు దేవరాజు.

జీపులో తనవెంట తెచ్చిన ఆహారపదార్థాలన్నింటిని గుడారంలో ఉంచాడు కపిల్ ఒకడు కను (షేన్) ఎత్తగానే గొర్లన్నీ బయటపడ్డాయి. ఒక క్యారియర్‌ని, వాటర్ బాటిల్‌ని చేతికిచ్చి వాటి వెంట వెళ్ళమని చెప్పాడు. అప్పటికే ఎండ జోరుగా ఉంది. గాలి ఆడడంలేదు. చెమటపట్టి ఒళ్ళంతా జిడ్డుగా తయారయింది తను స్నానం చేయాలని సైగలద్వారా చూపించాడు దేవరాజు. డ్రమ్ములో ఉన్న నీటిని చూపిస్తూ సూర్యుడివైపు చూపిస్తూ పొద్దుగూకాక తిరిగివచ్చి చెయ్యాలని సైగతో చెప్పాడు కపిల్.

అక్కడినుండి కదలక తప్పలేదు దేవరాజుకు. కపిల్ ఇచ్చిన బూట్లు వేసుకుని తలకు ఇసుక పడకుండా, ఎండ తగలకుండా బట్టను చుట్టుకున్నాడు. అప్పటికే గొర్లు చాలాదూరం వెళ్ళాయి. అవి మెల్లిగా కాకుండా పరుగుపరుగున వెళ్తున్నాయి. ఎక్కడైనా ముండ్లచెట్టు కనిపిస్తే దానిని చుట్టుముట్టి కొరుక్కుతింటున్నాయి.

దుఃఖంతో గుండె చెరువవుతుంటే యాదగిరిని కసిగా తిట్టుకుంటూ ముందుకు కదిలాడు దేవరాజు. అతడి కళ్ళవెంట కన్నీరు ధారలుకడుతోంది.



కలిగిన కాడికి తిని కండ్లముందట ఉండురా అంటే వినలేదు. ఇక్కడ పని చేత కాక మస్కట్ పోతనని మంకుపట్టుపట్టె. రేపే మస్కట్ వెళ్లుడని బొంబాయి పాయె. అమాసకు అమాసదాటిపాయె. ఈ రోజుకు నెల మీద ఇరువై రోజులాయె. ఏ విషయం తెలియకపాయె. కారటు గూడా లేకపాయె. ఏం చెయ్యాలె మల్లక్కా! అలుగవోయిన

అల్లిసాబులేడు. పిలువబోయిన పేరిసాబ్ లేడన్నట్టు యాదిగాడు గూడా రాకపాయె. సదువచ్చిన పోరడు అవ్వ ఆగమైతదని కార టన్న వెయ్యొద్దా?

"మనసంతా నీళ్లలెక్క అయితుంది. బాయందునా చెరువందునా మూరెడు తాడందునా? నా పాణానికి నేను ఎట్లనన్న పోతగని కాళ్లజేతుల ఇద్దరు ఆడపిల్లలుండి రిగదా! కొడుకు ఏం తింటుండో, యాడ ఉంటుండో! నోట్లె నాలికలేని అమాయ కుడు. మంచిగ మాట్లాడితే అంగి, లాగు ఇడిచిత్తడు. ఎటువంటోనికి ఎటువంటి కట్ట మచ్చె" కన్నీళ్లుకారుస్తూ చెబుతోంది నర్సవ్వ. ఆమెకు ఎదురుగా కూర్చుంది మల్లవ్వ.

"ఏంది చెల్లే! గట్ల బెంగటిల్లకు. వానికి ఏంగాదు. కండ్లు పోడగొట్టిన దేవుడు ఇండ్లు సూపిస్తడు. ఏ అయ్యకడుపులనన్న దయపుడుతుంది. వాడే మంచిగైతడు. మస్కట్ ఎందరు పోతలేరు ఎందరస్త లేరు. మస్కట్ అంటే పల్లెటూరి లెక్క అయింది. మొదట నర్సిమ్ముడు పోయి వచ్చిండంటే వానింటివద్ద జాతరలెక్క మంది నిండిండ్రు. టేప్ రికాడ్ తెచ్చి మాటలు, పాటలు రికాడ్ చేస్తుంటే అందరం చిత్రంగా సూసినం. ఇప్పుడు రోజుకొకలు వత్తున్నరు పోతున్నరు" ఓదా రుస్తూ చెప్పింది మల్లవ్వ.

"ఏం జెయ్యాలె అక్కా! నువ్వు చూసినం తల అత్తమామల మీద సుఖపడితినా, మొగని మీద సుఖపడితినా? ఈ రోగాలల్ల మన్నువడ ఇప్పుడు ఇట్ల ఉన్నగని ఎన్న డన్న కూసుండి తింటినా? మీద మీద తిరి గితినా... తిండిలేక బట్టలేక రామరామగోస ఎల్లదీసిన. ఏదో చాతనైనకాడికి చేసినం. ఉంటె తిన్నం లేకుంటే పన్నం గని ఈ పరి షాన్‌లు లేకుండె. ముసలితనంలో నాకొక రంధి మొదలాయె.

"ఏం నడుమంత్రపు పేశాలో ఏమో! అందరిలెక్క మనకు సాగదిరా బిడ్డా అంటే వినలేదు. నాకో జన్మరంధి పెట్టిపాయె. నా బతుకు ఇప్పుడో అప్పుడో అన్నట్టుంది. మింగే మందులు మింగతనే ఉన్న ఒక దిక్కుకాలు, చెయ్యి లేత్తలేదు. పుర్రెల నరా లన్ని మెసులుతున్నాయి. మీదికి సూత్తె ఏమైంది నీరుబుగ్గ లెక్క మంచిగనే ఉన్నద నవట్టిరి. లోపలరోగం ఒక్కలకు తెల్వ దాయె" కన్నీరు తుడుచుకుంటూ అన్నది నర్సవ్వ.

వీరి సంభాషణను వింటూ బీడీలు చేస్తోంది పద్మ. మధ్యమధ్య తొట్టెను ఊపు తోంది. అందులో చిన్న కూతురు పడుకుని ఉంది. ఆమె మనసు కూడా ఆందోళనగా ఉంది. భర్త ఎక్కడున్నాడో ఏం చేస్తున్నాడో తెలియదు.

"ఈ మస్కట్ దుబాయి పోవుడు అప్పు డెక్కడిది చెల్లే! కరువుల మన్నువడ కరు వువడితే ముక్కగటుక కూడా కరువైపాయె. ఆకలి మంటలకు ఆగలేక ఒకనాడు పెరు గులో నున్నటిరేగడి బురదకలుపుకుని తాగిన ఆ బాధ యాదికి రావద్దు. యాది కస్తే తెల్లారది పొద్దుగూకది.

అట్ల ఎల్ల దీసుకున్నంగాని ఈ కథలు మనకు ఎరుకలేదు. ఎన్నడో ఒక్క నాడు బస్సు ఎక్కాలంటే ఇరువై కోసులు నడిచి కామరెడ్డి పోతే ఎప్పుడన్న ఒకటి కనబడు తుండే. అది సరేగని చెల్లే నీకీ ముచ్చట తెలిసిందా? యాదిగాని తలపండుపలుగ యాదిగాడు ఎంతపని చేసిండనుకున్నవు. పదిహేను మందిని అరువై వెయిలు తీసు కొని మస్కట్ తోలిస్తనని తోలుకపాయె.

"జీతం పది వెయిలుంటది. పని అలుకగ ఉంటది అని కథలు చెప్పె. వాళ్లందరు మస్కట్ నుండి కారటు వేసిండ్రు. లేబర్ పని అట. పొద్దుగల్ల ఆరింటికి ఎక్కితే పొద్దు గూకి ఆరింటికి రావలెనట. సిమెంట్ సంచులు, ఇసుక మోసుడట. జీతం ఇక్కడి ఇరవై అయిదు వందలట.

ఉన్న వాల్లుండిరి లేనివాల్లుండిరి పూసపోగు ఉంటే అమ్మిరి. మిత్తికి ఎదురుమిత్తి తెచ్చిరి. వాటి మిత్తిగూడ తీరయి. యాదగిరిని పైసలు వాపసు ఇవ్వమని రాసిండట.

"అది సర్కార్ కంపెనీ అట. ఐదు పది వెయిలు తప్ప అంత డబ్బు ఖర్చు కానేకాదట. గాకొద్ది జీతంతోని అప్పులు ఎలా తీరుస్తరు. మిత్తి ఎప్పుడు తేరుపుతరు" బాధగా చెప్పింది మల్లవ్వ.

"అయ్యో అలాగా ఎవరన్నరత్తా!" కంగారుగా అడిగింది పద్మ.

నర్సవ్వ ఉలిక్కిపడింది. ఆమె నోటి వెంట మాట రావడంలేదు.

"ఎవరనేంటే బిడ్డా! ఊరు ఊరంతా కోడై కూత్తున్నరు. అంతా ఆగమాగం అయితున్నరు. వాడు ఎప్పుడు వస్తె అప్పుడు పట్టుకుందామని చూస్తున్నారు. వాని పెండ్లాం బొంబాయి ఫోన్ చేసి రావద్దని చెప్పిందంటున్నారు. నమ్మినానవోత్తె పుచ్చి బుర్రలైనయట. గట్లుంది కథ. వాళ్ల ఉసురు తగిలి పురుగుల పడిపోతరు" బాధగా చెప్పింది మల్లవ్వ. ఆమెవైపు భయంగా చూసింది నర్సవ్వ.

"ఇలాగైనా బాగుపడుతామని అన్నంత డబ్బు ఇచ్చిపోయిరి. వేరే ఊరుకాదుకదా! ఇదే ఊరాయె తెల్లారిలేస్తే ముఖం చూసుకుంటం. ఈ యాదగిరికి బుద్ధి ఉండాలి. వీళ్లను ఇలా మోసం చేస్తరా! ఇంత మోసం జేసుడుకు వాని మనసెట్ల ఒప్పిందో" తీవ్ర ఆందోళనకు గురి అవుతూ అన్నది పద్మ.

చిన్నగా నవ్వి గుసగుసగా చెప్పింది మల్లవ్వ. "నెమలికండ్ల నీళ్లు వేటకానికేం ముద్దుబిడ్డా! వానికి డబ్బు గావాలె. శవాల మీది పైసలు ఏరుకునే రకం. ఆ పాపపు పైస ఎన్ని రోజులుంటది. పెరిగీ పెరిగీ ఎన్నడో మొదట్లకే విరుగుతది. ఉన్నవాళ్లను ఉండనియ్యక ఎడాపెడా దూరం పంపించి పరేషాన్ చెయ్యవట్టె"

నర్సవ్వకు ఆందోళన ఎక్కువయింది. "ఏం జెయ్యాలక్కా! నా కొడుకును ఎక్కడ కాటకలిపిండో వీడు. మూలకున్నోన్ని ముంగటేసెగదా! సుశీల దగ్గరిదాకన్న పోయత్తా! అటు ముట్టినా ఇటు బొంబాయిలో ఉన్నా వారం తిరగ్గానే కారటు వేసేవాడు" అంటూ లేచింది నర్సవ్వ.

ఆమెతో పాటు మల్లవ్వ కూడా లేచింది. పద్మ అన్యమనస్కంగానే తనపనిలో మునిగిపోయింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. మౌనంగా వెక్కుతోంది.

దారి పొడవునా ఇద్దరూ మాట్లాడుతూనే ఉన్నారు. యాదగిరి ఇంటివద్ద ఇద్దరు విడిపోయారు. మల్లవ్వ తన ఇంటివైపు వెళ్తే నర్సవ్వ సుశీల ఇంట్లోకి నడిచింది. నర్సవ్వను చూడగానే కూర్చోమని చాప పరిచింది సుశీల.

"ఎట్లాబిడ్డా! నెల పదిహేను రోజులాయె. వారం రోజుల్లో తిరిగి వస్తానని పోయిన మనిషి ఇంతవరకు పత్తా లేడాయె. జాడలేడాయె. మస్కట్ వెల్లెనా. బొంబాయిలనే ఉన్నడా ఏదీ తెల్వదాయె. నీకు ఫోన్‌గిట్ల ఏం చెయ్యలేదా? " కూర్చుంటూ అడిగింది నర్సవ్వ.

"నీమీద ఒట్టు అత్తా! ఫోన్ జేసినంక చెప్పనా? నేనే పరిషాన్ అయితున్న. ఎన్ని రోజులయింది. ఇంతవరకు కారటు లేదు ఫోన్‌లేదు. నాకు మనుసున పడుతలేదు. ఎవలనన్న మనిషిని తోలిస్తామంటే అడ్రస్ లేదు. ఈ పని మనకు వద్దు. తగది అంటె వినకపాయె. ఐదేండ్లు అట్ల ఏడిస్తి. వచ్చినంక ఇట్ల ఏడ్వవడితి. ప్రీతితోని పిచ్చకుంట్లోన్ని చేసుకుంటే సచ్చెదాక సాపలల్ల వెట్టిండట. నేను ఇదే రంధిలో సచ్చెటట్టున్న.

"ఏం జెయ్యాలత్తా! చెప్పినా వినకుండా ఈ పని పెట్టుకునె. ఇప్పుడు నలుగురు నాలుగు రకాల అంటుండ్రు. పోయెదాక ఒక ఆపతి పోయినంక ఒక ఆపతి. వద్దు వద్దు అని చెప్పినా వినకుండా వెంటబడిరి. ఇప్పుడు తిట్టరాని తిట్లు తిట్టవట్టిరి" బాధ

పడుతూ చెప్పింది సుశీల నర్సవ్వకు ఎదు రుగా కూర్చుంటూ.

"మొన్న వెళ్లినవాళ్లు లెటర్లు రాసిండ్రట గదా! జీతం ఇస్తలేరని తిండి పెడుతలేరని. అలా ఎందుకు జరిగింది. మొదట జీతం ఎక్కువ ఉందన్నడట యాదగిరి. ఇప్పుడు అంత లేదటగద" ఆరా తీస్తున్నట్టుగా అడి గింది నర్సవ్వ. దేవరాజుకు కూడా అలాగే జరుగుతుందేమోనన్న భయం పట్టుకుందా మెకు.

"అది మనమెట్ల సెప్పస్తదత్తా! మనసంగతే చూడు ఏరినైనా కైకిలు పెట్టు కున్నమనుకో! నాలుగు రకాల పనుల చెప్పుతం. కడుపుల దయపుట్టిన తల్లి ఒక పైస ఎక్కువ ఇస్తది. ఇంకో తల్లి ఇయ్యనే ఇయ్యది. ఏదో తొవ్వజూపిచ్చినం. అక్కడ ఎవరెంత జీతం మిచ్చేటిది కలగన్నమా! అది మన అదృష్టం.

"ఈ రోజు వీళ్లు వచ్చి ఇట్ల అట్లంటే ఎవ్వరేం జేస్తరు. ఇంటి ముందు వచ్చి తిడుతుండ్రు. ఆయన ఇక్కడలేడు. వచ్చి నంక మాట్లాడుండ్రి అని చెప్పినా వినడం లేదు. ఇప్పుడు తెప్పియ్యి అంటే అడ్రస్ లేదని చెప్పిన. నువ్వు నమ్ముతవో నమ్మవో గని అత్తా! ఇంత వండుడు పెట్టుడే నా వంతు. అవుతల ఇదీ అని ఏది జెప్పడు. పోయేటప్పుడు అడ్రస్ కూడా ఇచ్చిపోలేదు. అడ్డమైనోళ్లతోని అడ్డమైన మాటలు పడు డాయె" చిన్నగా ఏడుపును అందుకుంది సుశీల.

నర్సవ్వ సుశీలవైపు బాధగా చూసింది. ఏదైనా విషయం చెప్పి ఓదారుస్తుందను కున్న సుశీల ఏడుపందుకునేసరికి మరిం తగా బెంగపడిపోయింది. "ఏందే సుశీలా. నాకు ధైర్యం చెప్పుతవంటే నువ్వే ఏడువవ డితివి. పోరడుపోయి నెల పదిహేను రోజు లాయె. యాడుండెనో తెలవకనేనస్తే చెప్పు కోనస్తే, పట్టుకోని ఏడ్చినట్టు చెయ్యవడితివి.

"వండక వడివెడితే ఉండకవాడే పోయెన న్నట్టు ఎప్పటికప్పుడు శేరుకు సవశేరు అను కుంటూంట అదుపులవెడితె కొడుకు చెప్పి నట్టు వింటుండె. ఇప్పుడు చూడు ఎక్కడు న్నవో యాడపన్నవో గని మంది కండ్లల్ల పడితివి. మనిషికోతీరు అనవట్టిరి. ఎవలె క్కడనన్నపోనిగని మన దేవరాజన్నా లెటరు వేయకపాయె. వీళ్లజాడ ఎట్ల దొరు కాలె" కాస్తంతా కటువుగా అంటూ లేచింది నర్సవ్వ.

"నీకంటే ఎక్కువ బాధ నాకే ఉందత్తా! దగ్గరి ముచ్చట. ఏమాత్రం కింద మీదైనా మాట పోతదని నాకే దడదడ ఉంది. వారికి ఏం కాదు మంచిగనే ఉంటరు. పని కాలేనట్టుంది. ఇంటికెట్ల పోవాలన్నని అక్క డనే ఉన్నట్టున్నరు. ఉంటె ఉండిరిగని కార టైనా వేసేదుండె. ఇక్కడ మనం పరే షాన్‌గావడితిమి". నర్సవ్వ వెంట బయటకు నడుస్తూ అన్నది సుశీల.

నర్సవ్వ బయటకు వెళ్తుండగా ముగ్గురు స్త్రీలు వచ్చారు. నడివయస్కుల్లా ఉన్నారు. ఇంతకుముందు మస్కట్‌కు వెళ్లిన వ్యక్తు లకు సంబంధించిన వ్యక్తులు వారు. సుశీ లను చూడగానే ఉలుకుపలుకు లేకుండా తిట్లదండకం అందుకున్నారు వారు.

"యాదిగ మాకొంప ముంచితివిగదరా! అరువైవేలు మూడిట్లెక్క మిత్తికి తెచ్చిన. నెలకు మిత్తి రూపాయలే పద్దెంది వందలై తయి. వాడిచ్చె ఇరువై ఐదు వందల జీతంల మిత్తి ఏంగట్టాలే అసలెట్ల తీర్వాలె. ఎన్నేండ్లు కష్టంజేస్తే తీరాలె" ఆమె తిట్లు సాగుతుండగానే మరోవ్యక్తి అందుకుంది.

"యాడాదికి తులంకు తులంన్నర బంగా రమిస్తనని తీసుకచ్చిన యాడాది వరకు బంగారం రేటు కూడా పెరిగే! తరుగుకు కూడా మునిగితిమి. ఏదో బాగుపడతమను కున్నంగని తీరని అప్పులయితవని ఎరుక లేదు. ఐదు రూపాయల మిత్తిలెక్క పడు తుంది అన్నింటిని లెక్క పెడితె. ఇక్కడున్నా ఏదో ఒకటి చేసుక బతుకుదురు"



వెంటనే మరో యువతి అందుకుంది. ఆబితాబి అయ్యే చేనును తక్కువ దరకు అమ్మితిమి. చేతుల ఎద్దు, ఎవ్వసం విడిచి పెట్టిపాయె. ఇప్పుడు కొందామన్నా అటు వంటి భూమి దొరకదు. తవ్వేడడ్లకు తంగేళ్లు పీకపోతే అడ్డెడడ్లు దుడ్డె బుక్కి నట్టు అయిపాయె ఇచ్చెబఱ్ఱెను విడిచి తన్నెబఱ్ఱెను పట్టుకున్నట్టుంది"

సుశీల పెదవి విప్పడంలేదు. నర్సవ్వ కొద్దిసేపు వారి మాటలు విన్నది. యాద గిరిని కొద్దిసేపు తిట్టిన తర్వాత సుశీలను కూడా పేరు పెట్టి తిట్టడం మొదలెట్టారు. డైరెక్టుగా తన పేరు పెట్టి తిట్టడంతో కోపం ఆపుకోలేక రెండు మూడు మాటలన్నది సుశీల. వారు ఏమాత్రం తగ్గకుండా ఎదురు దాడికి దిగడంతో మౌనంగా ఉండిపో యింది సుశీల.

నర్సవ్వకు అక్కడ నిలువబుద్ధికాలేదు. ఆలోచిస్తూ ఇంటికి చేరుకుంది. అంతవ రకూ ఆతృతగా ఎదురు చూస్తున్న పద్మ అత్తను చూడగానే ఏమైందని అడిగింది. జరిగిన విషయం చెప్పింది నర్సవ్వ. విషా దంగా మొహం పెట్టింది పద్మ.

"ఎందుకు తెలియదు. అన్ని సంగతులు తెలుసు. మొగుడూ, పెండ్లాం కలిసి నాటకం ఆడుతున్నరు. తక్కువ డబ్బు ఖర్చయ్యే కంపెనీకి ఎక్కువ డబ్బుతీసుకు న్నడు. నాలుగు రోజులు దాక్కుంటే అందరు మర్చిపోతరు. ఆ తర్వాత ఇంటికి రావచ్చునని చూస్తున్నడు.

"వాళ్లూవాళ్లు గంగలపడి చావని. ఆ విషయం మనకెందుకుకానీ మన మనిషి ఎటువాయె, యాడ ఉండే.. వాళ్ల జాడ ఎట్ల తెలువాలె" బాధగా అన్నది పద్మ.

నర్సవ్వ పెద్ద మనుమరాలని దగ్గరకు తీసుకుని రెండు చేతి వేళ్లలో ఒకటిపట్టుకో మంది. ఆ పాప మొదటిసారి రెండు వేళ్లను ఒక్కసారి పట్టుకోగానే కసురుకుని ఒక వేలిని మాత్రమే పట్టుకోమని చెప్పింది. ఆమె అలాగే చేసింది. "ఈ రెండు మూడు రోజుల్లో కారటు వస్తది. అక్కడికి చేరుకు న్నడట" అంటూ మూలకు వెళ్లి కొయ్యకు తగిలించిన చేటను అందుకుని కొన్ని వడ్లు పోసి చేటవల్లు పట్టింది. అలా కూడా లెటరు వస్తుందని, అక్కడకు చేరుకున్నాడని పని తేలిక, జీతం ఎక్కువ అని వల్లు పట్టింది. నర్సవ్వకు కొద్దిసేపు రిలీఫ్ అని పించింది.

"టప్పరాములు ఇంటిముందటికెళ్లే పోత డుగదా! ఇయ్యాల కారట్లు పంచడానికి పోయిండా? " కోడలిని అడిగింది నర్సవ్వ. ప్రతి రోజు లెటరు వస్తుందని లెటర్లు పంచే వరకు ఎదురు చూస్తారు అత్తాకోడళ్లు. ఈరోజు ఉత్తరం రాకపోతే తమ ఎదురు చూపులను మరునాటికి వాయిదా వేసుకుం టారు.

"లేదు ఇయ్యాల్ల పొద్దుపోయింది. ఇంకా రాలేదు" అంటుండగానే సైకిల్ పై టప్పరా ములు వెళ్లిపోయాడు.

"దిక్కుమాలిన కారటు ఇయ్యాల్ల గూడా రాలేదు. వాడు వేస్తేకదా రావడానికి. కారటు ఎన్నడు కండ్ల చూస్తమో" విషా దంగా అన్నది నర్సవ్వ. బేలగా చూస్తూ పద్మ తన పనిలో మునిగిపోయింది. ఆ రోజు కోటయ్య వచ్చి ఇద్దరినీ పరామర్శించి వెళ్లాడు. అధైర్యపడవద్దని పని పూర్తికాలే దని ఉండిపోయారని అతడిని అక్కడికి ఎక్కించాకే వస్తాడని చెప్పాడు. పద్మ మాత్రం తండ్రి మీద పడి పెద్దగా ఏడ్చింది. ఆమె దుఃఖంను చూడలేక రెండు మూడు రోజుల్లో ఏ విషయం తెలియకపోతే తానే స్వయంగా బొంబాయి వెళ్లి వస్తానని చెప్పి కూతురును ఊరడించాడు. ఆ మాటలు విన్నాకనే కాస్త సంతృప్తిపడింది పద్మ.

ఆరోజు రాత్రి సుశీలకు ఫోన్ వచ్చింది. అది ముంబాయి నుంచి యాదగిరి చేసిన ఫోన్‌కాల్. మాట్లాడుతున్నది భర్తని తెలి యగానే బావురుమంది సుశీల. అది ఫోన్

అన్న విషయం కూడా మరచిపోయింది. ఇక్కడ జరిగిన విషయాలన్నీ పూసగుచ్చి నట్టు చెప్పి మీరు ఎప్పుడు వస్తే అప్పుడు కాచుకుని కూర్చున్నారు పంచాయతీకి అని చెప్పింది.

బదులుగా యాదగిరి నవ్వుతూ అన్నాడు. "అంత చిన్న విషయానికి ఏడుస్తున్నావా? నేను ఊరిలోకిరాని ఒక్కొక్కన్ని ఏం చెయ్యాలో అది చేస్త. మళ్లీ నోరెత్తకుండా జేస్త. ఈ రోజే బయల్దేరి వస్తున్న

"ఫోన్ కట్ అయింది. సుశీలకు ఏం జరుగబోతుందో అంతుపట్టడంలేదు.

★ ★ ★

సామాన్యుడి కలల ప్రపంచం మస్కట్. అదొక్కటేకాదు. సౌదీఅరేబియా, దువాఖతర్, దుబాయ్, బైరన్, మేమన్ మొదలగు గల్ఫ్ దేశాలన్నీనూ. అక్కడికి వెళ్లగానే లక్షాధికారులమైపోతామనుకుంటారు. ఎంత డబ్బు వెచ్చించి వెళ్లడానికైనా వెనుకాడరు. ఏ దేశం వెళ్లినా మామూలుగా చదువురాని వారందరు మస్కట్‌కు వెళ్లాడని గానీ అవుటాప్ వెళ్లాడనిగానీ అంటారు.

వాస్తవంగా అక్కడ ఏం జరుగుతుందో వీరెవరికీ తెలియదు. ఇక్కడ అష్టకష్టాలు పడి డబ్బు జమచేసి ఇస్తే ఏజంట్లు పంచుకుంటున్నారు. అక్కడికి వెళ్లాక సరైన వేతనం ఇవ్వక శ్రమదోపిడికి గురౌతున్నారు. ఎవరో ఒకరు వెళ్లి లక్షల డబ్బును సంపాదిస్తే వారిని చూసి తాము కూడా డబ్బును సంపాదించాలన్న కోరికతో లక్షలు అప్పుచేసి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

యాభై సంవత్సరాల క్రితం దాకా గల్ఫ్ దేశాల్లో ప్రజల పరిస్థితి దుర్భరంగా ఉండేది. అప్పుడు అక్కడ జనాభా చాలా తక్కువ. అంతా రాతినేల. పిడికెడు మంచి మట్టి కావాలంటే దొరకదు. చెట్లులేవు. వర్షాలులేవు. జీవనాధారమైన పంట ఖర్జూరం. తాగడానికి మంచినీళ్లు కూడా దొరికేవికావు. గొర్లను పెంచుకుంటూ జీవనం కొనసాగించేవారు. కాలినడక, ఒంటి వాహనాలు తప్ప రవాణా సౌకర్యాలు ఉండేవికావు.

1970వ సంవత్సరంలో సుల్తాన్ ఖబూస్ రాజుగా వచ్చాక మస్కట్‌ను సుల్తానేట్ ఆఫ్ ఓమన్‌గా పేరు మార్చి ఎన్నో కార్యక్రమాలకు శ్రీకారం చుట్టాడు. గల్ఫ్ దేశాలకు పెట్రోల్ నిలువలు ఒక వరంలా దొరికాయి. ప్రపంచంలో పెట్రోల్ వినియోగం పెరగడం, దాని కోసం ఎక్కువ దేశాలు గల్ఫ్ దేశాలపైననే ఆధారపడడంతో ఈ దేశాల స్థితిగతులే మారిపోయాయి. మస్కట్‌లో పెట్రోల్‌కంటే సహజ వాయువుల నిలువలు ఎక్కువ.

అభివృద్ధి చెందిన దేశాలు సైతం గల్ఫ్ దేశాల సహకారాన్ని కోరాయి. ఫలితంగా తమ దేశాలలో ఉత్పత్తి అయ్యే సరుకులను ఎగుమతి చేయడం, పెట్రోలును దిగుమతి చేసుకోవడం మొదలెట్టాయి. అప్పటినుండి ఆ ప్రజల జీవన శైలే మారిపోయింది.

విశాలమైన తారురోడ్లు ఏర్పడ్డాయి. పునాదులు సైతం తీయడానికి వీలులేని రాతి నేలపై సుందర భవనాలు వెలిశాయి. ఏసి రూంలు, ఏసి కారులు వచ్చాయి. గోతుల్ని తవ్వి మట్టిని పరిచి చెట్లను పెంచడం మొదలెట్టారు. గడ్డి పరకలు కూడా మొలవని రాతి నేలపై ఇప్పుడు రంగురంగుల పూలు పూస్తున్నాయి. పచ్చిక బయళ్లు, ఉద్యానవనాలు వెలిశాయి. 1980 ప్రాంతంలో ఉన్న వేడి ఇప్పుడు లేదంటే అక్కడ ఎన్ని పచ్చని చెట్లు ఉన్నాయో ఊహించాల్సిందే.

అక్కడి రాతినేల, ఇసుక నేల నీటిని పీల్చుకోలేదు. ఉష్ణమండల దేశాల్లో పడ్డ వర్షంలో సగం వర్షం అక్కడ ఉన్నా నగరాలన్ని జలమయమైపోయేవే! కొద్దిపాటి వర్షానికే నీరు పారుకుంటూపోతుంది. అందుకే అక్కడ వాడిన నీటిని బయటకు వదలరు. నీటికి కరువుకాబట్టి డ్రైనేజ్ సిస్టంలేదు.

ప్రతి ఇంటికి ఒక సెప్టిక్ టాంక్ ఉండాల్సిందే! అది నిండాక మున్సిపాలిటీ వ్యాన్ వచ్చి టాంక్‌లోని నీటిని తీసుకుని పోతుంది.

సిటీకి దూరంగా గుట్టల మధ్య చెరువును నిర్మించి మురుగునీటిని అందులో వదులుతారు. మళ్లీ ఆ నీటిని శుభ్రపరచి పైప్‌లైన్ల ద్వారా చెట్లకు, తోటలకు సరఫరా చేస్తారు. ఈవిధంగా మురుగునీరు బయటకు వదలకపోవడంవల్ల ఈగలుదోమలు ఉండవు. అంటురోగాలురావు. మున్సిపాలిటీవాళ్లు ఎప్పుడూ రోడ్లను క్లీన్‌గా ఉంచే ఏర్పాటు చేస్తారు.

అక్కడ వరకట్న సమస్య ఉండదు. ఆడపిల్ల తల్లిదండ్రులకే కన్యాశుల్కం ఇస్తారు. స్త్రీజనాభా తక్కువగా ఉండడమే ఇందుకు కారణం. దైవభక్తి, పాపపుణ్యాల భయం ఓమనీలలో చాలా ఎక్కువ. ముస్లీం సంస్కృతి కొంతవరకు ఉన్నా ఆడవారు కూడా పురుషులతో సమానంగా చదువుకుంటున్నారు. ఉద్యోగం చేస్తున్నారు. బురఖాలు వేసుకోవాలనే బలవంతపు నిబంధన ఏదీలేదు. తలను కవర్ చేసే పూసల్లాంటి అలంకరణ చేసుకుంటారు.

గతంలో తక్కువ జనాభా అక్కడ సమస్యగా ఉండేది అందుకే అధిక సంతానాన్ని ప్రోత్సహించారు. బహుమతుల్ని ప్రకటించారు. ఒక్కొక్కరికి ముగ్గురు నలుగురు భార్యలు, పన్నెండు నుండి ఇరవై మంది వరకు పిల్లలుండేవారు. ఎక్కువమంది పిల్లలుంటే బహుమతులు ఇచ్చేవారు. అదే ఇప్పుడు ప్రాణసంకటంగా మారింది. జనాభా 16 లక్షలకు చేరుకుంది. అందులో 5 లక్షలు బయటి దేశాలవారే. ఐదు లక్షల్లో 3 లక్షల మంది ఇండియావారే.

మన ఆంధ్రప్రదేశ్ వైశాల్యానికి సమానంగా ఉన్న మస్కట్ దేశంలో ఏడు కోట్ల ఆంధ్రులతో పోలిస్తే 16 లక్షలు చాలా తక్కువే అయినా వ్యవసాయ ఉత్పత్తులు లేక కేవలం పెట్రోల్ నిలువల మీద మాత్రమే ఆధారపడి ఉండడంచేత వారికి ఆందోళన మొదలయింది. ఇప్పటికే మూడు లక్షల మంది నిరుద్యోగులు తమకు ఉద్యోగాలు కావాలని వినతి పత్రాలు సమర్పిస్తున్నారు.

అక్షరాస్యత విషయానికి వస్తే గల్ఫ్ దేశాల్లో అది చాలా ఎక్కువ. ఎవరో పాత తరం వారు తప్ప ఈ తరం వారికి విద్యావకాశాలు ఎక్కువ. అందుకే అన్‌ఎన్‌రోల్డ్ డ్రాపవుట్ అంటూ ఉండదు. ప్రభుత్వ పాఠశాలలేకాక ప్రవేటు పాఠశాలలు కూడా వెలిశాయి. ఈ తరం వారిలో నిరక్షరాస్యులంటూ ఉండరనే చెప్పాలి.

అక్కడి ప్రజల జీవన పద్ధతులు విభిన్నంగా ఉంటాయి. పేదలు, ధనవంతులు, కులం, మతం తేడా ఉండదు. అందరూ ఒకేచోట కూర్చుని భోజనం చేస్తారు. మన ఇండ్లలోలాగ బియ్యం, పప్పు ఉప్పు నిల్వలు ఉండవు. ఆర్టిఫీషియల్ ఫుడ్ ఎక్కువగా తింటారు. పిక్నిక్ వెళ్లినా వంట చేసుకోవాలనుకున్నా ఎప్పటికప్పుడు అవసరమున్న వస్తువులను షాప్‌నుండి కొనుగోలు చేసుకొని రావడమేకాని ఒకేసారి కొని ఇంట్లో నిల్వ ఉంచటం వీరికి అలవాటులేదు.

కూరగాయలు, తినుబండారాలు ఎక్కువగా ఇండియా నుండి దిగుమతి చేయబడినవే! ఇండియాలో ప్లేగువ్యాధి వచ్చినప్పుడు ప్లేన్‌లు నిలిపివేశారు. అప్పుడు మార్కెట్‌లలో కూరగాయలు సరిగా లభ్యం కాలేదు. రేట్లు కూడా ఎక్కువగా పెరిగిపోయాయి.

ఇక్కడొక విచిత్రమేమిటంటే ధరలు ఎప్పుడూ స్థిరంగానే ఉంటాయి. డిమాండ్ సప్లయ్‌ని బట్టి పెరగడమో తరగడమో ఉండదు. దాదాపుగా రేట్ల సూచిక ఎప్పుడూ స్థిరంగానే ఉంటుంది. విద్యుత్‌కోత అనేది లేదు. సంవత్సరంలో అత్యవసర పరిస్థితుల్లో తప్ప ఒక సెకను కూడా పవర్‌కట్ అనేది ఉండదు.





టైం ప్రకారం పనులు చేయడం వీరికి అలవాటు. ఆఫీసువేళల్లో కార్లను, బస్సులను గమనించినట్లయితే ఈ విషయం స్పష్టంగా అర్థమౌతుంది. సరిగ్గా తొమ్మిది గంటలకు ఒకచోట మనకు ఏఏ వాహనాలు కనిపిస్తాయో ప్రతిరోజూ అదే సమయానికి అక్కడ ఖచ్చితంగా అవే వాహనాలు దర్శనమిస్తాయి.

పాఠశాల టైమింగ్స్ వాతావరణ పరిస్థితుల దృష్ట్యా ఏడుగంటల నుండి మధ్యాహ్నం పన్నెండు గంటలవరకు ఉంటుంది. అన్ని ప్రభుత్వ పాఠశాలలకు బ్లాక్, తోపు రంగులు స్కూల్ డ్రెస్‌లుగా ఉంటాయి. ఇంగ్లీష్, అరబ్బీ భాషల్లో విద్యాబోధన జరుగుతుంటుంది. ప్రైవేట్ స్కూల్స్ కూడా ఎక్కువే.

ప్రతిరోజూ ఐదుసార్లు నమాజ్ (అజాన్) ఉంటుంది. అప్పుడు అందరూ మసీదుకు వెళ్లి నమాజ్ చేస్తారు. దారి వెంట ఎవరూ కనిపించరు. కంపెనీల్లో పని చేసేవారికి ప్రత్యేక మసీదులుంటాయి. వారికి డ్యూటీ పర్మిషన్ ఉంటుంది.

ప్రతీ వ్యక్తికి ఒక 'ఒతాకా' ఉంటుంది. దానినే ఐడింటీకార్డు అంటారు. మున్సిపాలిటీవాళ్లు కాని లేబర్ డిపార్ట్‌మెంట్ వాళ్లు కానీ చెక్ చేసినప్పుడు ఆ కార్డును చూపించాలి. ప్రతీ సంవత్సరం ఈ కార్డు కొరకై అక్కడ కొంత డబ్బును చెల్లించాలి.

సిటీకి దూరంగా ఉన్న గ్రామాల్లో ఇప్పటికీ పాత జీవన పద్ధతులు, ఇండ్లు కనిపిస్తూనే ఉంటాయి. కర్జూరపు చెట్లను పెంచడం, గొర్లను పెంచడం చేస్తుంటారిక్కడి ప్రజలు. కాస్త ధనవంతులైనవారు సిటీల్లోకి వెళ్లిపోతున్నారు. ఆర్థికంగా నిలదొక్కుకోలేనివారు ఇప్పటికీ పల్లెల్లోనే ఉన్నారు. వీరికి గొర్ల కాపర్లు అవసరమున్నప్పుడు ఇండియా నుండి వ్యక్తులను వీసా మీద రప్పించుకుంటారు. ఆర్థికంగా వీరే అంతగా లేనివారుకాబట్టి వచ్చిన వ్యక్తికి జీతాలు చెల్లించే స్థితిలో ఉండరు. అందుకే గొర్లకాపరిగా, కర్జూరపు చెట్లను ఎక్కే వ్యక్తులుగా వెళ్లేవారికి చాలా కష్టంగా ఉంటుంది. ఒకవేళ తెలియక వెళ్లినా కొద్దిరోజులకే పారిపోతారు. వీరి వద్ద బతాకా (లేబర్‌కార్డు) పాస్‌పోర్ట్ ఉండదు. పోలీసులకు దొరికిపోయాక కొన్ని రోజులు జైలులో ఉంచి ఇండియా పంపించేస్తారు.

మరికొందరు విజిటింగ్ వీసా మీద గల్ఫ్ కంట్రీలకు వెళ్తారు. ఇది మూడు నెలలు ఉంటుంది. ఈ మూడు నెలల్లోపు ఆ వ్యక్తులు ఏదో కంపెనీలో పని చూసుకుని అక్కడే స్థిరపడిపోయి పోలీసులకు దొరికే వరకు ఉండిపోతారు. మరికొందరు కంపెనీ వీసాలు కొనుక్కుంటారు. ఏ ఆధారమూ ఆదాయమూలేని విజిటింగ్ వీసాకే ఏజంట్లు అరవై వేలు తీసుకుంటారు. మరికొందరు మస్కట్ నుండి దుబాయికి, దుబాయి నుండి మస్కట్‌కు పారిపోతారు. ఇలా పారిపోయే ఏర్పాట్లను కొంత డబ్బు తీసుకుని అక్కడి వ్యక్తులు కొందరు సమకూరుస్తారు.

మస్కట్‌లో ఇండియావారు మూడు లక్షల వరకూ ఉంటే అందులో లక్షకు పైగా కంపెనీల్లో వీసాలు లేక రహస్యంగా పని చేసుకునేవారే ఉన్నారు. ఉత్తరాలు రావడానికి పోస్ట్‌బాక్స్ నెంబర్లు ఇస్తారు. ఆ నెంబర్‌మీద వచ్చిన ఉత్తరాలన్నీ అదే బాక్స్‌లో వేస్తారు. సంబంధించిన వ్యక్తులు వచ్చి బాక్స్‌ను తెరిచి తమ పేరు మీదగల ఉత్తరాలను పట్టుకెళ్తారు.

★ ★ ★

భార్య చెప్పిన విషయం విన్నాక యాదగిరి కొద్దిగా ఆందోళన పడ్డాడు. నిజానికి జీతం విషయంగానీ పని విషయంగానీ అతడికి ఏవీ తెలియవు. ముంబాయిలోని ఏజంట్లు ఏది చెబితే అదేచెప్పాడు. వారు చెప్పింది అబద్ధమని తెలిసినా మస్కట్ వెళ్లాక తమ అదృష్టం ఇలా ఉందని

మౌనంగా ఉంటారనుకున్నాడు తప్ప ఇలా రెచ్చిపోతారనుకోలేదు. ఒకేచోట నుండి పదిహేనుమందిని పంపడంవల్లే అలా యూనిటీ ఏర్పడి తిరగబడుతున్నారని గ్రహించాడు. ఈ తప్పు మరోసారి చేయకూడదని ఊరినుండి ఒకరిద్దరిని తప్ప గ్రూపులుగా పంపకూడదని నిర్ణయించుకున్నాడు.

ముందుగా ఈ సమస్యను అధిగమించాలి. ఆదిలోనే తుంచి వేయకపోతే అల్లరి పాలవడం తప్పదనుకున్నాడు. ఇంతవరకు తనవద్ద అడ్వాన్స్‌గా పాస్‌పోర్ట్‌లు ఇరవై ఉన్నాయి. ఒక్కొక్కరివద్ద పది వేల రూపాయలు అడ్వాన్స్‌గా తీసుకున్నాడు. వారు కూడా తిరగబడి తమ అడ్వాన్స్ రూపాయలు ఇవ్వమంటారు.

తన వద్దకు ఎవరూ పాస్‌పోర్ట్‌లు పట్టుకుని రారు. ఎలా? చాలా సేపటివరకు ఆలోచించాడు యాదగిరి. అతడికొక ఆలోచన వచ్చింది. వెంటనే ఊరికి బయలుదేరాడు. రాత్రి పదిగంటలు దాటాక ఇంట్లోకి అడుగుపెట్టాడు. చీకటిపూట కావడంవలన యాదగిరి రాకను ఎవరూ గమనించలేదు.

ఊరిలో పెద్ద మనుషులుగా చెలామణి అవుతున్న నలుగురు వ్యక్తులను అదేరాత్రి పిలిపించుకున్నాడు. యాదగిరి పేరు చెప్పగానే రెక్కలు గట్టుకుని వాలారు వారు. మందుతో ముందుగా విందు చేశాడు యాదగిరి. వారు సంతృప్తిపడ్డాక చెప్పడం మొదలెట్టాడు.

"ఏదో, మన ఊరివాళ్ళుగదా... బతుకుదెరువు ఉంటదనుకున్న. ఇక్కడా కరువే నాయె. అక్కడ ఏదో పనిచేసుకుని బతుకుతారనుకున్న. ఇప్పుడు అక్కడికి పోయినంక నాటకమాడుతున్నారు. వెళ్ళేదాక కాళ్లు పట్టుకున్నరు. వెళ్ళిన తరువాత రాళ్లు పట్టుకుంటుంద్రు. వాళ్ళతో ఇంకో ముప్పైమంది వెళ్ళారు. వాళ్ళంతా జీతమున్నదని రాశారు. వీళ్లు పోయి రెండు నెలలన్న కాలేదు. ఇప్పుడే జీతం పెరుగుతుందా? మొదట ఎట్లయినా తక్కువనే ఉంటది. ఏడాది తర్వాత ఎక్కువ చేస్తరు ఇప్పుడు పైసలియ్యమను అని లెటర్లు రాస్తే నేను ఎక్కడి నుండి తెచ్చి ఇవ్వాలి. వాళ్ళ ముందే నే డి.డి.లన్నీ ఆఫీసుల అప్పజెప్పితి. కొందరు ఏజెంట్లు పైసలు తీసుకొని తోలిస్తలేరు. నేను నెలదాటక ముందే తోలిస్తి. ఇప్పుడు వీళ్లు నా ఇంటిమీద దాడి జెయ్యవట్టిరి. నీతిగ పోతే కాలం ఎక్కడుంది. ఏడాది రెండేండ్లు పంపించకుండా తింపుకుంటే బావుండు"

"వాళ్ళకు జీతం తక్కువుందటగదా! అరవైవేలు పెట్టిపోయిరి. పదివేల జీతమంటివి. అక్కడ రెండువేల ఐదువందలే ఇస్తరట. వంట మనదేనట. వెయ్యిరూపాయలు తిండికే ఖర్చయిపాయె. ఇగ పదిహేను వందలు ఇంటికి పంపుతరు. ఇక్కడ తీసుకపోయిన బాకీకీ పద్దెనిమిదివందల మిత్తి గట్టుటాయె. మరి అప్పు ఎలా తీరుస్తరు. వారు పెండ్లాం పిల్లలకు పాసి అంత దూరంబోతే ఏం లాభం వస్తుంది" నలుగురిలో ఒకవ్యక్తి అడిగాడు. మిగతా ముగ్గురు అతడి మాటనే బలపరిచారు.

వారంతా ఏకమై ఉన్నారనీ యాదగిరి వచ్చాడని తెలిస్తే ఇంటిమీద దాడి చేస్తారనీ, వారి కోపానికి కూడా బలమైన కారణం ఉందనీ చెప్పారు. పొలాలు అమ్ముకున్నారనీ నూటికి ఐదురూపాయల చొప్పున మిత్తికి తెచ్చారనీ ఊరివాడివని నమ్మినందుకు ఇంత మోసం చేస్తావా? అనీ నిలదీశారు.

యాదగిరి ఇంట్లోకి వెళ్ళి నోట్లకట్టలతో వచ్చాడు. తలా వెయ్యి రూపాయలిచ్చాడు. వారు అసంతృప్తిగా కనిపించడంతో మరో వెయ్యి రూపాయలిచ్చాడు. వారి పెదవులపై చిరునవ్వు మెరిసింది. "నిన్ను ఎవ్వరూ ఏం చెయ్యలేరు. రేపు ఊరంతా వారినే తప్పు పట్టేట్టు చేస్తాం. వారి మాటల్ని ఎవరూ నమ్మకుండా చేస్తాం" అని

హామీ ఇచ్చి వెళ్ళిపోయారు. యాదగిరి తృప్తిగా నవ్వుకున్నాడు.

సుశీల అంతవరకూ మెలకువతోనే ఉంది. భర్త చెప్పిన వంటకాలన్నీ చేసి వారికి అందించింది. వారు వెళ్ళిపోయాక భర్తతో మాట్లాడకుండా ముభావంగా ఉండి పోయింది. ఆమె అలిగిందని గమనించి మెల్లిగా మాటల్లోకి దింపాడు యాదగిరి.

"మీరు తీసుకున్న పాస్‌పోర్టులు, అడ్వాన్స్‌గా తీసుకున్న డబ్బులు ఎవరివి వారికి ఇచ్చివేయండి. ఇంతవరకూ చేసింది చాలు. నలుగురూ నాలుగు మాటలు అంటున్నారు. మంచివానికి మాట చాలు, చెడ్డవానికి చెప్పు మేలు అన్నట్టు నేను బయట తలెత్తుకుని తిరగలేకపోతున్నాను. ఈ పాడుపని వద్దు. మనకున్నది - చాలు. కూటికి లేకపోతే అడుక్కు తిందాంగానీ ఇలాంటి మోసం పనులు వద్దు" కోపంగా అన్నది సుశీల.

"ఇందులో మోసం ఏముంది? తోలిస్తనని తోలియ్యకపోతే మోసం. అన్న వాయిదాకి తోలిస్తిని. చేసేపని, జీతం గురించి నాకేం తెలుసు? మా ఏజెంట్ ఏది చెబితే అదే చెప్పిన. అయినా మోసం గీసం అనుకుంట కూచుంటె ఎట్ల నడుస్తదది? దందచేస్తున్నప్పుడు ఇవన్ని మామూలే. ఏజెంటు పని ఎప్పటికి చేస్తమా? ... ఏదో గాడుపు వచ్చినపుడు ఎగబోసుకోవాలె. యాడాది రెండేళ్లు చేసి ఊరుకోవాలె. అప్పటికి కొంత డబ్బు సంపాదించుకుని ఎదన్నా బిజినెస్ చేయచ్చు" ఆమెను బుజ్జగిస్తున్నట్టుగా అన్నాడు.

"నువ్వు వచ్చావని తెలిస్తే వారు ఇంటిమీదికి వస్తారు. ఒక్కొక్కళ్లకీ పదివేల కమిషను వస్తుందంటిరికదా! కనీసం ఆ పదివేలైనా ఇయ్యండి. వారికి కొంతనైనా ఊరట ఉంటుంది. నేను ఎలాగో వారిని ఒప్పిస్తాను" చెప్పింది సుశీల.

"పదివేలు లేవు. పదిపైసలు లేవు. నువ్వు అలాగే చూస్తుండు. చక్రం ఎలా తిప్పుతానో! ఎవరూ మన ఇంటివైపు చూడకుండా చేస్తాను" అంటూ నిద్రకుపక్రమించాడు యాదగిరి. సుశీల ఏదో చెప్పబోతుంటే తనకు నిద్ర వస్తుందని వారించాడు.

తెల్లవారగానే రాత్రి కలిసిన నలుగురు పెద్దలు సమావేశమయ్యారు. వారంటే గ్రామంలో చాలామందికి భయం. తమ మాటకారితనంతో, లా పాయింట్లతో కుక్కను నక్క అని నిరూపించగల సమర్థులు. నలుగురు ఏకమయ్యారంటే న్యాయం యొక్క రూపురేఖలే మారిపోతాయి. పిట్ట కథలు చెప్పి, ఎన్నో ఉదాహరణలు చెప్పి తప్పు అన్నవారి నోటనే ఒప్పు అనిపించగల సమర్థులు.

మస్కట్ వెళ్ళిన వ్యక్తుల తాలూకు బంధువులందరినీ పిలిపించారు. యాదగిరిని కూడా పిలిపించారు. యాదగిరిని చూడగానే ఆవేశం కట్టలు తెంచుకుంది వారిలో. నలుగురూ నానారకాలుగా తిట్టారు. అందరినీ మౌనంగా ఉండవలసిందని హెచ్చరిస్తూ- ఏదైనా విషయం ఉంటే యాదగిరి వచ్చాక అడగాలిగానీ అతడు ఇంట్లో లేనప్పుడు వెళ్ళి అతడి భార్యను తిట్టాల్సిన పనేమిటని మొదటి పాయింట్ లేవదీశారు.

ఆ పాయింట్ మీద రెండు మూడు పిట్ట కథలు చెప్పారు. మొగవారు ఇంట్లో లేనప్పుడు ఆడమనిషీమీదికి వెళ్ళడం ఎంత తప్పో రెండు మూడు ఉదాహరణలు చెప్పారు. కొందరు తెలిసిన వ్యక్తులు పంచాయితీ అప్పుడే వాళ్ల చేతుల్లోకి వెళ్ళిపోతోందని ఆరోపించారు. వారు బయటకు చెప్పడానికి సాహసించలేదు. అసలు విషయాన్ని పక్కకు పెట్టి అనవసర విషయంపై వాదులాట మొదలయింది. ఎవరికివారే తాము యాదగిరి ఇంటికి వెళ్ళలేదని తప్పించుకున్నారు.



"యాదగిరి తోలిస్తానని మీ ఇంటికి వచ్చాడా? " అని రెండవ పాయింట్‌ని లేవనెత్తారు. అందరూ నీళ్ళు నమిలారు. ఇక్కడ అప్పు చేశారని ఆ అప్పు ఎగవేయ డానికే వారు ఇలా రాస్తున్నారని, ఈ మాయమాటలు రాస్తే ఎవరూ నమ్మరని మనం కూలికి పిలిస్తేనే నలుగురికి నాలుగు రకాల పనులుంటాయని అలాంటిది అంత దూరం దేశంకాని దేశంలో ఇంకెలా ఉంటుందో చెప్పమని వాదించారు.

వీరితో మరో ముప్పైమంది వెళ్లారు. వారంతా బాగానే ఉందని రాస్తే వీరు మాత్రం ఇలా రాశారు. ఇందులో ఎవరు అబద్ధమాడుతున్నారో చెప్పాలని అడిగారు. వారి వాదనాపటిమ ముందు వీరెవరూ నోరు తెరువలేకపోతున్నారు. 'నోరున్నవా నిదే ఊరు. కర్ర ఉన్నవానిదే బర్రె' అన్న నానుడి అందరి మనసుల్లో మెదులుతోంద క్కడ.

మొత్తంమీద అక్కడున్నవారే అబద్ధం రాశారని, ఇలా రాస్తే అప్పు ఇచ్చినవాళ్ళు కాస్త జాలి చూపించి కొంత బాకీ రూపా యల్ని మాఫీ చేస్తారనే ఉద్దేశంతో ఇలా రాశారని గట్టిగా వాదించారు. వారి వాదన ఎంత బలంగా ఉందంటే, కొందరికి తమ వాళ్లే అబద్ధం రాసి ఉంటారన్న నమ్మకం ఏర్పడింది.

చివరగా "యాదగిరి మీకు అన్యాయం చేసిండంటున్నారుగదా... ఫ్లేన్ టికెట్‌కు అయ్యే ఖర్చుని పట్టుకుని మీ డబ్బులు మీకు ఇచ్చేస్తాడు. మీ వ్యక్తులందరినీ మస్కట్‌నుండి ఇక్కడకు రప్పిస్తాడు. మీరంతా ఒప్పుకుంటారా? " అని అడిగారు. వారి ఆలోచనను పసిగట్టి యాదగిరి కూడా అందుకున్నాడు.

"కొట్లాటలేదు. పంచాయితీ లేదు. జీతం బాగానే ఉంటుంది. కొన్నిరోజులు గడిస్తే జీతం సంగతి తెలుస్తది. ఇంత తొందరలో ఏం తెలుస్తది? ఏది ఎట్లన్న ఉండని మీకు ఇష్టం లేకపోతే చెప్పండి. అందరినీ మస్కట్ నుండి ఇండియా తెప్పిస్త. పది వేలు పట్టుకుని యాభైవేలు ఇచ్చేస్త. మీరంతా నిర్ణయించుకుని చెప్పండి"

కొందరు అలాగే రప్పించమన్నారు. మరి కొందరు వద్దన్నారు. అలా కుదరదు. రప్పిస్తె అందరినీ రప్పించాలి. ఒకరిద్దరిని విడిచిపెట్టడానికి వీలులేదు. అది గ్రూపు విజా అని చెప్పాడు యాదగిరి. అక్కడికి వచ్చిన మరికొందరు వ్యక్తులు కూడా యాద గిరిది తప్పేంలేదు. మళ్ళీ తెప్పిస్తానంటు న్నాడు. డబ్బు వాపసు ఇస్తానంటున్నాడు. మీరే ఏదో ఒకటి తేల్చిచెప్పండి అన్నారు. వద్దన్నవారికి, రావాలన్న వారికి వాదులాట మొదలయింది. నలుగురు పెద్ద మనుషులు నవ్వుకున్నారు. యాదగిరి వారి వైపు అభినందిస్తున్నట్టు చూశాడు.

ఎలాగూ వెళ్ళారు. ఇక్కడికి వచ్చి ఏం చేస్తారు? జీతం తర్వాత పెరుగుతుండ వచ్చు మళ్ళీ రిటర్న్ విజా ఉంటుందిగదా. అన్న ఆలోచనే వారిని సందిగ్ధంలో పడే సింది. ఎక్కువమంది ఇష్టంలేనివారు న్నారు. కాబట్టి వారిమాటే నెగ్గింది. మళ్ళీ జీతం తక్కువ ఎక్కువ అని అనకూడదని షరతు పెట్టాడు యాదగిరి.

ఈ విషయం ఊరంతా తెలిసిపోయింది. బాకీలను ఎగ్గొట్టడానికే ఈ నాటకం ఆడా రని ప్రచారం జరిగింది. 'తీరా సమయానికి అక్కడినుండి వ్యక్తులందరినీ రప్పించి డబ్బు వాపసు ఇస్తానంటే ఒప్పుకోలేదట. ఏదో దురుద్దేశం లేనిదే ఎందుకు ఒప్పుకోరు' అన్న ప్రశ్న అందరిలో బయలుదేరింది యాదగిరి పాపులారిటీ మరింతగా పెరిగి పోయింది. అతడికి అడ్వాన్స్ డబ్బులు ఇచ్చి నవారు, అంతవరకూ వాపసు తీసుకోవా లన్న తమ నిర్ణయాన్ని మార్చుకున్నారు. తమను కూడా తొందరగా పంపించమని యాదగిరిని బతిమాలసాగారు.

★ ★ ★





"అదిగో... టప్పా రాములు ఆగిండు. కారటు వచ్చినట్టుంది. నడువు. నడువు..." రోడ్డువైపు దృష్టిని సారించి, కోడలును తొందరపెట్టింది నర్సవ్వ. బీడీలు చేస్తున్న పద్మ చేటను పక్కనబెట్టి పరుగులాంటి నడకతో బయటకు వెళ్ళింది. ఆమెకు ఒక ఫారిన్ కవరును అందించి వెళ్ళిపోయాడు రాములు.

ఆ కవరును చూస్తుంటే ఎవరో ఆత్మీయుల్ని చూసినట్టుగా అనిపించింది. అందులో ఏమున్నదో చదవాలనే ఆతృతతో కవరును విప్పుకుంటూ ఇంట్లోకి వచ్చింది పద్మ.

"గడీల పంచాయతి జరుగుతోంది. ఆ దిక్కుమాలినోడిని కలిసి అడుగుదామని పోతే సందు లేకుండ మంది ఉన్నరు. తొందరగా కారటు చదువు. మనకు గూడా వాళ్ళ లెక్కనే రాస్తే ఇదే కారటు పట్టుకుని మందిలకు పోదాం. వాళ్ళకెంత వాపసిస్తడో మనకు గూడా అంతే ఇస్తాడు. మనం ఒంటరిగా పోతే ఏవో సాకులు చెబుతాడు" కోడలుతో చెప్పింది నర్సవ్వ.

పద్మ ఉత్తరం విప్పి చదివింది. ఆ రెండు రోజులు తను చేసిందేపని, చూసిందే సుఖం అనుకున్నాడు దేవరాజు. పని చాలా తేలిగ్గా ఉందనీ, ఏ.సి. రూంలో ఉంటున్నానని, పూల చెట్లకు నీళ్లు పెట్టుడే తనపని అని రాసిండు. జీతం సంగతి మాత్రం రాయలేదుగానీ, తాను ఉన్నది పెద్ద ధనవంతుల ఇంట్లో అని రాశాడు. ఆ ఉత్తరం చదివితే ఎలాంటి బాదరబందీలు లేక హాయిగా ఉన్నాడనిపిస్తుంది. ఉత్తరం చదువుతుండగా ఇద్దరు ముగ్గురు చుట్టుపక్కలవారు వచ్చారక్కడికి.

"ఇక్కడుంటే ఏముంది, బిడ్డా! కడుపునిండ తిండిగూడ లేకపోయె. ఏదో కష్టపడ్డందుకు తొవ్వ దొరికింది. పని అలుకగనే ఉందంటున్నాడుగదా? బంగ్లాలో ఉంటున్నాడంటే జీతం గూడా ఎక్కువనే ఇస్తరు. ఏదో జీతం ఇచ్చేటోడికిస్తరుగానీ మంచిగుంటె చాలు. కొందరిని గొర్లకాడికి తోలిస్తరట. వాల్ల గోసనైతే చెప్పరాదట. ఎర్రటి ఎండ ఉంటదట. కూసుందామంటే పచ్చని చెట్టు గూడా ఉండదట. తాగెందుకు నీళ్లు దొరుకవట" ఉత్తరం చదివాక అన్నది ఒకావిడ.

ఉత్తరం చదివాక నర్సవ్వకు ఎక్కడలేని సంతోషం వేసింది. అంతవరకు ఉన్న అలసత్వం ఎవరో తీసివేసినట్టు క్షణంలో మాయమైపోయింది. ఆర్థిక ఇబ్బందులు, కుటుంబపరిస్థితులు ఏవీ గుర్తుకు రాలేదు. ఇల్లు, పొలం పోయిందన్న బెంగ మాయమైపోయింది. పోతే పోయిందిలే... ఇంకొకటి కొనుక్కుంటాం అన్న ధైర్యం వచ్చింది. కోడలుతో ఉత్తరాన్ని మరోసారి చదువుమని చెప్పింది. పద్మ చదువుతుంటే తన్మయత్వంతో విన్నది. కొడుకుసుఖంగా ఉన్నాడన్న విషయమే ఆమెను ఇంతగా సంతోషపరుస్తోంది.

ఉత్తరం చదివిన పద్మ, దాన్ని మలిచి భద్రపరిచి మళ్ళీ బీడీల చేట అందుకుంటుంటే అన్నది నర్సవ్వ. "ఊకె బీడీలేనా! ఏం బీడీలు పాడైనవి. పెయ్యికి మంచిదిగాదు బిడ్డా. కొద్దిసేపు అటు ఇటు తిరుగు. రోజురోజుకు జ్వరం వచ్చినదాని లెక్క బక్కగైతున్నవు. ఈ బీడీలు బాదు వెట్టి బట్టలు కుట్టుడు నేర్చుకో. ఒక మిషను తెచ్చుకుంటే చేతనైనకాడికి కుట్టుకొని బతుకవచ్చు"

అత్తవైపు విచిత్రంగా చూసింది పద్మ. ఆమె ఎన్నడూ అంత ధీమాగా మాట్లాడి ఎరుగదు. నిజమే అంటున్నానన్నట్టుగా చూసింది నర్సవ్వ. తనలో తాను నవ్వుకుని పనిలో మునిగిపోయింది పద్మ. మనవరాలిని వెంటబెట్టుకుని ఉత్తరాన్ని కొంగుచాటుకు దాచుకుని బయటకు నడిచింది నర్సవ్వ.

"ఆ బంగారాన్ని మందికి చూపిస్తవా?

ఎక్కడికి వెళ్ళకు కారటు వచ్చిందేమో ఆగు తలేదు అంటరు. తన సొమ్ము అయినా దాచుకుతినేరోజులివి" అత్తవైపు విసుగ్గా చూస్తూ అంది పద్మ.

"చూపించకపోతే ఏమిటీ? ఎవలదన్నెత్తు కొచ్చిన్నా? అబద్ధం ఆడుతున్నానా? ... హరిరామ గోస ఎల్లదీసిన. చచ్చేముందైనా తృప్తిగా చస్తా! ఆ దేవుని దయవలన ఒక్క మూడేండ్లు పోతే దరిద్రం పోతది" బయటకు వెళ్తూ అన్నది నర్సవ్వ.

పద్మకు మాత్రం ఏదో వెలితిగా, బెంగగా ఉంది. మనసంతా అదోలా ఉండి గతమంతా గుర్తుకొస్తోంది. దుఃఖాన్ని గొంతులోనే దిగమింగుకుంటూ బీడీలు చేయడం మొదలెట్టింది.

బయటకు వెళ్లిన నర్సవ్వ అరగంటలో తిరిగివచ్చింది. ఆమె వెంట యాదగిరి ఉన్నాడు. అతనిని చూడగానే గుండెలో కలుక్కుమంది పద్మకు. అతడివైపు చూడకుండా సర్దుక్కూర్చుని బీడీలు చేయడం మొదలెట్టింది. యాదగిరి వచ్చి మంచంలో కూర్చున్నాడు. నర్సవ్వ అరుగు అంచునే కూర్చుండిపోయింది. కొద్దిసేపు ఎవరూ ఎవరితోనూ మాట్లాడలేదు. చివరికి యాదగిరే అన్నాడు.

"పెద్దవ్వా! వినాశకాలానికి విపరీతబుద్ధి అన్నట్టు ఏదో చెడ్డ గడియ వచ్చింది. అప్పుడు అలా మాట్లాడాను కానీ తర్వాత నేను చాలా బాధపడ్డాను. అన్నెంపున్నెం ఎరుగని పిల్లయని ఏడ్చిన. నేను ఎన్నడూ అలా ఆలోచించలేదు. ఏదో చెడ్డ గడియ వచ్చి అలా జరిగింది. మీరు ఎవరితోనూ చెప్పక నా పరువు కాపాడారు. కన్నతల్లి లెక్క నా తప్పును కడుపులో పెట్టుకుని దాచుకున్నావు. మీకు చేతులెత్తి మొక్కుతున్నా. ఆ సంగతి మరిచిపొండి. తమ్ముని కారటు ఇవ్వాల రేపట్లో వస్తది. మంచి కంపెనీలోకి పంపిన. కంపెనీవానితో కొట్లాడి మంచిజీతం ఇచ్చే పనికి పంపిన" అతడి గొంతులో పశ్చాత్తాపం ధ్వనించింది.

నర్సవ్వ మౌనంగా లేచి కొంగుచాటు నుండి ఉత్తరాన్ని తీసి యాదగిరికి అందిస్తూ, "ఇంతకుముందే వచ్చింది" అన్నది. దానిని అందుకుని వారు వినేట్టుగా చదివాడు యాదగిరి. చదవడం పూర్తయ్యాక ఉత్తరాన్ని మడిచి కవరులో ఉంచి నర్సవ్వకు అందిస్తూ చెప్పాడు.

"కొత్తలో అక్కడ బెంగగా ఉంటది. లెటర్లు పదిహేనురోజులకొకట్టైనా రాయండి. ఏడాది గడిచిందంటే అక్కడి మంది పరిచయమైపోతారు. అంతవరదాకా ఒంటరిగా ఉన్నట్టె ఉంటుంది"

కొద్దిసేపు వారు అడక్కపోయినా ఇంతవరకు జరిగిన పంచాయతీ గురించి చెప్పి వెళ్ళిపోయాడు యాదగిరి. అతడు వెళ్ళిపోయాక అత్తతో అంది పద్మ.

"ఈ పాడు వెధవను ఎందుకు వెంటబెట్టుకుని వచ్చావు. వీని మొహం చూసినా పాపమే! అందితే జుట్టుపడుతడు. అందక పోతే కాళ్ళు పడుతడు. ఈరోజు అట్లానుకో లేదు, ఇట్లానుకోలే అని అంటే చేసిన తప్పును మరిచిపోతరనుకుంటున్నాడు. ఆనాడే నలుగురిలో చెబితే ఊర్లో పరువు పోతుండె" బాధగా అన్నది పద్మ.

కోడలివైపు చూస్తూ నొచ్చుకుంటున్నట్టుగా అన్నది నర్సవ్వ. "నేను వెంటపెట్టుకు రాలేదు. వాడే వచ్చాడు. వానితో మాట కూడా మాట్లాడలేదు నేను. ఎవని పాపాన వాడే పోతడు. పాపమే లేకపోతే భయమే లేదు. నలుగురికి చెబితే మనకే కష్టం వచ్చేది. డబ్బును ఆశజూపి మనదే తప్పు జేస్తడని ఊకున్న"

పద్మ కూడా ఆనాడు అల్లరి చేయకుండా ఉండిపోయింది అందుకే. బీడీలు చేయడం పూర్తవడంతో కట్టలు కట్టడంలో మునిగిపోయింది పద్మ. అప్పుడే అక్కడికి సుశీల వచ్చింది. భర్త ముంబాయి వెళ్ళిననుండి వారి గడప తొక్కలేదు. వెళ్తే ఏం అడుగు





తారోనని భయం. దేవరాజు విషయం ఏం చెప్పాడో తెలుసుకుందామని వచ్చింది. కోపంగా ఉండటంచేత భర్తను ఆ విషయం అడగలేదు. నర్సవ్వ ఉత్తరం వచ్చిన విషయం జెప్పింది. పద్మ ఉత్తరాన్ని చదివి వినిపించింది. కొద్దిసేపు మాట్లాడి సుశీల వెళ్ళిపోయింది.

యాదగిరి ఇంటికి వెళ్ళి స్నానంచేసి భోజనం చేసి పడుకున్నాడు. అతడు వచ్చాడని తెలిశాక ఇంటికి జనం రావడం మొదలెట్టారు. అందరినీ సాయంత్రం వచ్చి కలవమని చెప్పింది సుశీల. అతడు నిద్రపోయాక లేపడం ఆమెకు ఇష్టం ఉండదు. నిద్ర లేచాక మొహం కడుక్కుని బయటకు వచ్చాడు. యాదగిరి తనకొరకు వచ్చినవారితో మాట్లాడి మల్లయ్యను కలిశాడు. నర్సవ్వను ఎలాగైనా ఖాళీ చేయించాలని చెప్పాడు. యాదగిరి ఊరిలోకి అడుగు పెట్టిన నాటినుండి మల్లయ్య వడ్డీ వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్థిల్లుతోంది. బంగారునగలను, విలువైన వస్తువులను, స్థిరాస్థులను కుదువ బెట్టుకునే వడ్డీకి ఇస్తున్నాడు. డబ్బులు తక్కువపడితే యాదగిరి కూడా మల్లయ్య పేరునే సూచిస్తున్నాడు.

మల్లయ్య యాదగిరి కోరిక కాదనలేదు. వారంరోజుల్లో వారిని ఖాళీ చేయిస్తానని హామీ ఇచ్చాడు. యాదగిరి ఇంటికి వచ్చి భార్యతో, "ఒకవేళ పద్మావాళ్ళు ఖాళీ చేస్తే మన ఇంటిలో ఉండుమని చెప్పు. నీకు తోడుగా ఉంటుంది. కిరాయి అవసరం లేదని చెప్పు" అన్నాడు.

అతడు సానుభూతితో అంటున్నాడని సరే అంది సుశీల.



వాకిట్లో ముగ్గు వేస్తున్న నర్సవ్వ అడుగుల చప్పుడు విని వెనక్కి తిరిగిచూసింది. చేతిలో చిన్న సంచితో వస్తూ కనిపించింది వనజ. అంత పొద్దున్నే కూతురును చూసినందుకు ఆనందం వేసినా, బాకీపడిన ఐదు వేల రూపాయలు గుర్తుకు రాగానే నర్సవ్వ హృదయం బాధతో మూల్గింది. ముగ్గు చిప్ప పక్కనబెట్టి "పొద్దున బస్సుకు వచ్చావా?" అంటూ ఎదురెల్లింది. నవ్వుతూ ఔననట్టు తలూపింది మనజ. ఇద్దరూ ఇంట్లోకి నడిచారు.

ఆరోజు శనివారం కావడంతో పొద్దున్నే తలంటుస్నానం చేసింది పద్మ. భర్త మస్కట్ వెళ్ళిననుండి శనివారం ఉపవాసం పట్టుకుంది. అతడు ఇంటికి రాగానే తిరుపతి వస్తానని మొక్కుకుంది. వనజను చూసి దగ్గరకు వచ్చి 'ఇదేనా రావడం' అంటూ పలకరించింది. వనజ నవ్వుతూ ఔనని సమాధానం చెప్పింది. నులక మంచం వాల్చి కూర్చోమని సైగ చేసింది నర్సవ్వ. నులకమంచంలో కూర్చోని వెంట తెచ్చిన పండ్లు, బ్రెడ్ పాకెట్‌ను తల్లికి అందించింది వనజ.

ఆమె పెళ్ళయన్నుండి అలా పండ్లు ఎప్పుడూ పట్టుకురాలేదు. అంత శ్రద్ధతో ఆరోజు పట్టుకురావడంతో నర్సవ్వకు ఆశ్చర్యం వేసింది. పండ్లను అందుకుని పక్కనబెట్టి, "ఏంబిడ్డా ఇప్పుడు వచ్చినవు. అల్లుడు బాకీ మొత్తం కట్టలేదని ఎమైనా అన్నడా...? నేనే వచ్చి రెండు మూడు నెలలు ఆగుమని బతిమాలుదామనుకుంటున్న" అన్నది నర్సవ్వ.

ఆమె మాటలకు నవ్వుతూ సమాధానం చెప్పింది వనజ. "బాకీ గురించి కాదు. బాకీ ఈరోజు కాకపోతే రేపు తీరుతది. మస్కట్ పోనేపోయిండు. ఐదువేల బాకీ తీర్చడా? అందుకుగాదు నేను వచ్చింది. అన్న లెటరు వేసిండు. ఇక్కడికి వచ్చిందో లేదోనని నేను పట్టుకొచ్చిన. క్షేమంగానే చేరుకున్నానని రాసిండు"

సంచిలోనుండి ఒక కవరును తీసి అందించింది వనజ. ఆ ఉత్తరాన్ని అందుకుని విప్పి తేదీని చూసింది పద్మ. తమకు

వేసిన్నాడే అక్కడ క్యూడ ఒకటి వేశాడు. అందులో కూడా తమకు రాసినట్టుగానే ఉంది.

"ఏదో దేవుని దయవలన అక్కడికి చేరు కున్నాడు. మీ కష్టాలన్నీ తీరినట్టేనే అవ్వా! మూడు నెలలకు కాకపోయిన ఆరునెలల కైనా పైసలు పంపిస్తాడు. బేంక్ నెంబర్ తీసి పంపియ్యండి. బేంక్ నెంబర్ లేకపోతే పైసలు పంపుడు లేటవుతది" చెప్పింది వనజ.

అప్పు కొరకు వచ్చినప్పుడు కూతురు ప్రవ ర్తనకు, ఇప్పటి ప్రవర్తన భిన్నంగా ఉంది. ఆనాడు అలా మాట్లాడింది ఈమేనా? అని పిస్తుంది తల్లికి. ఇప్పుడు నిండుగా నవ్వుతూ ప్రేమను ఒలకబోస్తోంది.

"ఇక్కడికిక్యూడా నిన్ననే వచ్చింది. ఎదిరిచూసి, ఎదిరిచూసి కండ్లు కాయలు గాసినయి. రెండు నెలలనుండి ఏ విషయం తెలియకపాయె. నాకైతే భయం వేసింది. ఆ దేవుడు ఎట్లనో సూది తూములకెళ్ళి ఈక్కచ్చినట్టు ఈక్కచ్చిండు" చెబుతూ తమకు వచ్చిన ఉత్తరాన్ని కూతురుకు అందించింది. వనజ రాత్రిబడి చదువే అయినా ఉత్తరం రాయడం, చదవడం వచ్చు. ఉత్తరాన్ని విప్పి చదివింది.

పూజ ముగిశాక పద్మ సంచి పట్టుకుని ఏవైనా కూరగాయలు తీసుకువస్తానని బయలుదేరింది. అది గమనించి ఎక్కడికని అడిగింది వనజ. కూరగాయలకని చెప్ప గానే "నీకు ఆ శ్రమ అక్కరలేదు వదినా. వచ్చేప్పుడు మన ఊరునుండి చికెన్ పట్టు కొచ్చాను. ఇక్కడ చేతుల పైసలు ఉన్నాయో లేదోనని కొంత డబ్బు కూడా తెచ్చాను. అంటూ సంచిలోనుంచి ఒక పొట్లంను బయటకు తీసి అందించింది.

వదిన ప్రవర్తనకు విస్తుపోయింది పద్మ. తన భర్త ఇంట్లోకి రానీయడంలేదని వాదు లాడి డబ్బు పట్టుకెళ్ళిన వనజ ఇప్పుడు డబ్బు, చికెన్ పట్టుకురావడం విచిత్రమనిపి స్తోంది. దాన్ని అందుకుని విప్పి కడిగి ముక్కలుగా కట్ చేసి పద్మ చికెన్‌ను తాలింపు వేస్తోంది. కమ్మటి వాసన గుప్పు మంది. వనజ, నర్సవ్వలు మాటల్లో ముని గిపోయారు. పద్మ వంటపని చేస్తోంది. శనివారం మాంసాహారం తినకపోయినా వదిన కొరకని వండుతోంది.

"వంటలు బాగానే చేస్తున్నారు. చుట్టాలొ చ్చారనా లేక కారటు వచ్చిందనా? " అప్పుడే ఇంట్లోకి అడుగు పెడుతూ అన్నాడు మల్లయ్య. అతడిని చూసి లేచి నిలబడి "లోనికి రా సేటూ, కూర్చో" అంది నర్సవ్వ. కొడుకు వెళ్ళేప్పుడు మళ్ళీ ఏదైనా బాకీ తీసు కున్నాడేమోనని ఆమె గుండె దడదడలా డింది. మెల్లిగా గొంతు పెకల్చుకుని చెప్పింది.

"పొద్దున్నే వచ్చినవు. ఏమన్న పని ఉందా? నిన్ను చూస్తెనే భయమవుతుంది. నా కొడుకు ఏమన్న బాకీ తీసుకపోయిండా ఏంది? "

"బాకీలేదు ఏంలేదు. ఊరికనే వచ్చిన. మొన్న బాకీ గురించి ఒత్తిడిచేసి బాధ పెట్టి నని దుకాణంలోకి సామానుకు వస్తలేవు. అలా అడిగానని బాధపడ్డావా నర్సవ్వా. అలా బాకీ ఇయ్యకపోతే మిగతా బాకీలు రావని ఒత్తిడి జేసిన. ఉప్పు, పప్పు, నీకెంత సామాను గావాలంటే అంత తీసుకపో. పైసలు లేవని బాధపడకు. నెలకు కాకపోతే ఏడాదికి ఇయ్యి. దేవరాజు కారటు వేసిండ టగదా! యాదగిరి చెప్పిండు. జీతం బాగానే ఉంటదట. ఏడాదిలో బాకీలన్ని తీరుతా యట" కూర్చుంటూ అన్నాడు మల్లయ్య.

మనుషుల్లో మార్పును స్పష్టంగా గమని స్తోంది పద్మ. నేడు కాకపోయినా రేపైనా తాము డబ్బు సంపాదిస్తామనే నమ్మకమే వారిని మృదుస్వభావులుగా మార్చేస్తోందని ఊహించింది. ఆమెకు అప్పులవాళ్ళు గుర్తొ చ్చారు. ఇంతకుముందు ఇంటిచుట్టూ రోజుకు నాలుగు సార్లయినా చక్కర్లు కొట్టే

 

వారు. ఇప్పుడు ఎవరూ అప్పు ఊసే ఎత్తడంలేదు. ఒకవేళ ఎత్తినా ఎక్కడికి పోతుందిలే. బ్యాంకులో వేసుకున్నట్లే అంటున్నారు.

సామాన్యజనంలో మస్కట్ వెళ్ళడమన్నా, వెళ్ళినవారన్నా ఎంత నమ్మకం ఉందో ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. వచ్చేప్పుడు చిన్నచిన్న బహుమతులు తెస్తారు. వచ్చాక విందులు, చిన్న చిన్న అవసరాలకు డబ్బు ఇవ్వడం చేస్తారు. అందుకే వారికి, వారి కుటుంబానికి దగ్గరవ్వాలని ప్రయత్నిస్తుంటారు అనుకుంది పద్మ.

"అవ్వా! మేము ఇల్లు కొనుక్కున్నాం. రేపు ఇంట్లకు పోతున్నాం. మీరిద్దరు రండి. రెండురోజులుండి వస్తురు... నాకు మాత్రం ఆత్మీయులు ఎవరున్నరు మీరు తప్ప" భోజనాల వద్ద చెప్పింది వనజ.

"ఇదివరకే ఇల్లు ఉండేగదా! మళ్ళీ ఇల్లు ఎందుక్కొన్నారు? " అడిగింది నర్సవ్వ.

"ఇదివరకున్న ఇల్లు చిన్నగా ఉంది. మసులుకోవడానికి ఇబ్బందిగా ఉంది. అల్లుడు కొత్త ఇల్లు కడుతానన్నడు. వట్టిగైతదా. కష్టమైతది వద్దు. కట్టిన ఇల్లే కొందామని చెప్పిన. ఇంతకుముందు పదేండ్లు దుబాయి పోయివచ్చిన కుమ్మరాయన బరారు బంగ్ల కట్టిండు. రెండేళ్లు కూడా కాలేదు. తాగుడు బుక్కుడు అలవాటయి మూడు లక్షలకు ఇల్లు అమ్మితే మేం కొన్నాం. సున్నం వేసి సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నం" గొప్పగా చెప్పింది వనజ.

★ ★ ★

భోజనాలయ్యాక అందరినీ బయలుదేరతీసింది వనజ. ముందు ఏవో సాకులు చెప్పినా చివరికి బయలుదేరక తప్పలేదు నర్సవ్వకు. పద్మ అయిష్టంగానే కదిలింది. అందరూ మధ్యాహ్నం బస్ ఎక్కారు.

కొత్త ఇల్లు బాగానే ఉంది. ఇంటి చుట్టూ పచ్చని పందిర్లు వేశారు. టెంట్‌ను కూడా వేశారు. చుట్టూ చిన్నచిన్న పెంకుటిండ్లు. వాటిమధ్య దర్జాగా నిలబడినట్టు, కాంపౌండ్ వాల్‌తో రెండు పోర్షన్లతో ఆర్.సి.సి బిల్డింగ్ తెల్లటి వాటర్ పెయింటింగ్‌తో మెరిసిపోతోంది. బంధువులు చాలామంది వచ్చారు. వారి ముందు వనజ తన దర్పాన్ని ప్రదర్శిస్తున్నట్టుగా అనిపించింది పద్మకు.

నర్సవ్వకు మాత్రం అదో వింత ప్రపంచంలా అనిపించింది. ఇంటిముందు కార్లు, జీపులు, రకరకాల వాహనాలు రావడం అల్లుని చుట్టూ ఎప్పుడూ పదిమంది ఉండటం గమ్మత్తుగా అనిపించింది. దేవరాజు వచ్చాక తాముకూడా అలాంటి ఇల్లు కొనుక్కోవాలనుకుంది. అదే విషయాన్ని కోడలుతో చెప్పింది.

"మనం కూడా ఇట్లాసంటి ఇల్లే కొనుక్కోవాలె. ఇల్లు అమ్ముకున్న పేరు వచ్చినందుకు ఇట్లసంటి బిల్డింగ్ కొని ఊరిలో షబాస్ అనిపించుకోవాలె. మూడు లక్షలు పోతెపోనియిగానీ బిల్డింగ్ కొనుడంటే ఎంత విలువ"

ఆమె మాటలకు పెదవి విరిచింది పద్మ "ఆలూలేదు చూలూలేదు. కొడుకు పేరు గోవిందం అన్నడట. మస్కట్ చేరిండో లేదో ఇప్పుడే ఇల్లు కొనడం గురించి ఆలోచిస్తున్నాం. మూడు లక్షలు బ్యాంక్‌ల వేస్తే మూడు వేలు వడ్డీ వస్తది. అందులోనుండి వెయ్యి రూపాయలు ఇస్తే మంచి బిల్డింగ్ కిరాయికి వస్తది. రెండు వేలు లాభమే కదా" చెప్పింది పద్మ.

"అట్లనుకుంటమా! డబ్బును కడుక్క తాగుతమా! పశువుకు తింటే తృప్తి మనిషికి ఉంటే తృప్తి. ఎవరైనా ఇంటికివస్తే ఇల్లును చూస్తారా బ్యాంకులో డబ్బును చూస్తారా" కోపంగా అన్నది నర్సవ్వ.

"నువ్వు ఇప్పుడే ఇల్లు కొన్నట్టు గోల చేస్తన్నవు. క్షేమంగా ఇల్లు చేరనీ చేరినంక అన్నీ

చెయ్యవచ్చు ఇప్పుడెవరైనా వింటే నవ్వు తారు" చెప్పింది పద్మ కూతురును ఎత్తు కుంటూ.

"ఏంటిది అత్తాకోడళ్లిద్దరు బాగానే ముచ్చ టపెడుతున్నరు" అంటూ అక్కడికి వచ్చింది వనజ. అందరూ కలిసి బస్టాండ్‌కు బయలు దేరారు. అరగంట తర్వాత వచ్చింది బస్. పెద్ద కూతురును అత్తకు ఇచ్చి చిన్న కూతు రును తను ఎత్తుకుంది పద్మ.

బస్ ఎక్కి కూర్చుంది పద్మ. నర్సవ్వ కూడా బస్సెక్కింది. నడుములో ఏదో కలు క్కుమంది ఆమెకు. వెన్నుపూసలో నొప్పి మొదలయింది. బస్ కుదుపులకు అది మరింత ఎక్కువయింది. ఆయాసంతో సీటులో జారిగిలబడి కూర్చుంది. ఊరిలో బస్ దిగగానే కనిపించాడు ఆర్.ఎం.పి డాక్టర్. ఆమె వెన్ను విరిచి నడుస్తుంటే ఏమి టని పరామర్శించాడు. వెన్నులో నొప్పి ఉన్న సంగతి చెప్పింది నర్సవ్వ. ఇంటికి వచ్చి ఇంజక్షన్ ఇచ్చి మాత్రలు చిట్టీమీద రాసి వెళ్లాడు.

చుట్టుపక్కల వాళ్లందరికీ ఆ కుటుంబంపై సానుభూతి పెరిగిపోయింది. మాట్లాడని వారు కూడా 'లెటరు వచ్చిందా బాగున్నాడ టనా' అని మాట్లాడిస్తున్నారు.

★ ★ ★

వణుకు పుట్టించే చల్లనిగాలి రివ్వుమని వీస్తోంది. సన్నని ఇసుక గాలి తాకిడికి దుమ్ములా పైకి లేస్తోంది. గోత్రా (తలకు కట్టుకునే గుడ్డ)ను ఇసుక కళ్లలో పడకుండా ముఖంపై కప్పుకుంటూ గుడారంలో నుండి బయటకు తొంగిచూశాడు దేవరాజు. ఇంకా తెల్లవారలేదు. పిండారబోసినట్టు వెన్నెల. దుమ్ములా లేచిన ఇసుక పొగమంచులా వుంది. ఆకాశంలో మేఘాలు మచ్చుకైనా లేవు.

'మాయదారి ఎడారి... రాత్రంతా విపరీత మైన చలి. పొద్దంతా చర్మం మాడిపోయే వేడి. చలికి తట్టుకోలేం. ఎండను భరిం చలేం' అనుకుంటూ తెరను దించి లోపలికి నడిచాడు దేవరాజు. అగ్గిపెట్టెను వెదికి కొవ్వొత్తిని వెలిగించాడు. చేతికి గడియారం లేదు. టైం ఎంతయిందో తెలియదు.

తెల్లవారకముందే వస్తాడు కపిల్. అదివ రకే గొర్లపాలు పితకాలి. లేకుంటే అరబ్బీలో ఏదో అరుస్తాడు. రెండుమూడుసార్లు కొట్టా డుగూడా. ఆ భయానికి ఏ అర్ధరాత్రి వేళనో పాలు పిండుదామంటే తెల్లవారేముందు తప్ప పాలు ఇవ్వవు గొర్లు. గాలికి గుడారం కదులుతోంది. పైన తాటిపత్రి, కింద అట్ట లతో దృఢంగానే ఉన్నా మేకులు లోతుగా పాతకపోవడంవల్ల గాలి తాకిడికి కదులుతు న్నాయి.

దేవరాజు చెక్కబల్లమీద పడుకున్నాడు. నిద్రరావడంలేదు. అతడు వచ్చి రెండు నెలలు దాటింది. వచ్చిన మొదట్లో రాసిన ఉత్తరమే! మళ్లీ రాద్దామంటే ఉత్తరం దొరక డంలేదు. కపిల్‌కు చెబితే తీసుకురావడం లేదు. ఇంటినుండి కూడా ఉత్తరాలు కపి ల్‌కే వస్తాయి. అతడు తెచ్చి ఇవ్వడంలేదు. ఈ ఎడారిలోనుండి ఎలా బయటపడాలో తెలియట్లేదు. ఒక్క మనిషి కూడా కనిపిం చడు. ఇసుక రాతి గుట్టలు, గొర్లు, రోజుకొ క్కసారి కపిల్ తప్ప మరొకటి కనిపించడం లేదు.

తల్లి, భార్య చెప్పినా వినకుండా డబ్బు సంపాదించాలనే ఆశతో వచ్చినందుకు తన ను తాను ప్రతీ క్షణం తిట్టుకుంటున్నాడు. ఇంటికి వెళ్లి తనవారిని చూస్తానన్న ఆశ లేదు. మొండి ధైర్యం చేసుకుని జీవిస్తు న్నాడు. తల్లి, భార్య ఎంతగా కంగారుపడ తారో ఊహించుకుంటేనే ఆందోళనగా ఉంది. ఏడ్చిఏడ్చి కన్నీళ్లు కూడా కరువైపో యాయి.

గాలిహోరు ఎక్కువైనట్టుంది. గరగర శబ్దంవస్తోంది. షబక్‌లలో ఉన్న గొర్లు అరుస్తున్నాయి. వాటి అరుపులకు పక్కనే మరో షబక్‌లో ఉన్న గొర్రె పిల్లలు కూడా





అరవడం మొదలెట్టాయి. గాలి వీచినప్పుడల్లా ఇదేవరుస. గొర్లు అరవడం నిద్రాభంగం కావడం. ఎన్నడూ కంటినిండా కునుకులేదు. అసహనంగా లేచి కూర్చున్నాడు దేవరాజు. పక్కనే బుస్‌బుస్ అన్న శబ్దం వినిపించింది.

మనసు ఏదో కీడును శంకించింది. వెంటనే టార్చ్‌లైట్ అందుకుని బటన్ నొక్కాడు దేవరాజు. అది వెలగలేదు. అప్పుడు గుర్తొచ్చిందతనికి. రెండు రోజుల క్రితమే అది డిస్‌చార్జ్ అయిందని. అప్పటి నుండి కపిల్‌కు చెబుతూనే ఉన్నాడు చార్జ్ చేయించుకుని రమ్మని. అతడే వినిపించుకోవడంలేదు. వెంటనే కుడిచేత్తో క్యాండిల్ అందుకున్నాడు దేవరాజు. శబ్దం మరింత దగ్గరగా వినిపించింది. గుండె దడదడలాడింది.

క్యాండిల్ వెలుతురులో శబ్దం వినిపించిన చోట వెదికాడు దేవరాజు. చిన్న కట్టెపుల్ల సైజులో అరగజం పొడువు ఉన్న పాము కనిపించింది. వెలుతురును చూడగానే అది జంప్ చేసింది. ఇనుప రాడ్‌ను అందుకుని చంపాలని ప్రయత్నించాడు దేవరాజు. కార్పెట్ రంధ్రంగుండా ఇసుకలోకి దూరి మాయమైపోయింది. చూడడానికి చిన్నగా ఉన్నా చాలా డేంజర్. కరిస్తే చావుతప్పదు.

అక్కడే క్యాండిల్‌ను పట్టుకుని కూర్చున్నాడు దేవరాజు. అది మళ్లీ బయటకు రాలేదు. అక్కడ కొన్ని రకాల పాములు, ప్రమాదకరమైన కీటకాలు పొద్దంతా ఇసుకలోనే దాగి ఉంటాయి. రాత్రిపూట బయటకు వస్తాయి. అందుకే గుడారంలో కింది భాగాన మందంగా ఉండే కార్పెట్‌ను పరుస్తారు. దానికి హోల్‌లు లేకుండా చూస్తారు. అట్టముక్కతో హోల్‌ను మూసి బయటకు వచ్చాడు దేవరాజు.

పూర్తిగా తెల్లవారింది. గాలి హోరు తగ్గిపోయింది. అక్కడక్కడా ఇసుకమేటలు ఏర్పడ్డాయి. షబక్‌లవైపు చూశాడు. గొర్లు ప్రశాంతంగా ఉన్నాయి. జలదరింపులతో మీదపడిన ఇసుకను రాల్చుకుంటున్నాయి. ఫినిషింగ్‌లవద్ద మాత్రం ఇసుక మేటలుగా ఏర్పడింది.

అల్యూమినియం పాత్ర తీసుకుని షబక్ లోకి నడిచాడు దేవరాజు. పాలు పిండడానికి గంటకుపైగా పట్టింది. పిండినపాలను గేద్రీ (పాత్ర)లో పోస్తుండగా దట్సన్ (జీపు) హారన్ వినిపించింది. పాలు గేద్రీలో నింపి మూత బిగించి గుడారంలోకి వచ్చాడు దేవరాజు.

వంట సరుకులులేవు. బియ్యం మాత్రమే ఉన్నాయి. మంచినీళ్లులేవు. మొదట వచ్చినప్పుడు ఒక బారిల్ నిండా తీసుకుని వచ్చాడు. ఇంతవరకు అవే తాగుతున్నాడు. ఇప్పుడవి పూర్తిగా అయిపోయాయి. రెండు రోజులనుండి బారిల్‌ను కపిల్‌కు చూపిస్తూనే ఉన్నాడు. ఈ రోజు బతిమాలి చెప్పాలనుకున్నాడు.

దట్సన్ వచ్చి గుడారం ముందు ఆగింది. కపిల్ రాలేదు. షెబాల్ వచ్చాడు. ఇతడు కపిల్ కొడుకు. వస్తువుల కొరకై చూశాడు దేవరాజు. దట్సన్ ఖాళీగా ఉంది. బాధతో, ఉసూరుమంటూ గేద్రీని దట్సన్‌లో ఉంచి షెబాల్ వద్దకు వెళ్లి చేతులు మోడ్చాడు. తెలుగులో మాట్లాడితే వారికి అర్థం కాదని తెలుసు. వాటర్... వాటర్ అంటూ బారిల్ వైపు చూపిస్తూ తీసుకురావలసిందిగా దీనంగా సైగజేశాడు. వంట సామానులు నిండుకున్నాయంటూ పాత్రల్ని కూడా చూపించాడు. షెబాల్ ఏ భావమూ లేని నవ్వొకటి నవ్వి వెళ్లిపోయాడు. దేవరాజు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆకలి దప్పికల చేత చచ్చిపోతానా అనిపించింది. అంత డబ్బు ఖర్చుపెట్టి రావడమేమిటి? ఈ నరకయాతన పడడమేమిటి? అనుకున్నాడు.

దట్సన్ దూరమయ్యాక కాలకృత్యాలు తీర్చుకున్నాడు. స్నానం చేద్దామనుకున్నా



నీరులేదు. ప్రాణానికి తాగడానికి అదే బారి ల్‌లోని నీళ్లను వాడుకోవాలి. ఇలా నీటి కొరత ఏర్పడుతుందని తెలియక మొదట నీటిని ఎక్కువగా వాడుకున్నాడు. మొహం కడుక్కున్నాననిపించుకుని స్టోనా (స్టౌ) వెలి గించి పాలను మరగబెట్టాడు. ప్రతీ రోజు కపిల్ రాకముందే కొన్ని పాలను దాచుకో వడం, వెళ్లాక తాగడం, దప్పిక అయితే వాటితోనే గొంతు తడుపుకోవడం అలవాటు చేసుకున్నాడు దేవరాజు.

పాలు మరిగాక రాత్రి మిగుల్చుకున్న కుబుస్ (రొట్టెలాంటిది) పాలలో వేసుకుని తిన్నాడు. కర్జూరపు పండ్లను మధ్యాహ్నం తినడానికి మూల్లెకట్టుకున్నాడు. వేడి పాలను చల్లార్చి బాటిల్‌లో పోసి మూత బిగించాడు. అప్పటికే పొద్దుబారెడు పైకిలే చింది. ఎండ చుర్రుమంటోంది. కిందనేల వేడెక్కింది. గొర్లు అరుస్తున్నాయి. వాటిని మేపడానికి వెళ్లాలి. ఎడారిలో చెట్టు, చేమ, నీడ అన్నది ఉండదు. ఎక్కడైనా ముండ్ల చెట్లు ఉన్న చోట గడ్డి మొలుస్తుంది. వాటినే కొరుక్కుతింటాయి గొర్లు.

సద్దిమూట, పాల బాటిల్ చేతబట్టుకుని తలకు గుడ్డ చుట్టుకుని బయటకు వచ్చి షబక్ తడికల్ని తెరిచాడు దేవరాజు. పెద్ద సైజు ఎలుగుబంట్లలా ఉన్న గొర్లు మెల్లిగా ముందుకు కదిలాయి. ఎర్రటిఎండ. నిప్పులు గక్కే ఇసుక మైళ్ల దూరం నడ వాలి. ఒక్క ప్రాణి కనిపించదు. రాత్రి వరకు గుడారానికి తిరిగిరావాలి. దారి తప్పి మరోవైపు వెళ్తే గుడారం చేరేవరకూ పస్తులే. ఆ ఎడారిలో ఎటు చూసినా ఒకేలా అనిపించి దారి తెలియదు. సూర్యు డిని చూసుకుంటూ ప్రయాణించాలి. కొత్తగా వచ్చినప్పుడు రెండుసార్లు దారి తప్పాడు. రాత్రంతా ప్రయాణంచేయాల్సివ చ్చింది.

కపిల్ జీతమెంత ఇస్తాడో తెలియదు. అసలు ఇస్తాడో లేదో కూడా తెలియదు. ఇంటినుండి సమాచారమేదీలేదు. వారెలా ఉన్నారో తెలియదు. ఈ ఎడారి జైలునుండి ఎన్నడు విముక్తి కలుగుతుందో తెలియదు. అసలు వెళ్తాడోలేదో కూడా తెలియదు. ఊరు ఎటువైపు ఉందో ఎంత దూరంలో ఉందో తెలియదు. కష్టమో నష్టమో భరిద్దా మనుకుంటే ఈ ఎండలో ఎప్పుడు మాడి చ చ్చేది తెలియదు. గతాన్ని తలుచుకుంటూ నడుస్తున్నాడు దేవరాజు.

వేడికి చర్మం పొలుసుల్లా లేచి నల్లబడిపో యింది. అప్పుడప్పుడూ ఎడారి పాములు కనబడి భయపెడుతున్నాయి. ఒంటరితనం పిచ్చివాడిని చేస్తోంది. వేడి, చలి, ఇసుక తుపాను, పాములు, గొర్లు జీవితంలో భాగ మైపోయాయి. తనే ఓ వింత జంతువులా గొర్లను అదిలిస్తూ నడుస్తున్నాడు దేవరాజు.

రెండు నెలలనుండి గడ్డం తీయలేదు. రెండు మూడుసార్లు తప్ప స్నానం చేయ లేదు. బట్టలు అసలే పిండలేదు. కపిల్ రెండు డ్రెస్‌లు ఇచ్చాడు. తన వెంట తెచ్చు కున్నవి రెండు డ్రెస్సులు. వాటినే మార్చి మార్చి వాడుతున్నాడు. కొద్ది దూరం వెళ్ల గానే దాహంతో నాలుక పిడుచకట్టుకుపో యింది. కూర్చుందామంటే నీడలేదు. వడ గాలి ఎండకంటే వేడిగా మొహానికి తాకు తోంది. పాలబాటిల్ విప్పి గొంతు తడుపు కున్నాడు. కడుపు నిండా భోజనం, పరిశుభ్ర మైన స్నానం, ఉతికిన బట్టలు ఈ జన్మలో తనకు లభించవని అర్థమైపోయింది. తల వెంట్రుకల్లో పుట్టిన చెమట ధారలై మొహం పైకి కారుతుంటే తుడుచుకుంటూ ముందుకు నడిచాడు దేవరాజు.

కొద్దిదూరం వెళ్లగానే చెప్పు తెగిపో యింది. అవిలేకుండా ఎడారిలో నడవడం అసాధ్యం. కాళ్లు బొబ్బలెక్కుతాయి. తలకు చుట్టుకున్న గుడ్డ అంచును చింపి చెప్పును కాలికి కట్టుకున్నాడు. కొత్త చెప్పులు ఎప్పుడు ఇస్తాడో తెలియదు. అప్పటికి ఎండ బాగా ముదిరింది. ఇసుకపై పడ్డ





సూర్యకాంతి పరావర్తనం చెంది మెరు స్తోంది.

ఎలాగో పొద్దు గడుపుకుని గుడారంకు చేరాడు దేవరాజు. కాళ్లులాగుతున్నాయి. ఒళ్లు వేడెక్కింది. నిస్సత్తువగా కార్పెట్ పై వాలిపోయాడు. బాగా జ్వరం వచ్చింది. ఏదేదో పలవరించాడు. ప్రతీరోజు పొద్దునా సాయంత్రం వస్తాడు కపిల్. దేవరాజు పరి స్థితిని చూసి జ్వరం వచ్చిందని గ్రహిం చాడు. జీపులో ఎక్కించుకుని డాక్టర్ దగ్గ రికి తీసుకు వెళ్లాడు. ఎడారిలో నుండి ఊరి లోకి రావడం అదే మొదటిసారి. ఇంతకు ముందు చాలాసార్లు జ్వరం వచ్చినా మాత్రల్ని మాత్రమే పంపించాడు కపిల్.

దేవరాజుకు జీపు ఎక్కడమే గుర్తుంది. మళ్లీ మెలకువలేదు. డాక్టర్ దగ్గరికి వెళ్లాక బలవంతంగా కళ్లు తెరిపించారు. ఇంజక్షన్ చేసి మాత్రలు ఇచ్చాడు డాక్టర్. కపిల్ జీపులో తన ఇంటికి తీసుకెళ్లాడు దేవరా జును. అప్పటికే రాత్రయింది. లైట్లు వెలు గుతున్నాయి. చాలా రోజుల తర్వాత లైటు వెలుతురును ఆ ఇల్లును చూసినందుకు ఆనందం కలిగింది దేవరాజుకు.

మొదట వచ్చినప్పుడు తను పడుకున్న గదిలోకి వెళ్లాడు దేవరాజు. శుభ్రంగా స్నానం చేశాడు. కొత్త డ్రెస్సును ఇచ్చాడు కపిల్. వాటిని వేసుకున్నాక ఎంతో హాయిగా అనిపించింది. ఆ రాత్రి అక్కడే భోజనం చేశాడు. ఈసారి మరింత వెగ టును పుట్టించింది. ముందుగా ముసలి వాళ్లు (షెబాలు) తిన్నారు. తర్వాత షెబా బ్‌లు (వయసువారు) అదే భోజనాన్ని తిన్నారు. దేవరాజు షెబాబ్‌లతో తిన్నాడు. తర్వాత అదే అన్నం పెద్దపెద్ద మటన్‌ము క్కలను ఇంట్లోని ఆడవారు తిన్నారు.

భోజనం తర్వాత నిద్రముంచుకొచ్చింది. వెళ్లి గదిలో పడుకుంటుండగా హౌస్‌బాయ్ వచ్చాడు. దేవరాజు పేరుమీద వచ్చిన మూడు ఉత్తరాలను అతడికి అందించాడు. అరబ్బీలో ఏదో చెప్పాడతడు. దేవరాజుకు అర్థంకాలేదు. హిందీలో, ఇంగ్లీషులో చెప్పాడు. దేవరాజుకు అర్థంకాలేదు. సైగల ద్వారా ఉత్తరాన్ని దాచుకొమ్మని చెప్పాడు. దేవరాజుకు కొద్దిగా అర్థమైంది. వాటిని జేబులో భద్రపరచుకుని పడుకున్నాడు.

నిద్రలోకి జారుకుంటుండగా కపిల్ వచ్చి లేపాడు. నిద్ర కళ్లతో లేచి కూర్చున్నాడు దేవరాజు. అతడిని జీపులో కూర్చో మంటూ సైగచేసి జీపెక్కాడు కపిల్. ఇక్కడే పడుకుని తెల్లవారాక వెళ్తానన్నాడు దేవరాజు. అతడి మాటలు కపిల్‌కు అర్థంకాలేదు. విసుగ్గా మొహంపెట్టి పద్దల్ అంటూ అరిచాడు. చేసేదిలేక దేవ రాజు వెళ్లి జీపులో కూర్చున్నాడు. క్షణాల్లో వేగాన్ని అందుకుంది జీపు.

దేవరాజుకు నిద్రపట్టింది. ఎక్కడ ఎడారి మొక్కలు, ముండ్లచెట్లు ఏపుగా పెరుగుతాయో అక్కడే గొర్రెల స్థావరాలు ఏర్పరచుకుంటారు. కొందరైతే ముప్పై నలభై కిలో మీటర్ల నుండి వంద కిలోమీ టర్ల దూరంవరకూ గొర్ల స్థావరాలను ఏర్పరచుకుంటారు. గొర్లకాపరిగా ఇండియా, శ్రీలంక, బంగ్లాదేశ్, పాకిస్థాన్ దేశాలనుండి వ్యక్తులను విసాలమీద రప్పించుకుంటారు.

కపిల్ కుదుపుతుంటే నిద్రలేచాడు దేవ రాజు. చుట్టూ చిమ్మచీకటి. ఇంకా చంద్రో దయం కాలేదు. జీపు హెడ్‌లైట్ల వెలుతు రులో గుడారం కనిపిస్తోంది. జీపు అలికి డికి గొర్లు అరవడం మొదలెట్టాయి. కిందికి దిగి గుడారం వైపు నడిచాడు దేవ రాజు. జీపును రివర్స్ చేసుకుని వెళ్లిపో యాడు కపిల్.

లోపలికి వెళ్లి క్యాండిల్‌ను వెలిగిం చాడు. ఆతృతగా ఉత్తరాన్ని విప్పాడు. మొదటి ఉత్తరం అందరూ క్షేమంగానే ఉన్నారని రాశారు. రెండవ ఉత్తరంలో ఉత్తరాలు రాయడం లేదేంటని రాశారు.



మూడవ ఉత్తరం చదువుతుంటే కళ్లల్లో నీళ్లు తిరిగాయి. తనమీద బెంగతో ఉన్నట్టు, ఆ ఉత్తరం ముట్టగానే ఉత్తరం రాయాలని లేకపోతే తాము మరింతగా బెంగపడిపోతామని రాశారు. పొద్దుగూకితే తెల్లవారితే కళ్లల్లో వత్తులు వేసుకుని ఎదురు చూస్తున్నామని రాశారు. బెంగతో తల్లి మంచం పట్టిందని రాశారు.

దేవరాజుకు నిద్రమాయమైపోయింది. ఉత్తరాలను రెండుమూడు సార్లు చదివాడు. కవర్లను గుండె మీదపెట్టుకుని ఎప్పుడో నిద్రలోకి జారిపోయాడు. నిద్రలో పీడకల వచ్చింది. తను ఒంటె మీద కూర్చుని ప్రయాణం చేస్తున్నట్టు, ఒంటెమీదినుండి జారిపడ్డట్టు కలవచ్చింది. వెనకనుండి వస్తున్న వేలాది ఒంటెలు తనను తొక్కుతూ వెళ్తున్నాయి. ఉలిక్కిపడి అరుస్తూ నిద్ర లేచాడు దేవరాజు. చుట్టూ కటిక చీకటి. క్యాండిల్ ఎప్పుడో ఆరిపోయింది. కలగన్నట్టు గ్రహించి ముడుచుకుని పడుకున్నాడు దేవరాజు. అలాగే నిద్రపట్టింది.

కపిల్ వచ్చి తట్టి లేపేవరకు మెలకువ రాలేదు. నిద్ర కళ్లతో లేచి కూర్చున్నాడు. దేవరాజు వైపు గుర్రుగా చూశాడు కపిల్. అతడి కళ్లల్లో ప్రస్ఫుటమౌతున్న కోపానికి క్షణకాలం వణికిపోయాడు. వెంటనే లేచి నిలబడి అల్యూమినియం పాత్ర అందుకుని గొర్లవైపు నడిచాడు. జ్వరం పూర్తిగా తగ్గలేదు. తల బరువుగా ఉంది. మెడ నరాల వద్ద నొప్పి మొదలయింది. తెల్లవారిందంటేనే భయం. ఎండలో గొర్లను మేపడానికి వెళ్లాలి.

పాలను పిండి గేద్రీలో నింపి దానిని జీపులో పెడుతూ చూశాడు. అందులో వాటర్ క్యాన్ మరికొన్ని వంట వస్తువులు, పండ్లు ఉన్నాయి. దేవరాజుకు ప్రాణం లేచివచ్చినట్టయింది. బారిల్ వైపు చూపిస్తూ "స్నానానికి వాటర్ లెవ్వు" అన్నాడు. వాటర్ అంటే అతడికి కొద్దిగా అర్థమవుతుందని. తెచ్చినవి చాలులే అన్నట్టు నిర్లక్ష్యంగా చూశాడు కపిల్. దేవరాజు మనసు బాధతో మూల్గింది.

"కపిల్ నేను మా ఇంటికి లెటర్ రాయాలి. నాకు ఒక ఉత్తరం కావాలి. లెటర్... లెటర్ పోస్ట్ చెయ్యాలి" సైగలు చేస్తూ అన్నాడు దేవరాజు.

అతడి ఉద్దేశ్యం కపిల్‌కు అర్థమైంది. కానీ బదులు చెప్పలేదు. దేవరాజు మరోసారి అడిగాడు. కపిల్ మౌనంగా జీపు ఎక్కాడు.

"కపిల్ నాకు జీతం... అంటే మంత్... మంత్ సాలరీ, సాలరీ ఎప్పుడిస్తవు? ఎంత ఇస్తవు. నాకు ఇంటివద్ద బాకీలున్నాయి. డబ్బు పంపించాలి" కపిల్ ముందుకు వెళ్లి దీనంగా అడిగాడు. అతడి కళ్ల వెంట నీళ్లు కారుతున్నాయి. కపిల్ విలాసంగా నవ్వి "అంతా ఆకుల్ మాఫే హాయ్‌దిలిల్లా..." అంటూ జీపును ముందుకు కదలించబోయాడు. దుఃఖంతోపాటు కోపం కూడా వచ్చింది దేవరాజుకు. కోపాన్ని అణుచుకుంటూ కపిల్ కాళ్లపై పడ్డాడు దేవరాజు. కాలితో విదిలించాడు కపిల్. దేవరాజు తల జీపుకు తగిలి బొప్పి కట్టింది. గేరు మార్చి ఎక్సిలేటర్ నొక్కబోయాడు. అతడి చేతినిపట్టుకుని కిందికి లాగాడు దేవరాజు.

కపిల్ ఆ ఊపుకి నేలపై బోర్లాపడ్డాడు. దేవరాజు గుండె దడదడలాడింది. కపిల్ లేచినిలబడి నిప్పులు కురిపిస్తున్నట్టు దేవరాజువైపు చూస్తూ అరబ్బీలో తిట్టాడు.

"లెటర్... లెటర్... రాయాలి నాకు లెటర్‌కావాలి... సాలరీ కావాలి" ఒత్తి పలుకుతూ అన్నాడు దేవరాజు. కొన్ని క్షణాలు అలాగే కోపంగా చూసి వేగంగా గుడారంలోకి వెళ్లాడు కపిల్. తాగే నీళ్లను కింద ఒలకబోశాడు. వంట





సామానులన్నీ ఇసుకలో కుమ్మరించాడు. స్టౌలో ఉన్న కిరోసిన్‌ను ఒలకబోశాడు.

దేవరాజుకు చెమటలు పట్టాయి. కపిల్‌ను వారింపజూశాడు. రెండు నిమిషాల్లో అంతా అయిపోయింది. ఎడారి ఎండలో గొంతును తడిచేసుకోవడానికి నీరులేదు. ఆకలివేస్తే తిండిలేదు. ఎలా? దేవరాజు ఆలోచిస్తుండగానే కపిల్ వెళ్లిపోయాడు. అక్కడనుండి బయటపడతానన్న ఆశ పూర్తిగా చచ్చిపోయింది. ఏదికావాలని అడిగినా నీళ్లు, తిండిలేక మాడ్చేట్టున్నాడనుకున్నాడు దేవరాజు.

ఆరోజు గొర్లను మేపడానికి వెళ్లలేదు. గుడారంలోనే పడుకున్నాడు. ఇదివరకు ఎన్నడూ అలా పగటిపూట గుడారంలో ఉండిపోలేదు. శరీరానికి ఎంతో హాయి కలిగింది. లోపల చల్లగా ఉంది. బయట ఎండను చూస్తే కళ్లు మెరిశాయి. ఇంత ఎండలో ప్రతీరోజూ ఎలా ఉన్నాను అనుకున్నాడు. పొద్దుపొడుస్తుండగా వెళ్తే చీకటిపడ్డాకనే తిరిగిరావడం. పొద్దున చేసిన వంటనే రాత్రికి తినడం. పగలు గుడారంలో ఎలా ఉంటుందో తెలియదు. ఇంత చల్లగా ఉంటుందని ఊహించలేదతడు.

గొర్లు అరుస్తున్నాయి. టైం దాటిపోవడంతో షబక్‌లలో అటూ ఇటూ తిరుగుతున్నాయి. గుడారం పైకప్పువైపు సాలోచనగా చూస్తూ పడుకున్నాడు దేవరాజు. కపిల్ వెంటనే ఉండడంతో పాలను కూడా తీసుకోలేదు ఈ రోజు. నాలుక పిడుచగట్టుకుపోయింది. ఆకలి మొదలయింది. ఇంటినుండి బయలుదేరిన తర్వాత జరిగిన సంఘటనలన్నీ ఒక్కొక్కటి గుర్తుకు వస్తుంటే "అవ్వా" అని బావురుమన్నాడు దేవరాజు.

కొద్దిసేపటికి గుండె బరువు తగ్గినట్టయింది. దాహం ఎక్కువవుతుంటే గొర్లువద్దకు వెళ్లి పాలు పిండాలని చూశాడు. అవి దొరకకుండా పరుగులు తీశాయి. దొరికిన వాటికి ఒక చుక్క కూడా రాలలేదు. మళ్లీ గుడారంలోకి వచ్చి పడుకున్నాడు. అసంకల్పితంగా అతడి చూపులు గుడారానికి ఒక మూలన పిన్ చేసి ఉన్న కాగితంపైన పడ్డాయి. ఎండపూట తప్ప చీకటిపూట కనిపించదా ప్రదేశం.

ఆసక్తిగా దానిని అందుకుని విప్పి చదివాడు దేవరాజు. "మిత్రమా నువ్వు జీతం అడిగితే తాగే నీళ్లను ఒలకబోసి ఆహారపదార్థాలను నేలపాలు జేశాడుకదూ కపిల్‌గాడు. అందుకే ఈ రోజు పగలంతా గుడారంలోనే ఉండిపోయావుకదూ! వీడు అంతే! వీడొక పరమశాడిస్ట్. ఎప్పుడు జీతం అడిగినా, ఉత్తరాలు అడిగినా నీటికి, తిండికి కరువు చేస్తాడు. బయటి ప్రపంచంనుండి సంబంధ బాంధవ్యాలు లేకుండ చేయడమే వాని ఉద్దేశ్యం. నువ్వు ఎన్ని రోజులున్నా నీకీ నరకం తప్పదు. ఈ రోజు రాత్రే బయలుదేరు. తూర్పు దిశ వైపు ప్రయాణం చెయ్యి. దగ్గర ప్రయాణం కాదు. దాదాపు అరవై కిలోమీటర్ల సుదీర్ఘ ప్రయాణమట. నేను నీలాగే ఇరుక్కుపోయి నానా యాతనలుపడ్డాను. రెండేళ్ల తర్వాత కపిల్‌కు బదులుగా ఒకనాడు అతడి చిన్న భార్యవచ్చింది. అదృష్టవశాత్తు ఆమెకు హిందీ వచ్చును.

"హిందీలో నాగోడునంతా చెప్పుకున్నాను. నా మీద దయదలచి పారిపోవడానికి మార్గం చెప్పింది. తూర్పువైపు కాకుండా వేరేవైపు ప్రయాణం చేస్తే వందలమైళ్లు నడిచినా నీకొక గ్రామం కనిపించదట. అరవై కిలోమీటర్ల తర్వాత ఒక సిటీ వస్తుందట. లేబర్‌కార్డ్, పాస్‌పోర్ట్ లేదుకాబట్టి నువ్వు పోలీసులకు దొరికిపోతావు. రెండు మూడు నెలలు జైల్లో ఉంచి నీ దేశం నిన్ను పంపిస్తారు. అలాగైనా ప్రాణాలతో బయటపడతావు.

"ఇది ఎంత వరకు నిజమో తెలియదు.

ఇక్కడ ప్రాణంతో ఉన్నా మరణించినా ఒక్కటే! అందుకే తెగించి ఇదే రాత్రి బయలుదేరుతున్నాను. నా అదృష్టం పరీక్షించుకోబోతున్నాను. నువ్వు నీ అదృష్టం పరీక్షించుకో! చివరగా ఒక్కమాట. ఈ ఉత్తరాన్ని ఇదే చోట భద్రపరుచు. మళ్లీ ఒక అమాయకుడిని ఈ నరకం నుండి తప్పించడానికి ఉపయోగపడుతుంది. నీకు ఏవైనా ఇతర భాషలు వస్తే ఆ భాషల్లో కూడా తర్జుమాచేసి పిన్‌చేసి పెట్టు ఏ దేశస్థుడికైనా ఉపయోగపడవచ్చు గుడ్ లక్"

ఉత్తరం చదివి ఆలోచనల్లోపడ్డాడు దేవరాజు. అరవైమైళ్ల సుదీర్ఘ ప్రయాణం. దాదాపు పదిహేను గంటలు నడవాలి. పొద్దున పూటయితే ఎడారిలో చాలా కష్టం. రాత్రిపూటనే ప్రయాణం సాగించాలి. రాత్రిపూట ఎడారి జంతువుల బెడద ఎక్కువ. పొద్దంతా ఇసుకలో దాగి ఉన్న పాములు రాత్రిపూటనే సంచరిస్తాయి. ఏ ఒక్క పాము కుట్టినా ఎడారిలోనే సమాధి కాక తప్పదు. వెంట ఆహారం కనీసం నీరు ఉన్నా గొంతు తడుపుకుంటూ ప్రయాణం కొనసాగించవచ్చు కానీ ఇప్పుడు అలాంటివేవీ లేవు ఎలా?

రెండు మూడు రోజుల తర్వాతనైనా కపిల్ ఆహారం తెస్తాడుగదా! అప్పుడు వెళ్లవచ్చులే. అనుకున్నాడు కానీ మనసు ఒప్పుకోలేదు. బయటపడే మార్గం తెలిశాక అక్కడ క్షణమొక యుగంలా తోస్తోంది. చావైనా బతుకైనా సరే! వెళ్లిపోవాలనిపిస్తోంది. వెంటనే లేచి సరుకుల్ని కుమ్మరించిన చోటికి వెళ్లాడు దేవరాజు. ఏ ఒక్కటీ చేతికందేలాలేదు. కర్జూరపు పండ్లు మాత్రం ఇసుకలో ఉన్నాయి. వాటిని ఏరుతుంటే కిరోసిన్ వాసన గుప్పుమంది. తినకుండా వాటిపై కిరోసిన్ చల్లాడు కపిల్.

సాయంత్రం వరకూ అలాగే పడుకున్నాడు దేవరాజు. ఎప్పుడైనా చీకటి పడుతుండగా జీపులో వచ్చి గొర్లను లెక్కించుకుని వెళ్లే కపిల్ ఆ రోజు రాలేదు. రాత్రి వరకూ అతడికొరకు ఎదురు చూశాడు. కపిల్ జాడలేదు. అతడురాడని నిర్ధారించుకున్నాక గొర్లపాలు పితకడం మొదలెట్టాడు. పొద్దున ఒక్కటే పూట పాలు ఇచ్చే గొర్లు పరుగులు తీస్తున్నా బలవంతంగా కొన్ని పాలను పిండి బాటిల్‌లో నింపుకుని తూర్పువైపు బయలుదేరాడు దేవరాజు.



కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటి. అడుగుముందు ఏముందో తెలియదు. అడుగులోఅడుగు వేసుకుంటూ నడుస్తున్నాడు దేవరాజు. చల్లగాలి అప్పుడప్పుడే ఉధృతమౌతోంది. ఇసుక తొందరగా వేడెక్కి తొందరగా చల్లారుతుంది కాబట్టి ఎడారుల్లో పగలు ఎంతగా వేడి ఉంటుందో రాత్రి అంతగా చలి ఉంటుంది. చలికి వణుకుతూ నడక వేగాన్ని పెంచాడు దేవరాజు. కాళ్ళ కింద ఇసుక సర్రుసర్రుమంటోంది. బతుకుమీద ఆశలేకపోయినా తెగింపు ఉంది దేవరాజులో. మరణం తప్పదని తెలిసిన తర్వాత మనిషిలో వచ్చే తెగింపు అది.




మరునాడు ఎప్పటిలానే తెల్లవారక ముందే వచ్చాడు కపిల్. గుడారంలో దేవరాజు కనిపించలేదు. చుట్టూ వెదికాడు. ఎక్కడా అతడి జాడ తెలియలేదు. అతడు పారిపోయినట్టు గుర్తించాడు. దేవరాజుపై కసి పెరిగిపోయిందతనికి. ఇంటికి వెళ్ళి హౌస్‌బాయ్ దగ్గర దేవరాజు ఇంటి అడ్రస్ తీసుకున్నాడు. ఆక్సిడెంట్‌లో దేవరాజు చనిపోయినట్టు, శవం ముక్కముక్కలైపోయినట్టు ఇంటికి టెలిగ్రాం పంపి తృప్తిగా నవ్వుకున్నాడు.

★ ★ ★

"కారటురాక రెండు నెలలాయె. మేము నాలుగు కారట్లు వేస్తిమి. ఒక్కదానికి బదులు రాలేదు. కలిగిన కాడికి తిని గడప లోపల ఉండక మస్కట్ పోతనని రంధి పెట్టి, అక్కడికి చేరంగనే వేసిన కారటు తప్ప మల్లి వెయ్యకపాయె" ఏడుస్తూ చెప్పింది నర్సవ్వ.

"ఏంగాదు చెల్లే. అక్కడ పని ఎట్లఉందో. అయి తీరిన దానివి నువ్వే గట్ల బెంగటిల్లితే, కోడలు పిల్ల ఎట్ల బెంగటిల్లాలె. గట్ల ఆవటిల్లితే ఎప్పుడో గుండెపలిగి సత్తవు. ఎన్నో ఎల్లదీసుకచ్చినవు. గట్టుకు మొరిగిన కుక్క దిక్కులేక సచ్చిందట. నువ్వు ఏడిస్తే మాత్రం కారటస్తదా! వచ్చేటప్పుడస్తది" ధైర్యం చెప్పింది మల్లవ్వ.

వారి మాటలు వింటూ బీడీలు చేస్తోంది పద్మ. మల్లవ్వ కొద్దిసేపు నర్సవ్వతో మాట్లాడి పద్మవైపు తిరిగి అంది. "ఏమాయె పిల్లా... సప్పుడు జెయ్యవు. 'ఊ' అనవు, 'ఆ' అనవు. బుక్కెడు తిన్నమ్మ బూరుగు పేడోలుంటె, చాటెడు తిన్నమ్మ చెక్కపెడోలె ఉండెనన్నట్టు, అండ్లకే గుంజుకుపోయినవు. మొగడులేడని రంది పెట్టుకున్నవా... తప్పుపట్టుకోకు. మనుమరాలివని అంటున్న"

చిన్నగా నవ్వి మౌనంగా ఉండిపోయింది పద్మ అప్పుడే మల్లయ్య రావడంతో వారి చూపులు అటువైపు తిరిగాయి. మల్లయ్య ఇంట్లోకి వచ్చి కూర్చుని దేవరాజు లెటరు గురించి అడిగి వారికి ధైర్యం చెప్పి అన్నాడు.

"ఇల్లును మరమత్తు చేయిస్త. బండ పరిపించి గోడలకు సిమెంటు చేయిస్త. మీరు ఒక నెల రోజులు యాడనన్న ఉండుండ్రి, పని పూర్తయినంక మల్ల ఇందులోకే వస్తురుగని"

నర్సవ్వ మౌనంగా ఉండిపోయింది. కొద్ది సేపు మల్లయ్యతో మాట్లాడి వెళ్ళిపోయింది మల్లవ్వ. పద్మకు మెదడు మొద్దుబారిపోయినట్టనిపించింది. సామాను, పిల్లలతో నెలరోజులు ఎక్కడుండాలో అర్థంకాలేదు. అలాగని ఖాళీచేయలేమని ఖచ్చితంగా చెప్పలేక పోతోంది.

"ఏమైంది నర్సవ్వా... అట్లనే బీరిపోతివి. పని తీర్పాటమున్నప్పుడు చేస్తనని సుతారి అన్నాడు. అందుకనే ఖాళీ చేయిమంటున్న అదీ నెలరోజులే! ఈ ఇల్లు నాదికాదు. నీదే అనుకో! మరమత్తు అయినంక యాడాది గాదు, పదేండ్లుండు. బావికి మోటర్‌గూడా పెట్టిస్త. కరెంటు బిల్లుకూడా కట్టేస్తా! చీకట్ల ఎన్నిరోజులుంటరు" సానుభూతి చూపిస్తున్నట్టు అన్నాడు మల్లయ్య.

సరేనన్నట్టు తలూపింది. అప్పుడే యాదగిరి వచ్చాడు అక్కడికి. అతడివెంట ఐదుగురు వ్యక్తులున్నారు. మస్కట్ పంపియ్యమని వెంటపడుతున్నవారే వారు. ఏమీ తెలియనట్టు విషయాన్ని అడిగి తెలుసుకున్నాడు యాదగిరి.

"దీనికే ఇంత బాధపడాలా? నాది లంకంత కొంప. నేనెప్పుడూ ఇంట్లో ఉండను. సుశీలకు తోడు గూడా ఉంటరు. మా ఇంటికి రండి" అంటూ తన వెంట ఉన్న వ్యక్తులవైపు తిరిగి "ఒరేయ్ సామాన్లు సర్దుండ్రిరా!" అన్నాడు యాదగిరి.

నర్సవ్వ, పద్మలు, ఎంత వారించినా



వారు వినలేదు. ఇరుగుపొరుగు వారు కూడా "బావుంది, ఇప్పటికిప్పుడు ఎక్కడా మీకు ఇల్లు దొరకదు. అక్కడకే వెళ్ళండి" అంటున్నారు. ఒక నెలరోజులేకదా... ఎలాగో సర్దుకుందాంలే! అని చివరికి కోడలుకు సర్దిచెప్పింది నర్సవ్వ. అదేరోజు యాదగిరి ఇంట్లోని ఒక గదిలోకి మారిపోయారు. తనకు తోడు దొరికారని సుశీల కూడా సంతోషపడింది.

"ఏంటీ వారంరోజుల్లో ఖాళీ చేయిస్తానని రెండు నెలలు జరిపావు. ఇప్పుడు నెలరోజుల్లో మళ్ళీ రండీ అంటున్నావు. నాతోనే గేమ్ ఆడుతున్నావా? " మల్లయ్యను రహస్యంగా కలిసి అడిగాడు యాదగిరి కోపంగా.

"అప్పటికప్పుడు బాధపడతారని అలా చెప్పాను. వారిని మళ్ళీ ఆ ఇంటి గడప తొక్కనివ్వను" భరోసా ఇస్తున్నట్టుగా అన్నాడు మల్లయ్య.

మీసం మెలివేసి నవ్వుకున్నాడు యాదగిరి.

కొత్త ఇంట్లో ఆధునిక వసతులు అన్నీ ఉన్నా పద్మకు అసౌకర్యంగానే ఉంది. పెద్దపులి బోనులో ఉన్నట్టుగా భయంభయంగా ఉంది ఆమెకు. నర్సవ్వకైతే క్షణంకూడా ఆ ఇంట్లో ఉండబుద్ధికావడంలేదు. ముండ్లమీద నిలబడ్డట్టుగా ఉంది ఆమెకు. అయిష్టంగానే సామానులను ఇంట్లో సర్దుతోంది. వారికి సుశీల కూడా సహాయం చేస్తోంది.

మరునాడే యాదగిరి ముంబాయి వెళ్ళాడు. వారం రోజులక్రితమే పది వీసాలను తెచ్చాడు. ఒక్కొక్కరి వద్ద అరవై వేల రూపాయల చొప్పున ఆరు లక్షల రూపాయలు జమచేశాడు. ఈసారి డి.డి.లు తీయలేదు. ఇక్కడ తన ఎకౌంట్‌లో వేసి, ఏజంట్ పేరుమీద చెక్కు రాశాడు. అతడి వెంట వెళ్ళాల్సిన పదిమంది వెళ్ళారు.

యాదగిరి ఇంట్లోలేకపోవడం పద్మకు కాస్త ఊరటనిస్తోంది. సుశీల కలుపుగోలు మనిషి. తన మాటలతో వారి బాధను తొలగించాలని ప్రయత్నిస్తుంది. ఇదివరకే సుశీల, పద్మలు స్నేహంతో ఉండేవారు అందుకే ఇప్పుడు మరింత దగ్గరయ్యారు. వారిద్దరి స్నేహాన్ని చూసి ముచ్చటపడినా యాదగిరి గుర్తురావడంతో బాధపడింది నర్సవ్వ. ఎప్పుడు ఏ అవాంతరం వస్తుందోనని "పాము పగేందీ... తోక చుట్టమేందీ! యాలకు ఇల్లు ఎక్కడా దొరకదని ఇక్కడకి వచ్చినం. మన హద్దుల మనముండాలె. ఇసంటరమ్మంటే ఇల్లంత నాదే అన్నట్టు చెయ్యద్దని" కోడలును హెచ్చరించింది. మనుమరాలు ఇంట్లో తిరుగుతూ వస్తువుల్ని సర్దుతుంటే గమనించి ఆమెను గది లోనుండి బయటకు రానీయడంలేదు.

"అత్తా మీరు మేము వేరుగాదు. అంతా మీఇల్లే అనుకోండి" అంటూ సుశీల ఆప్యాయంగా చెప్పినా ఆమె మనసు బాధపడుతూనే ఉంది. "ఎడ్డయినా గుడ్డి అయినా తన కడుపు పండాలె. తప్పయినా బుర్రయినా తన చేను పండాలె. అన్నట్టు పూరి గుడిసె అయినా సరే... తనకంటూ ఒక ఇల్లు ఉండాలె" అంటూ గొణుక్కుంటోంది.

సుశీల సిలిండర్ స్టౌమీదనే వండుతుంది కాబట్టి ఇంట్లోనే వంటచేస్తుంది. పద్మకు ఇచ్చిన గదిలో పొయ్యిలేదు. పొగపోవడానికి దారికూడా లేదు. వెలుతురు కొరకని పైకప్పుపై అద్దం అమర్చారు. వంట చేసుకోవాలంటే వాకిట్లో పొయ్యి పెట్టక తప్పదు. "వంట సిలిండర్ మీదనే చేసుకొండి" అని సుశీల చెప్పినా వినలేదు నర్సవ్వ. మూడు రాళ్ళు తెచ్చి పొయ్యిని అమర్చింది. అక్కడ వంటచేసి గదిలోకి తెచ్చుకోవడం ఇబ్బందిగా ఉన్నా ఆ నిర్ణయమే సరైందనుకుంది పద్మ. తెల్లవారకముందే వంట ముగించుకోవడం అలవాటు చేసుకుంది.

వాకిళ్ళు వేరువేరుగా లేవు. ఇద్దరిదీ ఒకటే. ముఖద్వారం కూడా ఒక్కటే కాబట్టి




నర్సవ్వే వాకిలి ఊడ్చి ముగ్గు పెట్టేది! మొదట వ్యతిరేకించినా, తర్వాత మౌనంగా ఉండిపోయింది సుశీల. వారు ఇంట్లో దిగి న్నుండి సుశీలకు ఇంటిపని చాలావరకు తగ్గింది.

టీ.వీ. చూస్తూ బీడీలు చేయడంవల్ల చాలా రాత్రివరకూ పద్మకు నిద్రరావడం లేదు. పొద్దునపూట చేసే బీడీకట్టలు రాత్రి పూటనే పూర్తిచేస్తుంది. ఆ ఇంట్లోకి మారి వారం రోజులు గడిచాయి. వనజ, ఆమె భర్త, పద్మ తండ్రి కోటయ్య వచ్చి పరామ ర్శించి వెళ్ళారు. దేవరాజునుండి ఉత్తరం మాత్రం రాలేదు. ఆ విషయం ఊరంతా చర్చనీయాంశంగా మారిపోయింది.

ఒకనాడు మధ్యాహ్నం నర్సవ్వ ఇంటికి వెళ్ళాడు టప్పరాములు. అతడిని చూడగానే నర్సవ్వకు పోయిన ప్రాణం వచ్చినట్ట యింది. పరుగు పరుగున బయటకు వచ్చింది. అప్పటికే రాములును గమనిం చిన పద్మ నర్సవ్వకంటే ముందుగానే పరు గెత్తుకుని వచ్చింది. సంతకం తీసుకుని టెలిగ్రాం అందించాడు రాములు.

"అదేంటిది బిడ్డా... కారటస్తదనుకుంటే ఏంటిదో కాయిదం వచ్చింది. యాడికెళ్ళి వచ్చిందది" ఆశ్చర్యంగా అడిగింది నర్సవ్వ. అప్పటికే ఆతృతగా టెలిగ్రాంను అందుకుని ఒక వాక్యం చదివింది పద్మ. ఒక్కసారిగా లక్ష కిలోవాట్ల విద్యుత్తునుముట్టుకున్నట్టుగా వణికిపోయింది. ఆమె చూపులు ముందుకు సాగడంలేదు. మెదడు పనిచేయడంలేదు. గుండె దడ రెట్టింపయింది. కళ్ళు బైర్లుక మ్మాయి. భూమి గుండ్రంగా తిరుగుతున్న ట్టనిపించింది. క్షణాల్లో స్పృహతప్పి పడిపో యింది.

నర్సవ్వ కోడలువైపు భయంగా చూసింది. ఆమెకు ఏడుపు ముంచుకొ చ్చింది. "పద్మా... ఏమైంది బిడ్డా... ఏమైంది" అంటూ తలను చేతుల్లోకి తీసు కుని కదుపుతూ రాములువైపు భయంగా చూసింది.

అప్పటికే రాములుకు గూడా నిలువెల్లా చెమటలుపట్టాయి. మొహం విషాదంగా మారిపోయింది. ఇక చెప్పకతప్పదన్నట్టుగా నోరు విప్పాడు "నర్సక్కా... దేవరాజు... దేవరాజు" అంటూ నీళ్ళు నములుతుంటే వణికిపోతూ నిలబడి అరిచింది నర్సవ్వ.

"ఏమయిందిరా... నా కొడుక్కు... ఏమ యింది...? రాములూ... జెట్టన చెప్పరా... దేవరాజుకు ఏమైంది"

"దేవరాజు మనకిక లేడక్కా... మస్కట్ నుండి టెలిగ్రాం వచ్చింది. ఆక్సిడెంట్‌లో చనిపోయాట్ట" మాటల్ని కూడగట్టుకుని చెప్పాడు రాములు.

"ఓ...కొడుకా..." అంటూ గావుకేకపెట్టి స్పృహ తప్పి పడిపోయింది నర్సవ్వ.

ఆ అరుపుకు ఇంటిలోంచి పరుగు పరు గున వచ్చింది సుశీల. పద్మ, నర్సవ్వలు పడిపోయి ఉండడం, చూసి ఏం జరిగిందని అడిగింది రాములును. మస్కట్‌నుండి టెలిగ్రాం వచ్చిందని, దేవరాజు చనిపోయా డని చెప్పాడు రాములు బాధగా. ఆమె చేతిలో ఉన్న వస్తువు కిందపడిపోయింది. వేగంగా వెళ్ళి పద్మను కదిపి చూసింది. ఎలాంటి కదలికలేదు. నర్సవ్వ కూడా అలాగే ఉంది. సుశీలకు భయం పట్టు కుంది.

అప్పటికే ఇరుగుపొరుగువారు గుమికూ డారు. "ఎవరైనా వెళ్ళి జీపును తీసుకు రండి" అంటూ పద్మను, నర్సవ్వను సరిగా పడుకోబెట్టింది సుశీల. దేవరాజు మరణ వార్త నిమిషాల్లో ఊరంతా పాకిపోయింది. ఉన్నఫళంగా తరలి వస్తున్నారు జనం.

ఎవరో జీపును తీసుకుని వచ్చారు. అత్తా కోడళ్ళిద్దరినీ పక్క ఊర్లోని హాస్పిటల్‌లో చేర్చారు. వారి వెంట సుశీల, మరికొంత మంది పక్క ఇండ్లవారు ఉన్నారు. స్పృహ లోకి వస్తే తప్ప ఏమీ చెప్పలేమన్నాడు

డాక్టర్. రాత్రి పొద్దుపోయాక ఒకసారి స్పృహలోకి వచ్చింది పద్మ. నెత్తిని మంచానికి బాదుకుంటూ పెద్దగా ఏడ్వడం మొదలెట్టింది. ఆమెను సముదాయించడం ఎవరికీ సాధ్యంకాలేదు. డాక్టర్ వచ్చి మత్తు ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళాడు. ఏడుస్తూనే నిద్రలోకి జారుకుంది పద్మ.

నర్సవ్వకు మెలకువ రాలేదు. కోమాలోకి వెళ్ళిపోయిందని చెప్పాడు డాక్టర్. ఆగిఆగి ఊపిరి పీలుస్తోంది. వారి వెంట ఉన్నవారు తెల్లవార్లూ నిద్రలేకుండా కూర్చున్నారు. దేవరాజు గురించి, అతడి మంచితనం గురించి చెప్పుకున్నారు. తెల్లవారాక బంధువులంతా హాస్పిటల్‌కు వచ్చారు. వనజ బావురుమంది. కూతురు పరిస్థితి చూసి కోటయ్య గుండె తరుక్కుపోయింది. అతడి భార్య, కొడుకు వచ్చారుగానీ రెండు మూడు గంటల తర్వాత వెళ్ళిపోయారు.

వనజ భర్త వచ్చి డాక్టరును కలిసి ఎంత ఖర్చయినా ఫరవాలేదు. వారిని బతికించాలని బతిమాలాడు. సాధ్యమైనంతవరకూ ప్రయత్నిస్తానని చెప్పాడు డాక్టర్. చిన్నపిల్లలిద్దరూ తల్లివద్ద కూర్చుండి ఏడుస్తున్నారు. బిస్కెట్లు, పండ్లు ఇచ్చి ఎత్తుకుంటే పెద్దపిల్ల మౌనంగా ఉంటుంది కానీ చిన్నపిల్ల మాత్రం రోదిస్తూనే ఉంది. సీసాలో పాలునింపి పట్టినా ఊర్కోవటంలేదు. ఇద్దరు పిల్లల్ని చూస్తుంటేనే గుండె తరుక్కుపోతోంది అందరికీ.

వనజ భర్త అక్కడే ఉండి భార్యను సముదాయిస్తూ డాక్టర్ అడిగిన మందులు తెస్తున్నాడు. ఇద్దరికీ ఇంజక్షన్లు చేస్తూ గ్లూకోజులు మారుస్తున్నారు. మధ్యాహ్నం దాటాక మెలకువ వచ్చింది నర్సవ్వకు. కళ్ళు తెరుస్తూనే బావురుమని ఏడ్చింది. బెడ్‌పక్కనే కూర్చున్న వనజ తల్లిమీద పడి బావురుమంది. మిగతావారు చుట్టూ చేరి తల్లీ కూతుర్లిద్దరినీ సముదాయిస్తున్నారు. తల్లికి




ధైర్యం చెప్పాలికానీ ఏడ్వకూడదని వనజను మందలిస్తున్నారు.

రెండు నిమిషాలు ఆగకుండా ఏడ్చాక గుండెపై నొక్కుకుంటూ వెనక్కి వాలిపోయింది నర్సవ్వ. అక్కడున్నవారందరూ కంగారుపడ్డారు. వనజకు ముచ్చెమటలుపోశాయి. వనజ భర్త డాక్టర్‌వద్దకు పరుగెత్తు కెళ్ళి పిలుచుకుని వచ్చాడు. డాక్టర్ నర్సవ్వను పరీక్షించి పెదవి విరిచాడు. అక్కడున్నవారంతా గొల్లుమన్నారు. వనజను చూసి ఆమె భర్తకు భయం పట్టుకుంది. ఆమెను సముదాయించడం మొదలెట్టాడు.

నర్సవ్వను జీపులో ఇంటికి తరలించారు. అప్పటికే బంధువులంతా ఇంటికి చేరుకున్నారు. వనజ అన్నను, తల్లిని తలచుకుంటూ ఏడ్చింది. కోటయ్య కూడా శవం వెంటనే ఉన్నాడు. పద్మ వద్ద ఇద్దరు ముగ్గురు వ్యక్తులు మాత్రమే ఉన్నారు. మిగతావారంతా శవం వెంట ఉన్నారు. ఒకటిమీద ఒకటి ఆపదలు రావడంపట్ల అందరూ సానుభూతిని చూపిస్తున్నారు. శవం వెంట ఊరంతా కదిలింది. కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నారు అందరు. దూరపు బంధువెవరో చితికి నిప్పుపెట్టారు.

స్పృహనుండి తేరుకుంది పద్మ. కూతుర్లను ముందేసుకుని గుండె అవిసిపోయేలా ఏడ్చింది. దహన సంస్కారాల తర్వాత కోటయ్య కూతురు వద్దకు వచ్చాడు. వెంట అతడి భార్య కూడా ఉంది. చిన్నపిల్లల్నిద్దరినీ దరిజేర్చుకుని పద్మను ఓదార్చింది. అల్లుడు మరణించడం, వియ్యపురాలు మరణించడంతో పద్మ బరువు బాధ్యతలు తమమీదనే పడ్డాయన్న బాధ ఆమెకు ఎక్కువయింది. కోటయ్య మాత్రం కూతురు బతుకు ఇలా అయిపోయిందేమిటని చింతిస్తున్నాడు. తననుతాను ఓదార్చుకుంటూ కూతురును ఓదారుస్తున్నాడు. అత్త మరణించిన సంగతి పద్మకు తెలియనీయడం లేదు.

ఎప్పుడూ ఎవరో ఒకరు ఆ ఊరినుండి

హాస్పిటల్‌కు వస్తూనే ఉన్నారు. వచ్చిన వారందరికీ నర్సవ్వ మరణం కూతురుకు చెప్పకూడదని ముందుగానే చెబుతున్నాడు కోటయ్య. మూడురోజులవరకూ మెలకు వచ్చినప్పుడు ఏడుస్తూ స్పృహ తప్పుతోంది పద్మ. హాస్పిటల్‌లో కోటయ్య, అతడి భార్య మాత్రమే ఉన్నారు. ఊరివాళ్ళు, బంధువుల రాక తగ్గిపోయింది. పద్మ పరిస్థితి అందరినీ కలిచివేసింది. అప్పులవాళ్ళు అప్పు ఎలా రాబట్టుకోవాలో ఆలోచించి, ఆశ వదులుకున్నారు. మస్కట్‌లో ఉన్న వ్యక్తుల భార్యలు, తల్లులు, బంధువులు, తమవ్యక్తి ఎలా ఉన్నాడోనని బాధపడ్డారు.

'ఏం మస్కట్! బతికి ఉంటే బచ్చలికూర తినపచ్చు తల్లి ఆగమైపాయె. పిల్లలాగమై పోయిరి. అక్కడ పోరడు దిక్కులేని సావు సచ్చె. అటుపోకపోతే గిట్ల అయితుం డెనా...? ఏం నడుమంత్రపేశాలు! నెగుల పుట్టనిపిల్ల మంచమంతయాల్లాడెనన్నట్టు కట్టుకున్న దాన్ని ఆగంజేసుడు గాకపోతే ఏందీ!" అన్నారు కొందరు.

"వచ్చేదుంటే సచ్చేదాక తప్పదట. వాళ్ళ నొసట గట్లరాసి ఉంది. ఏదో బతుకుతమని పోయింద్రు. గిట్లయితదని ఎరుకనా...? నరంలేని నాలుక నానారకాలంటరు. పోయినోల్లంతా గిట్లనే అయితున్నరా? నూతిల పడ్డోనిమీద నూరు రాల్లన్నట్టు వీడు సచ్చిండు కాబట్టి రకరకాలు అంటుంద్రు. మంచిగ బతికివస్తే గిట్ల అందురా" అన్నారు మరికొందరు.

ఐదవనాడు పద్మను డిస్‌చార్జ్‌చేశారు. కూతురును చూస్తుంటే కోటయ్యకు దుఃఖం ఆగడంలేదు. పుట్టగానే తల్లిని, పెళ్ళయ్యాక భర్తను పోగొట్టుకుంది. బిడ్డకు ఎప్పటికీ కష్టాలే అనుకున్నాడు. తాను ఏడిస్తే ఆమె ఎక్కడ మరింతగా బెంగడపడుతోందోనని ధైర్యంగా ఉంటున్నాడు. హాస్పిటల్‌లో పద్మకు తోడుగా భార్యాభర్తలిద్దరే ఉన్నారు. లోకం ఏమంటుందోనన్న భయానికే హాస్పిటల్‌లో ఉంది కోటయ్య భార్య.

దుఃఖంనుండి కొద్దిగా తేరుకున్నాక అత్తా, ఆడకూతురు, బంధువులెవరూ లేకపోవడంతో వారిగురించి ప్రశ్నించింది పద్మ. వారు ఇంటికి వెళ్ళారని అత్త ఇప్పుడిప్పుడే కోలుకుంటోందని, వనజ అక్కడే ఉందని అబద్ధం చెప్పాడు కోటయ్య. ఇప్పటికే ఇద్దరు ముగ్గురు వ్యక్తులతో వనజను ఒక్కసారి వచ్చి చూసిపొమ్మని చెప్పిపంపాడు కోటయ్య. ఆమెను చూస్తేనన్నా కాస్త పద్మకు ఊరట కలుగుతుందేమోనని అతడి ఆశ. వనజ మాత్రం రాలేదు. తల్లి, అన్న చనిపోయిన దుఃఖంలో ఉండి రాలేదనుకుని కోటయ్యనే స్వయంగా వెళ్ళాడు ఒకనాడు.

"తలకు పాసిన వెంట్రుక ఏరేవులోపోతే నాకేం, నా తల్లి, అన్నతోపాటే నాకు అందరూ పోయారు. నేను ఎవరివద్దకూ రాను" అని ఖచ్చితంగా చెప్పేసింది వనజ. వస్తే ఎక్కడ భరువు బాధ్యతలు మోయాల్సి వస్తుందోనని అలా అంటోందని గ్రహించాడు కోటయ్య. "తీగకు కాయ బరువవుతుందా? నా కూతురు నా ఇంట్లోనే ఉంటది. ఎక్కడ మీద పడుద్దోనని ఎవరూ భయపడాల్సిన అవసరంలేదు" అంటూ మొహం చిన్నబుచ్చుకుని వచ్చాడు కోటయ్య.

హాస్పిటల్ దాటి బయటకు వచ్చాక జీపు ఎక్కుతుంటే మరోసారి బావురుమంది పద్మ. "ఇద్దరు కూతుర్లను చూపిస్తూ వీరి కొరకైనా నువ్వు బతకాలి, ఇలా ఏడ్చిఏడ్చి నువ్వు చనిపోతే కూనలగుడ్లు దిక్కులేనివారైపోతారా"ని నచ్చజెప్పాడు కోటయ్య. జీపు ఎక్కి కూర్చున్నాక అత్తవారింటికే పోతానని పట్టుబట్టింది పద్మ. ఈ పరిస్థితుల్లో అక్కడికి వెళ్తే బావుండదని, నర్సవ్వను వనజ తీసుకుపోయిందని, కొద్దిరోజులుండి కోలుకున్నాక వెళ్దువని సర్దిచెప్పి ఇంటికి తీసుకెళ్ళాడు కోటయ్య.



అతడికి లోలోపల భయంగానే ఉంది. ఇంటికి వెళ్ళాక నర్సవ్వ మరణం గురించి తెలిస్తే తట్టుకోలేదు. అందరికీ తెలుసు కాబట్టి ఎవరో ఒకరు తప్పకుండా అంటారు. ఎలా జరిగితే అలా జరుగుతుం దనుకుని జీపు ఎక్కాడు. అప్పటికే కూతురు మనసును గాయపరచవద్దని, కోలుకునే వరకూ ఆత్మీయతను ప్రదర్శించాలని భార్యకు, కొడుక్కు నచ్చజెప్పాడు.

జీపు ఇంటికి చేరుకోగానే చుట్టూ ఉన్న ఇండ్లవారు చుట్టుముట్టారు. మరోసారి పద్మ శోకదేవత అయింది. నర్సవ్వ మరణం గురించి ఎవరూ చెప్పగూడదని సైగలద్వారానే తెలియజేశాడు కోటయ్య. అది గ్రహించి వారు ఆ విషయాన్నే ఎత్త లేదు. కూతుర్లను చూసుకునే పొద్దు గడపా లని, ఇలా ఎందరో ఉన్నారని, భగవంతుడి రాత మన చేతులో ఏముందని... రకర కాల మాటలు చెప్పి ఓదార్చారు పద్మను. సంవత్సరాల తరబడి తిండిలేక జ్వరంతో బాధపడుతున్న వ్యక్తిలా మారిపోయింది పద్మ. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రబడ్డాయి. మొహం పీక్కుపోయింది. కూతుర్లు కూడా అలాగే మారిపోయారు.

పద్మ పచ్చిమంచినీళ్ళు కూడా ముట్టడం లేదు. ఏడ్చినంతసేపు ఏడుస్తుంది. తర్వాత నీరసంగా నేలపై వాలిపోతుంది. పాలులేక చిన్న కూతురు అల్లాడుతుంటే బర్రెపాలు అలవాటు చేశాడు కోటయ్య. మనసులో ఏమనుకుందోగాని సవతితల్లి కూడా బాగానే చూసుకుంటోంది. తను అత్తను చూడాలని, ఒకసారి రప్పించుమని తండ్రిని అప్పుడప్పుడు అడుగుతోంది పద్మ. ఇప్పుడూ అప్పుడూ అని దాటేస్తున్నాడు కోటయ్య.

అల్లుడికి దినవారం జరపాలని, కూతు రుకు బొట్టు, గాజులు తీసెయ్యాలని కొందరు పెద్దలు కోటయ్యకు సూచించారు. అతడి పరిస్థితి ఇరకాటంలో పడింది. ఆ పనులన్నీ తన ఇంటివద్దనే చేయాలని కూతురు పట్టుబట్టవచ్చు. ఆ విధంగానైనా అత్త మరణం తెలిస్తే ఎలా? తట్టుకుం టుందో లేదోనని ఆలోచిస్తున్నాడు. ఒకసారి విషయం చెప్పెయ్యాలనిపిస్తుంది, మరో సారి వద్దనిపిస్తుంది.

అతడు ఇలా ఆలోచిస్తుండగానే పద్మను చూడడానికి దూరపు బంధువెవరో వచ్చారు. అతడిమీద పడి బావురుమని ఏడ్చింది పద్మ. "ఏం జేస్తవు బిడ్డా! కట్టా లన్నీ ఒక్కటేసారి వచ్చె! అటు అత్తపొయ్యె. ఇటు భర్తపొయ్యె! ఎక్కడా దిక్కులేసి బతు కాయెనే బిడ్డా! దేవుని గుల్లె రాళ్ళువడ... నీకు ఎసొంటిరాత రాసే" అన్నాడు ఓదా రుస్తూ.

పద్మకు పరిస్థితి అర్థమైపోయింది. అప్పుడు కోటయ్య ఇంట్లో లేడు. పద్మ మరో సారి బావురుమంది. క్షణాల్లో మళ్ళీ స్పృహ తప్పింది. జీపులో హాస్పిటల్‌కు తీసుకుని వెళ్ళారు. వచ్చిన బంధువును ఇరుగుపొరు గువారు నానా తిట్లు తిట్టారు. అతడు చిన్న బుచ్చుకుని వెళ్ళిపోయాడు.



సుశీల మనస్సు మనసులోలేదు. దేవ రాజు మరణానికి కారణం తామే అన్నట్టుగా

ఉంది ఆమెకు. పద్మ దుఃఖాన్ని చూస్తుంటే హృదయం తరుక్కుపోతోంది. యాదగిరి మస్కట్ పంపడం చేతనే వారి కుటుంబం ఛిన్నాభిన్నమైపోయిందనుకుంటోంది. ఆ పాపమేదో తమను పట్టి పీడిస్తుందేమోని భయంగా ఉంది. ఏ పని చేయాలన్నా బుద్ధిపుట్టడంలేదు. మనసులో వైరాగ్యం చోటుచేసుకుంది. అనుక్షణం ఆమెకు పద్మే గుర్తుకువస్తోంది.

ఈ విషయాన్నంతా భర్తకు చెప్పాలనుకుంది. అతడు ఫోన్ చేయడంలేదు. అతడు ఉండే నెంబర్ ఆమెకు తెలియదు. ఈమధ్య ముంబాయి వెళ్ళి నెలల తరబడి ఉంటున్నాడు కాబట్టి ఎదురు చూడడం మానేసినా, దేవరాజు మరణంతో ఆమె కదిలిపోయింది కాబట్టి భర్తతో చెప్పుకుంటేనైనా కొంత బరువు దిగుతుందని ఆలోచిస్తోంది. ఆమె ఆలోచనలకు అడ్డుకట్ట వేస్తూ పిడుగులాంటి మరో వార్త తెలిసింది. ముంబాయి వెళ్లిన పదిమంది వాపసువచ్చారని, యాదగిరి మాత్రం అక్కడే ఉన్నాడని.

వారివద్దకు వెళ్ళి అడగాలనుకుంది సుశీల. కానీ భయంవేసింది. ఇంతవరకు ఎప్పుడూ ఇలా జరగలేదు. వెళ్ళినవారు వెళ్ళినట్టే, కాస్త వెనకాముందు, గల్ఫ్ వెళ్ళిపోయారు. వీరు ఎందికిలా వాపసు వచ్చారు అనుకుంది. అక్కడ ఏం జరిగిందో తెలియదు. రెండు మూడు రోజులాగితే ఎవరైనా చెబుతారు. అంతవరకూ ఓపికపట్టడం మంచిదనుకుంది. కానీ ఆరోజు రాత్రి వరకే విషయం ఊరంతా పాకిపోయింది.

విజాలు రెడీ కాలేదనీ, యాదగిరి తొందరపెట్టి తీసుకెళ్ళాడనీ, విజాలు రావడానికి ఇంకో నెలరోజులు పట్టవచ్చుననీ, అంతవరకూ అక్కడ ఉండలేక తిరిగి వచ్చామని చెప్పారు. యాదగిరి అక్కడే ఉండి పని పూర్తయ్యాక వస్తానన్నాడని చెప్పారు. సుశీలకు కొద్దిగా ఊరట కలిగింది. ఏది ఏమైనా భర్త ఇంటికి వచ్చాక ఈ పని మానేయాల్సిందిగా ఒత్తిడి చేయాలనుకుంది. పద్మను చూడాలనుకుని వాళ్ళ ఊరికి బయలుదేరింది. అత్త మరణ వార్త విని మళ్ళీ స్పృహ తప్పి హాస్పిటల్ పాలయిందని వాళ్ళ ఊరికి వెళ్ళాక తెలిసింది. ఆమెకు మరింతగా బాధవేసింది.

అక్కడనుండి హాస్పిటల్‌కు వెళ్ళింది. బెడ్‌మీద శవంలా పడి ఉంది పద్మ. కూతుర్లిద్దరూ చెరోపక్క కూర్చుండి ఏడుస్తున్నారు. ఇంకా స్పృహలోకి రాలేదు. ఆ విషయం ఇప్పుడే చెప్పాల్సింది కాదని మందలించాడు డాక్టర్. కోటయ్య, అతడి భార్య మాత్రమే ఉన్నారక్కడ. అప్పుడప్పుడూ ఊరినుండి వచ్చిన వారు పరామర్శించిపోతున్నారు.

పద్మను చూశాక ఏడుపు ఆగలేదు సుశీలకు. "నీది బంగారమసొంటి గుణం చెల్లే... నీకు ఈ కట్టాలు ఎట్లచ్చెచెల్లే... పాపి బ్రహ్మ రాతెట్ల రాసెచెల్లే" అంటూ పద్మపైబడి ఏడ్చింది సుశీల. కోటయ్య భార్య సుశీలను ఓదార్చింది. తేరుకున్నాక, ఏమయింది? ఎలా జరిగింది? విషయాలన్నీ అడిగి తెలుసుకుంది సుశీల. వెంట తీసుకు వెళ్ళిన బ్రెడ్ పాకెట్, ఆపిల్ పండ్లను పిల్లలకు ఇచ్చి సాయంత్రంవరకూ ఉంది. పద్మకు స్పృహరాలేదు. పెద్దకూతురు కొద్దిసేపు ఏడ్చి ఊరుకుంటుంది గానీ చిన్నపాప తల్లిపాలకై తహతహలాడుతూ ఏడుస్తోంది. అలవాటులేకపోవడంవల్ల పోతపాలను తాగడంలేదు. ఆమెను సముదాయించడం తలకు మించిన భారమైపోతోంది. చూడడానికి వచ్చిన వారంతా పిల్లలను చూసి బాధపడుతున్నారు.

సాయంత్రంవరకూ మెలకువరాకపోవడంతో మరునాడు వచ్చి పరామర్శిస్తానని బయలుదేరింది సుశీల. నువ్వు వచ్చి పలకరించి ధైర్యం చెబితేనైనా కాస్త ఊరడిల్లుతుంది. తప్పక రామ్మా" అంటూ అభ్యర్థిం

చాదు కోటయ్య. అలాగేనని చెప్పి బాధతో అక్కడినుండి కదిలింది సుశీల. బస్సెక్కి ఇంటికి వచ్చేవరకూ రాత్రి అయింది. అంత సేపూ పద్మ తాలూకు ఆలోచనలే ఆమెను చుట్టుముట్టాయి.

గోరుపోటుమీద రోకలిదెబ్బన్నట్టు, నర్సవ్వ ఇప్పుడే చనిపోవాలా...? ఆమె చనిపోకపోయినా ఒకరికి ఒకరుతోడు అన్నట్టు ఉండేవారు. ఒంటరిగా మిగిలిపో యిన పద్మ కోలుకోవడం ఎలా...? ఆమెకు ఎవరున్నారు...? ఎంతలో ఎంత ఘోరం జరిగిపోయింది? ఇలా ఆలోచిస్తూనే ఇల్లు చేరుకుంది. ఇంట్లోకి అడుగు పెట్టగానే మామ ఎదురొచ్చి యాదగిరి ఫోన్‌చేశాడని చెప్పాడు. ఏం మాట్లాడాడని నిరాసక్తిగా అడిగింది సుశీల. ఏదో ముఖ్య విషయం చెప్పాలట. ఈరోజు రాత్రి తొమ్మిది తర్వాత మళ్ళీ ఫోన్ చేస్తానన్నాడని చెప్పాడు అతడు.

ప్రయాణ బడలికతో అలిసిపోయి ఉండ డంవల్ల నిద్రవస్తున్నా ఆపుకుని మేల్కొనే ఉంది సుశీల. ఏదో ముఖ్య విషయం అంటే వీసాలు రెడీ అయ్యాయని అందరికీ చెప్పడం కాబోలు అనుకుంది. ఫోన్‌లోనే దేవరాజు మరణం, నర్సవ్వ మరణం, పద్మ పరిస్థితి చెప్పాలనుకుంది. ఇదే ఆఖరుసారి కావాలి. మళ్ళీ వచ్చేప్పుడు వీసాలు తేవద్దు. తెస్తే నేను ఉరిపోసుకుని చస్తానని బెదిరిం చాలనుకుంది.

అనుకున్నట్టుగా తొమ్మిదింటికి రాలేదు ఫోన్. పదిన్నరకు మోగింది. అప్పటివరకూ ఓపిగ్గా ఎదురు చూస్తూనే ఉంది సుశీల. ఫోన్ మోగగానే ఆతృతగా అందుకుని "హలో" అంది. బయటనుండి యాదగిరి మాట్లాడుతున్నాడని తెలిసాక, "ఏమిటండీ, ఏదో ముఖ్యవిషయం అన్నారట" అని అడి గింది.





యాదగిరి గొంతులో ఆతృత ధ్వనిం చింది. అతడు ఆందోళనగా ఉన్నాడని గ్రహించి కంగారుపడింది సుశీల. "ఏం జరి గింద"ని భయంభయంగా అడిగింది.

"జరగరానిది జరిగిపోయింది సుశీలా! ఇలా జరుగుతుందని కలలో కూడా అనుకో లేదు. నమ్మినవారు నన్ను నట్టేట ముంచే శారు. జీవితంలో కోలుకోలేని దెబ్బతిన్నాను. నువ్వు వద్దని చెప్పినప్పుడు నీ మాట విన్నా ఇంత పని జరిగేది కాదు..." యాదగిరి మాటలు పూర్తికాకముందే అరిచింది సుశీల భయంగా.

"అసలు ఏం జరిగిందో... ముందు చెప్పండి. నాకు భయంగా ఉంది. మీరు ఊరు ఎప్పుడు వస్తున్నారు...?"

"ఊరు రావడానికి నాకు మొహంలేదు సుశీలా... పదిమందితో ముంబాయి వచ్చానా? వారి డబ్బులు ఏజంట్‌కిచ్చాను. వాడు పారిపోయాడు. మన కమీషన్ పోగా కనీసం ఐదు లక్షల రూపాయలు. నాలాగే మరో ఐదుగురు ఏజంట్లు మోసపో యారు. అందరి వద్దా డబ్బు తీసుకుని వాడు దుబాయి పారిపోయాడు. ఇప్పుడు వారికి నేనేం సమాధానం చెప్పాలి? వీసాలు వస్తాయని వారు ఎదురు చూస్తుం టారు. నేను ఊరిలోకి రాగానే వీసాలు ఏవని అడుగుతారు. ఈ కథంతా చెబితే నమ్ముతారా?" ఆందోళనగా చెప్పాడు యాదగిరి.

"ఎవరో ఎందుకండి? నేనే నమ్మడం లేదు. వచ్చేప్పుడు వీసాలు తెస్తానని వారితో చెప్పారట. ఇప్పుడే ఏజంట్ పారి పోయాడంటున్నారు. ఇది నిజమైనా అబద్ధ మైనా అంతా అబద్ధమేననుకుంటాను. చెబితే వినక ఈ వేషం వేస్తిరి..." కాస్త కటువుగానే అంది సుశీల. అయినా లోలో పల ఆమెకు భయంగానే ఉంది. అతడు చెప్పిందంతా అబద్ధం కావాలని కోరుకుం టోంది.

యాదగిరి బాధపడుతూ, నమ్మకంగా

చెప్పాడు. ఒట్టు పెట్టుకున్నాడు. సుశీలకు నమ్మకం కుదిరింది. ఆమె వెన్నులో వణుకు మొదలయింది. ఆ వణుకు డబ్బు పోయినందుకు కాదు. ఊరిలో వారికి ఏం బదులు చెప్పాలో తెలియక ఆమె ఆలోచిస్తుండగానే చెప్పడం మొదలెట్టాడు యాదగిరి.

"సుశీలా... నేను చెప్పేది శ్రద్ధగా విను. ఇప్పుడు నేను ముంబాయిలోనే ఉంటాను. నెల రెండు నెలలవరకూ తిరిగిరాను. ఏజంట్ పారిపోయిన విషయం నేనెవరికీ చెప్పను. నువ్వు కూడా ఎవరితో చెప్పకు. మన ఇల్లు, పొలాలు పూర్తిగా అమ్మేయ్. డబ్బంతా బ్యాంకులో వేసేయ్. ఇంట్లో విలువైన వస్తువులు కూడా అమ్మేసెయ్. తర్వాత ఏజెంట్ పారిపోయిన విషయం చెప్పేద్దాం. మనకు అప్పటివరకు స్థిరాస్తులేవీ ఉండవు కాబట్టి ఎవరేం చేయరు. ఎవరికీ అనుమానం రాకుండా ఆస్తుల్ని అమ్మేయ్"

సుశీల మౌనంగా వింటోంది. భర్త ఆలోచన ఎందుకోగానీ ఆమెకు జుగుప్సను కలిగించింది. ఆమె వింటోందా లేదా అని ఒకసారి పిలిచాడు యాదగిరి. సుశీల 'ఊ' అన్నది. చెప్పిన మాటల్నే మళ్ళీ చెప్పాడు యాదగిరి.

"ఇప్పటికిప్పుడు... చేను, ఇల్లు అమ్ముతుంటే అనుమానం రాదా? ఎందుకమ్ముతున్నావంటే ఏం చెప్పాలే... చెట్లమీద ఇస్తర్లు కుట్టినట్టు చేస్తరేంది మీరు" కాస్త విసుగ్గా అంది.

"పెద్ద ఇల్లు కడుతున్నామని చెప్పు. పదివేలు పోయినాసరే! మడికట్లల్ల రెండు గుంటల జాగకొని వట్టిగనన్న అమ్ముతనంటే వెయ్యి రూపాయల బయానా ఇయ్యి. అటుపైసలు కట్టేతందుకే ఈ పొలాలు అమ్ముతున్నానని అందరికీ చెప్పు. ఎవ్వరు అనుమానపడరు" చెప్పాడు యాదగిరి.

సుశీలకు మనసు ఒప్పుకోలేదు. దేవరాజు మరణంతో ఆమె ఖిన్నురాలైపోయింది. ఆమె ఆలోచనాధోరణే మారిపోయింది. అందుకే కాస్త తీవ్రంగా అంది.

"అంటే... ఆ పదిమందికి డబ్బులు వాపసివ్వనంటారు. నన్ను ఏజంట్ ముంచాడు. నేను మిమ్మల్ని ముంచుతున్నానని చెబుతారా? వారు ఏజంట్‌ను చూసి డబ్బులిచ్చారా? లేక మిమ్మల్ని చూసి డబ్బులిచ్చారా? వీసమెత్తు బంగారం లేకుండా, గంటెడు భూమి లేకుండా అమ్ముకుని ఎంతో ఆశతో మీ వద్దకు వచ్చారు. కొందరైతే నూటికి ఐదు రూపాయల చొప్పున వడ్డీకి తెచ్చినవారున్నారు. వారినిలా మోసం చేయడం తగదు. మీకు తెలీదు... దేవరాజు మస్కట్‌లో చనిపోయాడట. ఆ బెంగతో తల్లి మంచానపడి చనిపోయింది. ఇదంతా మీ వల్లనే అయిందని నేను అనను. కానీ అందులో ఎంతో కొంత మనకు పాపం తగులుతుందని మాత్రం చెప్పగలను. ఇప్పుడు మనం చేతులెత్తేస్తే మనేడుతరాలు హెచ్చులేనంత పాపం తగులుతుంది"

"దేవరాజు చనిపోయిండా? ఎలా?" అతడి గొంతులో ఖంగారు ధ్వనించింది.

"ఎలాగయితే ఏందీ పంపిన పాపం మనది. ఇప్పుడు మళ్ళీ ఇదో పాపం చెయ్యమంటరేందీ" కోపంగా అడిగింది సుశీల.

"పాపపుణ్యాల గురించి కాదు. ముందు తప్పించుకునే మార్గం ఆలోచించాలి. మనమేం అబద్ధమాడటంలేదు. ఐదులక్షలు చేతినుండి కట్టుకోవాలంటే ఎలా? ఇన్నిరోజుల కమీషన్ లక్షన్నర కూడా రాలేదు మనకు. ఏజంట్ దొరికి, ఆ డబ్బులిచ్చేస్తే ఎవరివి వారికిచ్చేద్దాం" సుశీలను సముదాయిస్తున్నట్టుగా చెప్పాడు యాదగిరి.

"ఇప్పటికిప్పుడు తప్పించుకునే మార్గం ఒక్కటే! ఎవరి డబ్బులు వారికివ్వడమే! తర్వాత మన బాకీ ఉంటే వస్తయి. లేకుంటే

లేదు. మీకేంది? హోటల్లో తిని లాడ్జింగ్‌ల పంటరు. ఇంటికాడుండేది నేను, వారితో మాటలు పడేది నేను" దుఃఖాన్ని ఆపు కుంటూ అంది.

భార్య మాటలకు ఖంగుతిన్నట్టున్నాడు యాదగిరి. కొన్నిక్షణాలు మాట్లాడలేదు. తర్వాత విసురుగా "చెప్పింది చెయ్యి. నాకు నీతులు చెప్పకు. అంత జాలిగా ఉంటే ఐదో పదో పారేద్దాం. వాళ్ళు మస్కట్ వెళ్ళి లక్షలు సంపాదిస్తే మనకు మాత్రం ఏమన్నా ఎక్కువ ఇచ్చేవారా ఏందీ? " అంటూ ఫోన్ పెట్టేశాడు.

సుశీల కూడా ఫోన్ పెట్టేసి చాలా సేప టివరకు ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. ఏజంట్ పారిపోయాడనే బాధకంటే అమా యకులైన ఆ ఊరివారికి ఆ విషయం ఎలా చెప్పాలనే బాధనే ఎక్కువగా కృంగదీ స్తోంది. మస్కట్, దుబాయ్ అంటే వీరికెం దుకింత మోజు? అరవైవేలు విజాకి నింపు తారు. వెళ్ళేటప్పుడు విందులు, బంధువు లంటూ పదివేలవరకు ఖర్చుచేస్తారు. తీరా వెళ్ళాక అరకొర జీతంతో కాలం గడుపు తారు. వడ్డీతోసహా అప్పు తీరకముందే ఇల్లు చేరుతారు. వచ్చాక కట్నాలు, కాను కలు, దేవుండ్లు, కందూర్‌కు, యాత్రల కంటూ మరిన్ని అప్పులు చేస్తారు. రెండు నెలల రిటర్న్‌విజా తర్వాత అప్పును తీర్చడా నికి మళ్ళీ గల్ఫ్‌తీరాలకు పయనమైపో తారు.

ఈ వాస్తవాన్ని ఎందుకు గుర్తించడం లేదు. ఏజంట్‌లు, వడ్డీ వ్యాపారస్తులు, బంధువులకు తప్ప, కష్టపడి వెళ్ళిన వ్యక్తు లకు ఏ కొందరికో తప్ప ఏం మిగులు తోంది? ఒకరిని చూసుకుంటూ ఒకరు వెళ్తున్నారు. ఎడారి మంటల ధగధగకు బలియైపోతున్నారు. ఆ డబ్బుతో, స్వంత తెలివితో ఇక్కడే ఏదో ఒక వ్యాపారం చేసి ఎందుకు పని కల్పించుకోవడంలేదు? ఇది వారి అమాయకత్వమా? అసమర్థతా? లేక అరచేతిలో వైకుంఠాన్ని చూపే ఏజంట్‌ల మాయాజాలమా?

"ఏమైందే సుశీలా? గట్లనే బీరపోయి నవు. వాడేమన్నడు? ఎప్పుడస్తనన్నాడు. గడియ తీరికలేదు. గవ్వ ఆందని లేదు అన్నట్టుంది. వచ్చిరాంగానే ఓ దంద పెట్టు కున్నాడు. దిక్కుమల్లె దంద" కోడలువైపు చూస్తూ అన్నాడు సుశీల మామ. అతడు వారి సంభాషణను వినలేదు. అప్పుడే మెల కువ వచ్చిందతనికి.

మామ మాటలకు ఆలోచనల్లోంచి తేరు కుంది సుశీల. "ఏం లేదు మామా! అందరి దగ్గరా పైసలు తీసుకుని ఏజంట్ పారిపో యిండట. వాని కొరకే తిరుగుతుండట" నిద్రపోవడానికుపక్రమిస్తూ చెప్పింది.

"అయ్యల్లా... అంత పనైందా? ఎట్లగతీ! ఈ పదిమందికి పైసలెవలియ్యాలే. ఏం కథ? తవ్వేడు వడ్లకు తంగేళ్ళు పీకపోతే బుట్టెడొడ్లు దుడ్డె బుక్కిపోయినట్టయింది. కొద్దిగనా? లక్షలపైన. కట్టకపోతే ఎవ్వలూరుకుంటారు" బాధగా అన్నాడ తడు.

అప్పటికే ఒక నిర్ణయానికి వచ్చినట్టు చెప్పింది సుశీల.

"పొలాన్ని అమ్ముమన్నాడు. అమ్మి ఎవల పైసలు వాళ్ళకు ఇయ్యిమన్నడు. సచ్చిపో యిన దేవరాజు భార్యకు కూడా వాపసు ఇయ్యిమన్నాడు. కిస్మత్ మంచిగుంటే మళ్ళీ సంపాయించుకుంటనన్నడు" అబద్ధం చెప్పింది సుశీల.

తెల్లవారగానే పదిమందిని ఇంటికి పిలి పించుకుంది. విజాలు వచ్చాయేమోనని ఆతృతగా వచ్చారు వారు. ఏజంట్ పారిపో యిన విషయం, యాదగిరి అతడికొరకు వెదుకుతున్న విషయం చెప్పింది. ఇదంతా అబద్ధమని వారు వాదించేలోపే "వారంరో జుల్లో పొలం అమ్మి మీ డబ్బులు మీకి స్తాను. వాడు మమ్మల్ని మోసం చేశాడని





మేం మిమ్మల్ని మోసం చేయడంలేదు. ఎవరి కలకల మాకెందుకు. మీరు పుట్టెడు పుల్లెందులవడి పైసలిచ్చిండ్రు. ఒకవేళ విజాలు తెస్తే మాత్రం మళ్ళీ మేం పోము అనకుండ్రి" అంటూ చెప్పింది సుశీల.

ఎవరూ నోరు మెదపలేదు. సరేనన్నారు. వారంకాదు, పదిహేను రోజులు, నెలరోజు లైనా ఫరవాలేదు. ఈలోపు వాడు దొరికి విసాలిస్తే వెళ్తాం. లేదంటే డబ్బు తీసు కుంటాం అన్నారు. అందరి మొహాల్లో నిరాశ కొట్టిచ్చినట్టు కనిపిస్తోంది. నెలరోజు లు ఎందుకు వాయిదా పెట్టారంటే ఆలోపు గ్గానైనా ఏజంట్ దొరికి విసాలు ఇస్తాడేమో నన్న ఆశతోనే. చివరగా మరో తీర్మానం కూడా చేశారు. తమకిచ్చే డబ్బులే మరో కంపెనీకి ఇచ్చి విసాలు వచ్చే ఏర్పాటు చేయాల్సిందిగా యాదగిరికి చెప్పమని, అలాగైతే తాము ఆరేడు నెలలైనా ఆగుతా మని.

వారిలో మస్కట్ పిచ్చి ఎంతగా ముదిరి పోయిందో గుర్తించి బాధపడింది సుశీల. వారికి అలాగేనని చెప్పి ఆరేడునెలలు ఆపి వీలుకాలేదని ఇప్పుడిచ్చే డబ్బే అప్పుడు ఇవ్వ వచ్చు అలాచేస్తే సుశీలకు ఎంతో లాభం ఉంటుంది. కానీ సుశీల సరే అనలేదు. ఖచ్చితంగా వీలుకాదని చెప్పింది. మళ్ళీ వాడు కూడా పారిపోతే మీరు ఊరకుం టారా? అని ప్రశ్నించి పొలం అమ్ముడుపో గానే డబ్బులు ఇచ్చేస్తానంది.

వారంరోజులవరకూ మళ్ళీ యాదగిరి ఫోన్ చేయలేదు. ఆలోపే పొలాన్ని, తన వద్దనున్న బంగారాన్ని, విలువైన వస్తువు లను అమ్మేసింది. డబ్బు సరిపడకపోతే కొంత అప్పు చేసింది. కరెంటు బావి ఉన్న పొలం కాబట్టి తొందరగానే అమ్ముడుపో యింది. రేటు మాత్రం అనుకున్నంత రాలేదు. వస్తువులు కూడా తక్కువధరకే అమ్ముడుపోయాయి. ఎవరికీ నష్టం చేయడం లేదన్న తృప్తే ఆమెచేత నష్టానికైనా సరే వస్తువులన్నింటిని అమ్మించింది. ఎవరి డబ్బులు వారికి పెద్దల సమక్షంలో అప్పగించింది. పాస్‌పోర్టులు యాదగిరి వచ్చాక తెప్పిస్తానని చెప్పింది.

పద్మకు ఇచ్చే అరవై వేలతో వాళ్ళ ఊరికి బయలుదేరింది. పద్మకు డబ్బు వాపసు ఇస్తున్నట్టు ఎవరితో చెప్పలేదు. చెబితే అప్పులవాళ్ళు వెంటబడి ఇబ్బంది పెడతా రని, అప్పు కట్టమని పద్మను ఒత్తిడి చేస్తా రని గ్రహించింది. ఈ డబ్బుతో కొంతలో కొంతయినా ఆమె ఊరట చెందితే తనకు అదే చాలనుకుంది. అందరికీ డబ్బు ఇచ్చింది ఒక ఎత్తయితే పద్మకు ఇస్తుంది మరో ఎత్తుగా తృప్తినిస్తుందామెకు. భర్త వచ్చి తనను ఏంచేసినా ఫరవాలేదన్న మొండిధైర్యం వచ్చిందామెకు.

★ ★ ★

"గాలికిపోయే కంపను గాలికి పోనియ్యా కుంట అడ్డం తలిగి మెడకు పెట్టుకున్న ట్టాయె! ఇప్పుడు జూడు. సానం జెయ్యబోతే సాలైనంత పాపం తలిగినట్టు అయ్యో బిడ్డా... అయ్యో బిడ్డా అంటివి. బిడ్డ వచ్చి నడింట్ల గూసుండె. ఒక్కతి గాకపాయె. ఇద్దరు పిల్లలు ఎంబడుండిరి. సంసారం మందులకు గోలీలకే కావట్టె. ఇప్పుడెట్ల. చుట్టం లెక్కవచ్చి నాలుగురోజులుండి పోతదన్నట్టుగాదాయె. ఏటెల్లకాలం సాదు డంటే ఎట్లగావాలె" కోపంగా అడిగింది కోటయ్య భార్య లక్ష్మి.

ఆమె అలా ఎన్నడో నిలదీస్తుందని తెలుసు కోటయ్యకు. కానీ అంత తొందరగా నిలదీస్తుందని మాత్రం తెలియదు. ఆమె మాటలు కోపాన్ని కలిగించినా తనేమాత్రం కోపగించుకున్నా ఆమె మరింత మొండికే స్తుందని భావించి సర్దిచెబుతున్నట్టుగా అన్నాడు కోటయ్య. "కన్నతల్లి దయ్యమైతే తొట్టెగట్ట జాగ ఉండదట. తల్లి వెనుక తల్లి లాంటిదానివి. నువ్వె పగవడితే అది బతు

కుతదానే! దాని కిస్మత్ తక్కువుండి మన ఇంటికి వచ్చింది. మంచిగున్ననాడు ఎన్న డన్న మనకు ఎదురుచూసిందా? ఇప్పుడు మనం కాదంటే అదెటుపోవాల్నే. తర్వాత దాని బాకీ ఎట్లుంటే గట్లయితది. ముందు అదైతే కోలుకోని తియ్యి"

"మింగమెతుకే లేదట. మీసాలకు సంపెంగ నూనె అన్నడట నీ అసొంటోడు. మనకే కూటికి గతిలేదు. వాళ్ళనెట్ల సాదుతం. అక్కడేమన్న ఆస్తులున్నా యనా? చేను అమ్మిరి. ఇల్లు అమ్మిరి. పుట్టెడు బాకీలు గులగుల... ఊరంత బొల బొల అన్నట్టు ఊరునిండ బాకీలేనాయె. నాలుగురోజులాగినంక వాళ్లందరచ్చి బాకీలు గట్టుమంటరు. అప్పుడు నువ్వేం మాట్లాడుతవో" మరంత కోపంగా అంది లక్ష్మి.

"ఎవ్వడే నా దగ్గరికి వచ్చేటోడు బొక్కలి రుగుదంత. ఎవలకిచ్చిండని వస్తడు. వాడె వడూ రాడుగనీ... నువ్వు జరంత ఓపిక పట్టు. నా బిడ్డను ఆగంజెయ్యకు. ఇదివరకే అది పూర్తిగా అదిరిపోయింది. ఇప్పుడు నువ్వు సూటిపోటి మాటన్నవనుకో. ఇంకా ఆగమైతది..." కోటయ్య మాటలు పూర్తి కాకముందే అందుకుంది లక్ష్మి.

"ఏంటది గట్లంటవు. నేను పిచ్చిదాన్నా, ఎర్రిదాన్నా. పేరు వెయిన ఎంకమ్మ పేనమె త్తుకపోయిందన్నట్టు. నేనెంత మంచిగ జూసుకున్నా నాకు చెడ్డ పేరే వస్తుంది. నువ్వే గిట్లనవడితివి. మంది ఏమంటరు చెప్పు. రేపు గాచారం జాలక ఏమన్నా అయినాగానీ నేనే సంపిన్నంటరు. ఇగ నాకు వశంగాదు, తరంగాదు. ఈ ఇంట్ల నేనుండ. మీరే ఉండుండ్రి. నేను యాడన న్నపోత. జానెడు తావే దొరుకదా నాకు" అరుస్తూ బయటకు వచ్చింది లక్ష్మి.

వీరి సంభాషణ ఇంటి వెనక ఉన్న దొడ్లో సాగింది. ముందుగదిలో పడుకున్న పద్మకు వారి మాటలు వినిపించే అవకాశంలేదు. అది గ్రహించే కోటయ్య భార్యను మందలిం చాలని ఆ మాటలన్నాడు. పద్మకు ఇంటి వద్ద స్థిరాస్తులు లేవు. పైగా ఇద్దరు పిల్లలు. తాను మౌనంగా భరిస్తే అది ఇంట్లోనే ఉండిపోతుంది. ఇప్పటినుండే ఎప్పుడొక మాట అంటే కొన్నాళ్ళకైనా బయట ఒకగది అద్దెకు తీసుకుని తన బతుకు తాను బతు కుతుంది. లేదంటే అత్తవారింటికి వెళ్ళిపో తుంది. ఇది లక్ష్మికి వచ్చిన ఆలోచన. అందుకే భర్త ఎంతగా వారించినా విన కుండా ఎప్పుడూ ఏదో ఒకమాట అంటూనే ఉంటుంది. బాధగా కోటయ్య బయటకు వెళ్ళిపోయాడు.

లక్ష్మి ఇంట్లోకి వచ్చి పడుకున్న పద్మను చూసింది. "లెవ్వు. లేచి మొహం కడుక్కో. మొహం కడుక్కుని రెండు బుక్కల చాయ దాగు. పరాయిబిడ్డకు గాజులు పెడితే పైసలు చేటు, బ్రమలు చేటన్నట్టుంది నా బతుకు. నిన్ను ఎంత మంచిగ చూసు కున్నా సవతితల్లినే గదా! గట్లనే సూత్తదన్న పేరు. దేవునికి అడ్డం లేకపోతే సాలు. ఇంక గూడా అట్లనే పంటే పక్కలు కుట్టువ ట్టిపోతయి. లేచి అటు ఇటు తిరుగు" విసుగ్గా అంది లక్ష్మి.

పద్మకు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. హాస్పిట ల్‌నుండి ఇంటికి వచ్చిననాడు తండ్రి దిన వారం పెట్టాలన్నప్పుడు లక్ష్మి చేసిన వాదన గుర్తొచ్చింది. తండ్రి ఎంతగా నచ్చ జెప్పినా వినకుండా తన పంతాన్నే నెగ్గించు కుంది తల్లి. పద్మ అత్తవారింటికి వెళ్ళి ఇద్దరి దినాలు చేసి పిట్టకు పెట్టి, నర్సవ్వ అస్తికల్ని గోదావరిలో కలపాలని, ఆ ఊరి లోనే అన్నదానం చేయాలని, అలాగైనా కూతురుకు కొంత ఊరట లభిస్తుందని వాదించాడు కోటయ్య. లక్ష్మి వినలేదు. అనవసరపు ఖర్చులని అదే ఊరిలో చుట్టు పక్కల వారిక్కూడా చెప్పకుండా కార్యక్ర మాన్ని ముగించింది.

పద్మ మారుపలుకలేదు. మొహం కడు




క్కుంది. నడుస్తుంటేనే ప్రాణం తూలుతోంది. నిలదొక్కుకుంటూ వెళ్ళి పొయ్యి దగ్గర కూర్చుంది. ఇద్దరు కూతుర్లింకా నిద్ర లేవలేదు. గ్లాసులో టీ పోసి అందించింది లక్ష్మి. నోట్లో పెట్టుకుంటేనే కడుపులో తిప్పినట్టయింది పద్మకు. అందులో చక్కరలేదు. పాలు తక్కువయ్యాయి. నల్లగా, చేదుగా ఉంది. టీ వదిలిపెడితే ఏమంటుందోనని బలవంతంగా, మందును మింగినట్టు మింగి గ్లాస్‌ను కడిగి బోర్లించి వెళ్ళి అరుగుమీద కూర్చుండి నేల గీతలుగీస్తూ ఉండిపోయింది.

కొద్దిసేపటి తర్వాత బయటకు వచ్చింది లక్ష్మి. పద్మను చూస్తూనే విసుగ్గా అంది. "యాడవడితేగాడ బీరిపోకు. దునియమీద నీలెక్క అయినోల్లు మస్తుగున్నరు. ఏడుసుకుంట గూసుంటే పోయినోల్లు వస్తే పొద్దంతా ఏడువుమని నేనే చెప్పేదుంటి. అయి పాయె. అయిందానికి అల్లరలేదు. కాకోయేదానికి రంది లేదు. లేచి తానం జెయ్యి. జెరంత అలుకగ ఉంటది. పాలేరోని పీడ బామనోని మీద అన్నట్టు ఒగల పీడ ఒగలకు తలిగినట్టాయె. నిన్నియ్యల్ల పోరనిది లగ్గం పెట్టుకుందామన్నా కాల్లు, జేతులు ఆడకుంటాయె. అట్ల పెట్టుకుంటే సూడవ్వ ఇంట్ల ఆపదే ఉండె లగ్గమెట్ల పెట్టుకునిరి అంటరు. లోకంల మన్నువడ లోకంతోని వశంగాదు. నల్లగైతే దగ్గరికి రానియ్యరు. తెల్లగైతే ఓర్వరు"

మౌనంగా లేచి స్నానం చేసింది పద్మ. అప్పుడే కూతురు లేచి ఏడ్వడంతో ఆమెకు కూడా మొహం కడిగింది. స్నానం చేయించింది. చిన్నకూతురు ఇంకా నిద్ర లేవనేలేదు. వెళ్ళి ఆమె పక్కన ముడుచుకు పడుకుంది పద్మ. ఏంచేయాలన్నా తోచడం లేదామెకు. కంటివెంట నీరు నిరంతరంగా స్రవిస్తూనే ఉంది. రోజూ దుఃఖం వచ్చినప్పుడల్లా తనివితీరా ఏడ్చినా గుండెబరువు కొద్దిగా దిగేది. ఆ ఇంట్లో అలా ఏడ్వడం నిషిద్ధం. అదొక్కటే కాదు. బంధువులు వచ్చినప్పుడు కూడా పెద్దగా ఏడ్వనివ్వదు. కుమిలి కుమిలి ఏడుస్తూ అయినా పడుకోనివ్వదు. ఎప్పటికీ ఏదో మాట అంటూ మనసును బాధిస్తూనే ఉంటుంది.

"పద్మా... మల్లగట్ల పన్నవేంది? ఎవలన్న జూస్తే నేను నీకు తిండిపెడుతలేనను కుంటరు. ఎవ్వలో ఎందుకు? మీనాయన చాలదా? ఇంటిదొంగ పాణగండమన్నట్టు జేస్తడు. లెవ్వు! లేచి సలిదో బులిదో బుక్కెడు సల్లవడు. నిన్న మొత్తానికే తినలేదు. గట్ల తినకుంట ఉంటే పుల్లశీలిపోతవు. చేతులు గాలినంక ఆకులు పట్టుకున్నట్టు ఇప్పుడేడిస్తే ఏమత్తది. మనకెందుకు మస్కట్ అని అప్పుడే అనద్దా! అంగయిగొంగెడు తెమ్మన్నగని చెప్పుదెబ్బలపాలు గమ్మన్ననా... అన్నదట ఎనుకటికెవలో! పైసలు కట్టలకు కట్టలు దెస్తె కూసుండి తింటననుకున్నవు" ఎత్తిపొడుస్తున్నట్టుగా అంది లక్ష్మి.

పద్మ నోరెత్తలేదు. కుమిలి కుమిలి ఏడుస్తోంది. ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తోంది. ఏ రాత్రో, పగలో ఉరివేసుకుంటే సరి. తను బతికి మాత్రం ఏం చేసేదుంది. అసలు బతికేందుకు ఆధారమేది? తండ్రి వద్దకు వచ్చి నెల కూడా నిండలేదు. కాస్తైనా సానుభూతి చూపకుండా సూటిపోటి మాటల్ని వినాల్సివస్తోంది. ఇంకా ముందు ముందు ఏం జరుగుతుందో తెలియదు. తాను ఎవరి కుటుంబంలో కలహాలకు కారణం కాకూడదు. అందుకు ఒక్కటే మార్గం. తాను చనిపోవాలి. పిల్లల్ని ఎవరో పిల్లలు లేనివారు తీసుకుపోతారు. తన తండ్రికి తాను బతికి ఉంటే వచ్చే బాధల కన్నా చస్తే కలిగే బాధ చాలా తక్కువ. అందుకే తాను చావాలి. మళ్ళీ జన్మంటూ ఉంటే తల్లిలేని పిల్లగా పుట్టించమని దేవున్ని వేడుకొని చావాలి.

పద్మ ఆలోచనలు కొనసాగుతుండగానే

మరోసారి లేచి తినుమని అరిచింది లక్ష్మి. 'నాకు ఆకలిగా లేదని' స్థిరంగా చెప్పి కళ్లు మూసుకుంది పద్మ. మూసిన కనురెప్పల మాటున కదులుతున్న కళ్లల్లో నీరు ధారలై పారి పక్కబట్టల్ని తడుపుతోంది. గతమంతా గుర్తుకువస్తోంది. భర్తరూపం, అత్తరూపం కళ్లముందు కదులుతోంది. ఏమనుకుందోగానీ లక్ష్మి మరోమాట మాట్లాడలేదు. తనలోతాను గొణుక్కుంటూ పనిలో మునిగిపోయింది.

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. 'పద్మా' అన్న పిలుపు విని పరిచయమైన ఆ కంఠానికి ఉల్కిపడి కళ్లు తెరిచింది పద్మ. ఎదురుగా సుశీల కనిపించింది. ఆపుకుందామన్నా ఆగని దుఃఖంతో లేచి సుశీలపైబడి బావురుమంది పద్మ. కట్టలు తెంచుకున్న దుఃఖంతో ఏడుస్తున్న పద్మను ఓదార్చడం సుశీలకు సాధ్యం కాలేదు. భర్తను, అత్తను తలుచుకుని ఏడుస్తోంది పద్మ. సుశీల కూడా ఏడ్చింది. వీరి ఏడ్పులకు చుట్టుపక్కలవారు పోగయ్యారు. అందరికళ్లలో నీళ్లు తిరిగాయి. రకరకాల ఓదార్పు మాటలు చెప్పారు. పద్మ మాత్రం ఏడ్పును ఆపలేదు. పొగిలి పొగిలి ఏడుస్తోంది. లోపలినుండి లక్ష్మి కూడా వచ్చింది. "నీకు మేము లేమా బిడ్డా! ఎందుకు బెంగటిల్లుతున్నవు. నరుడు పట్టువడితే పోగుపోత్తంగని, పరమాత్ముడు పట్టువడితే పోగువోత్తమా? మన చేతులేముంది" అని ఓదార్చింది. అందరిముందు ఒకమాట, ఆ తర్వాత ఒకమాట మాట్లాడ్డం లక్ష్మికి అలవాటే. మందిముందు కావాలనే ప్రేమగా మసలుకుంటుంది.

అరగంట తర్వాతగానీ ఏడుపు ఆపలేదు పద్మ. నిలువెల్లా చెమటలు పట్టాయి. వచ్చినవారు తలోమాట చెప్పి వెళ్ళిపోయారు. వీరి అరుపులకు నిద్రలేచి ఏడుపును అందుకున్న పిల్లలిద్దరినీ ఎత్తుకుంది లక్ష్మి. వచ్చినవారి మెప్పును పొందాలన్నది ఆమె తహతహ. గదిలో సుశీల, పద్మలే మిగిలిపోయారు. పద్మ వెక్కుతూ మౌనంగా ఉండిపోయింది. సుశీల ఆమెకు ధైర్యాన్ని చెప్పింది. చాలాసేపటి తర్వాత పెదవి విప్పింది పద్మ.

"అక్కా! నాకు చచ్చిపోవాలని ఉందే! బతుకుమీద రోత పుట్టింది. నేను బతికి ఏంచేస్త. పెనెంమీదికెళ్ళి అగ్గిలవడ్డట్టు ఉన్నది బతుకు. ఎటూ ఆధారం లేకుంటయింది. కుడిదిలవడ్డ ఎలుకలెక్క కొట్టుకునుడైతుంది" బొంగురు గొంతుతో చెప్పింది. ఏడ్చి ఏడ్చి ఆమె గొంతు బొంగురుపోయింది. మాటలు పెగలడంలేదు.

"ఏంది చెల్లీ... గట్లంటవు. నాకే ఎంతో ధైర్యం చెప్పుతుండేదానివి. గిట్ల బెంగటిల్లుతవా? గిసొంటప్పుడే ధైర్యంగా ఉండాలె. నీకూ మంచి రోజులస్తయి" పక్కనే కూర్చుంటూ ఓదారుస్తున్నట్టుగా అంది సుశీల.

మోకాళ్లపై తలపెట్టుకుని కూర్చుంది పద్మ. కళ్లు ఎర్రగా, పైకి ఉబికి ఉన్నాయి. శూన్యంలోకి చూస్తూ వైరాగ్యంగా అంది. "ఏం మంచిరోజులక్కా... మొదలే దూలం కాలేదు. కొనదూలమెట్ల ఐతది. నాకు బతుకబుద్ధయితలేదు. అదే దవఖానల అట్లనే పోయినా బాగుండేది. మొండి ప్రాణం. ఇంక ఎన్ని చిత్రాలు సూపిచ్చుడుకు దేవుడు నన్ను బతికిస్తుండో! యాడ నన్న ఉరిపెట్టుకొని సస్త"

"ఏంది చెల్లే గట్లంటవు. ఈ పొల్లగాండ్ల గతేందే? వాళ్ళేంగావాల్నే. తల్లిలేని పిల్లలని ఎవలన్న దగ్గరికి తీస్తరా... సాది లగ్గాలు జేస్తరా... వీళ్ళకొరకన్నా నువ్వు బతుకాలె"

"ఎవ్వని పొల్లగాండ్లక్కా! బొరేమోలె మొగడు పోంగా బొంత శింపులకేడిచిందన్నట్టు నా బతుకే చీకటయింది. ఉట్టికందకుండ సర్గానికందకుండ ఉండిపోయింది. సచ్చి సచ్చినోల్లండ్ల కలువలేదు. బతికి బతికినోల్లండ్ల కలువలేదు. పుట్టెడు దుఃఖంతో సస్తూ బతికేకంటే ఒక్కసారి




సచ్చింది నయంగదా" విరక్తిగా అంది పద్మ.

అది పద్ధతికాదని నచ్చచెప్పింది సుశీల. చాలాసేపటివరకూ ఇద్దరూ మాట్లాడుకు న్నారు. మాటల మధ్యలో తన విషయా లన్నీ చెప్పింది సుశీల. "ఆయన వచ్చినంక నన్నేం చేసినా సరే! వీళ్ల బాధలు నాకు చూడబుద్ధికాలేదు. ఎవ్వల పైసలు వాళ్లకు పువ్వుల్లో పెట్టి ఇచ్చిన. మీరు కట్టిన అరవై వెయిలు కూడా తెచ్చిన చెల్లీ. నువ్వు పుట్టెడు దుఃఖంలో ఉన్నవు" అంటూ బ్యాగ్ తెరిచి డబ్బును అందించబోయింది సుశీల.

పద్మ నిరాకరించింది. ఎంతకీ ఒప్పుకో లేదు. చనిపోయేముందు ఈ ఆశలు నాకు వద్దు అనుకుంది. పైగా యాదగిరికి తెలి యకుండా ఇస్తోంది కాబట్టి రేపు వచ్చాక సుశీలను ఇబ్బంది పెట్టవచ్చు. నా మూలంగా వారి కుటుంబంలో కలహాలు పుట్టగూడదనుకుంది. సుశీల చాలాసేపు బలవంతంచేసి చేసేదిలేక మానుకుంది.

లక్ష్మి సుశీల ముందు అతివినయం ప్రద ర్శించింది. ఆమె చూడాలని పద్మమీద ప్రేమను ఒలకబోసింది. పిల్లలపై ప్రత్యేక శ్రద్ధ కనబరిచింది. సుశీలకు టీని అందిం చింది. ఇద్దరినీ భోజనాలకి లేపింది. పద్మ వద్దంటే 'ఇదమ్మా మీ చెల్లి వరస. ఏదీ వద్దంటుంది. ఎలా కోలుకునేది?' అన్నది. సవతి తల్లి అంటే ఇలా ఉండాలి. కన్నతల్లి కంటే ఎక్కువగా ఆరాటపడుతోంది. అను కుంది సుశీల. తనే బలవంతంగా పద్మని భోజనానికి లేపింది.

భోజనాలు అయ్యాక మరోసారి పద్మకు నచ్చచెప్పి డబ్బు ఇయ్యాలని చూసింది సుశీల. 'అందరు కావాలె కావాలె అంటరు... నువ్వేంటే డబ్బు ఇస్తనంటే వద్దంటున్నవు' అంటూ ఆశ్చర్యంగా చూసింది సుశీల.

"నాకు బతుకుమీద ఆశ లేదక్కా! మన సంతా నీళ్లయిపోతోంది. ఎట్ల జరిగే దుందో... ఏడ్చి ఏడ్చి ఎన్నడో నోరు దెరుస్తె. మమ్ముల్ని దేవుడు పట్టువట్టిండు" మోకాళ్లమధ్య తల పెట్టుకుని రెండు చేతుల్నీ నెత్తికి పెట్టుకుని బొంగురు గొంతుతో అన్నది పద్మ. ఎక్కడో నూతిలో నుండి వస్తున్నట్టున్నాయి ఆమె మాటలు.

ఇక ఆమెతో వాదించి లాభం లేదను కుంది సుశీల. మళ్లీ ఎప్పుడైనా ఇవ్వచ్చులే అనుకుంది. కొద్దిరోజులైతే ఆమె కోలుకుం టుంది. అప్పుడైతే నచ్చచెప్పగానే ఒప్పుకుం టుంది అనుకుంది. చెప్పాల్సిన మాటలు చెప్పి ఆరోజు సాయంత్రం బయలుదేరింది. సుశీల వెళ్లిపోయేప్పుడు పద్మ మరోసారి పొగిలి పొగిలి ఏడ్చింది. సుశీల ఆమెను ఓదా ర్చింది. కోటయ్య సుశీలను బస్సు ఎక్కించి వచ్చాడు.

సుశీల, పద్మల మధ్య జరిగిన సంభాషణ విన్నది లక్ష్మి. ఆమె డబ్బును ఇస్తాననడం, పద్మ ఒప్పుకోకపోవడం అంతా గమనిం చింది. పద్మపై కోపం పెరిగిపోయింది. భర్తతో చెప్పి ఆ డబ్బును సుశీల నుండి తెప్పించాలనుకుంది. పద్మ వద్దనగానే ఏదో సర్దిచెబుతున్నట్టు నటించి అప్పటికప్పుడు డబ్బును తీసుకునేదే లక్ష్మి. అలా తీసుకో వడం బావుండదని ఆగిపోయింది. ఆ డబ్బు ఎక్కడికీ వెళ్లదన్న నమ్మకం కుదిరిం దామెకు. అందుకు మిన్నకుండిపోయింది. లేదంటే ఏదో మాయమాటలు చెప్పి సుశీల నుండి డబ్బు తీసుకునేదే.

భర్త రాగానే ఈ విషయం రహస్యంగా చెప్పింది. కోటయ్య వద్దని హితవు చెప్పాడు.

"మన కొరకు కాదు. ఆమె కొరకే! ఇద్దరు బిడ్డలున్నారు. వాళ్లను ఎవలకన్న సాదు కోను ఇద్దాం. ఇప్పుడుగాదు. ఇంక రెండేం డ్లుగానీ. అదే అరవయివేలు పెట్టి ఎవరి కన్న ఇచ్చి లగ్గం చేత్తాం. వయసుపిల్ల నాయె. ఇప్పటినుండి ఇంటిమీద ఉంచుడు మంచిది కాదు. ఏమిట్లకేమైంది. ఇరువై మూడు ఇరవైనాలుగేండ్లుండది. ఇప్పటి

నుండి సచ్చినాయిన పేరుమీద ఉండుడంటే ఏంది? " విసుగ్గా అంది లక్ష్మి.

ముందుగా కోటయ్య ఒప్పుకోలేదు. 'ఎట్ల యితె అట్లయితది. మందిమీద ఇడిచిపెట్టు డెందుకు. ముందు ఆ డబ్బు పట్టుకరా' అని ఒత్తిడి చేసింది లక్ష్మి. కోటయ్య కాద నలేదు. అతడికి కూడా అనిపించింది. డబ్బు ఎవరిమీదో వదిలిపెట్టుడెందుకని. మరునాడే వెళ్ళి సుశీలను కలిశాడు. పద్మకు తాను నచ్చచెప్పానని చెప్పాడు. ఆమెకు ఏ ఆధారమూ లేదని, ఈ డబ్బే ఆధారమని చెప్పాడు.

సుశీల వద్ద డబ్బు రెడీగా ఉంది కాబట్టి వెంటనే ఇచ్చేసింది. ముట్టినట్టు కోటయ్య చేత కాగితం వ్రాయించుకుంది. అక్కడిక క్కడే పద్మ పేరున బ్యాంకులో వేద్దామనుకు న్నాడు కోటయ్య. వెంట పద్మలేనిదే వేసు కుంటారో లేదోనని ఇంటికి వెళ్లాడు. అతడు ఎప్పుడు వస్తాడా అని కాచుక్కూర్చున్న లక్ష్మి భర్త కనిపించగానే ఏం జరిగిందని ఆరాతీసింది. డబ్బును చూసి సంతోషప డింది. ఇప్పుడే పద్మకు చెప్పవద్దని నచ్చచె ప్పింది. ఇలాగైనా పద్మను వేధించకుండా, కూతురులా చూసుకుంటుందేమోనని ఒప్పు కున్నాడు కోటయ్య. ఆ డబ్బులను భార్య చేతుల్లో పెట్టాడు. అతడికి తెలియకుండానే అప్పులన్నీ తీర్చేసింది లక్ష్మి. మిగిలిన డబ్బుల్ని నమ్మకస్తులకు వడ్డీకి ఇచ్చింది. ఈ విషయం వారంరోజుల తర్వాత తెలిసి బాధపడ్డాడు కోటయ్య. లక్ష్మి ప్రవర్తనలో ఏ మాత్రం మార్పులేదు. పద్మను సూటి పోటి మాటల్తో వేధిస్తూనే ఉంది. రోజురో జుకూ బతుకుమీద విరక్తి పెరుగుతూనే ఉంది పద్మకు.

కోటయ్యకు డబ్బు ముట్టినరోజే వచ్చాడు యాదగిరి ఇంటికి. ఎంత హడావిడి చేస్తా డోనని భయపడింది సుశీల. ఏమాత్రం కోపగించుకోకుండా విషాదంగా ఉండిపో యాడు. భర్త పరిస్థితికి సుశీలకు ఏడ్పువ చ్చింది. ఆమె ఏడుస్తుంటే విచిత్రంగా అతడే ఓదార్చాడు. గుండె బరువు దిగినట్టనిపిం చిందామెకు.



కనుచూపు మేరలో ఎత్తుపల్లాలు లేని ఇసుక ఎడారి. సన్నని ఇసుక మెత్తటి పరు పులా ఉంది. ఎన్నడూ లేనిది పొగమంచు కురుస్తోంది. పూర్తిగా తెల్లవారినా పొగ మంచు చేత తెల్లవారనట్టుగానే ఉంది. రగ్గును నిండుగా సవరించుకుంటూ మరిం తగా ముడుచుకుని పడుకున్నాడు దేవ రాజు. అర్ధరాత్రి దాటకముందే మెలకువ వచ్చిందతనికి. అప్పటినుండి నిద్రరావడం లేదు. గతమంతా కళ్లముందు కదులు తోంది. అన్ని మైళ్ల ఎడారి ప్రయాణం చేసింది తనేనా అని ఆశ్చర్యంగా వుంది. ఇంకా తను బతికుండటం తనకే నమ్మశ క్యంగా లేదు.

కొంతసేపటి తర్వాత మొహం మీది రగ్గును తీసి బయటకు దృష్టిని సారించాడు దేవరాజు. పొగమంచు కొద్దికొద్దిగా విడిపో యింది. ఇసుకంతా తడితడిగా ఉంది. ఒంటెలు అక్కడక్కడ గుంపుగుంపులుగా పడుకుని పొడవాటి తలల్ని ఎత్తి ఆకాశం వైపు చూస్తున్నాయి. తల తిప్పి కనకయ్య




వైపు చూశాడు. అతడు గాఢనిద్రలో ఉన్న ట్టున్నాడు. గుర్రు వినిపిస్తోంది. చలి మాత్రం తగ్గలేదు. వణుకుపుట్టిస్తోంది. రగ్గును అలాగే కప్పుకుని లేచి కూర్చున్నాడు దేవరాజు.

"కనుకన్నా... ఓ కనుకన్నా నీ నిద్రపా డుగాను. చెడ గుర్రు కొడుతున్నవుపో! హరి బాబు వత్తడు. మాట్లాడుతనని చెప్పితివి. పదిహేను రోజులుదాటె. ఇప్పుడు ఎక్కడు న్నమో... ఎటు పోతామో తెల్వదాయె. నీ హరిబాబు సల్లగుండ ఇంకెన్నడత్తడే" అడి గాడు దేవరాజు.

ఆ అలికిడికి మెలకువ వచ్చింది కనక య్యకు. రగ్గును పక్కకు జరిపి దేవరాజును చూస్తూ అన్నాడు. "ఏంటిది దేవరాజు? ఏమో అంటున్నావు? ఎట్లుంది మస్కట్ బతుకు. తాతమ్మలు యాదికత్తుంద్రా! మన ఊర్లల్ల మస్కట్ పోయిండంటే వానికేంది దొర అంటరు. ఏమన్న ఇయ్యకపోతే నీకేం తక్కువుంది మస్కట్ పోతివి అంటరు. ఇప్పుడెట్లుంది దొరతనం"

"అదేమన్నగాని గనీ... ముందు నా కథ చెప్పు. పోయెటోన్ని పోనియ్యక ఇంటికి పోతే అప్పు ఎట్లతీరుస్తవు. ఇక్కడ ఉండు పని ఇప్పిస్తనంటివి. నేను నిజమేనని నమ్మి ఉంటిని. ఇంకా హరిబాబుగాడు రాక పాయె. నా గతేంది చెప్పు" దీనంగా అన్నాడు దేవరాజు.

అతడి మాటలు కనకయ్యను కలిచివే శాయి. దేవరాజును వెళ్లవద్దని ఆపి తప్పు చేశానా అనిపించింది. పదిహేనురోజుల క్రితం తెల్లవారుతుండగా కనిపించాడు దేవ రాజు. చలిలో వణుకుతూ ఉన్నాడు. అత డిని చూసి కనకయ్య ముందుగా ఆశ్చర్యపో యినా తరువాత తెలుగువాడని గుర్తించి పలకరించాడు. దేవరాజుకు పోయిన ప్రాణం లేచివచ్చినట్టయింది. ఏడుస్తూ తన కథనంతా చెప్పాడు.

కనకయ్య గత పదేండ్లనుండి మస్కట్ లోనే ఉంటున్నాడు. సుతారి పనిచేస్తాడు. మంచి జీతం ఉన్నా పని మాత్రం ఎక్కువ. ముస్లీం పేరు మీదనైతే విసా తొందరగా వస్తుందని, జీతం ఎక్కువగా ఉంటుందని అబ్దుల్లా పేరుమీద దొంగ పాస్‌పోర్ట్ తీసి మస్కట్ వచ్చాడు కనకయ్య. ఎవరో దగ్గ రివారికి తప్ప అందరికీ అబ్దుల్లాగానే తెలుసు కనకయ్య.

గొర్లు, ఒంటెలు ఎక్కువగా ఉన్నవారు వాటికి నీటి సౌకర్యం కొరకు అక్కడక్కడా నీటి కుండీలను కట్టిస్తారు. అప్పుడప్పుడూ నీటి వ్యాన్ వచ్చి వాటిని నింపి పోతుంది. అక్కడికి చేరుకున్న మందలకు ఆ టాంక్ లోని నీటినే తాగిస్తారు. ఒంటెలు వారం పదిరోజులకొకమారు నీటిని తాగుతాయి. గొర్లుమాత్రం రోజూ రెండుమూడుసార్లు నీటిని తాగుతాయి. అందుకే రెండుమూడు మైళ్లకొకటి చొప్పున నీటి టాంక్‌లను నిర్మి స్తారు.

కనకయ్య పని నీటిటాంక్‌లను నిర్మిం చడం. వ్యాన్‌లో సిమెంట్ ఇటుకలు, సిమెంట్ బస్తాలు తెచ్చివేసిపోతారు. చేతి కింద ఇద్దరు అసిస్టెంట్‌లుంటారు. వారి సహాయంతో హరిబాబు చెప్పిన చోట్లల్లా నీటికుండీలను నిర్మిస్తాడు. అలా ఒక కుండి నిర్మాణం పూర్తవుతున్న దశలో కనిపిం చాడు దేవరాజు.

అతడి కథంతా విన్నాక "నీకు ఇక్కడ ఉండాలనిపిస్తోందా, వెళ్లిపోవాలనిపి స్తోందా?" అని అడిగాడు కనకయ్య.

దేవరాజు సమాధానం చెప్పలేదు. కన కయ్యే కల్పించుకుని "అంత డబ్బు ఖర్చు పెట్టి వచ్చావు. ఇప్పుడే వెళ్లి ఏం చేస్తవు. నీకు పని ఇప్పిస్త. ఇక్కడనే ఉండు" అన్నాడు.

అతడి చేతికింద ఇప్పుడు ఇద్దరు అసిస్టెం ట్‌లూ లేరు. వాళ్లు వాళ్ల దేశం వెళ్లిపో యారు. మళ్లీ రిటర్న్ విసా ఉంది. రెండు మాసాలుండి వస్తారు. కనకయ్యకూడా

అంతే. రెండు సంవత్సరాలకొకసారి రెండు నెలలు ఇండియాకు వెళ్లివస్తాడు.

ఆ టాంక్ పూర్తి కాగానే మరో టాంక్ కట్టే చోటికి దేవరాజును తీసుకొని వచ్చాడు. తన చేతికింద పని చెబుతూ, అన్నం పెడు తున్నాడు. హరిబాబు వస్తాడని అతడితో చెప్పి ఏదైనా పని ఇప్పిస్తానని హామీ ఇచ్చాడు. సంతోషంగా ఒప్పుకుని చెప్పిన పని చేస్తున్నాడు దేవరాజు.

"ఏం చెయ్యాలె తమ్మీ... నీగాశారమో నాగాశారమోగానీ హరిబాబు రాకపాయె. ఎప్పుడూ రెండు మూడు రోజులకొకసారి వచ్చేటోడు పదిహేను రోజులు దాటినా రాలేదు. ఇలా ఎప్పుడూ జరగలేదు. ఇయ్యాల్ల రేపు రావాలె" లేచి కూర్చుంటూ అన్నాడు కనకయ్య.

"ఒకవేళ ఇయ్యాల్ల రాకపోతే రేపు పోదామా? " అడిగాడు ఆశగా దేవరాజు.

"ఎక్కడికి? " అతడి గొంతులో ఆశ్చర్యం ధ్వనించింది.

"హరిబాబు ఇంటికి. పదిహేను రోజుల నుండి వస్తలేవు ఎందుకని అడుగుదాం. మెల్లగ నా సంగతిజెప్పు"

అతడి మాటలకు పకాలున నవ్వాడు కన కయ్య. "మన ఇండియాల లెక్క అనుకు న్నవా ఏంది? యాడ దొరికితె గాడ ముచ్చ టవెట్టరు. ఇంటికి మనలను రానియ్యనే రానియ్యరు. ఒక వేల పోయినా గేటు ముంగటనే ఉండాలె. మొగోళ్లు లేకపోతే ఆడోళ్లు తలుపులు గూడా తియ్యరు. అయి నాగానీ ఎట్లపోతవు. హరిబాబు ఇల్లు యాడున్నదో నాకే తెల్వదు. నన్ను వారాని కొకనాడు లేకపోతే సామాన్లు అయిపోయి న్నాడు కారులో ఊర్లెకు తీసుకపోతడు. ఇద్దరం సూపర్‌మార్కెట్లకు పోతం. కావల సిన వస్తువులు కొనుక్కుంటం. డబ్బులు హరిబాబే ఇచ్చి జీతంల పట్టుకుంటడు. అప్పుడే నేను గడ్డం, కటింగ్ చేసుకుంట" చెప్పాడు.

దేవరాజు మౌనంగా ఉండిపోయాడు. అప్పటికే పూర్తిగా తెల్లవారిపోయింది. కన కయ్య లేచి వంట పనిలో మునిగిపో యాడు. ఎండరాకముందే వంట, తినుడు పూర్తి చేసుకోవాలి. వస్తువులన్నింటిని సర్ది సంచిలో మూటగట్టి ట్యాంక్ పని మొదలె ట్టాలి. దేవరాజు రాకముందైతే ఎప్పుడో కానీ వంట చేసేవాడుకాదు. రొట్టెలు, కర్జూ రపు పండ్లు, ఆపిల్ పండ్లు ఇతర రకాల పండ్లు ఎప్పుడూ ఉంటాయి. ఆ తిండి అత డికి అలవాటైపోయింది.

దేవరాజు వచ్చాక అతడికి ఆ తిండి సహించదని తెలిసి ఇటుకలు, సిమెంట్ తెచ్చే ఫోర్‌మెన్‌కు చెప్పి సహాన్ (తినే పల్లెం), స్ధోనా (స్టౌ), బస్సల్ (ఉల్లిగడ్డలు), కుబుస్ (రొట్టెలు) మొదలగు వంట సామాన్లు తెప్పించి వంట చేయడం మొద లెట్టాడు. దేవరాజు లేచి మొహం కడుక్కు న్నాడు. అక్కడక్కడ వారం పదిరోజుల పనే కాబట్టి ఎక్కడా గుడారాలు వేయలేదు. పొద్దున మొదలు రాత్రివరకు ఎండలో ఉండాల్సిందే! ఎండవేడికి కనకయ్య చర్మం నల్లగా మాడిపోయింది.

ఎండవేడికి దేవరాజు చర్మంగూడా పొలు సుల్లా ఊడిపోతోంది. అతడు కంగారుపడు తుంటే అలా ఊడిపోవడం మామూలేనని తనకు మొదట్లో అలానే ఊడిపోయిందని, చర్మపై పగుళ్లు ఏర్పడ్డాయని ధైర్యం చెప్పాడు కనకయ్య. అక్కడ రెండు డ్రమ్ము లనిండా నీళ్లున్నాయి. అవి చాలా చల్లగా ఉన్నాయి. పొద్దంతా ఎంత వేడిగా ఉంటాయో రాత్రి అంత చల్లగా మారిపో తాయి. స్నానం చేయడానికి వీలులేకుండా ఉన్నాయి. పొద్దెక్కి వేడిగా మారితే తప్ప స్నానం చేయరాదు.

అరగంటలో వంట పూర్తి చేశాడు కన కయ్య. మొహం కడుక్కుని స్నానాలు పూర్తి చేశారు. అప్పటికే బారెడు పొద్దుపైకె క్కింది. ఒంటెలు లేచి నిలబడ్డాయి. వాటిని




కాసేవ్యక్తి అప్పటికే లేచి మొహం కడుక్కున్నాడు. పక్కబట్టలు సర్ది సంచిలో వేసి కంచరగాడిదపై వేశాడు. తోలు సంచినిండా నీళ్లు నింపి గాడిదపై వేశాడు. ఆహార పదార్థాలు, రొట్టెలు, పండ్లు ఉన్న సంచి కూడా గాడిదపైనే ఉంది. అలసటగా ఉన్నప్పుడు గాడిదపై ఎక్కి కూర్చుని లేదంటే కాలినడకతో ఒంటెలను వెంబడిస్తాడు అతడు. ఏ దేశం వాడో తెలియదు. కనకయ్యకు అప్పుడప్పుడూ తారసపడుతుంటాడు. హరిబాబుకు అలాంటి ఒంటెల మందలు, గొర్లమందలు పదిహేనువరకు ఉన్నాయి. అవి అదే ఎడారిలో తిరుగుతూ ఉంటాయి. వాటికొరకే అక్కడక్కడా నీటికుండీలను కట్టిస్తున్నాడు.

"సూత్తున్నవా దేవరాజు! ఆ ఒంటెల కాపరి ఏ దేశపోడో తెల్వది. వానిది కుక్క గోస. యాడపొద్దుగూకుతదో యాడ తెల్లారుతదో తెల్వది. గిట్లనే నీళ్లకుండీలున్న జాగల రాత్రి గడుపుతడు. నరమానవుడు కనబడడు. గుడారం యాడనో ఉంటది. మళ్లీ అక్కడికి చేరుకునే సరికి నెల రోజులు పడుతుండవచ్చు. ఇట్ల తిరుక్కుంటనే పొద్దు గడుపాలె. ఎప్పుడన్నా ఒక్కసారి సుక్క తెగిపడ్డట్టు ఇంకో మంద కలిస్తే మనిషి కనవడుతడు. ఇద్దరు ఒక్క దేశపోల్లయితే మాట ముచ్చట మాట్లాడుకుంటరు. లేకుంటే మొహాలు చూసుకునుడే" చెప్పాడు కనకయ్య ఇసుకపై చాప పరుస్తూ.

"ఏం బతుకో కనకన్నా. ఎండాకాలం కోతల మీద నాలుగు రోజులు ఎండల పోతెనే యాష్టకస్తది. యాడాదులకొద్దీ ఎండలనే ఉండుడంటే ఎంతకష్టం. అక్కడ ఏజంట్ గాళ్లు అరచేతుల వైకుంటం చూపెట్టిరి. ఇక్కడి కచ్చినంక నరకం కనవడవట్టె. నమ్మి నానవొత్తె పుచ్చి బుర్రలాయెనన్నట్టు నమ్మివస్తే ఇంత పనిగావట్టె" చాపలో కూర్చుంటూ అన్నాడు దేవరాజు.

కనకయ్య అన్నాన్ని పళ్లాల్లో సర్ది కూరవేశాడు. అతడు చూపిస్తున్న ఆప్యాయతకు దేవరాజు ఆశ్చర్యపోయాడు. దూరమెక్కువైతే అనురాగాలు పెరుగుతాయన్న విషయం గుర్తుకొచ్చింది. అక్కడ పగున్నవారు కూడా ఇక్కడ ప్రాణ స్నేహితులుగా మారిపోతారు.

"ఇదో విషవలయం దేవరాజు. ఇక్కడికి వచ్చినోళ్లుమల్లరావద్దంటరు. అక్కడున్నోళ్లు ఇక్కడికి రావాలనుకుంటారు. పుట్టెడు చాకిరీ చేసివస్తిమి. ఏదో పొద్దు గడుపుకుని పోవాలె. అందరిదీ మనలెక్కకాదు. కొందరికి నీడకుండే పని దొరుకుతది. వాళ్ల పని నయం. జీతంగూడా మంచిగుంటది" భోజనం చేస్తూ అన్నాడు కనకయ్య.

"కిస్మత్‌గావాలె. కిస్మత్ మంచిగుంటే మంచి పనిదొరుకుతది. రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పదన్నట్టు ఇంత దూరం వచ్చినా మళ్లా గదే ఎత్తుకునుడు మొత్తుకునుడేనాయె. ఎవరో అదృష్టవంతులు నూటికొక్కలకు ఇక్కడికి వచ్చినంక అనుకున్నట్టు జరుగుతది" బాధగా అన్నాడు దేవరాజు.

అప్పటికే గాడిదనెక్కి ఒంటెల వెంట వెళ్తున్నాడు వాటి కాపరి. పాతికేళ్లవరకూ ఉంటాయి. మనిషి బక్కపలుచగా ఉంటాడు. కొత్తగా వచ్చినట్టున్నాడు. మొహం నిండా దిగులు కమ్ముకుంది. అతడిని భోజనానికి పిలుద్దామనుకున్నాడు. సరుకులు నిండుకోవడంతో ఇద్దరికి సరిపడా మాత్రమే వంట చేశాడు. ఎప్పుడు వంటచేసినా ఒక్క పూట మందమే చేయాలి. లేదంటే వేడికి ఆహారం చెడిపోతుంది.

"ఆయన వంట యాడజేసుకుంటడు" అడిగాడు దేవరాజు.

"వంటా పాడా! రొట్టెలో, పండ్లో తిని పొద్దు గడుపుకుంటడు. మళ్లీ జోపుడా (గుడారం)కు పోయినంకనే వంట జేసుకునుడు. సామాన్లన్ని అక్కడనే ఉంటయి" చెప్పాడు కనకయ్య.

అప్పటికే ఎండ బాగా ముదిరిపోయింది. ఇసుక చుర్రుమంటోంది. చల్లని నీళ్లు వేడిగా మారిపోయాయి. భోజనం ముగించి పాత్రలన్నీ సర్దారు. కొద్దిసేపట్లోనే పనిలో మునిగిపోయారు.

దేవరాజు రాకముందు కనకయ్య ఒక్కడే కాబట్టి పని తొందరగా పూర్తయ్యేది కాదు. ఇద్దరు అసిస్టెంటులు ఉన్నప్పుడు వేరు సంగతి. ఇప్పుడు దేవరాజు వచ్చాక ఎంతో ఆసరాగా ఉంది. ఇటుకలు అందిస్తున్నాడు. సిమెంటు కలుపుతున్నాడు. గమాలల్లో సిమెంటును కలిపి అందిస్తున్నాడు. కూర్చుందామంటే నీడలేదు కాబట్టి పని మొదలుపెట్టాక ఆగడమంటూ ఉండదు. మధ్యాహ్నంపూట ఒకటి రెండు గంటలు రెస్టుతీసుకోవడానికి ప్రతీ నీళ్ళకుండీ కట్టే చోట చిన్న గుడారం ఏర్పాటు చేయాలని హరిబాబును కోరాడు కనకయ్య.

అప్పటికప్పుడు తలూపినా గుడారం ఉంటే పనిచేయరని, నీడకు అందులోనే పడుకుంటారని, ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు హరిబాబు. కనకయ్యకు కూడా ఆ విషయం తెలుసు. మొదట కొన్ని రోజులు అడిగినా మౌనంగా ఉండిపోయాడు ఆ తర్వాత. ఎడారుల్లో ఎక్కడ నీళ్ళ కుండీ కట్టాలన్నా హరిబాబే కాంట్రాక్టు తీసుకుంటాడు కాబట్టి ఇండియానుండి వచ్చింది మొదలు అక్కడికి వెళ్ళేవరకు ఎడారిలోనే గడపడం.

దేవరాజుకు లోలోపల ఆందోళనగా ఉంది. కనకయ్య అక్కడే ఉండుమని చెప్పినా వినకుండా వెళ్ళిపోయేవాడే! సిటీకి చేరుకున్నాక పోలీసులకో మున్సిపాలిటీవాళ్ళకో చిక్కి ఇండియా వెళ్లిపోవాలనుకున్నాడు. బయలుదేరేముందు అక్కడినుండి బయటపడితే చాలనుకున్నాడు. కనకయ్య మాటలు విన్నాక ఇండియా వెళ్ళి ఏం చేయాలన్న ఆలోచన వచ్చింది. వెళ్తే తల్లి బెంగటిల్లుతుంది. భార్య సంసార భారాన్ని మోయలేక సతమతమౌతుంది. అప్పుల వాళ్ళు చుట్టుముట్టి వేధిస్తారు. అప్పు తీరే మార్గంలేదు. అందుకే చావైనా బతుకైనా అక్కడే తేల్చుకోవాలనుకున్నాడు.

అన్యమనస్కంగా ఉన్న దేవరాజును ఓదార్చి ధైర్యం చెప్పాడు కనకయ్య. తను పనిచేసే హరిబాబు చాలామంచివాడని, ఏదైనా పని చూపిస్తాడని, లేదంటే అక్కడే తన చేతికింద ఉంచుతాడని చెప్పాడు. అతడికి ఎన్నో ఫ్యాక్టరీలున్నాయని అందులో పని ఇప్పించి లేబర్ కార్డ్ ఇచ్చే ఏర్పాటు చేస్తాడని చెప్పాడు.

దేవరాజు నిజమేనని నమ్మాడు. తను ఒంటరిగా ఉన్నానని, దేవరాజు ఉంటే పనిలో సహాయంచేస్తాడని, తన అసిస్టెంటులు వచ్చేవరకు అతడిని అలాగే మభ్యపెట్టి తర్వాత పని దొరకదని పంపించాలని ఆలోచనతో కనకయ్య ఉన్నాడని తెలియదు దేవరాజుకు. అందుకే అతడి మాటలు నిజమేనని నమ్మి హరిబాబుకొరకు ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

అలా వారం రోజులు గడిచాయి. రోజూ పొద్దున సాయంత్రం జీపులు వస్తూనే ఉన్నాయి. ఫోర్‌మెన్, హరిబాబు వస్తూనే ఉన్నారు. సిమెంట్, నీరు, కాంక్రీటు, సిమెంట్ ఇటుకలు వస్తూనే ఉన్నాయి. పని నడుస్తూనే ఉంది. వారికి అరబ్బీలో ఏదో చెబుతూనే ఉన్నాడు కనకయ్య. వచ్చినప్పుడల్లా వారివైపు ఆశగా చూస్తూ వీరెవరని అడుగుతున్నాడు. హరిబాబు వచ్చినా ఫోర్‌మెన్ అనో మరెవరో అనో చెబుతున్నాడు.

ఒకరోజు కనకయ్యకు ఇంటినుండి ఉత్తరం వచ్చింది. కవరుమీద 'అబ్దుల్లా' అనే పేరుంది. అక్కడికి వచ్చినవారు కూడా అదే పేరుతోనే సంబోధిస్తున్నారు. తను ఇంటికి ఉత్తరం రాయక చాలా రోజులయిం





దని, ఒక ఉత్తరం ఇస్తే రాస్తానని చెప్పాడు. కనకయ్య సరే అన్నాడు. కానీ ఎవరితో ఉత్తరం తెమ్మని చెప్పలేదు. అలా రెండురోజులు గడిచాయి. పొద్దున తినడం పూర్తి కాగానే పనిలో మునిగిపోవడం, ఒక్కొక్క నాడు వెన్నెలగా ఉంటే రాత్రివరకూ పనిచేయడం. అలా రాత్రి, పగలు ఎందుకు కష్ట పడుతున్నాడో అర్థంకాలేదు దేవరాజుకు.

"అదేంటి కనకన్నా... నువ్వే గుత్తదారు లెక్క జెయ్యవడితివి. వీటిని గుత్తపట్టు కున్నవా లేక రోజు కూలీ చేస్తున్నవా...? టైం అనేది లేకుండా, రెస్టు లేకుండా చేస్తున్నవు" అడిగాడు దేవరాజు ఆశ్చర్యంగా.

"ఉప్పు తిన్నప్పుడు ఇమరాసముండాలె తమ్మి! ఇమానం లేని పీనుగు మోసినోన్ని పట్టిందట అన్నట్టు మనకింత అన్నం పెడు తున్నప్పుడు ఎందుకు పని జెయ్యద్దు. ఈ అరబ్బీవాల్లు కడ్డులుంటరు. గమ్మడికాయలు పోయేప్పుడు గుర్తుపట్టరు. ఆవగింజలకాడనే అరికెలు పడుతరు. ఒక్కొక్క జాగల వందల వందల మంది కూలీలుంటారు. వాళ్ళు పొద్దంతా కూసున్నా ఏమనరు. మనం ఒక్క గడియ వట్టిగుంటే అగో ఇయ్యాల్ల ఏం పనిగాలేదు? అని నిలదీస్తడు" చెప్పాడు కనకయ్య.

ఆరోజు ఒక గొర్లకాపరి వచ్చాడు అక్కడికి. ఇండియావాడే కాని ఏ రాష్ట్రంవాడో తెలియదు. రాత్రి అక్కడే పడుకున్నాడు. దేవరాజుకిప్పుడు మరో బెంగపట్టుకుంది. తను వచ్చి ఇన్ని రోజులైనా ఇంటికి ఎలాంటి సమాచారంలేదు. తల్లి, భార్య, పిల్లలు ఎలా ఉన్నారో తెలియదు. తన క్షేమాన్ని తెలుపుతూ ముందుగా ఇంటికి ఉత్తరం రాయాలి. తననుండి ఎలాంటి ఉత్తరంలేక వారు ఎంతగా తల్లడిల్లుతున్నారో!

కనుకయ్యను అడిగితే ఉత్తరం ఇవ్వడం లేదు. గొర్లకాపరివద్ద వెదకాలనుకున్నాడు.

అర్ధరాత్రిదాటాక కంచరిగాడిద పక్కనే ఉన్న అతడి సామాన్ల సంచిని వెదికాడు. అందులోనుండి కొంత సామాను, ఆ తర్వాత ఇండియానుండి వచ్చిన ఉత్తరాలు బయటపడ్డాయి. వాటిని చూసి ఆశ్చర్యపోయాడు దేవరాజు. వెన్నెల వెలుతురులో తెలుగు అక్షరాలు దర్శనమిచ్చాయి. అతడికి ఆనందం వేసింది. వచ్చినవ్యక్తి తెలుగు వాడేనని గుర్తించాడు. కవరుమీద పేరును చూసి ఆలస్యం చేయకుండా అతడిని నిద్ర లేపాడు. కనకయ్య దూరంగా ఉండడంచేత వీరి మాటలు వినిపించడంలేదు.

అర్ధరాత్రి తన పేరును పెట్టి పిలిచిన దేవరాజువైపు ఆశ్చర్యంగా చూశాడు అతడు. తన కథను నాలుగు మాటల్లో చెప్పుకుని హరిబాబు కొరకు ఎదురుచూస్తున్నట్టు చెప్పాడు దేవరాజు.

హరిబాబు ఆనవాళ్ళు చెప్పి, ప్రతీరోజు జీపులో వస్తున్నాడని చెప్పాడతడు. దేవరాజు తెల్లమొహంవేశాడు. కనకయ్య గురించి చెప్పి అతడు హరిబాబు రావడంలేదని చెబుతున్నాడని చెప్పాడు.

"దేవరాజూ! నిన్ను ఇతడు మోసంచేస్తున్నాడు. ఇంతకుముందు ఇతడి చేతికింద ఇద్దరు అసిస్టెంట్లు ఉండేవారు. వారు తమ దేశం వెళ్ళిపోయారు. అబ్దుల్లా హరిబాబు వద్ద నీటిటాంకులను గుత్తకు తీసుకుంటాడు. రాత్రి, పగలు కష్టపడి వాటిని తొందరగా పూర్తిచేసి బిల్ తీసుకుంటాడు. ఎంత తొందరగా వర్క్ పూర్తిచేస్తే అబ్దుల్లాకు అంతనయం.

నిన్ను నమ్మించి పని ఎల్లదీసుకుంటున్నాడు. నువ్వు సహాయం చేయడంవలన అతడి పని తొందరగా పూర్తయి ఎక్కువ లాభం వస్తుంది. నేడో రేపో ఈ టాంక్ పూర్తికాగానే మరో చోట మరో టాంక్ పని. నువ్వు ఎన్నిరోజులున్నా పొట్టకు తుట్టిలేకుండా బతుకుతవు తప్ప జీతమంటూ

ఉండదు" వివరంగా చెప్పాడతడు.

దేవరాజుకు తలతిరిగిపోయింది. ఎంతటి నమ్మకద్రోహం అనుకున్నాడు. అప్పటిక ప్పుడు ఇనుపరాడ్‌లతో వాటర్‌ట్యాంక్‌ను కూలగొట్టాలన్నంత కోపం వచ్చింది. ఆ వెంటనే దుఃఖం కూడా వచ్చింది. గద్గదస్వ రంతో అన్నాడు అతనితో.

."ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మద్దో తెలియడంలేదు. దేశంగాని దేశం వచ్చి ఆగమై తిరుగుతున్న. పీరీలు బిచ్చమెత్తంగ మొల్లోడు బెల్లమడిగిండట. నేనే పొక్కగాని పాములెక్క తిరుగుతున్ననంటే వీడుగూడా నన్ను మోసంజెయ్యాల్నా! ఉన్నదున్నట్టు చెప్తే నా బుద్ధి ఉంటే ఉండుంటి లేకుంటే లేదు"

"వీడు పెద్ద సైబర్‌గాడు. చేతికింది మనుషులతో రోజూలొల్లిపెట్టుకుంటుండే. ఒకవేల జీతమిత్తనన్నా ఇక్కడుండకు. ఇటు సక్కగ పో! ఇరువై ముప్పై కిలోమీటర్లు నడిస్తే సలాల్ అనే ఊరు వత్తది. అక్కడ వాతావరణం వేరుగా ఉంటది. కూరగా యలు కూడా పండిస్తరు. దానికి దగ్గరలోనే పెట్రోల్ బాయిలుంటయి. అక్కడ ఏదన్న పని దొరుకుతది.

పెద్దపెద్ద కంపెనీలు గూడా ఉన్నయి. తెల్లవారితే శుక్రవారం కాబట్టి అందరికీ సెలవు ఉంటుంది. నువ్వు తెల్లవారేవరకు అక్కడికి చేరుకుంటే అందరూ కలుస్తారు. అక్కడ తెలుగువాళ్ళు కూడా ఎక్కువగానే ఉన్నారు" చెప్పాడతడు దేవరాజువైపు జాలిగా చూస్తూ.

కొండంత ఆశతో ఏదో పని దొరుకుతుం దని అనుకున్న దేవరాజుకు నిరాశే ఎదుర యింది. కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. దేవరాజు ఏడుస్తున్నాడని గ్రహించి ఓదార్చాడతడు. "అబ్దుల్లా నిద్రలేవకముందే ఇక్కడినుండి వెళ్ళిపో. లేస్తే ఏదో గొడవచేస్తాడు. రేపు హరిబాబుకు చెప్పి లేబర్ ఆఫీసర్స్‌కి వప్ప జెప్పుతారు. అసలే రంజాన్ నెల ఇది. ఆఫీ సర్లు చాలా ఫిక్స్ చేస్తరు. ఎవరి కంటా పడకుండా ఉన్నన్నినాల్లే నువ్వు ఇక్కడ ఉండుడు. ఎవరు చెక్‌చేసినా అకామా చూపించుమంటరు"

కొద్దిసేపు అతడితో మాట్లాడి లేచాడు దేవరాజు. టవల్‌ను నెత్తికి చుట్టి రగ్గును నిండుగా కప్పుకుని అతడికి చెప్పి కనయ్యావ ద్దకు వచ్చాడు. కనకయ్య గాఢనిద్రతో గుర్రుపెడుతున్నాడు. రొట్టెలు, పండ్లు, నీటి తోలు సంచిని భుజాన వేసుకుని బయల్దే రాడు. చెప్పులకొరకు వెదికితే దొరకలేదు. కనకయ్యకు మెలకువ వస్తుందేమోనన్న భయంతో చెప్పులు లేకుండగానే బయలుదే రాడు.

అనంతమైన ఇసుకరాసుల్ని, ఎడారి మొక్కల్ని, పాముల్ని, ఎడారి ఎలుకల్ని దాటుకుంటూ వెళ్తున్నాడు. కొంత తడవు గడిచాక చంద్రుడు అస్తమించాడు. కారు చీకట్లు ముసురుకున్నాయి. వణుకుపుట్టించే చలి. అడుగు ముందు ఏముందో తెలి యదు. ముళ్ళ మొక్కలపై అడుగుపడి కాళ్ళు గీరుకుపోతున్నాయి. పక్కనే బుస్ బుస్ మన్న ధ్వనులు, ఇసుకలో జంతు వులు కదులుతున్న సవ్వడి వినిపిస్తోంది. అప్పుడప్పుడు ఏవో జంతువులు కాళ్ళకింద పడి మెత్తగా తగులుతున్నాయి.

దేవరాజుకు భయంవేయడంలేదు. మొండిధైర్యం వచ్చేసింది. చచ్చినా, బతికినా ఫరవాలేదు అనుకుని నడుస్తున్నాడు. అప్పు డప్పుడు వింత శబ్దాలకు ఒళ్ళు గగుర్పొడు స్తోంది. తెల్లవారే వరకూ నడుస్తూనే ఉన్నాడు దేవరాజు. అనంతమైన ఎడారి ప్రయాణం తరగడంలేదు. మళ్ళీ దారిత ప్పానా అనిపించింది. ఈ ఆలోచనరాగానే కాళ్లలో నిస్సత్తువ చోటుచేసుకుంది. సంచిలో నీరును వంచుకుని తాగి కొద్దిసేపు కూర్చున్నాడు. అప్పటికే పూర్తిగా తెల్లవారి తూర్పు ఎరుపెక్కింది.




పొద్దుపొడుస్తుందంటే భయం. రగ్గును తీసి దూరంగా విసిరికొట్టాడు. తలకు చుట్టుకున్న టవల్ కూడా విప్పేసాడు. మరోసారి మొండి ధైర్యాన్ని కూడగట్టుకుని ముందుకు నడిచాడు. నిమిషాలు గడుస్తున్నకొద్దీ సూర్యుడుపైకెక్కుతున్నాడు. ఎండ వేడెక్కుతోంది. కాళ్ళకింద ఇసుక వేడెక్కుతోంది. ముళ్ళు గీరుకుపోయి రక్తం స్రవిస్తున్నకాళ్ళు సుర్రుమంటూ బొబ్బలెక్కుతున్నాయి. అరికాలి మంట నెత్తికెక్కుతోంది. షర్ట్‌ను విప్పి రెండుగా చీల్చి కాళ్ళకు కట్టుకుని నడవడం మొదలెట్టాడు దేవరాజు.

ఇసుక వేడి తగలకపోయినా ఆయాసం, నొప్పి బాగానే ఉంది. అయినా తమాయించుకుని నడుస్తున్నాడు. నిలువెల్లా చెమట కమ్మింది. తోలు సంచీలో నీళ్ళు పూర్తయిపోయాయి. ఎండ మరింత తీవ్రమైంది. తాను ఎలాగూ బతకనన్న మొండిధైర్యంతో అడుగేస్తున్నాడు దేవరాజు. కాళ్లల్లో సత్తువ క్షీణించి అడుగుతీసి అడుగువేయాలంటే కష్టంగా ఉంది.

సూర్యుడు నడినెత్తిపైకి వచ్చాడు. దాహంతో నాలుక పిడుచగట్టుకుపోయింది. కాళ్ళకు కట్టిన గుడ్డలో ఇసుక చిక్కి నొప్పిగా ఉంది. దేవరాజు పూర్తిగా ఆశ వదులుకున్నాడు. ఏ గ్రామం తనకు కనిపించదనుకున్న తరుణంలో దూరంగా ఎత్తైన బిల్డింగ్‌లు కనిపించాయి. అతడిలో ఆశ మొదలయింది. పోయిన ప్రాణం లేచివచ్చినట్టయింది. శక్తినంతా కూడదీసుకుని సంతోషంగా పరుగును అందుకున్నాడు.

మొదటగా కనిపించిందొక హాస్పిటల్. సరాసరి లోపలికి వెళ్లాడు దేవరాజు. అతడి వింత రూపానికి విస్తుపోయారు అక్కడివారందరు. అతడిని మొదటగా పలకరించింది ఒక తెలుగు డాక్టర్ కావడం దేవరాజు అదృష్టం. తన కథనంతా విప్పి చెప్పుకుని ఏడ్చాడు దేవరాజు. అందులో పనిచేస్తున్న మరో నలుగురు ఇండియన్ డాక్టర్స్ అతడి పరిస్థితికి జాలిపడ్డారు. కాలిన గాయాలకు ట్రీట్‌మెంట్ చేశారు. తనకు పని చూపించుమని కాళ్ళు పట్టుకున్నాడు దేవరాజు.

దేవరాజుకు మంచి బట్టలు ఇచ్చి భోజనం పెట్టించారు. ఇక్కడే నిరుద్యోగ సమస్య మొదలయిందని, తామే నిలదొక్కుకోవడం లేదని హితవు చెప్పి వారం రోజుల్లో దేవరాజును ఇండియా పంపే ఏర్పాటు చేశారు. డాక్టర్లందరూ కూడబలుక్కుని ఇండియాలో ఉండే తమ ఎన్.ఆర్.ఐ. ఎకౌంట్‌లమీద చెక్కు రాయాలనుకున్నారు దేవరాజుకు. వారిలోవారు చర్చించుకుని దేవరాజుపై జాలిచూపి హైదరాబాద్‌లో ఉండే డాక్టర్ ఎకౌంటులోంచి లక్ష రూపాయలకు చెక్కు రాసి అందజేశారు.

వారందరికీ పేరుపేరునా నమస్కరించి అక్కడినుండి బయలుదేరాడు దేవరాజు. ఎయిర్‌పోర్ట్ వరకూ హాస్పిటల్ కారులో వచ్చాడు. జీవితం ఊహించని మలుపు తిరిగి, అర్ధాంతరంగా ఇంటికి వెళ్తున్నందుకు బాధగా ఉన్నా చివరికి డాక్టర్లు తనని ఆదుకోవడం ఆనందంగా ఉంది. బతుకుదెరువు కొరకు వచ్చిన తనని మరణపు చివరి అంచుల వరకు నెట్టి, మళ్ళీ పునర్జన్మనిచ్చిన ఎడారి తల్లివైపు తడిసిన కన్నీటితో చూస్తూ విమానం ఎక్కాడు దేవరాజు.

అతడి ఆశలకు రెక్కలు వచ్చినట్టే ఆకాశంలోకి ఎగిరింది విమానం. ☆

## అంకితం

పొట్టచేతబట్టుకుని గల్ఫ్ తీరాలవైపు
పయనించే అన్నలకి, తమ్ముళ్లకి,
అక్కలకి, చెల్లెళ్లకి, అక్కడి
జీవితాన్ని కళ్ళకు కట్టినట్టు
వివరించిన తమ్ముడు
మారుతికి.

# చతుర ప్రపంచం

## అంతర్జాతీయ హోటళ్ళు

హోటల్ లేని దేశమంటూ ఉండదు. ప్రతీ దేశంలో ఆ దేశం ఫుడ్ ఐటమ్స్ తో హోటల్లో రెస్టారెంట్లూ ఉంటూవుంటాయి.

కానీ చిత్రంగా అమెరికాలోని కొన్ని రెస్టారెంట్స్ సంస్థలు విదేశాల్లో కూడా తెరిచి విజయవంతంగా నడుపుతున్నాయి. అమెరికాలో చెయిన్ ఆఫ్ రెస్టారెంట్స్ హోటల్స్ పద్ధతి... ఒకే మేనేజ్‌మెంట్ ఆధ్వర్యంలో, ఒకే పేరు గలవి దేశం అంతటా తెరిచి నడపడం మొదలయి 40 ఏళ్లు దాటుతోంది.

వీటిలో ప్రసిద్ధి చెందినవి మెక్ డొనాల్డ్, బర్గర్‌కింగ్, పిజ్జాహట్, కె.ఎఫ్.సి(కెంటకీ ఫ్రయిడ్ చికెన్)లు. బాటా షాపుల్లా ఒకే రకం డెకరేషన్‌తో, ఒకే రకం యూనిఫామ్‌తో, దేశం అంతటా ఒకేరకం రుచితో, ఒకే రకం పదార్థాలని సర్వ్ చేసే ఈ పద్ధతికి నాంది పల్కింది మెక్‌డొనాల్డ్. అందులో దొరికే మెనూ కూడా లిమిటెడే. మొత్తం 9 రకాల ఆహార పదార్థాలు మాత్రమే మెక్‌డొనాల్డ్‌లో సర్వ్ చేస్తారు. వాటిలో టిఫిన్ వెరయిటీలు ఎక్కువ. బర్గర్ కింగ్‌లో, పిజ్జాహట్‌లో, కె.ఎఫ్.సి లో భోజన పదార్థాలు ఉంటాయి.

ఈ చెయిన్‌కి చెందిన హోటళ్లని తెరిచేందుకు ఓ పద్ధతిని అనుసరిస్తారంతా. ఇంకా తమ పేరుతో హోటల్ లేని ప్రాంతంలో ఓ హోటల్‌ని తెరవడానికి ప్రయివేట్ వ్యాపారస్థులు ఆ సంస్థని కలుస్తారు ఫ్రాంఛైజ్ తీసుకోవడానికి. ఓ ఏడాదికి ఆ కొత్త హోటల్ లో ఎంత వ్యాపారం జరగవచ్చో లెక్క గట్టి వచ్చే లాభం నిర్ణయించి అందులో కొంత వాటాని చెల్లిస్తే ఈ సంస్థ ఆ వ్యాపారస్థుడికి ఫ్రాంఛైజ్ ఇస్తుంది. అప్పుడు ఆ వ్యాపారస్థుడు ఆ సంస్థ నిబంధనల ప్రకారం అదేరకం డెకరేషన్‌తో, మెనూతో హోటల్‌ని తెరుస్తాడు. ఆ సంస్థ తాలుకు ఓ హోటల్‌లో మేనేజర్ హోదాను కనీసం ఓ ఏడాది పనిచేసి అనుభవం గడించిన వ్యక్తే ఈ కొత్త హోటల్‌లో కూడా మేనేజర్‌గా ఉండాలన్నది ప్రాధమిక నిబంధన. ఇందువల్ల ఆ సంస్థ క్వాలిటీని, గుడ్‌విల్‌ని కాపాడుకోవచ్చన్నది దీని వెనుక కారణం.




ఆ హోటల్ నడిపినంత కాలం ఏటా లైసెన్స్ ఫీజ్‌ని ఆ సంస్థకి చెల్లిస్తూండాలి. ఈ విధంగా మెక్‌డొనాల్డ్ రెస్టరెంట్లు మొదట యూరోపియన్ దేశాల్లో, తర్వాత సౌత్ ఈస్ట్ ఏషియా దేశాల్లో చైనాలో, ఆఖరికి మాస్కోలో కూడా తెరవబడ్డాయి.

ప్రపంచంలోని అతి పెద్ద మెక్‌డొనాల్డ్ హోటల్ మాస్కోలో ఉంది. ఇండియాలో ఢిల్లీ, బెంగుళూర్, బాంబే, పూనాల్లో కూడా తెరిచారు.

ఇదే విధంగా బర్గర్‌కింగ్ కార్పొరేషన్ హోటళ్లు ప్రపంచం మొత్తం మీద 56 దేశాల్లో 9500 ఉన్నాయి.




# బ్రాడ్‌వే లో ఆఖరిరోజు...

న్యూయార్క్ లో ప్రదర్శించే బ్రాడ్‌వే నాటకాలు సుప్రసిద్ధం. సినిమాలకన్నా అధికంగా ప్రేక్షకులు వాటిని అక్కడ ఆదరిస్తుంటారు. ఉదాహరణకి 'సౌత్‌పసిఫిక్' అనే నాటకం 1949 ఏప్రిల్ 7 న ఆరంభం అయి 5 ఏళ్ల పాటు నడిచింది. ఆఖరి ప్రదర్శనానంతరం కర్టెన్‌ని మూయడానికి ప్రొడ్యూసర్, నటీనటులకి కళ్లమ్మట నీళ్లు వచ్చాయి. వాళ్లు ఈ అయిదేళ్లుగా ఆ నాటకంతో ఎటాచ్ అయి ఉండడంతో తెర పడటం వాళ్లు భరించలేకపోయారు. దాంతో ఆ స్టేజీమీద నటీనటులకి షాంపేన్ బాటిల్స్ ఓపెన్ చేసి పార్టీ ఇచ్చాడు ప్రొడ్యూసర్.

బాగా హిట్టయిన ఏ నాటకానికయినా ఆఖరి ప్రదర్శన తర్వాత ఆ స్టేజి మీద పార్టీ జరుపుకోవడం బ్రాడ్‌వే లో ఆనవాయితీ.

బ్రాడ్‌వే నుంచి హాలీవుడ్‌కి ఎంతోమంది నటీనటులు వచ్చారు. గ్రోచోమార్క్స్, ఆర్సన్‌వెల్స్, పాల్ న్యూమాన్, డస్టిన్ హాఫ్‌మాన్ మొదలయిన వార్కి బ్రాడ్‌వే అనుభవంతో సినిమాల్లో అవకాశాలిచ్చారు.

కొన్నిసార్లు ఆఖరి ప్రదర్శనలోని ఆఖరిసీన్స్ స్క్రిప్ట్‌లో ఉన్నట్లు జరగవు. 'సింగ్‌అవుట్ ది న్యూస్' అనే నాటకంలో చివర్లో హీరో, హీరోయిన్లు సూట్‌కేసులతో స్టేజీమీంచి బయటకి వెళ్లడంతో నాటకం ముగుస్తుంది. ఆఖరి ప్రదర్శన లో వాళ్లు ఎంత ప్రయత్నించినా సూట్‌కేసులని లేపలేకపోయారు. వాటిని నేలకి స్క్రూలతో బిగించాడా దర్శకుడు.

మరో నాటకంలో సూట్‌కేసులని ఓ ముసలి నటి లేపలేకపోయింది. రాళ్లతో నింపాడా దర్శకుడు దాన్ని. 'ఎరౌండ్ ది వరల్డ్' అనే చిత్రం చివర్లో బార్‌లోని వెయిటర్‌ని తుపాకీతో కాల్చి చంపాలి హీరో ఆఖరి ప్రదర్శనలో ఎన్ని సార్లు తుపాకి పేల్చినా బార్ ఎటెండర్ చావకపోగా నవ్వుతూనే కాలు వూపసాగాడు. దాంతో ఆ నటుడు ఆర్సన్‌వెల్స్ వాడి మీదికి కొట్టడానికి వెడితే వాడు ప్రేక్షకుల్లోకి పారిపోతే వెల్స్ కూడా అతని వెంటపడి చివర్లో 'నేను చచ్చాను' అనేదాకా దెబ్బలు ఆపలేదు.

మూడు గంటల డ్రామాని నటీనటులు మూడునాలుగేళ్లపాటు రోజూ కలిసి నటించడంతో ఆఖరి ప్రదర్శన సమయంలో ఆ ప్రదర్శనానంతరం విడిపోతున్నందుకు ఎంతో దుఃఖంతో ఉంటారు. అందుకే అందులోని ఏడుపు దృశ్యాల్లో వారు అద్భుతంగా నటిస్తారు.

అయితే అన్నీ హిట్స్ ఉండవుకదా! ఏ బ్రాడ్‌వే ప్లేలో నటించే నటీనటులయినా మొదటివారం ఎంతో టెన్స్‌గా ఉంటారు. అది హిట్టవుతుందా లేదానని. ఫ్లాప్ అని తెలీగానే ఆఖరి ప్రదర్శనానంతరం వాళ్లు నిశ్శబ్దంగా మేకప్ రూంలోంచి వీలయినంత త్వరగా బయటకి జారుకుంటారు.




ఆఖరి ప్రదర్శనానంతరం మొమెంటోలని కోరతారు నటీనటులు. వాళ్లు వాడిన విగ్గులు, నృత్యానికి ఉపయోగించిన బూట్లు లాంటివి. హీరోయిన్లు తాము వాడిన కాస్ట్యూమ్స్ మీద సాధారణంగా మోజు పడతారు. హీరోలు ఆ థియేటర్ బయట ఉంచిన పోస్టర్లు తీసుకెడతారు.

# అమెరికాలో శ్టాటిస్టిక్స్

అమెరికన్స్‌కి శ్టాటిస్టిక్స్ అంటే మహా ఇష్టం. ఆకాశం కింది ఏ అంశమయినా దానిమీద ఎంతో ఉత్సాహంగా సర్వేలు చేస్తారు. జనజీవనంలోని అతి మామూలు విషయాలపై కూడా అక్కడ సర్వేలు జరిగాయి. వాటిలో కొన్ని ఆశ్చర్యకరంగా ఉంటే మరికొన్ని నవ్వు పుట్టించేవిగా ఉంటాయి.

అమెరికన్స్‌లో 52 శాతం మంది యొక్క జీవనపరమావధి ఒకటే. అది ధనవంతులవడం. ఇది ఒక సర్వేలో తేలిన విషయం.




1974 లో జరిగిన ఓ సర్వేలో 44 శాతం మంది అమెరికన్స్ తమని ఎవరో వెంటాడుతున్నారని భావించారుట. 1984 లో ఇదే విషయం మీద మళ్లీ సర్వే చేస్తే ఈ శాతం 67 కి పెరిగింది.

ప్రజల్లో 39 శాతం మంది థియేటర్లకి వెళ్లి సినిమాలు చూడరని, 45 శాతం మంది నవలలు చదవరని ఓ సర్వేలో తేలింది.

అక్కడ సాంకేతిక విజ్ఞానం రోజురోజుకీ అభివృద్ధి చెంది మనిషిని ప్రకృతికి దూరం చేసి చివరికి వినాశనానికి దారి తీస్తుందని 74 శాతం మంది నమ్ముతున్నారని వెల్లడయింది.

పిల్లల పెంపకం సర్వే విషయానికొస్తే 83 శాతం మంది అమెరికన్లు తమ పిల్లల్ని బాగా కొడతారని ఒప్పుకున్నారు. టీ.వీ ప్రోగ్రాముల్ని తిలకించే పిల్లలపై సర్వే చేస్తే వారికి 16 వ ఏడు వచ్చేసరికి సుమారు 18000 హత్యలని టీ.వీ లో చూస్తారని తెలుస్తోంది. ప్రతి ముగ్గురిలో ఒకరు ఆల్కహోల్ ముట్టరు.

స్వర్గం, నరకం మొదలైనవి ఉన్నాయని నమ్మేవారు 77 శాతంమంది ఉన్నారు. అందులో 5 శాతం మంది స్వర్గంలో విసుగ్గా ఉంటుందని కూడా నమ్మి చెబుతూ ఉంటారు. అమెరికన్లలో 58 శాతం మంది తమ ఇళ్లదగ్గర నీగ్రోలు నివశించకూడదని ఆశ పడుతూంటారు. 27 శాతం మంది అమెరికన్లు నీగ్రోలు తెల్లవాళ్లని వివాహం చేసుకోకూడదని అభిప్రాయపడుతూంటారు.

అమెరికన్ మహిళల్లో 37 శాతం మందికి తాము అందగత్తెలమన్న గర్వం ఉంది.

అమెరికన్ విద్యార్థి వారానికి సగటున 38 గంటలు స్కూల్లో గడుపుతాడు. కోటీఇరవై లక్షల మంది అమెరికన్లకి తమ దేశ రాజధాని వాషింగ్‌టన్ డి.సి అని తెలియదు.

ప్రతి ముగ్గురిలో ఇద్దరు అమెరికన్లు ఇటీవల జరిగిన గల్ఫ్‌వార్ కి ప్రధాన కారణం అయిన ఇరాక్ ను ప్రపంచ చిత్రపటంలో గుర్తించలేరు.

25 శాతం మంది వరల్డ్‌మ్యాప్‌లో అమెరికాను గుర్తించలేరు. ప్రపంచంలో ఓటు హక్కుని తక్కువగా ఉపయోగించుకునే ప్రజల్లో అమెరికన్లది 3 వ స్థానం. అమెరికాలో ఎన్నికలకు శలవు లేదు.

# 'కూతురు' పై సమీక్షలు

సెప్టెంబర్ చతురలో ప్రచురితమైన కోలపల్లి ఈశ్వర్ రచన 'కూతురు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## బతుకుపాఠం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*



రచనలన్నీ కల్పనలు, ఊహాజనితాలు, మధురమైన భావనా స్పందనల అక్షరవెల్లువలు అని తలపోసే సగటు పాఠకునికి 'కూతురు' నవల బతుకు పుస్తకాన్ని ఎలా పఠించాలో విశదపరుస్తుంది. తల్లిదండ్రులపట్ల బాధ్యతను విస్మరించి వారసత్వపు హక్కుగా వచ్చే ఆస్తిని మాత్రం ఆబగా అందుకుని చప్పరించే బిడ్డలకు ఈ నవల కనువిప్పు. తమ తప్పటడుగులనాడు చేయిపట్టుకుని నడిపించిన తల్లిదండ్రుల అడుగులు జీవనసంధ్యలో తడబడినప్పుడు వారికి చేతి ఆసరా నివ్వకపోగా, సుఖాలకు, సౌకర్యాలకు వారిని అడ్డంకిగా భావించి వృద్ధాశ్రమాలలో వదలి బతికుండగానే వారికి తర్పణం విడుస్తారు. ఇక్కడ 'తల్లిదండ్రుల మీద దయలేని పుత్రుండు (పుత్రిక)' అన్న పద్యాన్ని ఉటంకించడం సమయోచితం.

కొడుకు పుట్టాడని ప్రభలు కట్టుకుని మైమరిచే తల్లిదండ్రులకూ, 'అయ్యో! కూతురు పుట్టిందే' అని వగచేవారికి 'రేవతి' లాంటి కూతురుంటే అనే ఊహ పొటమరించకమానదు. నవలలోని పాత్రలన్నీ రేవతి చుట్టూ అల్లుకున్నవే. రేవతిలో స్వార్థ బీజాలు నాటబోయి విఫలుడై, భార్య స్వార్థానికి బలయినవాడు సాయిక్రిష్ణ. రేవతి బాధ్యతను పంచుకోవడంతో డాక్టరైన రామ్మోహన్ వృత్తిపరంగా కూడా మంచి పనిచేశాడనిపిస్తుంది. చిక్కుముడిపడిపోతున్న సామాజికాంశాన్ని కథావస్తువుగా స్వీకరించి పాత్రోచిత చర్చలద్వారా విషయాన్ని ఆసక్తికరంగా మలచిన ఈ నవల ఏ కొందరినైనా మేల్కొల్పకపోతే సమాజపు విలువలు పక్షవాతం బారినబడి కడకు

సమాజాన్నే రోగగ్రస్థం చేయకమానవు.

–సి. ఉమాదేవి
గన్నవరం-521 101

## కాస్త అతి...!

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

కూతురు నవల సమాజంలోని ఒక కోణాన్ని, సమస్యని విశ్లేషిస్తూ మనుషుల మనస్తత్వంలో రావలసిన మంచి మార్పును సూచించింది. సమస్య పరిష్కారాన్ని కూడా సూచించడంతో ఇదొక మంచి నవల అయింది. కానీ కూతురు కావడంవల్లనే తల్లి దండ్రుల్ని చూసుకొనే బాధ్యత తీసుకోలేకపో వడం అనేది సరియైన ఆలోచనకాదు. అదే విషయాన్ని రచయిత కూడా 'సాయికృష్ణ' పాత్ర ద్వారా ఒప్పుకున్నారు. కాబట్టి ఈ సమస్యను కూతురు ద్వారానే చూపాల్సిన అవసరంలేదు. ఆ విధంగా రేవతి తన బాధ్యత నిర్వర్తించడాన్ని రచయిత ఎక్కువ చేసి అతిగా రాశారనిపించింది. కానీ చాలా మంది పెళ్ళికాని ఆడపిల్లలు వేరే ఆధారం లేనప్పుడు తల్లిదండ్రులతోపాటు తమ సోద రీసోదరుల బాధ్యత తీసుకోవడం లేదా పంచుకోవడం మనం నేటి సమాజంలో చూస్తూనే ఉంటాము. ఆడపిల్లలు పెళ్ళికానం తవరకూ తమ తల్లితండ్రుల్ని తన కుటుంబం అనుకుంటుంది. కనుక రేవతి బాధ్యత తీసుకోవడం సహజంగానే అన్పి స్తుంది! రచయిత రాసినట్టు అదో ఘనకా ర్యంగా అన్పించదు. ఇదే విషయంతో చాలా కథలు, నవలలు, సినిమాలు వచ్చాయి కాబట్టి రచయిత రచనలో కొత్తదనం ఏమీ కనబడలేదు. అదే పెళ్ళైన కూతురు పుట్టింటి వారి బాధ్యత అత్తింటివారికి నచ్చచెప్పి కానీ, ఎదిరించికానీ తీసుకోవడంలో ఉన్న కష్టం, పెళ్ళికాని కూతురు తీసుకోవడంలో లేదు. అది సహజ ప్రక్రియ. రేవతి పాత్ర చిత్రీక రణ కూడా కొంత అసహజంగా ఉంది.

సమాజంలో పడిపోతున్న విలువలు, ముసలివారైన తల్లితండ్రుల్ని నిరాధారంగా వదిలేస్తూ నేటితరం చేస్తున్న తప్పుల్ని రచ యిత స్పష్టంగా చూపుతూ రేపటితరం కూడా మనల్నీవిధంగా చేయవచ్చని హెచ్చ రిస్తూ రచన సాగుతుంది. సమాజానికి ప్రతి రూపమైన సాయికృష్ణలాంటి వాళ్ళు తొంభైశా తం మంది ఉంటారు. వాళ్ళలో కొందరి దృక్పథంలోనైనా మార్పువస్తే రచయిత ప్రయత్నం సఫలీకృతం అయినట్లే.

నవల చదివించేదిగానే ఉన్నా అక్కడ క్కడా విసుగు కూడా పుట్టించింది. మొత్తం మీద కొంత ప్రయోజనాన్ని ఆశించి చేసిన రచన.

—జాస్మైన్ సుల్తానా,
ఏలూరు.

## కొత్తకోణం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

పెళ్ళయితే ఆడపిల్ల పుట్టింటికి, కనిపెంచి న వాళ్ళకు దూరమవ్వడం, పూర్తిగా కొత్తిల్లు అయినా సహజంగా అత్తిల్లే ఆమెకు సర్వస్వం కావడం మన ఈ సమాజంలో చూస్తున్నదే.

ఇంతకాలం తల్లిదండ్రుల బాధ్యత కొడు కులే వహించాలనీ, ఆ పని కూతుర్లకు అక్క ర్లేదనీ, ఒకవేళ ఆడపిల్ల(లే) తప్ప మగ సంతానంలేని తల్లిదండ్రులకు వృద్ధాప్యం లోనో, అనారోగ్యంలోనో తమ చేయూ తనివ్వాలనుకున్నా అత్తింటివారు అందుకు అంగీకరించరనేది అందరికీ తెలిసిన సత్యం. సర్వసాధారణంగా ప్రతిచోటా అలాగే జరు గుతున్నది కూడా.

అయితే, హక్కులే తప్ప బాధ్యతలను గుర్తించని 'కొడుకు'కంటే, బాధ్యతలను





కూడా హక్కులాగే ఫీలయ్యే ఒక అపూర్వమైన 'కూతురు'ను గురించిన కొత్తకోణాన్ని కోలపల్లి ఈశ్వర్‌గారి 'కూతురు' నవల ఆవిష్కరించి సమకాలీనుల కళ్ళు తెరిపించేలా చేస్తోంది.

మొత్తం నవలంతా ఒకేరకమైన సీరియస్ మూడ్‌లో సాగుతూ, వృద్ధులైన పేరెంట్స్ పట్ల యువత బాధ్యతని, కర్తవ్యాన్ని వివిధ పాత్రలద్వారా, సన్నివేశాల కల్పనద్వారా ఆసక్తికరంగా చర్చించడంవల్ల అంతే సీరియస్‌గా నవలను పఠించేందుకు పాఠకులకు ఆస్కారం కలిగింది.

కూతురుగా రేవతి తన తల్లికి తల్లికావడంతోపాటు, ఎందరో అభాగ్యులకు, నిర్భాగ్యులు అయిన వృద్ధతరం రోగులకు అదే రకం సేవలందించేందుకు సిద్ధపడ్డంలో ఆమె దయాగుణం ప్రస్ఫుటమౌతుంది. డాక్టర్ రామ్మోహన్ తన నిస్వార్థగుణంతో తల్లిని అమితంగా ప్రేమించే రేవతిని వివాహమాడి, ఆమెను తల్లితోసహా ఇంటికి ఆహ్వానించడం వెనుక వున్న లక్ష్యం సమాజానికి వెలుగురేఖలా భావించాలి. "వ్యక్తిత్వం వున్న, అందునా తల్లిదండ్రుల మీద ప్రేమాభిమానాలున్న కూతురు ఒక మంచి ఇల్లాలు అవుతుంది" అంటూ డాక్టర్ రామ్మోహన్ చెప్పిన మాటల్లో వాస్తవం కనిపిస్తుంది.

రేవతి తన తల్లిని ప్రేమించడంద్వారా డాక్టర్ రామ్మోహన్‌కు మంచి ఇల్లాలవ్వడమే కాక, తన గుణాన్ని సైతం విశ్వవ్యాప్తం చేసుకుంది. అలాకాక, ఆమె తన స్వార్థం చూసుకొని సాయికృష్ణ చేయందుకున్నా, స్నేహితురాలు కల్పన సలహామేరకు తల్లిని తీసుకొని హైద్రాబాద్ వెళ్ళి అక్కడ ఆమె తోడిదే జీవితం అనుకున్నా సమాజంలో తానూ ఒకరుగా మాత్రమే రేవతి మిగిలేది. కానీ, తనకంటే ఉన్నత లక్ష్యాలతో, అభ్యుదయ భావాలతో అభాగ్య, నిరుపేద జనాలకు ఉచిత వైద్యసేవలు అందించేందుకు ఉద్యుక్తుడయిన రామ్మోహన్ జీవిత భాగస్వామి కావడం, ఆ ఇద్దరి హృదయస్పందనలు ఒకటేకావడంతో 'రేవతి-రామ్మోహన్' పాత్రలు సజీవ సత్యాలయ్యాయి.

—యస్.కె. నాగేశ్వరరావు,
పెనుగొండ - 534320

## తృప్తినిచ్చేవేమిటి?

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ముదిమి మీదపడ్డ తల్లిదండ్రులకు పట్టెడన్నం పెట్టి, ఇంటెడు చాకిరీ చేయించుకుంటూ అదే "ఊరికి ఉపకారం" అని భావించే గంజాయివనంలాంటి సంతానం వున్న ఈ సమాజంలో పక్షవాతంతో మంచాన పడ్డ అమ్మకు అమ్మగా మారి ఆమెను కంటికి రెప్పలా కాపాడుకునే రేవతిలాంటి తులసిమొక్కలు ప్రస్తుత సమాజంలో బహు అరుదు.

అలాగే ఓ చేతిలో డబ్బు పడితే తప్ప మరో చేత్తో నాడిపట్టని, వైద్యాన్ని పక్కా వ్యాపారంగా తప్ప సేవానిరతితో చేపట్టని డాక్టర్లు లెక్కకుమిక్కిలిగా వున్న వైద్య రంగంలో ప్రభుత్వోద్యోగాన్ని తోసి రాజని ఇంటినే ప్రజావైద్యశాలగా మలచిన మానవత్వాన్ని కూడా గుర్తించాల్సిందే. అల్లుడు అంటే అత్తమామలను నల్లిలా గిల్లువాడు అని చెప్పుకోవాల్సిన ఈ కట్నాలకాలంలో మంచానపడ్డ రేవతి ముసలి తల్లినే పెళ్ళికానుకగా స్వీకరించిన మంచితనాన్ని రామ్మోహన్ రూపంలో సాక్షాత్కరింపచేశారు. ఆర్థిక సంబంధాలనే హోరుగాలి ధాటికి కొడిగట్టడానికి సిద్ధంగా వున్న కారుణ్యజ్యోతికి రచయిత తన చేతులడ్డుపెట్టే చిరుప్రయత్నం రచనలో స్పష్టంగా అగుపించింది.

ఆస్తులు పుచ్చుకోవడమేకానీ ఆదరణని పంచిఇవ్వడం తెలియని కొడుకులు, కోడళ్ళు కల తల్లిదండ్రులు ఈ నవల చదివి రేవతి



లాంటి కూతురొక్కరుంటే చాలనుకుంటారనడంలో అతిశయోక్తిలేదు.

పెళ్ళైన తర్వాత అత్తమామల బాధ్యత తనది కాదని తలచే చాలామందిలో ఒకడు సాయికృష్ణ. రేవతిప్రేమకోసం, ఆమెతో పెళ్ళి కోసం ఆరాటపడిన అతనికి గుణపాఠం చెప్పించి పరోక్షంగా అతని మనిషితనాన్ని దెబ్బతీయడం కథాపరంగా ఔచిత్యమనిపించవచ్చేమో కానీ, పాత్రపరంగా అతని దోషం ప్రశ్నార్థకమే.

విషయం పక్కదారి పట్టకుండా నవల ఆద్యంతం ఒకే సమస్యమీద ఫోకస్ చేస్తూ రచనకు చక్కని ముగింపు ఇవ్వడంద్వారా ప్రేమ, అభిమానం, ఆప్యాయత, బాధ్యత ఇవన్నీ మనిషికి నిజమైన తృప్తినిస్తాయి అనే ఉదాత్తమైన సందేశాన్నిచ్చిన రచయితకు, చతురకు అభినందనలు.

–యన్. మధుసూదనయాదవ్,
బాపట్ల - 522 101

## త్యాగం- బాధ్యత

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మాతృదేవోభవ, పితృదేవోభవ అని ఆర్యోక్తి. దేవుడు తానన్నిచోట్లా ఉండడం వీలుకాక తన ప్రతినిధిగా తల్లిని సృష్టించాడని చెపుతారు. అలాంటి తల్లిదండ్రులీనాడు వృద్ధాశ్రమంలో నిరాదరణకు గురవుతున్నారంటే దానికి కారణం బలహీనపడుతున్న మానవ సంబంధాలు, మనిషిలో పెచ్చురిల్లిన స్వార్థం.

ఈ సమస్య తీవ్రతను గుర్తుచేస్తూ అందర్నీ ఆలోచింపచేసిన నవలా కుసుమం కోలపల్లి ఈశ్వర్‌గారి 'కూతురు'. సమస్య చాలా పాతదే అయినా దీనిపై ఇంతవరకూ చాలా నవలలు వచ్చి ఉన్నా కేవలం ఒకే కూతురు ఉన్న తల్లిదండ్రుల గురించి ప్రస్తావిస్తూ సమస్యలోని కొత్తకోణాన్ని స్పృశించగలిగారు రచయిత.

రేవతి, రేవతితల్లి, రామ్మోహన్, కల్పన, సాయికృష్ణలాంటి కేవలం అయిదే పాత్రలతో కూడా కథని పట్టు సడలకుండా, విసుగు కల్గించనీయక ఆర్ద్రమైన హృదయాలతో చదివింపచేశారు రచయిత. తల్లికోసం తన జీవితాన్ని త్యాగం చేసిన రేవతి, అది త్యాగం కాదు బాధ్యత అనుకోవడం చాలా గొప్పగా ఉంది. ప్రతివారూ బాల్యంలో తల్లిదండ్రులు తమకు చేసిన సేవలను గుర్తుంచుకొని అదే సమయంలో భవిష్యత్తులో తాము కూడా అనుభవించబోయే వృద్ధాప్యాన్ని ఊహించగల్గితే వృద్ధులైన తల్లిదండ్రులను తప్పనిసరిగా జాగ్రత్తగా చూసుకోగలరు. డబ్బే లోకంగా బతికిన సాయికృష్ణ తల్లిదండ్రులు వృద్ధాప్యంలో బిడ్డల నిరాదరణకు గురికావడం కథకు చక్కని మలుపు. కొడుకైనా, కూతురైనా తల్లిదండ్రుల బాధ్యత సమానమేనని గ్రహించగల్గిననాడు ఈ నవల ప్రయోజనం నెరవేరినట్టే.

చివరికి రేవతి స్పీచ్ థెరపీ ఫలించి ఆమె తల్లే ఆమెను 'అమ్మా' అని పిలవడం హృదయాల్ని కదిలించివేసింది. ఈ సమాజానికి కావలసింది రేవతి, రామ్మోహన్‌లాంటి ప్రేమ, ఆప్యాయత మూర్తీభవించిన నిస్వార్థపరులే. అందరూ మదర్‌థెరిస్సాలు కాలేకపోయినా రేవతిలా ఆలోచించగలిగితే ఓల్డేజ్ హోమ్‌ల అవసరమే ఉండదు. రేవతి పాత్ర చిత్రణలో స్త్రీ ఔన్నత్యాన్ని వెలికితెచ్చిన రచయితకు హేట్సాఫ్.

–ఎ. రాధాశ్రీనివాస్,
గుంతకల్ - 515 801

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.







**priya**

**Pickles**

**ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి**

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 48